# సాక్షి

శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారిచే వ్యావహారికభాషలో వివరణలతో,
శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి పీఠికతో

మూడవ సంపుటం



కవిశేఖర
పానుగంటి
లక్ష్మీనరసింహారావు




అభినందన పబ్లిషర్స్
28-10-1 కార్ల్ మార్క్స్ రోడ్డు, విజయవాడ-520002

# SAAKSHI PART–III

Panuganti Lakshmi Narasimha Rao
with
**Preface** by Madhunapantula Satyanarayana Sastry.
**Leads** by Indraganti Srikantha Sarma

First Edition: 1991

Publishers
**Abhinandana Publishers**
Vijayawada-520 002



Director of Publishing
**B. Babjee**

**PRICE:** Rs. 50-00
**(Set of 3 Volumes Rs. 150/**

**Title:** Sri Bapu

Typesetting, Processing & Printing

Kala Jyothi Process (Pvt.) Ltd.,
1-1-60/5, RTC Cross Roads,
Musheerabad,
Hyderabad-500 020. A.P.

# సాక్షి మూడవ సంపుటం

పానుగంటి లక్ష్మీ నరసింహారావు
మధునాపంతుల సత్యన్నారాయణ శాస్త్రి
గారి పీఠికతో, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ
గారిచే వ్యావహారిక భాషలో వివరణలతో
(అదనంగా సుమారు 175 పేజీలు
చేర్చబడినవి.)
మొదట ముద్రణ: 1991

పబ్లిషర్సు
అభినందన పబ్లిషర్సు
విజయవాడ-520 002.

డైరక్టర్ ఆఫ్ పబ్లిషింగ్
బి. బాబ్జీ

వెల: రు. 50.00
(పూర్తి మూడు సంపుటాల
వెల రూ.150/-)

టైటిలు: శ్రీ బాపు

టైప్ సెట్టింగ్, ప్రాసెసింగు
ప్రింటింగ్:

కళాజ్యోతి ప్రాసెస్ ప్రైవేట్ లిమిటెడ్
1-1-60/5, ఆర్.టి.సి. క్రాస్ రోడ్స్,
ముషీరాబాద్,
హైదరాబాద్-500 020. ఆం.ప్ర.

# మా మాట

మంచి రచనలు అందించాలనీ,
మంచి అభిరుచి పెంపొందించాలనీ,

పాఠకులు కలకాలం తమ సొంత గ్రంథాలయంలో మంచి పుస్తకాలు పెట్టుకుని పదే పదే వాటిని చదువుకోవడానికి దోహదం చెయ్యాలనీ - మా చిరకాల వాంచితం.

ఈ ప్రయత్నంలో మా సోదర సంస్థ 'న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్' యిప్పటివ రకు చాలా విజ్ఞాన దాయకమైన పుస్తకాలను, ఉత్తమ సాహిత్య గ్రంథాలను ప్రచురించి, చేతనైనంత కృషి చేస్తూందని మీకు తెలుసు.

ఇప్పుడు మా నూతన సంస్థ 'అభినందన పబ్లిషర్స్' ఒక సాహసం చేస్తోంది. అయితే, ఈ సాహసం ఆనందకరమైనది. ఒకరకంగా గర్వకారణమైనది. అదే, 'కవిశేఖర' పానుగంటి లక్ష్మీ నరహింసారావు గారు రచించిన 'సాక్షి' వ్యాసాలను ప్రచురించి - అభిమాన పాఠకులకు అందించడం.

కొందరు - కథలు వ్రాసి, గొప్ప కథకు లనిపించుకున్న వారున్నారు. కొందరు నవలలు వ్రాసి గుర్తింపు, గౌరవం పొందిన వారున్నారు. అలాగే కవులనిపించుకుని రాణకెక్కిన వారున్నారు. కాని - 'వ్యాసం' అనే ప్రక్రియకు అపూర్వమైన సాహిత్యగౌరవం తెచ్చిపెట్టి - పాఠకులను విశేషంగా ఆకట్టుకున్న మహా రచయిత బహుశా పానుగంటి వారొక్కరే. నాటకం వ్రాసి గురజాడవారు గిరీశం పాత్రను చిరంజీవినిచేస్తే, పానుగంటివారు వ్యాసాలను ఉపన్యాసాలుగా, ఉపన్యాసాలను వ్యాసాలుగా జలకాలాడించి - జంఘాలశాస్త్రి పాత్రను చిరంజీవిని చేశారు. ఈ వ్యాసాలలో పానుగంటి వారి శైలి, విషయ విన్యాసం చూస్తుంటే, చురకత్తి కొనను మల్లెదండ వ్రేలాడ దీసి నట్టుంటుంది. 1913లో కొంతకాలం, 1920లో కొంతకాలం 'సాక్షి' వ్యాసాలను ఆయన రచించారు. ఎందరో అసంఖ్యాక పాఠకుల్ని ఆకర్షించారు. అలరించారు. పానుగంటే సాక్షి, సాక్షే పానుగంటి అనిపించారు.

తొలుత ఈ వ్యాసాలను పిఠాపురం రాజావారు ముద్రించి ప్రచారం చేశారు. ఆ తరువాత మద్రాసులోని ప్రసిద్ధ ప్రచురణ సంస్థ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారు ఆరు సంపుటాలుగా ప్రచురించారు. ఈ విషయాలు జరిగి దాదాపు నలభై సంవత్సరాలు గడిచాయి. (వావిళ్లవారికి సంబంధించినంతవరకు)

ప్రస్తుతం ఆ ఆరు సంపుటాలు'సాక్షి' వ్యాసాలను - అక్షరంపొల్లుపోకుండా మొత్తం - మూడు సంపుటాలుగా పాఠకులకు అందించగలిగే భాగ్యం మాకు కలిగినందుకు సంతోషిస్తున్నాం.

1920 లెక్కవేసుకున్నా, ఈ వ్యాసాల రచన జరిగి ఇప్పటికి 70 ఏళ్లు కావస్తోంది. వీటి భాష గ్రాంథికం. విషయాలు ఎంత ఆసక్తి కరమైనవైనా, ఎంత హాస్యరసప్రధానంగా వున్నా, ఈ నాటి పాఠకులకు ఈ 'సాక్షి' ని చేరువ చెయ్యాలంటే, వ్యావహారిక భాషలో, ప్రతి వ్యాసం సారాంశం ముందు 'టూకీ' గా అందిస్తే బాగుంటుందని తోచింది. ఈ మా

లక్ష్యం చెప్పగానే సహకరించి, వ్యాసాలన్నింటికి 'క్లుప్త కథనాన్ని' వ్రాసి యిచ్చిన మిత్రులు, ఇంద్రగంటి శ్రీకాంత శర్మగారు. మా ప్రచురణ సంకల్పం తెలిపిన వెంటనే ఆనందంతో ఆశీర్వదించి పీఠిక వ్రాసి యిచ్చినవారు మహాకవి, కళా ప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు, ఇటువంటి ఆదరభావాలతోనే ఈ సంపుటాలకు ముఖపత్ర రచన చేసినవారు ప్రముఖ చిత్రకారులు శ్రీ బాపుగారు. ఈ సంపుటాలు అందంగా - అచ్చుతప్పులు లేకుండా - పాఠకులకు అందించాలని ఆశించి, శ్రమించి సహకరించిన వారు పండిత మిత్రులు పి. జగన్నాథరావుగారు. వీరికి మా 'హార్ద' కృతజ్ఞతులు.

ఇన్నాళ్లకు మళ్లీ 'సాక్షి' వ్యాసాలను వెలువరించడమంటే, చాలా అందంగా చెయ్యాలని అత్యాధునిక ముద్రణ పద్ధతిని అనుసరించాం. ఇది బరువైనదైనా 'పరువైనదని' సాహసించాం. ఈ సంపుటాలను మీ చేతిలో సవినయంగా సగౌరవంగా ఉంచుతున్నాం. ప్రోత్సహించి, ఆశీర్వదించమని విన్నవించుకొంటున్నాం.

"సాక్షి మూడు సంపుటాల వ్యాసాల సాక్షిగా"

"తెలుగు సాహిత్యానికి సాక్షి నామసంవత్సరం"

డైరక్టర్ ఆఫ్ పబ్లిషింగ్
అభినందన పబ్లిషర్స్
బి. బాల్జి
డైరక్టర్.

# తెలుగువారి బృహత్సంహిత

'మృదుమధుర నవార్థభాసుర వచనరచనా విశారదులైన' మహాకవి ఆధునిక కాలమున ఎవరు?–అని ఎవరైన ప్రశ్నించినచో నా ప్రత్యుత్తరము – పానుగంటి లక్ష్మీనరసింహారావుగారని.

వచనరచనాధురీణులు మరికొంతమంది వుండివ జాతికి ప్రయోజనదాయకమే కాని, నష్టదాయకము కాదు గదా–

కాని తమదైన శైలీవిన్యాస మాధుర్యము కలవారు కావలెనన్నచో–

రావలసిన పేరు లక్ష్మీనరసింహారావుగారిదే. రావలసిన పేరు వచ్చినది. వచ్చినది శాశ్వతమైన యశస్సు తప్ప కొన్ని కేలండర్లకే పరిధి అయినది కానే కాదు.

నిబ్బరమైన పానుగంటి వచనమున కబ్బురపడని గద్య ప్రేమికులుండరు.

అంతగొప్ప వచన మాయనకు వచ్చుట వింతకాదు. తపఃఫలితము. భాషామాధుర్య మధనోద్భూతము. జీవము భావమని వేరుగా చెప్పనవసరము రాదు.

గద్య సాహిత్య రంగమున జరుగవలసిన దానికై నాడు 1922లో పానుగంటి వారెంతగా అభిలషించిరో, ఆశించిరో తెలియుటకు ఆంధ్రసాహిత్య పరిషదేకాదశ వార్షికోత్సవమున వారి అధ్యక్ష వచనమే సాక్షివచనము.

''చిత్రములైన శైలీ భేదములు, మన భాషలో మిగుల నరుదుగా నున్నవని వేరే చెప్పనేల? రైమని పేకచువ్వ పై కెగిరినట్లున్న శైలి భేదమేది? కాకి పై కెగిరి యెగిరి ఱెక్కలు కదలకుండ జందెపు బెట్టుగ సాపుగ వాలుగ దిగునప్పటి లఘుపతన చమత్కృతి కనబఱచు శైలి పద్ధతి యేది? తాళము వాయించునప్పటి తళుకు బెళుకులు, టింగుటింగులు, గలగలలు, జలజలలు గల శైలియేది?.... భయంకరమయ్యును మనోహరమై, మహాశక్తి సక్తమయ్యు, మార్దవయుక్తమై, ధారాళమయ్యు విశాలమై, స్వభావ సమృద్ధమయ్యు నరసాలంకార భూయిష్ఠమై, సముద్ర ఘోషము గలదయ్యు సంగీత ప్రాయమై.... చదువరులకు గనుకట్టై, వాకట్టై, మదిగట్టై తలపులిమినట్లు శ్వాసమైన నలుపకుండ జేసినట్లు, ముష్టివాని చిప్పనుండి మూర్ధాభిషిక్తుని కిరీటము వఱకు, భూమి క్రింది యరల నుండి సముద్రములోని గుహల వఱకు నెవరెస్టు కొండనుండి యింద్ర ధనుస్సు రంగుల వఱకు, మందాకినీ తరంగ రంగద్ధంసాంగనా క్రేంకారముల నుండి మహాదేవసంధ్యా సమయ నాట్య రంగమున వఱకు మనోవేగముతో నెగురు శక్తి కల చిత్ర విచిత్ర శైలి భేదము లింక నెన్నియో భాషలో బుట్టవలసియున్నవి''.

సరియగు వచనము ఎట్టిది అనుటకు ఈ అధ్యక్ష వచనమే నిర్వచనము–

ఆయన ఆశించిన వచనము వచ్చినది, ఆ వచ్చుట యితరుల వలన కాదు–సాక్షాత్తు ఆయన వలననే, సాక్షి వలననే.

అధునాతన సంఘమునకు షడ్దర్శనములుగా సాక్షి దర్శన మిచ్చినది. అది వ్యాస దర్శనము. అనేకములను గద్య గ్రంథములని మనము సరిపెట్టుకొనవచ్చును. కాని, సాక్షి సంపుటములు గద్యకావ్యము లనిపించగల గుణ సమన్వితములు. కోణములు మార్చి సాక్షిపైన వంద పరిశోధన గ్రంథము లుదయింపజేయ వచ్చును, వేయి వుపన్యాసము లీయవచ్చును.

నాటి నాటకములలో సంగీతము అన్ని తావుల నుండరాదని తెలుపు నుపన్యాసమున "సాయంతన పాకసామగ్రీ సందర్భమును సంగీతములో వెల్లడించి యుంటమా? అట్లే చేసి యుండిన యెడల మన యిరుగుపొరుగు వారు మన చేతులు కాళ్ళు గట్టి తలలు నున్నగా గొఱిగించి నిమ్మకాయ పులుసుతో రుద్ది, బెత్తముచే మోది యున్మత్త శాలకు పంపించి యుండరా? అజ్ఞాన స్వరూపమగు గ్రుడ్డయినను గడుపునొప్పి రాగ గ్యారుక్యారున నేడ్చును గాని సరళ స్వరము పాడునా? ప్రాయ్యి యలుకుచుండఁగ దేలుచేఁ గుట్టబడిన వనిత మొఱ్ఱో మొఱ్ఱో యని యేడ్చును గాని ముఖారిపాడి తాండవించునా? అట్లే చేసియుండిన యెడలఁ దేలుమాట యటుంచి దయ్యపుబాధయని చీపురుకట్టలతో వీఁపు తట్టుఁ దేరఁ జావగొట్టి యుండరా?

కన్నకొడుకు మరణింపఁగఁ దల్లి తలకొట్టుకొని యేడ్చి యేడ్చి కొయ్యబాఱి పోవలసినదికాని మొలకట్టుకొని యుత్కంఠమున బాడిపాడి ముక్తాయించి తీరవలసినదా? దూడచచ్చిన యావైన దిగులు పడి డిల్లపడి, గడ్డిమాని నీరు మాని దూడను ముట్టెతో స్పృశించి కంటనీరు పెట్టుకొని తహతహచే గింజుకొని 'యంబా' యని యఱచునే! మనమంత కంటె నధమ స్థితిలో నుండవలసి వచ్చెనే-ఎంత మహాప్రారబ్ధము పట్టినది! పాట కొఱకే మనమప్పుడుప్పుడు పాడుకొనుచున్నాము. కాని ప్రాపంచిక సర్వవ్యాపారములను బాటలతో గాక మాటలతోడనె మనము నిర్వహించు కొనుచుంటిమని మన మందఱమెఱిఁగి నవంశమే కదా!.... ఆహా మనుష్యత్వము పశుత్వమున కంటె నేడాకులు తగ్గినదా?" అని వ్రాసిన పానుగంటి తత్త్వమును మనము గ్రహించవలెను. వాస్తవిక దృక్పథమునకు మనలను తీసికొని వచ్చుటలో ఆయన చెప్పునవి దెప్పునవి కొల్లలు కొల్లలు. ఒక్కొక్కప్పుడాయన రచన గిల్లునట్లుండును. గిల్లును. అవసరమైనప్పుడు మన చర్మము దళసరి అని భావించిన ప్పుడు రక్కియైన నొక్కి చెప్పును గాని వదలుట యనునదియుండదు. అందువలననే సాక్షి, ఛాందసులకు లక్ష్మీనరసింహ స్వప్నము!

పానుగంటి వంటివారుకాక మరియొకరు అట్టి గ్రాంథిక వచన రచనము అరసున్న లతో బండిరాలతో చేసియున్నచో నీ కాలమున నిగిరిపోయి వుండును. కారణము ఒఠి వచన రచనా పాటవము చాలదు.

పానుగంటివారు కవి. విమర్శకులు. భావుకులు. సమాజ దర్శనము మరువని వారు. సంఘ సంస్కరణము కోరినవారు. సైలడి రచనా సంస్కరణము కోరిన వారు. ఆకట్టుకొను టలో కనికట్టు కనిపెట్టిన వారు.

కొంచెము ముందునకు వెళ్ళినట్లనిపించవచ్చు గాని-

నాటకములలో 'కన్యాశుల్కము' ఎట్టిదో గద్యరచనములలో 'సాక్షి' అటువంటిది.

ఆయన వచన కవిత్వము వ్రాయకపోవచ్చును. గాని వచనమున గవిత్వము వ్రాసిన వారు.

పానుగంటివారిని వచన యోధులని చెప్పవలెను. మనము చెప్పనవసరము లేదు. ఈ వాక్యములు పల్కుచున్నవి.

''వచనము వ్రాయువారిని దీసివ్రేత సరకుగ గుక్కమూతి పిందెగఁ దృణీకరింప న్యాయమా? పద్యమున. గవిత్వముండి వచనమున లేకుండునా? ఎచ్చట రసముండునో అచ్చటనే కవిత్వమున్నది. అన్ని నాగరక దేశములందు గూడ వచన ప్రబంధములు లక్షోపలక్షలుగా వృద్ధి పొందుచున్నప్పుడు మన దేశమందట్లు జరగకపోవుట కడుశోచనీయము గాదా?

వచన గ్రంథ రచనా బాహుళ్యము గాని భాష యభివృద్ధి పొంగ నేరదు''-

ఇవి నాటుకొనవలసిన మాటలు.

వీరేశలింగమువారు, చిలకమర్తివారు, పానుగంటివారు-వీరందఱునూ ఒఠి రచనలను చేయుట కాదు, భాషా వికాసమునకు, సాహిత్య సమున్మీలనమునకు, దేశ ప్రయోజనములకు పాటు పడుట వారి రక్తమున నున్న అంశములు. వర్తమాన రచయితలు వారి ఆదర్శ స్ఫూర్తి పొందవలసిన జాత్యవసరమున్నది.

వెగటుదనము, పచ్చి శృంగారము లేకుండగ హాస్యము పుట్టించు పానుగంటి సాక్షి రచనలలో-ఉల్లేఖించివలసినచో సవాలక్ష కన్పడును. విజ్ఞానము, పరిశీలనము అనునవి పానుగంటి వారికి రెండు కన్నులుగ రచనకు దారులు చూపించినవి. తోలు బొమ్మలాటలో బాటలు పాడు ఆడుదానిని పరిశీలనాత్మకముగా వర్ణించు సందర్భమున ''గ్రామమున రాత్రివేళ యందది యేమూల బాడుచున్నను గ్రామమంతయు దాని కంఠము వినిపించును. చెక్కుచెదరలేదు. వలి లేదు. తొలి లేదు. బొంగు జీరలేదు. అపస్వరము వెలితి లేదు. 'కై' మనిన నక్షత్ర మార్గమున గఱ్ఱుమని తిరుగుచుఁ బలిటీలు గొట్టును. సంగతుల పై సంగతులు పూలు చల్లినట్లది వర్షించును'' అనుటలో చివరి వాక్యములు కవి వాక్యములు.

పానుగంటి వారి ఆలోచనలు దేశీయమైనవి. సాహిత్యరంగమున, సంఘ సంస్కారణ మున మాత్రమే కాదు; పారిశ్రామిక రంగమున కూడ మనదేశము అభివృద్ధి గాంచవలెనని వారాశించుట 'స్వదేశ పరిశ్రమలు' అను శీర్షిక గల రచనమే తెలుపును. కడుసన్నని నూలు నేసి యంత్రములు చేయలేని వస్త్రోత్పత్తిని చేయు మన వారి నేర్పు నాయన ఎన్నియో వాక్యములలో ప్రశంసించినారు. ఇప్పుడైనా కన్నులు తెఱవరా? స్వదేశ పరిశ్రమ విద్యా సంరక్షణ మాచరించరా? మీ ధనము మీలో నుండునట్లు చేసికొనరా? అని ప్రశ్నించినారు. దేశభక్తి-స్వార్థ త్యాగము వ్యాసము పానుగంటి వారి అంతరంగమునకు వేదిక వంటిది. మాతృభక్తి పితృభక్తి వంటివి లేకనే దేశభక్తి యుండుట, కల్గుట వీలుకాదని నొక్కి చెప్పుచు నిజమైన దేశభక్తుల అవసరము తెలుపుచు దేశభక్తి, ప్రదర్శనముగా నుండరాదని అభిప్రాయపడినారు.

''బజారులో దేశభక్తులు. మంద బయట దేశభక్తులు. ఇంటిలో దేశభక్తులు. దొడ్డిలో

దేశభక్తులు. వాకిటిలో దేశభక్తులు. రైలు స్టేషనులో దేశభక్తులు. నేల యీనినట్లిందఱు దేశభక్తులు–వందలు, వేయి లక్షలు. ఇందఱు దేశభక్తులు మన దేశమున నున్న తరువాత మన దేశమునకిఁక గొఱతయేమి? ఇంకను దేశమునకు దురవస్థ యేమి? ఏమియులేదు, ఇదియే స్వతంత్ర్య రాజ్యము. ఇదియే స్వర్గలోకము''–

ఈ పానుగంటి వాక్యములు పరోక్షముగా క్రియాత్మక దేశభక్తి ప్రబోధించుచున్నవి. ఆంగ్ల భాషావ్యామోహమున తెలుగు మాటాడుటకు నిష్టపడని వారిని ఆయన దులిపిన తీరు గమనించవలెను.

''మ్యావుమని కూయలేని పిల్లి యెచ్చటనైన నున్నదా?... ఈఁతరాని కప్ప ఏ దేశమందైనా నుండునా? పుట్టగానే క్యారుమనలేని బిడ్డ చచ్చినదనుట కేమైన సందేహమా? ఆంధ్రదేశమున బుట్టిన పక్షులైన ననవరతశ్రవణమున నాంధ్రమున మాటలాడుచుండగా –అయ్యయో మనుజుడే అంత మనుజుడే–ఆంధ్రమాతాపితలకు బుట్టిన వాడే–ఆంధ్ర దేశీయ వాయు నీరాహార పారణ మొనర్చినవాడే– అధమాధ మాఱు సంవత్సరముల యీడు వఱకైన నాంధ్రమున మాట లాడినవాడే–అట్టివాఁ డాంగ్లేయ భాష నభ్యసించినంత మాత్రమున నిప్పుడాంధ్రమున మాటలాడ లేకుండునా–'' అనిన పానుగంటివీరాంధ్ర వాక్యములు ఎంత దళసరి చర్మము వారినైన మార్చగల శక్తి సంభరితములు కదా?

'కవి' వ్యాసమున వచనము వెంబడి గల పద్యము పానుగంటికవి ఆంతరంగిక దశా విశేషములు తెలుపునది.

''మల్లెపూవుఁదూఱి మధుపంబుతోఁ బాడి
గంధవాహుతోడఁ గలసి వీచి
యబ్ధిలోన మునిగి యౌర్వవహ్నిని గ్రాగికి
నీటి బుగ్గయగుచు నింగి బ్రాకి
తోఁక చుక్క తోడ డీకొని శ్రమఁ జెంది
సాంధ్యరాగ నదిని స్నానమాడి
తనువునిండ నింద్రధనును రంగులు పూసి
కైరవాప్తు సుధను గ్రైవుజెంది
గోళగాన రుతికి మేళవింపు బాడి
పాడియాడి యాడిపాడి సోలి
భావనామహత్వ పటిమను బ్రహ్మమై
పోవు కవికి కోటి మ్రొక్కులిడుదు''

కవి యనగా ఎవరనగా–

''నమయానుసార నర్వతోముఖ నమ్మోహినీ కరణ నరస్వతీ మూర్తి'' ఇది సాక్ష్యుక్తి. దీని కన్వర్థము పానుగంటివారే. అది కల దిది లేదు, ఇదికల దదిలేదు అనునది సాక్షి విషయమున చెప్పలేము.

సాక్షి సంపుటములు అధునాతన కాలమున తెలుగువారికి బృహత్సంహితలు.

సాక్షి సంపుటములు పునర్ముద్రణము చేయుటను పై నుండి పీఠికాపుర మహారాజు గారు, నాటి నావిళ్లవారు, అభినందించుచున్నట్లు, పానుగంటివారు ఆశీర్వదించు చున్నట్లు, నా కనిపించుచున్నది.

ఇది తెలుగువారికి తమ జాతీయ సంపదను తిరిగి చూచుకొనుటకు, అనుభవించు టకు బృహదవకాశము.

లలితానగరు
రాజమహేంద్రి.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
**15-11-90.**

# విషయసూచిక

# 1. సాక్షి

1922లో సాక్షి సంఘం మూతపడిన తరువాత, - ఈసారి మళ్లీ తెరిచారు. జంఘాలశాస్త్రి ఈ విషయం ప్రకటిస్తూ, ఆంధ్రపత్రికలో ఇందుకు సంబంధించిన ప్రకటన శ్రోతలు చూసి వుండరనీ, మళ్లీ సర్పవురంలోనే, పోస్టాఫీసు ఎదుట ఇల్లే సాక్షి ఆఫీసనీ తెలిసి వుండదనీ అన్నాడు.

జంఘాలశాస్త్రి వీధి అరుగుమీద ఒంటరిగా కూర్చున్నాడు. ఇంతలో ఒక అపరిచిత వ్యక్తి వచ్చి ఎదుట నిలబడ్డాడు. అతన్ని 'శనివారపు సంతకు వచ్చావా?' అని అడిగాడు. నిజానికి అతను ఉపన్యాసం వినడానికి వచ్చాడనే శాస్త్రి అనుకున్నా, బాగుండదని మాటమార్చి అడిగాడు. దాని మీదట తను అవలంబించిన 'దొంగ' మాటల పద్ధతి తనకే అసహ్యం వేసి - ఉపన్యాసం వినడానికి వచ్చావా! అని అడిగాడు. ఆ మనిషి తనకు సాక్షి సంఘమేమో, ఉపన్యాసమేమో ఏమీ తెలియదనీ, తమ కరణం గారికి మందు తప్పుగా ఇచ్చి చంపిన వైద్యుడవు కాదా? అని అడిగాడు. దానికి జంఘాలశాస్త్రి తను ఎందుకక్కడ కూర్చున్నదీ చెప్పాడు. ''అవసరం నీది గనుక, ఇలా ఇక్కడ కూర్చోవడం ఏం బాగాలేదు. శనివారపు పశువుల సంతలోకి వెళ్లయినా ప్రసంగించు'' - అని చెప్పి వెళ్లిపోయాడు.

జంఘాలశాస్త్రి ఈ ఉదంతం ఎందుకు చెప్పాడంటే, సాక్షి సంఘం మళ్లీ మొదలైంది శ్రోతల్లారా గమనించండి అని చెప్పడానికే —.

జంఘాలశాస్త్రి యిట్లు వ్రాసెను.

''సోదరులారా'' యని సంబోధించి యుపన్యాస మిచ్చుటకు సభలో నేనుదక్క మఱి యెవ్వఁడును లేఁడే! సాక్ష్యుపన్యాసములు తిరుగ నారంభ మగు నని యాంధ్రపత్రికారాజములోఁ బ్రకటించిన ప్రకటన నెవ్వరు చూచియుండలేదు కాఁబోలు! చూచి యుపేక్షించిరి కాఁబోలు! ఎటులైన నేమి? సభలో వినువాఁడు లేఁడు. సభలో నిది గొప్పలోపము కాదా?

గాయకుఁ డగువాఁడు వినువారు లేకుండినను దనలోఁ దానుపాడుకొని యొకప్పుడు సంతోషింపవచ్చును. కవి యగువాఁ డొకపద్యమును వ్రాసి, దానిని భైరవితో నొకసారి చదివి,

మారువాతో మఱియొకసారి చదవి తనలోఁ దా నానందింపఁ గలఁడు. చిత్రలేఖకుఁడగువాఁ డొంటెకుచ్చుతో సృష్టించిన తన యుంచుకొన్నదాని మొగమునెగ దిగఁ జూచి తనలోఁ దాను మురిసిపోఁగలఁడు. కాని వినువాఁడు లేకుండ ''ననఁగననఁగ'' నని కథ నెవఁడైన నారంభింపఁ గలఁడా? పీటలపై వధూవరులైన లేకుండఁ బురోహితుఁడు విఘ్నేశ్వరపూజ నారంభించుట యెక్కడనైన నున్నదా? తలుపులకు, గోడలకు, నటుకమీఁది గబ్బిలాలకు నుపన్యసించువాఁ డున్మత్తశాల కర్హుఁడు కాఁడా? ప్రబల వక్తృప్రవరుఁడైన ''బర్కు'' దొర గారు వట్టిబల్లలకుఁ గుర్చీలకు నుపన్యసించెనని వినియున్న మాట సత్యమే. కాని, వారికిఁ గలిగిన పరిస్థితియే నాకుఁ గూడఁ గలిగిన దని సంతసించుట బుద్ధిహీనతకంటె భిన్నమా? అనేకసహస్రశ్రోతలయెదుట నుపన్యాసము లారంభించిన యాదొరగారి కుపన్యాసావసానసమ యమున నుపన్యాసద్రాఘిష్ఠతాదికారణములచేత శ్రోతలు లేకుండిన లేకుందురు గాక! మాకు మొదటి నుండియుఁ బూర్ణానుస్వారముగ నున్నదే. ఆజన్మదరిద్రుఁడు మృణ్మయపాత్రతో నీరు ద్రాగినాఁడు: అర్కవంశ్యమహారాజు త్రాగినాఁడు. అభావస్థితినిబట్టి సామ్యమును వర్ణియించుట తప్పు కాదా? మాచకమ్మకు ఋతుకర్మము లేదు. వార్ధకాక్రాంతయైన వనితకును లేదు.

ఒంటరిగ నుపన్యాసశాలలోఁ గూరుచుండుట యెందుల కని వీథియరఁగుమీఁదఁ గూరుచుంటిని. ఎవ్వరైన వచ్చుచున్నారేమో యని యటునిటు చూచుచుంటిని. ఇంతలో నెవ్వఁడో వచ్చి నన్నుఁ గొంచెమెఱిఁగినవాఁడువలె నాయెదుట నిలువఁబడినాఁడు. ఇతఁ డుపన్యాసము వినుటకే వచ్చినవాఁడనియే నానమ్మకము. శ్రోతలు లేకపోవుటచేతవారికై యెదురుచూచుచు వీథిలోఁ గూరుచుంటి నని యాతని కేమాత్రమైనఁ దెలియునెడల నపహసించునేమో యనభయముచేత ''శనివారపు సంతలోనికి వచ్చితివా'' యని యెఱుఁగనివాఁడువలె యాధాలాభముగ నడిగితిని. ఆహాహా! ఇంతలో మనస్సెంత దొంగతన మునకు సాహసించినదో! ఇంతనటన కిప్పు డేమంతపుట్టి మునిఁగినది? ఈతఁడెవఁడో క్రొత్తవాఁడు గదా! ఈతఁడు నన్నుఁగూర్చి యేమనుకొన్న నాకేమి? ఆతనిఁ జూచుటతో డనే మనస్సట్టె యట్టె ముడుచుకొనియపోయినదే సత్యమడుగంటినదే. మోసమునకు ముందడుగువడినదే. కల్లపలుకు నోటివెంట వెడలినదే! మనస్సున కింత పిఱికితన మేల యుండవలయును. ఇప్పుడంత యవసర మేమి వచ్చినది? ఉపన్యాసప్రారంభదినమున శ్రోతలు లేకుండట తప్పా? ఆసంగతి యాక్రొత్తవానికిఁ దెలిసినంతమాత్రమున హానియా, అప్రతిష్ఠయా? ఇంతమాత్రమునకే మర్యాద మట్టిఁగలసిపోవునా? మర్యాదను గూర్చి పనికి మాలిన భ్రమములకు లోనైయెన్నియో నటన లొనర్చుచుంటిమి గదా? పైమనుజునిఁ గూర్చి మనకున్నలక్ష్యములో, భయములోఁ బదునాల్గవవంతులక్ష్యము, భయము మనకు భగవంతు నిపైనుండునెడల నెంతబాగుగా నుండును! ఈయిగిలింపులు-ఈ సకిలింపులు-ఈకల్లలు -ఈ గారడులు-ఈహస్తలాఘవములు-ఈయభినయములు నుండవుగదా. స్వచ్ఛమై, తేజ స్వంతమై, నివాతమైన దీపకళికవలె మనస్సు నిరుపహతముగఁ బ్రకాశించుచుండునుగదా.

ఇట్లు మనస్సులో నూహించుకొని నటించిన నటనకు వెగటుపడి, యడిగిన ప్రశ్నమునకు బిడియపడి ''అయ్యో! నీ వుపన్యాసమును వినుటకే వచ్చితివి కాదా'' యని బహిరంగముగ నడిగితిని. ''నీపేరేదయ్యా'' యని యతఁడు సన్నడుగఁ గొంత నిరుత్సాహ

మొందినవాఁడ నయ్యును వెంటనే మనస్సు నిర్మల మొనర్చుకొని జంఘాలశాస్త్రియని చెప్పితిని. ఆతఁ డట్టె నన్నుఁ దేరిపాఱఁ జూచి, ''నిన్నెచ్చటనో చూచిన ట్లున్నదయ్యా'' యని మొగము రవంత నాలోచనభావసూచనముగఁ బైకెత్తెను. ''ఔను నీవే కాదు. అనేకాంధ్రులు దైవకటాక్షమున నాపేరు వినియుందురు. సాక్షిసంఘమని, సాక్ష్యుపన్యాసములని యాంధ్రలోకమునఁ గొంతసంచలనము కొన్ని సంవత్సరముల క్రిందఁ గలిగినది. ఆసందర్భముననే నీవు నాపేరు విని యుందువు. అటులైన నీవు నాకు మిత్రుఁడవే'' యని కొంత కలుపుగోలుతనమునఁ బలికితిని. ''సంవత్సరా లెక్కఁడనయ్యా, నాల్గుమాసములైనఁ బూర్తిగ నైనదా? సాక్షియేమో, సంఘమేమో, నాకాగొడవ యేమియుఁ దెలియదయ్యా. సన్నిపాతభైరవిలో శుద్ధివేయని నాభి వేసి మాకరణముగారిని టూరునఁజంపినవాఁడవు నీవే కాదఁటయ్యా'' యని యాతఁడు కఠినముగఁ బలికెను. ''నాయనా నేను వైద్య మెఱుఁగ''నని యింక నేమేమో చెప్పఁబోవుచుండఁగా, ''నెఱుఁగక పోవుటచేతనేనయ్యా ఇంత కొంపతీసినా'' వని యాతఁడు తొందరతో నడ్డుగఁ బలికెను. ''నేను సారస్వత సాంఘికాద్యుపన్యాసముల నిచ్చినవాఁడనే కాని సన్నిపాతభైరవ్యాదు లిచ్చినవాఁడను గానయ్యా'' యని నే నంటిని. ''నీయుపన్యాసములవలన నిదివఱ కెవరు చావలేదుగద'' యని యతఁడు నిష్కల్మషముగ నడిగెను. లేదంటిని. ఇప్పు డిక్కఁడ నెందుల కుంటివని యాతఁ డడుగ, ''ఉపన్యాసమీయఁ దలఁచి వినువారికై నిరీక్షించుచుంటి''నని నే నంటిని. ''సరే కాని నీవు నీ యావశ్యకతకొఱకుపన్యాసముల నిచ్చుచుంటివా'' యని న న్నాతఁడు ప్రశ్నించెను. ప్రత్యుత్తర మిచ్చుటకేమియుఁ దోఁపక కొంత సేపూరకుండి, ''నాయనా! సాక్ష్యుపన్యాసములు తిరుగ సాగింపవలసిన దని యనేకసోదరులు కోరినారు. ఈరీతిగ భాషాసేవ చేఁతనైనంత వఱకుఁ జేయుటకు నేనును సంకల్పించుకొంటిని. ఉభయపక్షములందుఁగూడ నావశ్యకత యున్న ట్లూహింపవచ్చు'' నని నేనంటిని. ''నాకు నచ్చలేదు. నీయావశ్యకతయే ప్రధానము కావున శ్రోతలు లేరని నీ విచ్చటఁ గూరుచుండక యిప్పుడు సాగుచున్న శనివారపుఁ బశవుల సంతలోనికిఁ బోయి యక్కఁడ నుపన్యసింపు''మని పలికి యాతఁడు పోయెను.

సాక్షిసంఘము తిరుగ స్థాపింపఁబడినది. వెనుకటినత్యపురమే సాక్షిసంఘస్థానము. లేఖాలయమున కెదుటియిల్లే సాక్షిసంఘకార్యాలయము. వెనుకసాక్షిసంఘసభ్యులే యిప్పటిసభ్యులు. వెనుకటివలెనే సాక్షి యనుశీర్షిక క్రింద నుపన్యాసము లీపత్రికలోఁ బ్రచురింపఁబడును. నెలకు నాలుగే పడునో, యంతకంటెఁ దక్కువయే పడునో చెప్పఁజాలము. శుక్రవారపత్రికకొఱకు నిరీక్షింపవలయును నని సోదరులను బ్రార్థించుచున్నాను.

# 2. సాక్షి సంఘ పునరుద్ధారణము

జంఘాలశాస్త్రి సాక్షి సంఘం మళ్లీ ప్రారంభమైందని చెప్పి తొలి ఉపన్యాసం ఇద్దామని వస్తే శ్రోతలు లేక గతంలో ఊరుకున్నాడు. ఇప్పుడు, అదలాజరగడం ఒక విధంగా మంచిదైందని సంతోషిస్తూ తొలి ఉపన్యాసం చెప్పడానికీరోజు మంచిదన్నాడు. ఈరోజు వినాయకచవితి. శివ ప్రీతికరమైన రోజు. *1920* నాటిసాక్షి సంఘం శివరాత్రిరోజున స్థాపన జరిగిందట.

జంఘాలశాస్త్రి తన ఉపన్యాసం ప్రారంభించాడు. ధర్మశాలలు, దేవాలయాలు, వైద్యాలయాలు, సారస్వతసంఘాలు, మనకి చాలావున్నాయి. వాటిని పునరుద్ధరణ చెయ్యడంగాని, అటువంటివాటిని కొత్తగా స్థాపించడంగాని, మన పెద్దలు నిర్ణయించిన పవిత్రదినాలలో జరిపించడం మంచిది.

అవతారపురుషుల జన్మదినాలు, మరణించిన దినాలు, సంస్కర్తలజయంతులు, వర్ధంతులు, దేవీనవరాత్రులు, వసంత నవరాత్రులు, గణపతినవరాత్రులు, ఇటువంటి కార్యకలాపాలకు శ్రేష్ఠాలు. అలాచేస్తే ఆయా ధర్మకార్యాలలో, ఆరోజులకు అధిష్ఠాతలైన మహాపురుషులు, దేవతలుకూడా మనసభల్లో కూర్చుంటారు. ఆశీర్వదిస్తారు.—

ఇలా అంటూ జంఘాలశాస్త్రి ఒక మహా ఆవేశానికి, భక్తిపారవశ్యానికి లోనై పురాణదంపతులను-పార్వతీపరమేశ్వరులను-స్ఫురింపచే ఒక దివ్యతేజస్సును ఎదుటచూసిన అనుభవం పొందాడు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

ఆంధ్రపత్రికారాజములోని ప్రకటనమును గాంచి క్రిందటిసారి యమావాస్యాదినమున నుపన్యాసమునువినుట కెవ్వరైన వత్తురేమోయని కొంతసేపు నిరీక్షించితిని. ఎవ్వరును రాలేదు. రాకపోవుటయే మంచిదయ్యెను. ఈదినము వినాయకచతుర్థి. శివప్రీతికరమైన దినము. మంగళకరమైన దినము. సర్వమంగళామోదకరమైన దినము. సర్వవిఘ్ననాశకుఁడైన శాంభవీపుత్త్రుని పూజాదినము. ఈపవిత్రదినమున సాక్షి సంఘపునరుద్ధారణ మాచరించి ప్రథమోపన్యాస మీయవలయునని తలఁచి విఘ్ననాయకుని మనఃపూర్వకముగ నారాధించి, కొందఱు మిత్రులతోఁ బక్వాన్నములభుజించి సోదరులారా! మీకొఱకు వేచియుంటిని.

మీరందఱు విచ్చేసితిరి. చాలా సంతోషమైనది. క్రిందటిసారి సాక్షిసంఘము శివరాత్రియందు స్థాపింపఁబడినది. ఈసారి శివపుత్రరాత్రియందు స్థాపింపఁ బడినది.

నాయనలారా! ధర్మాన్నశాలలు, ధర్మవైద్యశాలలు, దేవాలయములు, గ్రంథాలయములు, సారస్వతసంఘములు, భజనమందిరములు మొదలగుపవిత్రసంస్థ లనేకములు మన కున్నవి. ఇట్టివానిని నింక స్థాపింపవలసివచ్చినప్పుడు కాని, పురుద్ధారణ మొనర్పవలసివచ్చినప్పుడు కాని మనపెద్ద లేదినములు పవిత్రములుగా గణించినారో యాదినములందే యాకార్యములు జరిగింపవలయును. మనకెన్ని యె పవత్రదినములున్నవి. అవతారపురుషులు జన్మించినదినములు మనకుఁ బవిత్రదినములు, మన భారతమహావీరులు జన్మించినదినములు, మరణించినదినములు, మనలో మతకర్తలు వేదాంతులు సంస్కర్తలు జన్మించినదినములు, మరణించిన దినములు మనకుఁ బవిత్రదినములు. ఇవికాక, దేవీనవరాత్రము లని, వినాయకనవరాత్రము లని, వసంతపూజాదినము లని యనేకములైన పవిత్రదినములు మాకున్నవి. ధర్మనిర్వహణమునకై, జ్ఞానప్రదానమునకై యేర్పాటుకాఁబడుసంస్థలస్థాపనము, పునరుద్ధారణము మొదలగు లోకోపకారకకార్యము లిట్టి పవిత్రదినములందే మనపెద్దలచే మనభారతదేశముచే, మనదేవతలచేఁ బావనములని యెంచఁబడిన యిట్టి మహాదినములందే జరిగింపవలయును.

ఇరువదియవ శతాబ్దమందు జీవించియున్న మనకు-నాంగ్లేయభాషాజ్ఞాన మేకొలఁదియో సంపాదించినమనకు-కాల మనఁగా Sequence of Events వలన మనస్సులోఁ గలిగిన **impression** కంటె మఱియేదియు కాదని యాంగ్లేయుగ్రంథములు చెప్పచుండఁగా వినినమనకు నింకమదర్శ దుర్దినమని, ఏకాదశి సుదినమని గూఢమైన మౌఢ్యముండనేలయని పైవారధిక్షేపింతురా? ఊఁ, అధిక్షేపింపనిండు. ఎందులకయిన సరే, యెవనినైనసరే, యధిక్షేపింపకూరకుండిన దెవఁడు? పవిత్రదినములు లేనిజాతిప్రపంచమందున్నదా? ఉండుట కవకాశ మున్నదా? మనమహ్మదీయసోదరులకు బక్రీత్, రమ్‌జాను, మొహరము మొదలగు పవిత్రములు లేవా? మన యాంగ్లేయసోదరులకు క్రిస్మసుపండుగలు, మేయుత్సవములు మొదలగునవి లేవా? ఇదికాక వారికిఁ బ్రత్యాదివారముకూడఁ బవిత్రదినమేకాదా? ఒకదినము మంచిది వేఱొకటి జబ్బేకానియెడల Good Friday కర్థమున్నదా? దానిపవిత్రత యెఱిఁగియే దాని నట్లు పిలిచినారు. ఇది కాక వర్ణవిభేదము మిథ్య యని, వేదములు కృత్రిమము లని, జీవాత్మలెండమావులని, భగవంతునిగూర్చి విచారింపఁ దగదని బోధించిన బుద్ధుఁడు సైతము పెద్దలుగతించిన దినములను పవిత్రములుగాఁ జూచుకొనుమని బోధింపలేదా? అందఱుకూడ నీవిషయ మంగీకరించినదే అడగినప్పుడు మాత్ర మొప్పుకొనుటకుఁ గొంత జంకుచున్నారు. కాని మన కాభయమెక్కడఱు లేదు. పెద్దలు నడచినత్రోవను నడుచుచున్నంతకాలము మనమెవ్వరికి భయపడవలసినపని లేదు.

మనపవిత్రదినములందే మన ధర్మసంస్థల సంబంధములగు నుత్సవములను జరిగించుకొనవలయును. ఆదినములు పావనము లగుటచే జనుల మనస్సులం దొకమంచిమార్పు కలుగక తప్పదు. శివరాత్రిదినమునఁ జేయవలసిన పవిత్రవిధు లన్నియు యథావిధిగఁ జేయనివాఁడైనను జేయలేకుంటిమని రవంతవంతకైనఁ బాల్పడక తీరఁడు. ప్రతిదినమును క్షురకర్మ మొసరించుకొనువాఁడైనను భీష్మైకాదశీదినమున గడ్డము తడిపించుకొనుటకుఁ

గానంత తటపటాయించును. పవిత్రదినములం దెట్టిపాపశీలుని మనస్సునందైన రవంత పశ్చాత్తాపము తాత్కాలికముగనైనఁ గలుగక మానదు. అట్టిపవిత్రాంతఃకరణములతో జనులెల్లరు మనయుత్సవములఁ బాల్గొందురు. వారితో మన మాయుత్సవములందు వివిధ భక్ష్యభోజ్యాదులతో నసాధారణమైన విం దారగింతుము. పెద్దలేర్పఱచిన యట్టిపవిత్రదినములందే యట్టిపక్వాన్నములఁ దినవలయునుగాని మనయిష్టానుసారముగ నేదోయొక్కటి కల్పించి, యాదినమున నసామాన్యములయిన పిండివంటలతోఁ జిత్రాన్నదధ్యోదనములతోఁ, బరమాన్నములతో నుదరపూరణ మొనర్పఁదగదు. చేత సొమ్మున్నదికదా; అంగడిలో ఘృతపిష్టాదివస్తువు లున్నవికదా; పడమటింటి బానిసతనముకుఁ బరిపూర్ణపితంతువగు వదినెయున్నదికదా; ఒడల దార్ఢ్యమున్నదికదా; ఉదరమున క్షుత్తున్నదికదా; యని నీ కిష్టమైనదినమున నకారణముగ పాకపుగారెలు; పలావు తినవచ్చునా? తగదు. పెద్దలను దలఁచుకొనుచు, పూర్వమహావీరుల సంస్మరించుకొనుచు, నవతారపురుషులలో వారినారాధించుచుఁ గాలమును గడపవలసినపవిత్రదినములందే యిట్టి యారగింపు లాచరింపవలయును. అంతేకాని రుచివైవిధ్యముకొఱకు, కండల పుష్టికొఱకు, నైహికసుఖముకొఱకు, రక్తపటిష్ఠతకొఱకు, నరముల యుద్రేకమునకై యిష్టానుసారముగ మనము బలాహారముల నేమియుఁ దినఁదగదు.

''యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
తే త్వఘం భుంజతే పాపాయే పచంత్యాత్మకారణాత్.''

ఆత్మ కారణముగ వండుకొనువారు భుజించునది అఘము కానియన్నము కాదని శ్రీకృష్ణభగవానులు సెలవిచ్చినారు. అట్టివారు తమకొఱకై వండుకొనుటయే పాపము. భుజించుటవలని కక్కఱయేలేదు. శరీరపుష్టికై, యైహికసుఖమునకై భోజనప్రయత్న మొనర్చువారు పాపులని స్పష్టపడినదికదా.

ఐహికసుఖదినములయినవివాహదినములందు నిరంకుశముగ మన మన్నిపిండి వంటలు తినుటలేదా యని యందురేమో? అదేమిమాట? మన కులదేవతలు కా క ముప్పదిమూఁడుకోట్ల దేవతలు వివాహవేదికపై నాహ్వానింపఁబడియున్నారు. వివాహమైహిక సుఖమునకుఁ గానేకాదు. మనపెద్దలు దాని నట్లు గణింపనే లేదు. స్వర్లోకవాసులకు పెద్దలకు నివాపవారి నిచ్చి వారియుత్తమగతుల సంరక్షించుటకు, నిత్యదేవతాపూజాకార్యమునకు, నతిథిసత్కారమునకు, స్వార్థపరిత్యాగియై పరోపకారముకొఱకు పాటుపడుటకును బనికి వచ్చు వంశపావనుఁడైన కొడుకును దెచ్చుకొనుటకు నేర్పఱుపఁబడిన వివాహతంత్ర మైహిక సుఖతంత్రమా? ధర్మమందే చరించుట కీయాశ్రమము తీసికొనుచున్నామని యగ్నిసాక్షిగఁ బ్రమాణము లొనర్చుకొన్న భార్యభర్తల ప్రథమసమావేశోత్సవములో నైహికగ్రంథలేశమైన మున్నదా?

పర్యవసానమునఁ జెప్పున దే మనఁగా మనము తీసికొనుచున్న యాహార మున్నదే, అది యైహికమార్గమందు బల మిచ్చుటకుఁగాదు; ఆముష్మికకార్యములందు దీక్ష నిచ్చుటకు. లాంపట్యవృద్ధికొఱకుఁగాదు; వైరాగ్యవృద్ధికొఱకు. రక్తికొఱకుఁ గాదు; భక్తికొఱకు స్వసేవకొఱకుఁ గాదు; పరసేవకొఱకు. శరీరముకొఱకుఁ గాదు; ఆత్మకొఱకు. ఇంతింత స్వల్పాంశములందుఁగూడ మనపెద్దలు మన కహంభావము రాకుండ, దేహమత్తత కలుగకుండ, స్వార్థలోలత పెరుఁగకుండఁ, బశుత్వము వృద్ధికాకుండ, జాగ్రత్తపెట్టుటకుఁ

ప్రయత్నించినారు. దేవతానివేదితాన్నమే కాని తినఁగూడ దనఁగ నర్థమేమి? తిన్న యాహారమంతయు దేవసేవకొఱకే యని యన్నముతోఁ బ్రమాణముచేయుటయే కాదా?

అందుచే మతకర్తలసంబంధముచే, మహావీరుల సంబంధముచే, దేవతల సంబంధముచే, దేవతల సంబంధముచే, నవతారపురుషులసంబంధముచేఁ బవిత్రములగు దినము లందు మన ధర్మసంస్థల యుత్సవము లన్నియు జరిగించుకొనుట సర్వవిధముల శ్రేయము. ఆదినముల కధిష్ఠాతలగు మహాపురుషులుకూడ, మహాత్ములుకూడ, దేవతలుకూడ, మనతో పాటు సభలలోఁ గూరుచుందురు; మనకు మంచియూహలఁ గలిగింతురు; మనకు సత్కార్యదీక్షను బుట్టింతురు; వారివారి యాత్మలలోని విద్యుచ్ఛక్తిని మనము సహింపఁదగి నంతవఱకు మనకుఁ బ్రసాదింతురు; మనకు సర్వకార్యసాఫల్యమును జేయుదురు; మనసం స్థలు శాశ్వతముగ వర్ధిల్లవలయు నని యాశీర్వదింతురు; దేవతలస్మరింపకుండ మనమేదియు సంకల్పించుకొనఁదగదు. దేవతల నాహ్వానించి యారాధింపకుండ మన మేప్రయత్నముఁజేయఁదగదు. వినాయకదేవు నిచ్చటఁ బ్రతిష్ఠించి, పత్రపల్లవప్రసవాదులచేఁ బూజించి, ఫలమోదకాదిభక్ష్యములు నివేదించి, భక్తితోఁ బాదములకుఁ బ్రణమిల్లి, యేతత్పా దపద్మ సన్నిధానమున సాక్షిసంఘపునర్నిర్మాణ మొనర్చుటచేత, సాక్షిసభలో నిప్పుడు వేంచేసియున్నావా రెవరో యెఱుఁగుదురా?

నాయనలారా! సంసారచింతల కొక్కక్షణము శాంతిఁ జెప్పి, కప్పదాఁటులు వేయుమ నస్సును గట్టిగఁబట్టి, శ్రద్ధావంతులై, యీశ్వర ధ్యానతత్పరులై రవంతసే వుండఁగలరా? అదిగో, ఏమి కానవచ్చుచున్నదో? నిశ్చలదీక్షతో, నిర్మలమనస్సుతో నీరంధ్రదృష్టితోఁ జూచెదరా! ఆహా! చీమకుత్తుకలో సింహము ప్రవేశించినదే! సముద్రసప్తకము చౌటిపడియలో నిఱికినదే! పరమాణువులలోఁ బర్వత మిమిడినదే! కానులేనివానిగుడిసెలోఁ గైలాస మవతరిం చినదే! ఆహా! చూచితిరా! రజతాద్రియెట్లు వెలిఁగిపోవుచున్నదో! ఉదయమార్తాండుని కిరణజాలమాకొండపైఁ బ్రసరింపఁగఁగొండ యేమియఖండతేజోమండితమై ప్రకాశించుచు న్నది! కుడిప్రక్కను గాంచితిరా? లక్షలు, కోటు లగునింద్రధనస్సులు పడుగుపేకగా నల్లుకొనిపోయి చిత్రవిచిత్రాతివిచిత్రమహా విచిత్రవర్ణములను వర్షించుచున్నవికదా! ఆతేజ స్సంఘాత మొకప్పుడుపాము మెలికలుగఁ బ్రవహించుచున్నది, చూచితిరా! ఇప్పుడు తరంగ ఫక్కిగ తవణించుచున్నది. ఇప్పుడదిగో జలయంత్రములోని నీటిసోనవలెఁ బైకెగసి రంగురంగులపూవుల నీనుచున్నది. అదిగో, ఇంతలోనుడిగుండములోవలె గిరగిరఁ దిరిగి క్రిందికిఁ గ్రుంకిపోవుచున్నది. కన్నులు చెదరుచున్నవి. ఒక్కనిముసము కన్నులుమూసికొ నుట మంచిది. ''శంకర భగవానుఁడా! కన్నులు చెదరిపోకుండఁ గటాక్షింపుము. తలతిరుగ కుండునట్లు దయసేయుము. త్వదీయవైభవమును జూచి తరింతుము. తండ్రీ! తండ్రీ! ఓహో! అనిర్వర్ణ్యమైన యాయద్భుత తేజమునుండి యంతకంటె ననిర్వర్ణ్యమైన యొకతేజో రాశి బయలువెడలుచున్నదే! ఆతేజోరాశి యొకత్రుటిలోఁ గుడివైపు శుద్ధస్ఫటికసహస్ర కాంతితో, నెడమప్రక్క నింద్రనీలకోటికాంతితో, రెండుపాయలుగా విడిపోయియుఁ గలసియే యున్నదే! వారే పురాణదంపతులగు పార్వతీపరమేశ్వరులు! ధన్యోస్మి! ధన్యోస్మి! శంకరా! అఘనాశంకరా! దుర్గా సంరక్షితభక్తవర్గా! నమస్కారములు. నమస్కారసహస్రములు. నమ స్కారకోటులు.

ఓమ్ శాంతి శ్శాంతిః.

# 3. చిత్ర లేఖనము

ఈరోజున తుంగభద్రాతీరవాసులు, చిత్రకారులు అయిన ఒక శాస్త్రిగారిని సాక్షి సంఘసభకు ఆహ్వానించి, ఆయనచేత ఉపన్యాసం ఇప్పించాడు జంఘాలశాస్త్రి.

ఆశాస్త్రిగారు ముందు చిత్రలేఖనం గురించి, స్త్రీ మూర్తులచిత్రణంగురించి కొంచం మాట్లాడారు. కొన్ని నెలలనుంచీ తాను ఆంధ్రదేశంలోని చిత్రకళాశాలల్ని చూస్తున్నాననీ, కొన్ని స్త్రీవిగ్రహాలకు పైటగాని, జాకెట్టుగాని లేవనీ, అన్ని స్త్రీ విగ్రహాలకు బొడ్డుకన్పిస్తుందనీ, మరికొన్ని విగ్రహాలకు చీరకట్టేలేదనీ ఆవేదన వ్యక్తంచేశారు. ఇలాంటి విగ్రహాలు సంతోషం కలిగించడానికిబదులు సంతాపం కలిగించాయన్నారు. బుద్ధిమంతులైన చిత్రలేఖకులు వాటిని అలా ఎందుకు చిత్రించారా! అని ఆలోచిస్తూ పడుకుంటే ఆశాస్త్రిగారికే ఒకకల వచ్చిందట. ఆకలలో అనందర్భాల్నితొలగించి సందర్భశుద్ధిగా వ్రాసిందే ఈ ఉపన్యాసం.

కలలో శాస్త్రిగారిని ఒక పురుషుడు ఒక సభలోకి తీసుకువెళ్లాడు. అందులో శ్రోతలంతా పురుషులే. ఉపన్యాసరంగంమీద ఒక యువతి మాత్రం కుడిచేతిలో కొరడాపట్టుకుని వుంది. ఆమె తేజస్సులో సౌందర్యం కాఠిన్యం, కలగలిసివున్నాయి. ఆమె ఉపన్యసిస్తోంది. ఆడవాళ్లమర్యాద గురించి మీకేమైనా తెలుసునా? అని గద్దిస్తోంది. స్త్రీమూర్తుల్ని చిత్రించేటప్పుడు అర్ధదిగంబర స్వరూపాలను, పూర్తి దిగంబర స్వరూపాలను ఎందుకు చిత్రిస్తారని నిలదీస్తోంది. తనదేశంలో స్త్రీ ఔన్నత్యం ఏమిటో, ఆమె వ్యక్తిత్వం ఏమిటో, –అది స్త్రీ మనస్సుతో అందుకుంటేనే అర్థమవుతుందని వివరించింది. స్త్రీ పుట్టింది మొదలు, చనిపోయేవరకు, ఏమాన మర్యాదల్ని ప్రాణంగా చూసుకుంటుందో చెప్పింది. స్త్రీ పట్ల గౌరవంకలిగి ప్రవర్తించండి అని చెప్పింది. స్త్రీపట్ల గౌరవంకలిగి ప్రవర్తించండి-అని హెచ్చరించి, కొరడాతో ఛటేల్న సభాసదుల్నికొట్టింది-అని శాస్త్రిగారు ముగించారు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

నాయనలారా! మనసంఘమును దిరుగ స్థాపించినపిమ్మట రెండుపన్యాసములైన నిచ్చితినో లేదో, ఇంతలోనే సంఘ వ్యాపారములకు విఘాతము తటస్థించినది. అందుల

కెంతయైన వగచుచున్నాను. దైవకటాక్షమున నట్టి యంతరాయము లికముందు రాఁబో వని యంతరంగమున నమ్మియున్నాను.

నాయనలారా! నాప్రక్కను గూరుచుండిన యీశాస్త్రిగారు తుంగభద్రాతీరగ్రామవా సులు. ఈయనకుఁ జిత్రకళానైపుణ్యము కొంతకలదు. చిత్రకళాశాల లన్నిటికిఁ బోయి వానిలోని చిత్రములను సందర్శించుపనిపై స్వగ్రామమునుండి కొంతకాలము క్రింద బయలు దేఱి తిరుగుచు మన గ్రామమునకు దయచేసినారు. వారీదినమున నుపన్యసింతురు. మీరు శ్రద్ధాళువులై వినఁగోరుచున్నాను. అయ్యా! శాస్త్రిగారూ! మీ రింక నుపన్యసింతురుగాక.

శాస్త్రిగారియుపన్యాసము-స్వప్నము

చిత్ర లేఖనమునందుఁ బ్రావీణ్య మార్జింపఁ దలఁచి కొన్నిమాసములనుండి యాంధ్రదే శమందలి చిత్రకళాశాలను సందర్శించుచున్నాను. అనేకములైన చిత్రములను జూచినాను. కొన్ని స్త్రీవిగ్రహములకుఁ బైఁట లేదు. కంచుకమును లేదు. అన్నిస్త్రీ విగ్రహములకు నాభి కానఁబడుచున్నది. అనేకవానికి చీరకట్టు బొడ్డునకు రెండు బెత్తిళ్లు దిగువగ నారంభింపఁ బడియున్నది. కొన్నివిగ్రహములకుఁ జీరకట్టలేదు. లేకున్నను మర్మస్థానము లూరువిన్యాసా దిపరిస్థితులవలన రవంత గుప్తములుగ నుంచఁబడినవేమో యనఁగ రామరామా! అట్లుకాదు. ఏమని చెప్పుదును? ఇట్టి విగ్రహములు సంతోష మిచ్చుటకు బదులుగ సంతాపము నిచ్చినవి. ప్రీతి నిచ్చుటకు బదులుగ రోఁత నిచ్చినవి. బుద్ధిమంతులగు చిత్రలేఖకులు వాని నట్లే వ్రాసిరో యని యూహించుకొనుచుఁ బండుకొంటిని. ఒకస్వప్నము వచ్చినది. స్వప్నానం తర మాస్వప్నములో నేనుఁ విన్నదంతయు స్వప్నములో సహజముగఁ గల్గునసందర్భత లను సవరించి సందర్భశుద్ధిగ నాశక్తికనుగుణమగునట్లు వ్రాసితిని. స్వప్నములో నొక్కఁడు నన్నుఁ బిలిచి నన్నుఁ దనతోఁగూడ రమ్మనినాఁడు. మాటలాడకుండ నాతనివెంటఁ బోయితిని. ఆతఁడు నన్నొక్కసభలోనికిఁ దీసికొనిపోయినాఁడు. ఆసభలో ననేకపురుషులు కూరుచుండినారు. నేను నొకబల్లపైఁ గూరుచుంటిని. ఉపన్యాసరంగమున నొక్క యువతి మాత్రము నిలువఁబడి యున్నది. ఆమె యమానుషతేజస్సమన్వితమై యున్నది. ప్రసన్న తలో భయానకత్వము, శాంతిలోఁ దీవ్రత, వెన్నెలలో నెండ, కరుణలోఁ గాఠిన్యము నామెవదనమందు సమంజసముగ సమ్మేళన మొందియున్నవి. ఆమెకుడిచేతిలో నొక్కకొర డాయున్నది. ఆచేయిచాఁపి యామె యుపన్యసించుచున్నది. నేను సభలోని కేఁగకముం దామె యేమిచెప్పెనో నాకుఁ దెలియదుకాని నేను గూరుచుండిన పిమ్మట నా కీమాటలు వినఁబడెను.

"మీకుఁ దెలియునా? చెప్పినసనైనఁ దెలియునా? ఆఁడుదాని మర్యాద యెట్టిదో మీరు గ్రహింపఁ గలరా? అది యాకాశముకంటె స్థూలమైనది. సూదిమొనకంటె సూక్ష్మమైనది. అది వజ్రముకంటెఁ గఠినమైనది. గాజుకంటెఁ బెళుసయినది. అది శతకోటికంటె శాంతమై నది. శిరీషముకంటె మృదులమైనది. జీవాత్మతత్త్వమును గ్రహియింపవచ్చును. జగత్తత్త్వ మును గుర్తెఱుంగవచ్చును. పరమాత్మ తత్త్వమును భావింపవచ్చును గాని మానినీమానసత త్త్వము గ్రహింప మీతరమా? అది మీదృష్టికి కానునా? మనస్సున కందునా? బుద్ధికిఁ బొడకట్టునా? అదిగో యనుసరికి మాయ మగునే? మనన మొనర్చినకొలఁది మానసా తీతమగునే! అట్టి యసాధ్యమైన తత్త్వమునుగూర్చి, అట్టి యజ్ఞేయమైన తత్త్వమునుగూర్చి

మీయూహము లెట్లున్నవి? మీపలుకు లెట్లున్నవి? మీరచన లెట్లున్నవి? మీచేష్ట లెట్లున్నవి? ఆఁ, ఆఁ ! పడఁతుల మర్యాదనుగూర్చి పరిహాసములా? వెక్కిరింతలా? అల్లరులా? పటములా? బజారులోఁ బ్రదర్శనములా? ఆఁ ? ఏమనుకొనుచున్నారు? మంచిచెడ్డ లక్కఱలేదా? భయోభక్తు లక్కఱలేదా? పుణ్యపాపము లక్కఱలేదా? తల్లులున్న మీరు –చెల్లెండ్రున్న మీరు–అక్కలున్న మీరు–కన్నయాఁడుబిడ్డలున్న మీరు నాదేశమందలి స్త్రీల విగ్రహములను సృష్టించునప్పు డర్ధ దిగంబరస్వరూపములను సృష్టించుచున్నారుకాదా? ఎందుకొఱకు? ముచ్చటకొఱకా? వేడుకకొఱకా? తేఱి పాఱఁ జూచుటకొఱకా? చూచి కిసుక్కుమనుటకొఱకా? బజారులోఁ బెట్టుటకొఱకా? ప్రజల నాకర్షించుటకొఱకా? పది రూపాయలఁ దెచ్చుకొని కడుపు నిండించు కొనుటకొఱకా? ఆఁడుదాని రహస్యావయవ ములనుఁ జిత్రించి ప్రకటించి యంగడిలోఁ బెట్టుకొని యమ్ముకొని యాఁకలి తీర్చుకొనుచు న్నారా? ఇంతకంటె నీకు బ్రదుకుతెరు వేదియుఁ గనఁబడలేదా? కాక ఇది ఖ్యాతికారణమని యిందు దిగితివా? ఇది పరమార్థ మని దీనితోఁ దరింతునని జన్మరాహిత్య మొందుదు నని యూహించితివా? రామరామా! కానఁగూడని యవయవములను గోనపై కెక్కించితివే? చెప్పరాని యవయవములను విప్పి బట్టబయలు చేసితివే? స్మరింపరాని యవయవములను సంతలోఁ బెట్టితివే? నిన్నేమనవలసియున్నది? ఎంతసేపు నాఁడుదాని గుప్తావయవములపై దృష్టియా? వానిప్రతిబింబములను మనస్సులో దింపుకొనుటా? వానిని కాగితముపై నెక్కిం చుట? ఒంటివెంట్రుక కుచ్చుతో రంగులు పూసి యెత్త పల్లముల విభజించి వెలుఁగునీడల వివరించి ఓ-తబిశీల్లపై దబిశీల్లతోఁ జిత్రించుటా? ఇది పశుత్వము గాక పాండిత్య మగునా? యథార్థముగాఁబురుషులు ప్రబలకామాతిరేకులు. సంతతగ్రామ్యసుఖాభిలాషులు. అంగనార హస్యాంగ సంతతసందర్శనాభీష్ట భూయిష్ఠులు. నాదేశమం దెల్లెడల నిండియున్న జమీందా రులలో నూటి కేఁబదుగురవఱ కీవ్యాపారమునఁ బండితాగ్రగణ్యులు.

వయసు హెచ్చినకొలఁది వీరి కావాంఛ హెచ్చుగుచున్నది. తలవడఁకినకొలఁది యాతలఁపు బింకమగుచున్నది. అస్రపటిమ తగ్గినకొలఁది యాయభిలాష హెచ్చుగుచున్నది. అనుభవశక్తి తగ్గినకొలఁది యాలోకనరక్తి మ్రొగ్గగుచున్నది. గాడిదకంటెను బందికంటెను గుక్కకంటెను నధమాధములైన యిద్దఱుముగ్గురు గుడిసెవ్రేడిముండలను వీరు భద్రపఱచి ముక్కులపైఁ జత్వారపుజోళ్లతోఁ, జేతులలో భూతద్దములతో, నాకులాటధామలయెదుట వీ రొనర్చు నసందర్భతలు, నల్లరులు, నానురచేష్టలు హరహరా! చెప్పఁదగదు. వినఁదగదు. తలఁపఁదగదు. జరుగుఁబా టున్న జమీందారు లిట్లొనర్చుచుండగా నదిలేని యితరపురు షులు దిగంబరచిత్ర లేఖనములతో ముచ్చటలు దీర్చుకొనుచున్నారు. మొత్తముమీఁద బురుషులకందఱ కీరోగమున్నది.

చిత్రలేఖకులారా? మీ రిట్టియవకతవకచర్య కిఁక నాశ్యాసాంతము చెప్పవలయును. అనంతసృష్టిలోఁ జిత్రించుట కెన్నివిచిత్ర వస్తువులు లేవు? అనంతమగు గ్రంథజాలములో నెన్ని యద్భుతపరిస్థితులు లేవు? బాహ్యప్రపంచమందలి పరమాకర్షకసన్నివేశము లట్లుండఁగా నాంతరప్రపంచమునఁ జిత్రవిచిత్రాతిచిత్రమహాచిత్రపరిస్థితు లెన్నిలేవు? వానిలో నొక్కదానిని బూర్ణముగఁ జిత్రించుటకు మీకుబ్రహ్మ యిచ్చిన యాయువు చాలదే. అట్టిచో నేవి పవిత్రము లని, గుహ్యములని, ప్రకటనబాహిరము లని దర్శనమువలనఁ బుణ్యక్షయక

రము లని యెన్నఁబడుచున్నవో యట్టివానిపై దృష్టి మీ కెందులకు? కవిత్వము నేర్చుకొనుట కుచవర్ణనమునకా? చిత్రలేఖన మభ్యసించుట గుహ్యాంగ రూపప్రకటనమునకా? కవి యెన్ని పాట్లు పడినను వర్ణ్యవస్తుస్వరూపము నెదుటఁ బెట్టలేఁడు. మీకళ యాకృతివిషయమున న ట్లసమర్థ మైనది కాదే. కావున మీరు కవులకంటె నెక్కువలోకాపకారకులు.

ఆఁడు వారిమర్యాదయెట్టిదో మీ కావంత యైనఁ దెలిసినయెడలఁవారి నిట్లు మీకళలలో నెంతగా నగౌరవపఱతురా? బట్టబయలైన పయోధరములతో, బట్ట మొదలే లేని మొలతో మీరు వ్రాయుచున్న విగ్రహములఁ గాంచి నాదేశస్త్రీ లెంత యేడ్చుచున్నారో మీకుఁ దెలియునా? శరీరములు చావఁగా మనసులు పుండుగాఁగాఁ గనులవెంట రక్తబాష్పములు విడుచుచున్నారే! వా రంతకంటె నేమి చేయఁగలరు? వారు తిరుగఁబడి మిమ్ముఁ బరాభవింప సాహసింతురా? వారు చిత్రలేఖనమును నేర్చుకొని పురుషవిగ్రహములను విగతకౌపీనముగఁ జిత్రింపఁగలరా? చావనైనఁ జచ్చెదరుగాని యట్టిసిగ్గుమాలినపనికి మీవలె వారొడఁబడుదురా? నాదేశస్త్రీలకు సహనము, సాధ్వసము, లజ్జ, సరళత, సద్భావము, సర్వేశ్వరభక్తి సహజాలంకారములు కావా? ఒడలి యాభరణము లన్నియుఁ బోయినస్త్రీ లున్నారు. కొడుకులు పోయిన స్త్రీ లున్నారు. కాని సహనము, లజ్జపోయినస్త్రీని నాదేశమున నాసేతుహిమాచలపర్యంతము చూపఁగలరా? వారికి సహనమే పోయిన యెడల మీదుర్నయము లింతకాలమునుండి యెట్లు సాగుచున్నవి? వారికి లజ్జయే పోయినయెడల మీబ్రదుకు లింతకాల మిట్లుండునా? సహస్రకారణములచే సగము చచ్చిపడి యున్న యిల్లాండ్ర రహస్యావయవములను నడివీథి కెక్కించి వారిని సాంగకముగ సమనస్కముగ సాత్మకముగ సంపూర్ణముగఁ జంపఁదలఁచితిరా?

పోనిండు మీ రంతటితోనైన నాఁగినారా? జగన్మాత లైన లక్ష్మీ సరస్వతీ పార్వతీదేవుల గతు లంతకంటె నధ్వాన్న మొనర్చితిరే! అంతకంటె నవకతవకఁ జేసితిరే! దుర్గాదేవికిఁ దొడలపై రవంత కప్పనక్కఱలేదా? భారతీదేవికిఁ బయోధరములపై రవంత ప్రచ్ఛన్నత యక్కఱలేదా? కన్నతల్లుల బ్రదుకులే యిట్లు కాల్చితిరేల? ఇది మాతృద్రోహము కాదా? జాతిద్రోహము కాదా? దేశద్రోహము కాదా? దేవతాద్రోహము కాదా? జర్మనీదేశమందలి చిత్రలేఖకుఁడో యాంగ్లేయచిత్రలేఖకుఁడో మావిగ్రహములఁ గాంచి మెచ్చుకొనినాఁడని యసందర్భవాక్యము లాడకుఁడు. భారతదేశనారీగౌరవము పరశురామప్రీతి యగునెడల, పాశ్చాత్యవిచిత్రలేఖకుల కేమి పోయెను? పరీక్షాధికారుల ప్రాశస్త్యనిర్ణాయకులు మీకుఁ బాశ్చాత్యులా? మీ చిత్రకళ యెక్కడ? వారిచిత్రకళ యెక్కడ? మీజాతితత్త్వమెట్టిది? వారిజాతితత్త్వమెట్టిది? మీనాగరకత యెట్టిది? వారినాగరకత యెట్టిది? మీవివాహోద్దేశమేమి? వారివివాహోద్దేశమేమి? మీ స్త్రీలవస్త్రవైఖరి యెట్టిది? వారిస్త్రీలవస్త్రవైఖరి యెట్టిది? భేద మింతయంత యని చెప్పఁ దరమా? మీస్త్రీలతత్త్వము మీకే తెలియనప్పుడు వారికిఁ దెలియక పోవుట వింతయా? పాంచాలిని వివస్త్రను జేయుటకై రారాజు శాసించెననుటలో నర్థమేమి? మగువను దిగంబరను జేయుటకంటె నామగువకు దానిమగనికి దానిజాతికి వేఱ శిరచ్ఛేదనము లేదనియే కాదా? ఆంజనేయులు రావణునియంతఃపురమున రాత్రి సంచరించునప్పుడు నిద్రావశలైన రాక్షసస్త్రీలరహస్యావయవములు ప్రమాదవశమునఁ గంటఁబడునప్పుడు రామ రామా యని స్మరించుకొనుచు మహాపాప మొనర్చితినని గడగడ వడఁకలేదా?

నకంచుకుఁడైన సన్న్యాసిని విష్కంచుక యైనసువాసినిని గాంచినవెంటనే సచేలస్నాన మొన రింపవలయు నని ధర్మశాస్త్ర ముద్ఘోషించుట లేదా? అది కాక నాల్గువేల సంవత్సరముల క్రిందట నైన మహామూర్ఖ జాతిలో నైన నత్తగారినిగోడ లాఁకలిచేఁ దినునరమాంసభక్షకసం ఘములో నైన నాఁడుదానిమొలకు రొట్టకట్టుండెనని మనము విన్నప్పుడు, ఇరువదవశతా బ్దము నందలి మీదిగంబరస్త్రీల కర్థ మేమి? అదికాక పాశ్చాత్యచిత్రలేఖనము కేవల మాకారప్రతి బింబమైన (Photography) లోనికి దిగఁబోయి పాడైపోయిన దనియు, మాచిత్ర లేఖనమునకు భావలావణ్యప్రకటనమే ప్రాణమనియు నీనడుమ పెద్దపెద్దపలుకులు పలికితిరి కాదా? అటులే మాటవరున కంగీకరింతము. నుదుటిచిట్లింపులో, భ్రూభంగములో, కనుల యరచూపులోఁ, బ్రక్కచూపులో, నిండుచూపులో, చూచిచూడకుండఁ జూచిన చూపులోఁ, జూడకుండఁ జూచినచూపులోఁ, బైచూపులోఁ, గ్రిందిచూపులో, ముక్కుప్రక్క ముదుతలలోఁ, జెక్కులయెఱుపులో, నిగనిగలో, వెలవెలలో, గడ్డపుధైర్యములో, గుండ్రతన ములో, గుంటలో, హస్తవిన్యాసములలో భావప్రకటనమున కవకాశముండునుగాని పయోధర ముల సందున నేభావము ప్రకటన మగునని పైఁట లాగివేసితిరయ్యా? ఆత్మసౌందర్యము (Beauty of the soul) కానఁబడుతునని పలికి పార్వతీదేవిని వస్త్రహీనమొనర్చి ప్రదర్శన ములలోఁబెట్టితిరా? మీకు మతులున్నవా? మతుల కేమి? ఉన్న వినియోగము మాత్రమేము న్నది? ముందు గతులుండునా?

బిడ్డలారా! స్త్రీతత్త్వ మేదియో మీకుఁ గొంతఁ జెప్పెదను. నేను జెప్పున దేదియో మీరు గ్రహింపలే రని నే నెఱుఁగుదును. నేను జెప్పుమాటలకు మీకర్థము తెలియ దని నాయభిప్రాయము కాదు. మీకు మనసున కెక్కదు. మీ కది యనుభవములోనికి రాదు. వచ్చుట కవకాశము లేదు. ఎందుచేత? ఆఁడుదాని కున్న మనసువంటి మనసు మీకు లేదు. నే నిప్పుడు చెప్పఁబోవుసంగతు లన్నియు మీ కెంత మాత్రమును గ్రొత్తవి కావు. మీ రమదినమునఁ జూచుచున్నవే. అయిననేమి? వానిలో నిమిడియున్న గుట్టు మీరు గుర్తెఱుఁగ నేరరు.

ఆఁడుప్లిల పుట్టఁగనే సమీపస్థలైన వృద్ధస్త్రీలు తటస్థముగ మాటలాడ కూరకుందురు గాని యాఁడుపిల్ల పుట్టిన దని చప్పునఁ జెప్పరు. ఆఁడుపిల్ల పుట్టినప్పుడే యాసంకోచము. ఎందుచేత, ఆఁడుపిల్ల యింకనొక యరనిముసమునకు బుట్టు ననఁగా సిగ్గను తత్త్వము పుట్టును. సిగ్గు పుట్టినయుత్తరక్షణముననే స్త్రీశిశువు భూమిపైఁ బడును. సిగ్గుపుట్టుట యనఁగా నేమో మీమనస్సున కెక్కినదా? ఎక్క దని నే నెఱుఁగుదును. ఈపిల్లతోఁ బుట్టినసిగ్గు దీనిమృతిపర్యంతము రక్షింపఁబడునో లేదో యని వృద్ధస్త్రీలకు జన్మకాలమందుఁ గలిగిన సంకోచము. స్త్రీజన్మమునకు శరీరముకంటె, ప్రాణముకంటె, మనస్సుకంటె, నాత్మకంటె సిగ్గు ముఖ్యము. అదియే ముందు అదియే మొదటిది. అది లేనియెడల స్త్రీవ్యక్తికి శరీరము లేదు. ప్రాణము లేదు. మనస్సు లేదు మఱి యేమియును లేదు. దానితోడనే స్త్రీకి జన్మము. దానితోడనే, వృద్ధి. దానితోడనే చావు. చచ్చినతరువాత నది నిల్చియుండును. కాని పోవునది కాదు.

మీయాఁడుపిల్లలకు మీభార్యలో దాసులో యుగ్గుపోయినప్పుడు మీరుచూచియుండ కపోరు. బొడ్డుమీఁదినుండి మోఁకాళ్లవఱకు గుడ్డకప్పిన పిమ్మటఁగాని యుగ్గు పోయరు.

మగపిల్ల వానికిఁగూడ నట్లైపోయుదు రనిమీరు వెకవెకలాడవలదు. ఆఁడుపిల్లకై పుట్టిన యాచారము తెలియక మగపిల్ల వానికిఁగూడ వ్యాపింపఁ జేసిరి కాని మఱియొకటికాదు. ఆఁడుపిల్ల తప్పుటడుగులు వేయ నారంభించు వెంటనే యభిమానపుబిళ్ల కట్టుట యాచార మని మీ రెఱుఁగకపోరు. అంత చిన్నగ్రుడ్డున కది కట్టకపోయిన నేమి ఫుట్టి మునిఁగిపోయె నని మీకుఁదోఁచును. కాని యది కట్టినదాఁకఁ దల్లి తహతహలాడిపోవును. అది కట్టఁగనే తల్లికనుల కెంతయైన నిండు. తల్లి మనస్సున కిఁక నిస్సంకోచత. తాను బదునెనిమిదిమూ రల చీర కట్టుకొని దట్టమైన రైక తొడిగికొని మేలుముసుఁగు వైచుకొనినయెడలఁ దనశరీరము నకెంత నిండో, తనచిత్తమున కెంత నిర్భీతియో, తనశిశువుబిళ్లకట్టుచూచి తానంతసంతోష ముగ నంతసంకోచరహితముగ నుండును. ఆఱేండ్లయిన శిశువునకు రాకుండనే పరికిణీలకై రైకలకయి పైఁటలకయి తల్లి చేయు ప్రయత్నమింత యంత కాదు. మీ కిది యంతయుఁ బిచ్చగఁ గానఁబడును. ఆయీడు మగపిల్లవాఁడు గోచిపెట్టుకొనియో తీసివైచియో కాళ్లసందునఁగట్ట నుంచుకొని వీథిలో గుఱ్ఱపుసవారులు చేయుచుండఁగా నాఁడు పిల్లల కీబట్టలభారము ప్రచ్ఛన్నత—ఆఁడుపిల్లలను బెంచుటయందుఁదల్లి పడుశ్రమములోఁ బదునా ల్గవవంతయిన మగపిల్లవానిని బెంచుటయందుఁ బడదు. పడవలసిన యావశ్యకత లేదు. "అక్క యెంతసేపుఁ దలవంచుకొనియే మాటలాడుననియు, నెప్పుడూ చూచిననైన నమ్మచెఱఁగపట్టుకొని వెనుకవెనుకనే గ్రుడ్డిదానివలె దేవులాడుచుండ ననియుఁదన పలకపు ల్లను హరించిన పొరుగింటిపిల్లవానిని గలియఁబడి నాలుగుదెబ్బ లిడ్చి కొట్టక సిగ్గులేక పంతులతోఁ జెప్పుకొన్నదనియు" నాఱేండ్లతమ్ముఁ డధిక్షేపించుచుండ ననాదరణసే యుచుండఁ బదేండ్ల బాలిక వినయమునకు నిలయమయి సాధుత్వమునకు స్థానమయి సిగ్గున కాకరమయి సోదరులకు సహాయయై తల్లికంటెవెలుఁగయి తండ్రికి గర్వకారణమయి తోట కూరకాడవలె నట్టెయట్టె యెదుఁగుచు, నెదిగినకొలఁది సిగ్గావరించుటచేత జంకుచుఁ గొంకుచు బంగారువంటిప్రాయమును బడయుచుండును.

ఇఁక భర్తయింటికిఁ బోయినపిమ్మట నాతని దుర్నయమువలన నేవియైన రోగములు సిద్ధించినఁగాని సహజముగ గర్భకోశసంబంధములగు కుసుమాదిబాధలు సిద్ధించినఁగాని నోరెత్తక, బాధపడినట్లు పైకిఁగూడఁ గనఁబడక సహించి సహించి, నీరసించి మృతినైన నొందుట కంగీకరించును గాని యత్తతోఁ జెప్పునా? ఆఁడుబిడ్డతోఁ జెప్పునా? ఊహుఁ –ఆఁడుదానిగుట్టట్టిదో యెఱుఁగుటకు బుద్ధిలేని మీరు స్త్రీలు వట్టిపనికిమాలిన మూర్ఖు లని, రోగములు దాఁచెద రని, తలగొట్టుకొనిననైన వెల్లడింప రని మించిపోయినతరువాత నేమి యేడ్చిన నే మున్నదని వారిపైఁ దీండ్రింతురు. కాలిలో ముల్లు గ్రుచ్చుకొనియెడల గ్రామమంతయుఁ గాలిపోవుచున్నట్లుగా గావుకేకలు వైచుచు వీథులవెంట మొలను గుడ్డయైన నున్నదో లేదో యెఱుఁగకుండనొంటికాలితోడనే పరవళ్లు ద్రొక్కుచు మీ రేడ్చుచుందురు కదా? అట్టిచో నోర్వఁజాలని బాధ సహించుచు నోరుమూసికొని యుండుటకు వారికిఁ బ్రబలమైన కారణ మున్నదందురా? లేదందురా? అది వారిమూర్ఖత యని యెన్నఁడును భ్రమపడఁకుడు. దేనిని బోఁగొట్టుకొనుటకంటె జీవమును బోఁగొట్టుకొనుట మంచిదో దానిరక్షించుకొను సంకల్పమే యట్టిచర్యకుఁగారణము. నేను జెప్పిన యీమాటల సార మును మీరు గ్రహింపలేనియెడల మీరు చచ్చి స్త్రీలై పుట్టినపిమ్మటఁ దెలియునుగావున నంతవఱకు నిరీక్షింపుఁడు.

ఆడువారు వీణవాయించుచుండ మీలో ననేకులు చూచి యుందురు. మగవారివలె వారు వీణను నిలువఁ బెట్టి వాయింపరు. ప్రక్కబారుగ వాయింతురు. అది సులభమార్గ మగుటచేతఁ గొందఱు మగవారుకూడ నాపద్ధతి నవలంబించినారు. దానికేమి? మగవారివలె నిలువఁబెట్టి యెందులకు వాయింపరో యెఱుఁగుదురా? నిలువఁబెట్టి వాయించునెడల నెడమచేయి పైకెత్తవలసివచ్చును. అంతమాత్రముచేతనే (Modesty) మంటఁ గలియునని వారిభయము. సూదిమొనలో సహస్రాంశముకంటె సూక్ష్మమైన దాఁడుదానిమర్యాద. అత్యం తసూక్ష్మములో సూక్ష్మమైన దాఁడుదానిమర్యాద. అట్టివిచిత్రమైన తత్త్వమును గ్రహింపలేక నాదేశనారీమణులను మీసోదరీమణుల నింతదారుణముగ నగౌరవపఱచితిరే.

పాశ్చాత్యదేశమునం దనేకపాషాణపాంచాలికలు దిగంబరముగ సృజింపఁబడలేదా యని యందురేమో! వారి చిత్రము లెంతసొగసుగ నున్నను నెంతయాకృతిసౌష్ఠవమును వెల్లడించినను నెంతప్రకృతి ప్రతిబింబములైనను వారిచిత్రలేఖనపద్ధతియే వేఱు. వారికళకు గమ్యస్థానమేవేఱు. వారివిగ్రహము లెంత నాగరికతాసౌందర్యముగలవియైననుసరే; యెంత సంస్థానసౌష్ఠవసౌభాగ్యసంపన్నములైన వయిన నరే, యెంత జీవకళాకలితము లైన నరే, వారిచిత్ర లేఖనకళయం దైహికలంపటతాపంకిలత్వ మున్నది. మనచిత్రము లెంతమోటువైన నరే. మన చిత్రలేఖనకళయం దాముష్మికపరిమళప్రకాశ మున్నది. ఇది ప్రధానభేదము.

మనకు శిలావిగ్రహము లనేకకోటులు లున్నవి. అవి యన్నియు దిగంబరములుగా నున్నవా? దిగంబరములైనను గాకున్నను వస్త్రములు లేని విగ్రహములను మనము పూజించుచున్నామా? అది గాక యీసందర్భమున నత్యంత విచిత్రమైన యాచార మొక్కటి యున్నది. చెప్పనా? మన దేవాలయములలోని స్త్రీవిగ్రహములకు బట్టలు కట్టింపవలసి వచ్చినప్పుడు పూజరి కనులకు గంతలు కట్టుకొని మరి కట్టవలయును. ఆహా! ఇంత యద్భుతమైన యాచారము మరి యేదేశమందైన నున్నదా? అసాధారణమైన యద్వితీయ మైన యాశ్చర్యకరమైన ఈయాచరమును బట్టియైనను నాదేశమందలి యాఁడువారిమర్యాద యెట్టిదో రవంతయైన మీరు తెలిసికొనలేరా? మీకింతకంటెఁ జెప్పవలసినది లేదు. మీరింత టినుండియైన బుద్ధి కలిగి, జాతిభక్తి కలిగి దేశభక్తి కలిగి స్త్రీగౌరవము కలిగి మీకళను వృద్ధిచేసికోవలయును.

అదిగాక మీకళకు భావము ప్రధానమని చెప్పుచు, మీ విగ్రహములకన్నులు బొత్తిగఁ బాడుచేయుచున్నారు. కన్నులు నగము మూయునెడల నేదో భావము ప్రకటిత మగునని మీ రనుకొనుచున్నారు కాఁబోలు. మీవిగ్రహములకన్నుల యసందర్భతనుగూర్చి మఱియొ కసారి యుపన్యసింపఁదలఁచితిని.

కాని నాదేశరక్షకదేవత లైన లక్ష్మీ సరస్వతీ పార్వతీదేవుల విగ్రహసృష్టియందు మీ రొనర్చిన మహాదోషమునకు మిమ్ము శిక్షింపకతప్పదు, ఇదిగో"

అని పలికి కొరడాతో చెటేలున సభానదులఁ గొట్టెను. అమ్మయ్యో యని యేడ్చుచు నిద్రనుండి లేచితిని.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 4. కవి

కవి ఎలా ఆలోచిస్తాడు? ఎలా ప్రతిస్పందిస్తాడు? ఎందుకు, దేనిగురించి ఆరాటపడతాడు?- అనే విషయాలను తరిచి జంఘాలశాస్త్రి ఈ ఉపన్యాసం ఇస్తున్నాడు.—

కవి, ఒక గడ్డిపరకలో సైతం పరమేశ్వరుడి కరుణ, పరమేశ్వరుడి లీల, పరమేశ్వరుడి జ్ఞానం, పరమేశ్వరుని ఆనందం, పరమేశ్వరుడి మహిమ, భావించి ఆ మూర్తిని సేవించి సేవించి, ఆశక్తిని ధ్యానించి ధ్యానించి, ప్రకృతిలో సహజతకు సంతోషించి, వలచి, వశుడై, సౌందర్యగీతాలను అరచిఅరచి, వ్యక్తిత్వాన్నిమరచి, తన్మయుడవుతాడు.

నవ్వితే ఒక సొగసు, బెదిరిస్తే వేరొకసొగసు, తల ఊగిస్తే మరోసొగసు, రౌద్రంగా ఝూంకరిస్తే ఇంకొకసొగసు, బతిమాలితే మరోసొగసు కనిపించే ప్రకృతికిలొంగి, సౌందర్యం అనే పాలసముద్రంలో చేతులు బారలువిసిరి ఈదుతూ-మరొకసారి ఏచిరు కెరటంమీదనో తలవాల్చి మైమరచి పడివుండే మనిషి కవి.

బాహ్యప్రకృతే ఎంతో ఆశ్చర్యంగా వుందనుకుంటే, మరిలోపలి ప్రకృతి ఇంకా ఆశ్చర్యకరమైంది. అక్కడ తలెత్తే ఉత్పాతాలు బాహ్యప్రకృతిలో వాటికంటె తీవ్రమైనవి.

మనం రకరకాల వ్యవధానాలతో చరిత్రలో సాగిన అనేక యుద్ధాలగురించి వినివున్నాంగాని, సృష్టిప్రారంభంనుంచే అరిషడ్వర్గం (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు)తో మనిషికి లోపలి ప్రకృతిలో జరిగే యుద్ధం దాని సంక్షోభం వాటికంటె బీభత్సమైంది. ఈరెండు విధాల ప్రకృతులలో విశేషాలను తన అనుభవంతో పట్టజాలినవాడు కవి. అతనికి మాటల్ని బొమ్మలుగాచేసే శక్తివుంది. కవి ఒక విధమైన పిచ్చివాడు. కోటి విధాల పరమార్థగ్రహణ మార్గాలలో ఒక మార్గమే ఆపిచ్చి. అటువంటి వెర్రితో, తాను ధన్యుడై లోకాన్నిధన్యంచేసేవాడు కవి.

**జం**ఘాలశాస్త్రి యిట్లు పలికెను.

ఎక్కడఁ జూచిన జిగజిగ, ఎక్కడఁ జూచిన మిలమిల, ఎక్కడఁ జూచిన నీరు, ఎక్కడఁ జూచివ పరిమళము, ఎక్కడఁ జూచిన వెలుఁగు, ఎక్కడఁ జూచిన బయలు, ఎక్కడఁ జూచిన

రంగు. ఆహోహో! ఏమివింత! ఏమిచిత్రము! పచ్చనిబయళ్లు! ఫలములతో నిండినచెట్లు, పుష్పములు గుత్తులుగుత్తులుగా నున్న లతలు, భూమినుండి యుబికి యుబ్బెత్తుగ లేచుకొండలు, స్వాదుజలభరితములగు నదులు, నొడ్డులేని సముద్రము, నంతములేని యాకాశము, తేజోమయములగు గ్రహములు, కంటికి తేజము, చెవికి హాయి, యొడలికిఁ జలువ, ఘ్రాణమునకు సౌరభము, జిహ్వకు రుచి నిచ్చుచున్నవికదా? ఈతేజముకంటె, నీహాయికంటె, నీచలువకంటె, నీసౌరభముకంటె, నీరుచికంటె విలక్షణమైన యాశ్చర్యకర మైన, యనుభవైకవేద్యమైన యానందము ప్రకృతిదర్శనమున మనస్సునఁ గల్గుచున్నదికదా? ఆయానందప్రభావమున మనస్సెట్టె యుట్టె తేలికయై యట్టె యట్టె విస్తీర్ణమై ప్రకృతియందు వ్యాప్తమై లీనమై పోవుచున్నదికదా? ఏవస్తువును గాంచిన సౌందర్యామృతము వర్షించుచున్నట్ల గడుచున్నదికదా? ఏవస్తువును గాంచిన సౌందర్యామృతము వర్షించుచున్నట్లగడుచున్నది కదా? ఆహా? ఆకసమున నీవైపునుండి యావైపునకు వ్యాపించిన యింద్రధనుస్సువంపులతో, రంగులతో, వ్యాప్తితో, సౌందర్యముతోఁ కలసి ప్రకృతిసౌభాగ్యదేవతకు మంగళపుటారతు లిచ్చుచున్నవికదా? ఒక్కగులాబిపువ్వులోని సారళ్యము, సౌందర్యము, సౌరభము నాలోకింపఁ బోయి, యస్వాదింపంబోయి, యనుభవింపఁబోయి, యాపుష్పసౌభాగ్యములోఁ గలసి, యాకేసర మార్దవమున నార్ద్రమై, యామకరందబిందుసందోహమున లీనమై మన సట్టె యట్టె తన్మయత్వమును జెందుచున్నదే. తుట్టతుద కొక్క గడ్డిపోరకలోఁ బరమేశ్వ రుని కరుణ, పరమేశ్వరునిలీల, పరమేశ్వరునిజ్ఞానము, పరమేశ్వరునియానందము, పరమే శ్వరునిమహిమము భావించి; యామూర్తిని సేవించి సేవించి, యాశక్తిని ధ్యానించి ధ్యానించి తరింప వచ్చునుగదా! ప్రకృతిసామంజస్యమునకు, ప్రకృతి సామీచీన్యమునకు, వలచి వలచి వశుఁడై వశుఁడై సౌందర్య గీతము లఱచి యఱచి, వ్యక్తిత్వమును మఱచి మఱచి, తన్మయుఁ డగు నాతఁడు కవి. తాను వలచిన ప్రకృతిఁ జూచినకొలఁది, చూచినకొలఁది సుందరస్వరూ పయై కానఁబడునే. ఆఘ్రాణించినకొలఁది నధిక పరిమళభరితయై కానఁబడునే. కౌఁగిలించిన కొలఁది కౌఁగిలించిన కొలఁది కఠినతలో మెత్తన, మెత్తనలోఁ గఠినత. కఠినతలో గఠినత, మెత్తనలోమెత్తన, వేఁడిలోఁ జలువ, చలువలో వఁడి, చలువలోఁ జలువ నిముసనిముసమున కధికతరముగఁ గానఁబఱచుచున్నదే. ముద్దుపెట్టినకొలఁది ముద్దులోఁ దేనె, యాతేనెలో కలకండ, యారెంటిలో ద్రాక్షపండ్లరసము, నామూఁటిలోఁ బద్మసౌరభము, ఆనాల్గింటిలో శిరీషపేశలత క్షణక్షణప్రవర్ధమాన మగుచుఁ గానఁబఱచుచున్నదే ప్రాఁకులాడినకొలఁది ప్రాఁకులాడినకొలఁది వన్నెలు, చిన్నెలు, హొరంగులు, హొయలులు, తళుకులు, బెళుకులు, వగలు, వద్దికలు నేకొత్తరాభివృద్ధిగాఁ గానఁబఱచుచున్నదే. మల్లెపూవులలో రెల్లుపూవులలో నట్టె యట్టె మందహాస మొనర్చుచున్నదే. చక్కని చుక్కలమాటునఁ జేరి కాముకుఁడైన కవికిఁ గ న్నిట్టెయట్టెఁ గీటుచున్నదే. పర్వతములప్రక్కఁ జేరి తెల్లని జిలుఁగుపయ్యెదతోఁ బయోదరములాంధ్రవనితవలెగూఢతయుఁ బ్రత్యక్షతయుఁ గాకుండ మాటుకొనుచు బయ లుసేయుచున్నదే. అంభోధరములచెంత నిలిచి మొగము ముడుఁచుకొని ధుమధుమలాడుచుఁ గంటవెంట నిప్పులు గ్రక్కుచు బడబడాయమానశబ్దములతోఁ గఠోర ముగ ఝూంకరించుచున్నదే. అట్లు ఝూంకరించి ఝూంకరించి స్త్రీనైజము ననుసరించి ధారాపాతముగఁ గన్నీరు విడుచుచున్నదే. గంగావాల్గాదిముక్తాహారాలంకృతగళసీమయై, నక్షత్రపుష్పహారవిరాజితకేశబంధయై, భానుమండలసిందూరతిలక ప్రభాభాసమానఫాలసీ

మయై పద్మపన్నీరచంపకశేఫాలికాదిపుష్పపరిమిళభరిత నిశ్వాసయై, సర్వగోళసంచలనో ద్భూతమహారవగీతామాధురీరమాధురీణయై ప్రకాశించు నీప్రకృతికాంత చూచిన చూపులకుఁ, బలికిన పలుకులకుఁ, బాడినపాటలకు, నాడినయాటలకు, చేసినచేష్టలకు నధీనుఁడై, పరవశుఁడై, కవి రసమయుఁడై విరాజిల్లునే. సర్వాంగసుందరయై బంగారుప్రాయ మున నున్న వేశ్యాకాంతను విటుఁ డెంతగాఢముగఁ బ్రేమించునో, ప్రేమించి దానిపాదముల యొద్దనే యొద్గిలఁబడి, దాని మొగమునందే సదా దృష్టిధ్యానముల నిల్పుకొని యుండునో ప్రకృతి ప్రమదాశిరోమణి నంతకంటె గాఢముగఁ బ్రేమించి యామెకౌఁగు దగిలినఁ జాలు నని, యామెముఖసౌరభ మబ్బిన భాగ్య మని, యామె యవయవవర్తులత కనఁబడిన నదృష్ట మని, యామె చిఱునవ్వువెన్నెలచే మనస్సు చల్లఁబడిన స్వర్గ మని, యామె క్రీగంటఁ దన్నుఁ గటాక్షించిన మోక్షమని, కవి యామెను నేత్రపుష్పములచే, వాక్పుష్పములచే, మనఃపుష్పముచే నారాధించుచుండునే. ఆకుపచ్చనితలషుగాగరాకట్టి, పూలరవికఁ దొడిగి, పంటకాలువలయొద్దునను, జలప్రపాతముల ప్రక్కలను, నడివలెఁ దాండవించుచుండ కవి మహానందమున లయానుసారముగ గీతములు పాడుచుఁ జేతులతోఁ దాళములు వైచుచుం డునే. ఒడలు భయంకరముగ నదరుచుండ, నోటివెంటఁ బొగలు, గంధకపుజ్వాలలు, రాతినీరు గ్రక్కుచు రౌద్రస్వరూపిణియై చెలరేఁగుచుండ, నొదిఁగి, యడఁగి శోకసంతప్తచిత్తుఁడై కన్నీళ్లతోఁ గవి కరుణగీతములఁబాడుచుఁ గరఁగిపోవుచుండునే. పండు టాకులనడుమ, శిథిలములైన మహాభవనములనడుమ సంధ్యారాగము వెనుక సన్యాసినివలెఁ గాషాయాంబరధారిణియై, యస్తమించుచున్న సూర్యునిఁ జూచుచు నాలోచనభావమున నిశ్శబ్దముగ నడఁగియుండఁ, గవి జగదశాశ్వతతత్త్వము, సర్వసంగపరిత్యాగమును బోధిం చువైరాగ్యగీతములు పాడి తానుగూడఁ గాషాయమాత్రధారియై నిర్మలుఁడై, నిర్లేపుఁడై నిస్సంగియై, నీఱయిపోవునే. నవ్విన నొక్కసొగసు, రౌద్రమున ఝూంకరించిన నింక నొక్కసొగసు, నేడ్చిన మఱియింక నొక్కసొగసు, బతిమాలిన మఱిమఱి యింక నొక్కసొగసుఁ, గల ప్రకృతికాంత కధీనుఁడై కవి సౌందర్యక్షీరవారాశిలో నొకపుడు చే బారలు వైచి యీఁదుచు మఱియొకపుడు కదలిన ట్లగపడక నిల్వు టీఁతసీఁదుచు, వేఱొకపుడు సౌందర్యామృతమును గడుపునిండఁ గ్రోలి కదలలేకుండ నలసిసొలసి యేతరంగముమీఁదనో తలయుంచి యొక్కనిమేషకాలము మైమఱచి పడియుండునే. నోటివెంటఁ గనులవెంటఁ జెవులవెంట ముక్కువెంట లావణ్యామృతము నధికముగాఁ గ్రోలుటచేఁ గెక్కు కెక్కుమ నుచు నూపిరియాడక, బుడుక్కున మునిఁగి యొక్కసారి తేలి, మఱియొక్క మున్కలో నమృతమయుఁడై యద్వైతస్థితి నొందునుగదా!

బాహ్యప్రకృతియే యింతయనిర్వర్ణ్యమై, యద్భుతమై యప్రతిహతమై యుండ దీనిని మించిన ప్రకృతి వేఱొక్కటి యున్నది. అదియే యాంతరప్రకృతి. బాహ్యప్రకృతి యెంతవివి ధమో, యెంతవిపులమో, యెంతవిస్మయజనకమో, యాంతరప్రకృతి యంతకంటె వివి ధము. అంతకంటె విపులము. అంతకంటె విస్మయజనకము. దానిలోఁ బ్రకాశించుచున్నది, యెండయా కాదు, వెన్నెలయా కాదు, ఎండయు వెన్నెలయుఁగలసి యెండయు వెన్నెలయుఁ గాని, యెకవింతకాంతియై, వింతలలో వింతయై వెల్గిపోవుచున్నదే. లక్షసూర్యులు, కోటి చంద్రు లొకదానిప్రక్క నొక్కటి, యొకదానిలో నొక్కటి యేకకాలమందుఁ బ్రకాశించుచు న్నవే. ధ్వనికంటె, వెల్తురుకంటె, విద్యుచ్ఛక్తికంటె నెక్కువ వేగవంతములైన వింతవింతబా

రుమెఱుపులేవో సుల్కాసహస్రములతోఁ గొఱవిదయ్యపుఁ గోటులతో లోన జిఱిజిఱి మనుచున్నవే. అంతరప్రకృతిలోని రత్నములముందు, మీపట్టువజ్రము, మీ కోహినూరువ జ్రము దిగదుడుపునకైన నక్కఱకు వచ్చునా? అనంతరప్రకృత్యాకాశమునఁ గలుగు నింద్రధ నస్సులముందు బాహ్యప్రకృతిలోని యింద్రధనస్సులు వెలవెలలాడుచున్నవే. నిస్తేజస్కము లగుచున్నవే మాసిమాయమగుచున్నవే. అంతశ్శక్రచాపములలో వట్టి రంగులుమాత్రమేనా? కాదే, రంగులో శబ్దమో, ఆశబ్దములోఁ బరిమళమో, ఆపరిమళములో మాధుర్యమో, ఆమాధుర్యములోఁ జలువయో, అన్నిటిలో ననిర్వచనీయమైన సౌందర్యమో, ఆహా! ఏమి యంతఃప్రకృతి! ఏధరణీ కంపములైన, నే యగ్నిపర్వతోత్షేపములైన, నేగాలివానలైన, నాంతర ప్రకృతిలోని సంక్షోభముల కీడువచ్చునా ఎనిమిదిదినములయుద్ధమున్నది. పదునెనిమిదిదిన ములయుద్ధ మున్నది. మూఁడుసంవత్సరముల యుద్ధమున్నది. నూరుసంవత్సరముల యుద్ధ మున్నది. కాని సృష్ట్యాదినుండి కామక్రోధాదులయుద్ధ మవిచ్ఛిన్నముగ నాంతరప్రకృ తిలో జరుగుచున్నదే. రామాయణయుద్ధమైన భారతయుద్ధమైన ఐరోపామహాసంగ్రామమైన నవియన్నియునైన నరిషడ్వర్గ సంక్షోభము ముందెంత? పిడుగుపాటుముందు పికిలికూతలు కావా? సముద్రపుహోరుముందు సరుగుడుచెట్లగానము గాదా? అట్టిబాహ్య ప్రకృతికి నిట్టియాంతర ప్రకృతికి నేమిసంబంధ మున్నదో, యేమి భేదమున్నదో, దానిలోఁ దిరుగు నప్పు డేమియానందమో, దీనిలోఁ దిరుగునప్పుడేమియానందమో, యాయానందమున కీయానందమున కెచ్చట సామ్యమో, యెచ్చటభేదమో, యనుభవమునఁ గనిపెట్టఁజాలి నయాతఁడు కవి. చెట్టుమొదలే కొమ్మయై, కొమ్మయే యాకై, యాకే చిగురై, చిగురే పుష్పమై, పుష్పమే మకరందమైనట్లు బాహ్య ప్రకృతియే జడత్వమును త్యజించి, భారమును వదలి, మోటుతనమును విడిచి, క్రమముగా సున్నితమై, మృదులమై, తేలికయై, వేగవంతమై, సూక్ష్మతమమై, విపులతరమై, యాంతరప్రకృతిగ మారెనో, కాక యాంతర ప్రకృతియే క్రమముగ మందమై, బరువై కఠినమై మొద్దై బాహ్యప్రకృతిగ మారెనో తెలిసికొనఁ గోరి యొక్కసారియే యందులో నొకకా లిందులో నొకకాలుంచి, యందులో నొకచేయి, యిందులో నొకచేయి యుంచి, యందులో నొకకన్నిందులో నొకక న్నుంచి, పరిశీలించి, కాశిపట్టుబట్టకు, మెఱుఁగువైపు, మోటువైపులెట్లో యట్లే యని యనుభవమునఁ గని పట్టఁజాలినయాతఁడు కవి. అట్లు కనిపట్టి యాకృతిచే, రంగులచే, రుచిచే, బరువుచే, స్వభావముచే, గతిచే, భేదములైన యావస్తువు లన్నిటికి లోపల వెలుపల, నొకవిలక్షణ మగుశక్తి నిండియున్న దనియు సృష్టములగు సర్వపదార్థములుగూడ నామహాశక్తిసాగరమం దలి తరంగములు, తుంపరలు, బుద్బుదములు, ఫేనము లని యావేశమున గనిపట్టఁజాలిన యాతఁడు కవి. అందుచే నేకత్వమే బహుత్వముగా నున్నదికాని, బహుత్వ మసత్యమనియు, నేకత్వమే సత్య మనియుఁ గనుపట్టు నాతఁడు కవి.

ఈశక్తియందుమాత్రము, కవికి, వేదాంతికి సామ్యమున్నది. ఉత్తమమైనకవిత్వము వేదాంతముకంటె భిన్నముకాదు. "Poetry is the highest Philosophy" అని పాశ్చాత్య విమర్శకచక్రవర్తి చెప్పినాఁడు. జగత్తత్త్వమును గూర్చి, పరబ్రహ్మతత్త్వమునుగూర్చి పలికిన వేదర్షులందరు మహాకవులు కారా? జగత్పుస్తకమును జదివి, దాని యర్థమును గ్రహించి, దానిభావమును గుర్తెఱిఁగి, దాని రచియించిన మహాశక్తియొక్క తత్త్వము ననుమానింపఁ గలిగిన యాతఁడే కవి. భూమిలో నుండు గాజురాయి మొదలుకొని యంతరిక్షమున నత్యంత

దూర మందుండు చుక్కవఱకు సమస్తపదార్థములందు నీతిని, శాసనమును, ప్రేమమును, సౌందర్యమును, మతమును, నవిలంఘ్యక్రమమును బుద్ధివైశిత్యముచేఁ గనిపట్టఁజాలిన యాతఁడు కవి. ఫలభారమున వంగిన చెట్లు ప్రపంచమున కేమి బోధించుచున్నవి? విద్యాంసుఁడు వినయవంతుఁడై యుండవలయు ననియేకదా? ఉదయముననే భరతపక్షి 'తుఱ్ఱు' మని సూర్యునివంక కేల యెగురుచున్నది? నిద్రావస్థలో నిస్సహాయస్థితిలో రక్షించిన భగవంతుని పాదములపై మనుజుని యాత్మకృతజ్ఞతా వందనములతో నుబ్బెత్తుగ నెగురవలయు ననుమతమును బోధించుటకేగదా. గులాబిపాదపై నొకపూవును మనము లాఁగగా దానిపై కొమ్మపై నుండుపువ్వు తానుగూడ వంగుట యెందులకు? ఒకచెంపఁ గొట్టువానికి రెండవ చెంపఁగూడ చూపు మని యేసుక్రీస్తుఁ డెందులకు బోధించెనో యందులకే. పురపాలకసంఘమువారి వీథి దీప మేమి బోధించెనో యందులకే. పురపాలకసంఘమువారి వీథి దీప మేమి బోధించుచున్నది? తా నంతస్తాపముచే దహింపఁ బడినసరియే. పరులకు మే లొనర్పు మను స్వార్థపరిత్యాగమహాపాఠమును బోధించుట లేదా! కన్ను లున్న వానికి, మన సున్నవానికి రాతిలో నీతి యున్నది. మట్టిలో మత మున్నది.

అట్లు చూచువాఁడు కవి. చూచి యూరకుండునా? ఆవేశ మూరకుండనిచ్చునా? ఆనందము పొరలి పోకుండ నాఁగునా? లోపల చిత్తము తాండవించుచున్నప్పుడు జిహ్వపై శారద తాండవింపకుండునా? కలకంఠకలస్వనములతో నొకప్పుడు, శ్రీనివాసదేవాలయ ఘంటా ఘణఘణధ్వనులతో నొకప్పుడు శ్రీశైలేశ్వర శంఖారావములతో నొకప్పుడు, ఆఫ్రికాదేశపంచాననభయంకరగర్జారావములతో నొక్కప్పుడు పలికి, చిత్తోత్సాహమును, జిత్తోద్రేకమును నప్రయత్నముగ, ననర్గళముగ వెల్లడించునాతఁడు కవి. ఎవనిపలుకు లొకప్పుడు గంగా ఝురీవేగసన్నిభములో, యొకప్పుడు పుత్రునియాలింగనమువలె చల్లనలో, సంతోషజనకములో, యొకప్పుడు పడుచుపెండ్లాము నాలింగనము వలె గోరువెచ్చనలోఁ గుతూహలప్రదములో, యొకప్పుడు పన్నీటితుంపరవలె పరిమళభరితములో, యొకప్పుడు వీణావాదమువలె మధుర మధురలలితలలితములై హృదయాకర్షములో, యొకప్పుడు వేదవాక్కులవలె శాసనములో, యొకప్పుడు నిస్సంబంధములుగాఁ గానఁబడుచు, దూరస్థములుగఁ గానఁబడుచు, మెలికలై ప్రక్కబాఱునఁ బోవుచు, తిరుగుడులై వెనుకబాఱున వచ్చి కాళ్లు చేతులు మనస్సు గట్టిగాఁ గట్టి డబ్బాటున మోనముతో స్వాధీనపఱచు కొనుదాఁక స్వభావము తెలియని పలుకు లొకప్పుడు, రివ్వుమని పైకిఁ బోయి యచ్చట నింద్ర చాపవర్ణములఁ బూలను ద్రిమ్మరించి క్రింద జాజిపోవుపలుకు లొకప్పుడు, నుపయోగించు సమయానుసారసర్వతో ముఖసమ్మోహినీకరణసరస్వతీమూర్తియగు నాతఁడు కవి.

పైకి మందుఁడై, బాహ్యప్రపంచజ్ఞానశూన్యుఁడై, జడుఁడై, యాంతరప్రపంచముచే గాఢముగ నవలోకించుచు, గోఁచితో, గొంగళి పాఁతతో, నెడమచేతివెదురుకఱ్ఱతోఁ, గుడిచేతికుండతోఁ, గడుపులో నాఁకలితో, నడుముపై వంపుతో, శిరముపైఁ గంపతో బిచ్చగాఁడై, మాధుకర మెత్తుకొనుచు నొకపుడు, ధర్మ సింహాసనాధిష్ఠాతయై, కిరీటాంగదధారియై, స్వర్ణవేత్రధరసేవితుఁడై యొకచేత ధర్మశాస్త్రమును, నొకచేత కత్తిని ధరించి యొకయడుగు చందనమున, నొకయడుగు నగ్నియం దుంచి, ప్రజలను యథాన్యాయముగఁ బరిపాలించుచు నొకపుడు, ముండియై, దండియై, కాషాయాంబరధా

రియై, బ్రహ్మవర్చసము ముఖమున రవణింప నుపదేశముద్రను వహించి, యుపనిషత్సార మును బోధించుచు నొకపుడు, చిఱువెంద్రుకలతో, పాలబుగ్గలతో, నోటిచొంగలతో, కంటికా టుకతో, మాటిమాటికి పైకెత్తుచున్న నడుముతో, చమురుతలతోఁ, దొట్టిలోని బొత్తులలోఁ బందుకొని వ్రేలు నోటఁబడక వెక్కివెక్కి యేడ్చుచు నొకపుడు నిట్లు భావనాప్రపంచమున, భావనానాటకమున, భావనారంగమున సర్వవేషధారియై బాహ్యప్రపంచాతీతుఁడై తన ప్రపం చమునఁ దా నొక్కఁడై సర్వమై యుండునాతఁడు కవి.

ఎదుట లేనివస్తువుల వర్ణించునపు డాంతరదృష్టితో, వజ్రధారకంటె వాఁడియైన యాంతరదృష్టితో, నావస్తువుల యాకృతి, రంగు, రుచి, వాసన, ధ్వని, స్పర్శము మొదలగున విపరిశీలించి వాని బాహ్యాంతస్స్వరూపముల నెట్టయెదుటఁ బెట్టఁగల యింద్రజాలమహేంద్ర జాల విద్యావిశారదుఁ డగునాతఁడు కవి. ఏయేవస్తువుల నెట్లెట్లు వర్ణించిననవి స్వస్వరూప ములతోఁ బ్రత్యక్షము లగునో యట్టి చాకచక్యసంపత్తితోఁ గొన్నిటిని బలిష్ఠములైన నాల్గు జటకాలతోనో, కొన్నిటిని బలిష్ఠములైన మూఁడువ్రేతలతోనో కొన్నిటిని దేలికతేలిక లేఁతలేఁత యగు పదిప్రేటులతోనో నిర్మించి యెంతదూరముననో యెన్నిమూలలలోనో దాఁగియున్న వానిని సాక్షాత్కరింపఁ జేయఁగ... ...యయానుసారశబ్దార్థగుంభనాసమర్థుఁడగు నాతఁడు కవి. ఎవనిబొమ్మలు మాటలో యతఁడు చిత్రకారుఁ డగునట్లే యెవనిమాటలు బొమ్మలో యతఁడు కవి.

నాయనలారా! కవియొక్క ప్రధానశక్తులను జెప్పుచున్నాను. ఇట్టిశక్తుల కుదాహరణ ములు మనభాగవతభారతరామాయణాది గ్రంథములనుండి యెత్తిచూపునెడల నాల్గుదినము లకైన నీయుపన్యాసము తెమలదు. కవిలక్షణములనుమాత్రమే చెప్పెదను. లక్ష్యములను మీరు చూచుకొనవలయును. (అయ్యా మీపూర్వోపన్యాసములం దెన్నిటిఁ గూర్చియో చెప్పెద నని వాగ్దాన మొనర్చియున్నారు. ఈసందర్భమునఁ గవిభేదములఁగూర్చియుఁ బాత్రౌచిత్యముఁగూర్చియుఁ జెప్పవలసి యున్నది. పూర్వవాగ్దత్తములైన వన్నియు నీసారి చెప్పినదాఁక మిమ్మువదలము–అని సభలోఁ గేకలు.) నాయనలారా! కూతురు కొడుకును గందునన్నఁ దల్లి వల దనునా? వినువా రున్నప్పుడు చెప్పకుందునా? పూర్వమున నుపేక్షించిన వానినే కాక నింక ననేకవిషయములఁగూర్చి చెప్పెదను. ప్రపంచచర్య లంత కంటె నంతకంటెఁ జెడుచునేయున్నప్పుడుపన్యాసవిషయములకు లోపమేమి? భగవత్క టాక్షము మాత్రముండవలయును.

నాయనలారా! కవిలక్షణము లింకఁ జెప్పెదను. ఇది చప్పున మనస్సునఁ బ్రవేశించువి షయము కాదు. కావున సావధానచిత్తముతో వినవలయును. వస్తువర్ణనశక్తి నింతవఱకుఁ జెప్పియుంటిని. పరుల సుఖదుఃఖాద్యవస్థాభేదములను తనవిగాఁ జేసికొని పరులహృదయ ములందు దూరి తన్నుఁ బూర్తిగ మఱచి తనవ్యక్తిత్వమును బూర్ణముగఁ దుడిచిపెట్టి వారిహృదయములం దైక్యమై, వా రట్టియవస్థాభేదములం దెట్లు మాటలాడుదురో, యెట్లు పాడుదురో, యెట్లు గంతులిడుదురో, యెట్లు కూలఁబడుదురో, యెట్లేడ్తురో యట్లు మాటలాడి, యట్లు పాడి, యట్లు గంతులిడి, యట్లు కూలఁబడి, యట్లేడ్చునాతఁడు కవి. కళత్రవిహీనుఁ డగునిర్భాగ్యుఁ డేడ్చిన ట్లొకపుడు, పుత్రోదయమైన భాగ్యవంతుఁడగు వృద్ధుఁ డుప్పొంగి మహానందమున నోలలాడిన ట్లొకపుడు, సందిగ్ధావస్థలో నేటు చేయుటకుఁ దోఁపని యాపన్నునివలె నూఁగులాడి యొకపుడు, నపకారి యగునరి యెదుటఁబడిన

వీరాగ్రేసరునివలె బాయకత్తి జళిపించి ఝాంకరించి, సంహరింపఁ బోవుచు నొకపు డిట్లే యందఱాడవలసిన యాటలు తానే యాడి తానే పరవ్యక్తు లైనట్లు మాటలాడు నవ్యక్తిసంఛన్న పూర్వకపరవ్యక్తిప్రవేశ పాండితీమండితుఁడగు నాతఁడు కవి.

ఆంతరప్రపంచములోని రూపశూన్యములైన రసభేదములు, నవస్థాభేదములు నక్షిగోచరములు కాకుంటచే వానిని వివరించి, విస్పష్టముగా మనయెదుటఁ బెట్టవలసివచ్చుచున్నపుడు బాహ్య ప్రపంచమున మన కనుభవములో నున్నవస్తువులను జట్టుభట్టు సందర్భానుసారముగ నుపమలొనర్చి తెలియనివానినిఁ దెలియున ట్లొనర్చి చీఁకటిపై వెలుతురినిఁ బ్రసరింపఁజేయు విజ్ఞానతేజశ్శాలియగునాతఁడు కవి. మనస్సంకల్పములు, చిత్తవికారములు, బుద్ధిభ్రమములు, వివిధరసస్ఫురణములు, వర్ణ్యవిషయములైనప్పు డాయగోచరపరిస్థితులను దెలియఁబఱచుటకు బాహ్యప్రపంచమునందలి సామ్యపరిస్థితులసాహాయ్య మావశ్యకము, ఆంతరప్రపంచమందలి సామ్యపరిస్థితులసాహాయ్య మావశ్యకము, ఆంతరప్రపంచమునందలి యజ్ఞవిషయమునెల్ల సూక్ష్మముగా, సునాయాసముగా, సుప్రశస్తముగా, నత్యంతసముచితములైన యుపమలతో లంకెవేసి మనసుతోనైన స్పష్టముగ గ్రహించుట కవకాశములేనివానినిఁ గంటితోఁ జూచునట్లు చేయు ప్రకృతిజ్ఞానపరిపూర్ణుఁ డైనయాతఁడు కవి. కవి ప్రాశస్త్యము సముచితోపమానసంఖ్యనుబట్టి గ్రహింపవచ్చును. శ్రీమద్రామాయణము నందు వాల్మీకి యుపయోగించిన యుపమలకు హద్దు లేదు. తులసీ దాసుని రామాయణమునందుఁ గూడ నట్లే యున్నవి. మనఃప్రపంచమునందలి యవస్థాకోటులకెల్ల బాహ్యప్రపంచమున నుపమానకోటులున్నవి. కవి వానిని గ్రహింపవలయును. అది యిదియు నొకటే, అది యిదియు నొకటే యనుటకు సామ్యముకొఱకు గవి యెట్లు ప్రకృతినిఁ బరిశీలించునో, యది యిది కాదు, అది యది కాదు, (నేతి, నేతి) యని పలుకుటకు వేదాంతియు నట్లే ప్రకృతినిఁ బరిశీలించును. సామ్యపరిజ్ఞాని కవి. భేదపరిజ్ఞాని వేదాంతి. సామ్యముఁ దెలియకపోవుటకు నిజమే. కాని కవి యందు సామ్యజ్ఞానము విశేషముగ నుండును. వేదాంతి యందు విభేదజ్ఞానము విశేషముగ నుండును. ఇది స్థూలమైన నిర్వచన మని యెఱుఁగవలయును. అపదార్థములైన యంతరంగావస్థలకుఁ బదార్థత్వమిచ్చి ప్రత్యక్షము చేయుట కుపమాలంకారము మహాకవులందఱు మిక్కిలి విరివిగా వాడియున్నారని చెప్పియున్నాను. బాహ్య పరిస్థితులను వెల్లడించునప్పుడు గూడఁ గవు లుపమలను వాడినారు, వాడుచున్నారు. వాడఁగలరు. ఇది కేవల మావశ్యకము కాదు కాని యలంకారమునకుఁ, జమత్కారమునకు, సౌందర్యమునకు, వస్తువైశద్యమునకుఁ గవు లట్లు చేయుదురు. మఱియుఁ గవులు మఱియొక విధములయిన యుపమలను గూడ వాడుచున్నారు. అవి యేవనఁగ బాహ్యావస్థలను వెల్లడించు నప్పు డాంతరావస్థల నుపములుగఁ దీసికొనుచున్నారు. ఇది కేవలము విరుద్ధము. రవంత దెలిసినదానిని దెలుపఁగోరి తెలియని దానినిగాఁ జేయుచున్నారు. ఇట్టిక్లిష్ట పరిస్థితుల కుదాహరణములు గొన్ని యిచ్చెదను. మహాకవిశిఖామణియైన వాల్మీకినుండియే యిచ్చెదను. అశోకవనమందుండిన సీతాదేవిని వర్ణించునప్పుడు శుక్లపక్షాదియందలి చంద్ర రేఖవలె నున్నదని చెప్పినారు. ఇది తెలిసినది. ''పినద్ధాం ధూమజాలేన శిఖామివ విభావసోః అని మఱియుఁ జెప్పినారు. ఇదికూడఁ దెలిసినది. కాని 'స్మృతీమివ ససందిగ్ధాం కీర్తిం నిపతితామివ, నిహతామివ చ శ్రద్ధా మాశాం ప్రతిహతామివ. బుద్ధిం సకలుషామివ' యని యనేకములయిన యంతరావస్థల నుపములుగా జేసినారు. సందిగ్ధమైన స్మృతివలె, నిపతితమైన కీర్తివలె, నిహతమైన శ్రద్ధవలె, ప్రతిహతమైన యాశవలెఁ, గలుషమైనబుద్ధివలె సీతాదేవి యున్నదని జెప్పుటవలన సీతను గూర్చి తెలియకపోవుటయే కాక తెలియనియవస్థానభేదము లెన్నియో

మనపైఁ బడినవి. ఈపద్ధతి సమంజసము కాదేమో? కాని యావాల్మీకి తిరుగబడి ''నాపుస్తకము నిన్నుఁ జదువు మన్నవాఁ డెవఁడు? నీకుఁ దెలియుట కొఱకే నేను కవిత్వము చెప్పవలయునా? ఒకనికిఁ దెలియుట యనునది కవితోద్దేశమా? నాయుత్సాహము కొలఁది నాయిష్టమువచ్చినట్లు నానంతోషముకొఱకై నాకొఱకే పాడుకొంటి'' నని మనల ధిక్కరించు నెడల మనము కొంతసేపటి వఱకు మూఁగలమైయుండవలసివచ్చునేమో? వాల్మీకి మహర్షి చెప్పిన యధిక్షేపణము నిజమే. మామిడిచిగురువగరున జీరవదలినకంఠముతోఁ గలకంఠ మెవనికొఱకుఁ బాడుచున్నది? మధుపాన మొనర్చి పాడు తుమ్మెద నీవు వినుటకే పాడుచున్నదా? ప్రకృతి జ్ఞానాస్వాదమున మత్తిల్లి మైమఱచి వినువారు లేకున్నను వ్రాయువారు లేకున్నను నాత్మసంతోషము కొఱ కానందగీతములను బాడు గాయకశిఖామణి కవి.

''అభ్రకం రససిందూరం గంధకం టంకణం సమ'' మ్మనుయోగము ననుసరించి యాయావస్తువులను గలిపి సింధూర భూషణమును జేయు వైద్యునివలె, వివిధములయిన రంగులను చిత్రచిత్రములగు పాళ్లతోఁ గలపి యొకవింతరంగును చేయుచిత్రకారునివలె రామాశుగ సన్నిభమైన దృష్టిని బదునాల్గుభువనము లొక్కవిసరున ముందునకు వెనుకకుఁ బఱపి సర్వవస్తుజాలమును బరిశీలించి యావస్తువులలో దేనిదేని నేయేవిధములుగా గలపిని బాగుగా నుండునో యోజించి యట్లు కలపి నూతన వస్తువుగఁ జేసి వాని నుంచుటకుఁ దావు, వాని బిలుచు టకుఁబేరుకల్పించి వానిని వాగ్రూపములగు ప్రతిమలను జేసి మనయెదుటఁ బెట్టఁగలద్వితీయద్వితీయ సృష్టికళా బ్రహ్మయగునాతఁడు కవి.

కవి పిచ్చివాఁ డనుమాట సత్యమే. ఎట్టిపిచ్చిలో నేమాత్రమైన వెగటును లేదో, యెట్టిపిచ్చి జగదుద్ధరణపటిష్ఠమో, యెట్టిపిచ్చిలో జ్ఞానవిజ్ఞానములు దుర్నిరీక్షమైన తేజస్సుతో వెల్గునో, యెట్టివెఱ్ఱికి వేయి విధములు గాక, కోటి విధములైనను బరమార్థగ్రహణ విధానమున నొక్కటే విధము గలదో, యెట్టి వెఱ్ఱి వెఱ్ఱులన్నింటికంటె వెఱ్ఱిదో, యట్టి వెఱ్ఱిని, నట్టి లోకాతీతయెన వెఱ్ఱిని, నట్టి వెఱ్ఱి లేని వెఱ్ఱిఁ గలిగి తాను ధన్యుడై ధన్యముజేయు నాతఁడు కవి.

ఆ. మల్లెపూవుఁ దూఱి మధుపంబుతోఁ బాడి
గంధవాహుతోడఁ గలసి వీచి
యబ్ధిలోన మునిఁగి గలసి వీచి
యబ్ధిలోన మునిఁగి యౌర్వవహ్నిని గ్రాఁగి
నీటిబుగ్గ యగుచు నింగిఁ బ్రాఁకి
తోఁక చుక్కతోడ డీకొని శ్రమఁజెంది
సాంధ్య రాగనదిని స్నానమాడి
తనువునిండ నింద్రధనుసురంగులు పూసి
కైరవాప్తసుధను గైపుఁ జెంది
గోళగానరుతికి మేళవింపుగఁ బాడి
పాడి యాడి పాడి యాడి సోలి
భావనామహత్వపటిమను బ్రహ్మమై
పోవుకవికిఁ గోటిమ్రొక్కు లిడుదు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# 5. వైష్ణవుని యుపన్యాసము

జంఘాలశాస్త్రి ఒకసారి ఒక వైష్ణవభక్తుడి ఉపన్యాసాన్ని సాక్షి సంఘసభలో ఏర్పాటు చేశాడు. ఆయన పేరు తిరువేంగడాచార్యులు.

ఆయన భక్తి అంటే ఏమిటో, శాస్త్రోక్తంగా ముందు నిర్వచిస్తూ —తైలధారలాగ, ఎక్కడ తెంపు, వంపు లేకుండా, తరుగు విరుగు లేకుండా వుండే—భగవంతుడిపట్ల—ఏకాగ్ర చిత్తం అని సూచించాడు. భక్తి పేరిట రకరకాల మనుషులు చేసే వింత ప్రవర్తనల్ని బట్టబయలుచేశాడు. కొందరికి కష్టాలు ఎదురైనప్పుడు తాత్కాలికంగా భక్తి ప్రబలుతూ వుంటుంది. కష్టం వెనకబట్టగానే, భక్తి పలాయనం చిత్తగిస్తుంది. ఇటువంటి భక్తికంటె నాస్తికత్వం మేలు. నాస్తికతలో నీతి వుంది. శాసన విధేయత వుంది.

కొందరు మనుషులు సుఖంగా అంతా జరిగిపోతున్నప్పుడు భక్తులు. పూజలు, హారతులు, నైవేద్యాలు, దానాలు, పురాణ పఠనాలు- అబ్బో! అదంతా గొప్ప ప్రదర్శనమే. వీళ్లకి కాస్త ఒళ్లు వెచ్చబడితే చాలు ఒకటొకటీ మూల పడతాయి. సొంత సేవలు, బ్రతుకు భయాలు వరించేస్తాయి. ఈ ప్రదర్శనాలకీ, భక్తికీ కూడా ఏమీ సంబంధం లేదు. వీరిది పూజా మందిరం కాదు. బొమ్మల దుకాణం.

ఆచార్యులుగారు భగవద్గీతనుంచి ముఖ్యశ్లోకాలు తీసుకుని —భక్తితత్త్వం ఎంత గహనమైనదో, ఎంత ఆర్తిలోంచి, తపనలోంచి, త్యాగం లోంచి, అర్పణ భావంలోంచి పుడుతుందో వివరించారు. ఇందుకు గజేంద్ర మోక్షం కథనీ, ద్రౌపదీ మానసంరక్షణం కథనీ ఉదాహరించి—ప్రపత్తికి పరాకాష్ఠను సూచించారు. సారాంశంగా—భక్తిమార్గం ప్రకృతి మార్గానికి భిన్నమైంది కాదనీ, భగవంతుని మీద దృష్టి లేకుండా ఒక్క ఆలోచనకూడా చెయ్యవద్దని మనవి చేశాడు.

**జంఘాలశాస్త్రి** యిట్లు పలికెను.

నాయనలారా! ఒక శ్రీవైష్ణవుడు మనసభలో భక్తినిగూర్చినేఁ డుపన్యసించును. (''ఇదివఱకు భక్తినిగూర్చి యుపన్యసించితిరి కాదా? తిరుగ నావిషయమునుగూర్చియే యుపన్యాస మెందులకు'' కని సభలోఁ గేక.) నాయనా! అట్లన గూడదు. మంచిమాట లెవరు

చెప్పినను వినవలసినదే. అందులో జన్మతారకమైన భక్తినిగూర్చిన మాట లనుదినమున ననుక్షణమునఁగూడ వినవలయును. వినఁగా వినఁగాఁ గొన్నిమాటలైన మనస్సున స్థిరముగఁ బ్రవేశించునేమో, యవి యెన్నఁటికైన నాచరణములోనికి వచ్చునేమో యని నేను దేవులాడుచున్నాను. ఒకసారి వచ్చినది తిరుగ రాఁగూడదనుట కిది యేమి స్ఫోటకమా? అదిగో యావైష్ణవులు మాటలోనే వచ్చుచున్నారు. నాయనలారా! ఉపన్యాసము వల దనకుఁడు.

అయ్యా తిరువేంగడాచార్యులుగారూ! దయచేయుఁడు. నాయనలారా! నే నిప్పుడు మీతో మనవిచేసిన యాచార్యులవారు వీరే శ్రద్ధతో వారిభక్తివిషయకోపన్యాసమును వినవల యును.

## వైష్ణవుని యుపన్యాసము

శ్రీమతేరామానుజాయ నమః సోదరులారా—అడియేనికి రవ్వంత సంస్కృతసాహిత్య మున్నది. వైష్ణవమతగ్రంథములను గొలఁదిగా నడియేను సేవించినాఁడు. ఈసభలో ననేకులు తఱచుగ వచ్చి యుపన్యసించుచుండఁగా నడియేను కాభాగ్య మేల లేకపోవలయును నని యిచ్చట కిందులకు సిద్ధపడినాఁడు. ఐహికవిషయములపై నేమి చెప్పిన నేమి వినియోగమని యెంచి, భక్తినిగూర్చి చెప్పఁ దలఁచితిని—అచ్చటచ్చటఁ గొన్ని ప్రపత్తిమాటలుగూడ రావచ్చును.

భక్తి యనఁగా నేమి? తైలధారావదవిచ్ఛిన్నస్మృతిసంతాన రూపాపన్నజ్ఞానము భక్తి యని పెద్దలు సాయించినారు. తైలధారవలె సంతతము నిరంతరముగ భక్తియుండవలయును. ఎక్కడను దెంపుగాని, వంపుగాని, తఱుఁగుగాని, విఱుఁగుగాని యుండఁగూడదు. ఎందఱెం దఱికెన్ని యెన్నిరోగములు వచ్చిననరే, యెన్నియెన్ని వ్యవహారము లెట్లు ధ్వస్తమైన సరే, యెన్నెన్ని పరాభవములు, ప్రజానిందలు సిద్ధించిన నరే, భక్తిసాంతత్యమునకు భక్తినైరంతర్య మునకు, భక్తిప్రవాహవేగమునకు భంగము లేశమైన రాఁగూడదు. తీయనీటికిఁ జేప యెక్కినట్లు, భక్తి మనస్సునం దట్టె యట్టె ప్రవేశించి, మనస్సులోని యైహికసంకల్పము లన్నియు నావలఁ ద్రోచి, తానుమాత్రమే భగవత్ప్రేమరూపముగా నిల్చియుండవలయును.

కొందఱకుఁ గష్టములు సంభవించినప్పుడు తాత్కాలికము భక్తి కలిగిన ట్లుండును. కాలికి ముల్లు గ్రుచ్చుకొన్నప్పుడు మనుజుఁ డమ్మాయని యబుద్ధిపూర్వకముగ నను చున్నాఁడు. అమ్మను నిశ్చయముగా మనస్సునందుఁ దలఁచి యమ్మపైనుండు ప్రీతిచే, భక్తిచే నాతఁ డట్లమ్మాయని యఱచినాఁడా? అమ్మ వచ్చి రక్షించు ననువిశ్వాసముతో నామెను బిలిచెనా? అట్టి యాక్రోశములకు మనస్సుతో సంబంధము లేదు. అవి కొంచెము హెచ్చుత గ్గుగ దైహికవికారములు కాని మఱియొకటి కావు. "నారాయణా! నారాయణా! భగవన్నారా యణా! నారాయణా" యని పాడుచు ముష్టిదాసరయ్య వచ్చును. ఆతని నారాయణస్మర ణము మనఃపరిపాకముచేఁ గలిగినదా? కడుపుమంటచేఁ గలిగినది. ఆఁకలిచే నది కలిగినది కాని యంతశ్శుద్ధిచేఁ గలిగినదా? అలవాటుచే నది కలిగినది కాని యాముష్మికార్తిచేఁ గలిగినదా? జోలి నిండఁగనే నారాయణస్మరణము రవంతయుఁ గట్టుపడును. అటుపైని దా నెవఁడో నారాయణుఁ డెవఁడో! దాక నిండుకై వచ్చిన నారాయణస్మరణమునఁ దత్ఫలము

పందునా? జోలి యావలఁ బాఱనైచినాఁడు. కల్లుకొట్టులోఁ బ్రవేశించినాఁడు. త్రాగి యొడలు తెలియక యడ్డమైన బూతులు కనఁబడినవారి నెల్ల తిట్టినాఁడు. ఇట్టిభక్తికంటె నాస్తికత మంచిది కాదా? నాస్తికతలో నీతియున్నది. శాసనవిధేయత యున్నది. దీనిలో నవియైన లేవే.

కొందరు నరులు సుఖకాలమునందు దైవస్మరణ మొనర్చుచుందురు గడియగడి యకు రామరామా యని యఱచుచుందురు. కన్నబిడ్డలు గారుగీరు మనుచు గంతులువై చుచు నాడుకొనుచున్నంతవఱకు, గల్లాకొట్టులోఁ గృష్ణకాటుకలు సమృద్ధిగ నున్నంతవఱకుఁ, జేతిపెట్టెలో జార్జిసార్వభౌముని మొగములు చాలఁ గనఁబడుచున్నంత వఱకుఁ, గడుపుచల్లగ నున్నంతవఱకుఁ, బ్రక్కలో భార్య వెచ్చవెచ్చగఁ బండుకొన్నంత వఱకు, వీరి రామస్మరణ మింత యంత యని చెప్పఁదగదు. దేవతార్చన లందు జయఘం టలు కావు—శుభనాదములు కావు—సాంబ్రాణి ధూపములు కావు—కప్పురపుటారతులు కావు —గోఘృతదీపములు కావు—చిత్రాన్నదధ్యోదనాదిభోగములు కావు—శ్రీపుష్పయోగములు కావు—ఓ చేతులజోడింపులు కావు; లెంపల వాయింపులు కావు—పైగడబడలు, దడబడలు, నెన్నియైన జరుపుదురు. ప్రతిరాత్రి పురాణకాలక్షేపము; పక్షమునకు సాలగ్రామదానము; మాసమునకు సత్యనారాయణవ్రతము—సంవత్సరమునకుఁ బెరుమాళ్లకుఁ బిరాట్టికిఁ బున స్సంధానము. వీరు సుఖదినములలో దైవము పేరుపెట్టుకొని యెంత కోలాహల మైన నెంత హంగామా యైనఁ జేయుచున్నారు. సాయం కాలమగుసరికి యొడలు రవంత వెచ్చఁబడినది. ఆరాత్రియే పురాణకాలక్షేపము మూలఁబడినది. తెల్లవాఱుసరి కమ్మగారికిఁ దొంబదియెనిమి దివఱ కుండవలసినదానికి నూటమూఁ డున్నది. ఆయుదయమే పెరుమాళ్ల కష్టోత్తరశతనా మార్చన సున్నయైనది. అయ్యగారి కుషఃకాలస్నానము లేదు సరేకదా, తొమ్మిదిగంట లైనను దంతధావనమైన లేదు. మొగము కడుగని యయ్యవారు సాలగ్రామములు కడుగునా? పిరాట్టిశిరమునకుఁ దిరుమంజనము మాని పెండ్లాము తల కమృతాంజనము రాయు చున్నాఁడు. మూల్గుచున్న భార్య వంకఁ జూడవలసిన యయ్యవారు నోరుమూసికొన్న పెరుమాళ్లవంకఁ జూచునా? పూజాకాలమందు సేవాకాలము చెప్పుటకు రావలసిన భాగవతో త్తములు దిగులువడ్డ మొగములతో, శ్వాసకోశపరీక్షాయంత్రములతో, ముక్కుద్దములతోఁ జేతిదుడ్లతోఁ, జర్మపాదరక్షలతో మహమ్మదీయవైద్యుఁ డొకఁడు, మంగలివైద్యుఁ డొకఁడు, మాలవైద్యుఁ డొకఁడు లోనికిఁ బ్రవేశించి, యమ్మగారిని బరీక్షించుచున్నారు. శ్వాసకోశము లలో రవంత గురుకున్న దని యొకఁ డనినాఁడు. ప్రేగులోఁ గానంత గళు కున్నదని మఱియొకఁ డనినాఁడు. హృదయకోశములో రవంత 'మర్మ' మున్న దని యింకొకఁ డన్నాఁడు. శ్లేష్మవాతజ్వర మని (Pneumonia) యొకఁ డనినాఁడు. ఆంత్రజ్వర మని (Typhoid fever) మఱియొకఁడన్నాఁడు. మన్నెపుజ్వర మని (Malaria) ఇంకొకఁ డన్నాఁడు. ఏది సిద్ధాంతమని యయ్యవా రడిగినాఁడు. విశిష్టాద్వైతమే సిద్ధాంత మన్నవాఁ డీ మాలమంగలి వైద్యులను జ్వరసిద్ధాంత మడిగినాఁడు. భార్య బ్రదుకదని యేడ్చు చున్నాఁడు. అపాయకర మని ముగ్గురుకూడఁ జెప్పినప్పుడేమిచేయును? శ్లో. న ధర్మని ష్ఠోస్మి న చాత్మవేదీ, న భక్తిమాన్ త్వచ్చరణారవిందే । అకించనో నన్యగతిశ్శరణ్య, స్త్వత్పాదమూలం శరణం ప్రపద్యే. యని బట్ట మెడఁ జుట్టుకొని పెరుమాళ్లకు సాష్టాంగ పడవలసిన యయ్యవారు నాభార్యను రక్షింపరా యని మాలవైద్యుని కాళ్లపైఁ బడుచున్నాఁడు.

ప్రమాదమున నైనను రామనామ ముచ్చరించుట లేదు. అంతటితో నాఁగినఁ గొంతమంచిదే ''పనికిమాలిన ప్రపంచము, ఎంతసేపు పుణ్యాత్ములకే చిక్కులు. భక్తులకే బాధలు. ఏమిలోకము? ఏమి దేవుఁడు? ఉన్నాఁడో లేఁడో కూడను ఉండిచేయుచున్న సౌభాగ్య మిదియే కాదా? కరుణాళుఁ డఁట! ఆపద్రక్షకుఁ డఁట. చెప్పినవానిని, వినినవానిని గూడఁ జెప్పుదీసి కొని తన్నవలయును. ఏదో సుఖముగా జీవనము జరుగుటకేకదా యిన్నిపూజ లొనర్చితిని. నేఁ జేసిన పూజ లన్నియు బుగ్గియైపోయినవా? ఎన్ని దివ్యదేశములు సేవించితిని! ఎంతడబ్బు తగులఁ బెట్టితిని! ఇచ్చిన యావులు, చేసిన సత్కారములు, పెట్టిన నైవేద్యము లన్నియు దిగమ్రింగి, తీర పని వచ్చినప్పుడు మొండిచేయి చూపుటా? కనఁబడినాఁడుకాఁడు కాని యీడ్చి సాగఁదీసి.......'' యని యయ్యవారు పలుకుచున్నాఁడు. నాస్తికతయింత కంటె సహస్రగుణములు మంచిది కాదా? పశుత్వమే యింతకంటెఁ బ్రశస్తతరము కాదా? శ్రీరామ కృష్ణపరమహంసగా రిట్టి వారిని జిలుకతోఁ బోల్చినారు. దోరజామిపండు కడుపునిండఁ దిని, కొబ్బెర చిప్పలో నీరు ద్రావి, పంజరమున నడ్డుగనున్న యినుపశలాకపైఁ గూరుచుండి 'అఖిలజగన్నాయకా! ఆపన్ని వారకా! జగచ్చక్రవర్తీ! జగన్నాథమూర్తీ!' యని ముద్దులొలుకఁ బలుకును. పంజరమునొద్దకుఁ బిల్లి వచ్చి దానితోఁక గ్రహింపఁ బోవఁగ జగచ్చక్రవర్తి లేఁడు, జగన్నాథమూర్తి లేఁడు. కేరుకేరున నొక్కపెట్టునఁ గూయుచు విలవిల కొట్టుకొనును. నోటితుంపరకు మనస్సున కెంత సంబంధ మున్నదో, యిట్టి వారి హరినామస్మరణమునకు నాత్మకు నంత సంబంధ మున్నది. వీరిట్లొనర్చు హరినామస్మరణము, దేవతార్చనము మొదలగునవి భక్తితో సంబంధించిన వేమాత్రము గావు. ఆఁడుపిల్లలు కాగితాల యిండ్లు కట్టుకొని యాడుకొన్న మగఁడు పెండ్లామాటలకు శృంగారరసముతో నెంత సంబంధ మున్నదో, వీరి బొమ్మలదుకాణమునకు భక్తిరసముతో నంత సంబంధ మున్నది. ఇవి కర్మముతో సంబంధించినవి మాత్రమే యగును. సుఖము సిద్ధించినయెడల నొడలు తెలియక తెయితక్కలాడుట, కష్టములు సంభవించినయెడల నెత్తి నోరు కొట్టుకొని యేడ్చుట భక్తుని లక్షణమా? భక్తుఁడు సుఖదుఃఖముఁడు కాఁడా?

శ్లో. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకారస్సమదుఃఖసుఖః క్షమీ.
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధిః యో మేభక్తస్స మే ప్రియః.
యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః.
సమశ్శత్రౌ చమిత్రే చతథా మానావమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః.
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమితిర్భక్తిమాన్ మే ప్రియో నరః.

ఈశ్లోకములందు భక్తునిలక్షణములు కొన్ని శ్రీకృష్ణభగవానులు సెలవిచ్చియున్నారు. సుఖదుఃఖసమత్వము, శత్రుమిత్రభేదశూన్యత, స్తుతినిందాతుల్యత్వము, శుభాశుభ పరిత్యాగము, సంతతసంతుష్టచిత్తత మొదలగునవి భక్తునిలక్షణము లని సెలవిచ్చినారు. కాని, యట్టిభక్తి యెట్లు కలుగును?

శ్లో. జన్మాంతరసహస్రేషు తపోజ్ఞానసమాధిభిః,
నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే.

అనేక సహస్రజన్మములు తపోజ్ఞాన సమాధులవలన పాపక్షయమైన పిమ్మట నరులకు శ్రీకృష్ణభగవానునియందు భక్తిపుట్టును. అంతకాలమైన పిమ్మట, నంతశ్రమ మొందినపి మ్మట, కృష్ణభక్తి యుదయించునని చెప్పఁబడినది. అది నందుకొట్టి చావకుండ బ్రదికి, బాల్యగండము లన్నియు దాటి బ్రదికి, పరిపుష్టినొంది పుష్పించి ఫలించుటకు మఱియెంత కాలము పట్టునో? ఒక జన్మములో వైయాకరణులము కావచ్చును. తార్కికులము కావ చ్చును, వేదాంతులము కావచ్చును; ఇవియన్నియు గూడఁ గావచ్చునుగాని యనేక సహస్రజన్మసంసారమునఁ గాని భక్తి కలుగదు.

భగవంతుఁడు మనల రక్షించి యుద్ధరించు ననమాట నిశ్చయమేనా? ఇంకను సందేహ మేమి? ఆయన రక్షించి యుద్ధరింపకుండు నెడల నింక రక్షించువాఁ డెవఁడు? మృత్యుసంసార సాగరమునుండి యుద్ధరించువాఁ డెవఁడు?

శ్లో. యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే,
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామి నచిరాత్పార్థ! మయ్యావేశితచేతసామ్.

అని కృష్ణభగవానులు సెలవిచ్చియున్నారు.

మహాశక్తియున్న యీశ్వరుఁడు కాని మనుజుల రక్షింపఁగలఁడా? అందులో నొకరా యిద్దఱా? అదిగాక యనేక సహస్రజీవకోటులను రక్షించి యుద్ధరింపవలయునే?

శ్లో. శక్తే స్సూపసదత్వాత్ కృపాయోగాచ్చ శాశ్వతాత్
ఈశేశితవ్య సంబంధాత్ అనిదం ప్రథమాదపి
దక్షిష్యత్యనుకూలాన్నః.......

అని పెద్దలు సాయించినారు.

సర్వేశ్వరుఁడు సర్వశక్తిసంపన్నుఁ డగుటచేతనే మనల రక్షింపఁ గలఁడు. భూమిలో నున్న రాజులు, రాజాధిరాజులు, చక్రవర్తులు మనల రక్షింపఁగలరా? వట్టిమాట. వారే మనలను రక్షించునెడల వారిని రక్షించువాఁడెవఁడు? వారికున్న కాంచనరాసు లన్నియు వారికష్టములకే కారణము లగుచున్నవికావా? వారి కున్న సుఖసాధనము లన్నియు వారికి దుఃఖదాయకములే యగుచున్నవి కావా? వారి కున్న భోగపరికరము లన్నియు రోగపీడాకర ములే యగుచున్నవి కావా? అందుచే వారి కున్న కష్టములు మనకష్టములకంటె శతసహస్రగు ణాధికములై యున్నవి. వా రీకష్టములనుండి విముక్తి నొంద లేక గిజగిజ కొట్టుకొను చుండఁగా, వారు మనకేమి చేయగలరు? మనకంటె వారి కనేకములైన విలువగల పదార్థము లున్నవి. మణులరాసు లున్నవి. ఏడంతరువుల మేడ లున్నవి. దాసదాసీజనశతము లున్నారు. అశ్వగజాందోళికాది సంపద లనేకము లున్నవి. కాని మానవ శక్తిలో వారు మనకంటె నెక్కువ ఘనులు? భగవంతుఁ డట్టివాఁడా? ఆయన దివ్యశక్తిసంపన్నుఁడు. అద్వితీయశక్తి సంపూర్ణుఁడు.

కాని యెంత మహాశక్తిసంపన్నుఁ డైనను నాతఁడు మనల రక్షించు నని యెట్లు

నమ్మవచ్చును? ధనవంతుఁ డైనవాఁ డెల్ల త్యాగి యగుచున్నాఁడా? విద్యావంతుఁడైనవాఁ డెల్ల గురుఁ డగుచున్నాఁడా? ప్రపంచజ్ఞాన మున్నవాఁ డెల్ల కవి యగుచున్నాఁడా? అట్లే శక్తియున్నవాఁ డెల్ల రక్షించు నని యేమి నమ్మకము? శక్తిని రక్షణకార్యమునకై ప్రోత్సహించు గుణ మొక్కటి దానివెనుక నుండవలయును. ప్రపంచజ్ఞాన మున్నవాఁ డెల్ల కవి యగుట లేదు. అట్టిజ్ఞానమును చిత్రవిచిత్రముగ లోకసమ్మోహనకరముగ నుపయోగపఱచుటకు సమర్థమైన నవనవోన్మేషశాలిని యగు ప్రతిభ దానివెనుక నుండవలయును. అట్లే భగవంతుడు తనశక్తి జూపుటకుఁ బ్రేరణసేయఁగల యేగుణము దానివెనుక నున్నది? లేదా ఇదిగో ''కృపాయోగాచ్చ శాశ్వతాత్'' అని శ్లోకమున లేదా? ఓ! కృపగలశక్తిమంతుఁడు రక్షించుట కడ్డేమి? అందులో శాశ్వతమైన కృపయే. ఈదినమున నిల్చి రేపు మాయ మగునది కాదే? ఎందఱ నెంతకాలము రక్షించినను దరుఁగునది కాదే? అందుచే నాతఁడు మనల రక్షించుట నిశ్చయము.

కాని ఆతఁ డెవరు? మన మెవ్వరము? మనల నాతఁడేల రక్షింపవలయును? ప్రపంచమున శక్తిమంతులు, కరుణాళురు నందఱను రక్షించుచున్నారా? ''రష్యాచక్రవర్తి యిక్కడివారిని రక్షించుటకుఁ బూనుకొనునా'' అని యన నక్కఱలేదు. అట్టిసందేహ మనావశ్యకము, రక్షించుట కట్టిసంబంధముగూడ నున్నది. అది యెప్పు డారంభమైనదో యెరుఁగ నంతపురాతనమై యున్నది. ఆసంబంధమేది? ఈశేశితవ్య సంబంధ మని శ్లోకమున చెప్పఁబడినదికాదా? ఇఁక నేమి?

కాని మఱియొకటి యున్నది. ''రక్షిష్యత్యనుకూలాన్నః'' అని శ్లోకమున చెప్పఁబడినది. అనుకూలురమైన మనలను రక్షింపఁగలఁడఁట. ఈయనుకూలత్వము మనగుణము. మన మెట్లుండిన నాతని కనుకూలురమై యుందుమో రవంత తెలిసికొనవలసియున్నది.

భగవంతుఁడు మనల రక్షాపేక్షను ప్రతీక్షించును. ''పరమేశ్వరుఁడా! రక్షింపు'' మని మన మెప్పు డైన నాతనిఁ గోరుదుమా, అట్టి కోరిక తనచెవి నెప్పుడైనఁ బడునా యని యాపన్న రక్షణార్థమై దయా సముద్రుఁడగు భగవంతుఁడు వేచియుండునఁట. ఆమాత్రపు మాటయైన మననోటినుండి వెడలదే! అట్టిమాటలు నోట వెడలుచున్న కొందరి కామాటలు నాల్క చివరనుండి వచ్చినవి కాని మనస్సునుండి వచ్చినవికావు. అట్టి శుష్కవాక్యము లక్కఱకు రావు. ఆర్ద్రమైన మనస్సుతో, విశ్వాసపూర్ణమైన మనస్సుతో, దృఢనిశ్చితమగు మనస్సుతో, ననన్యగతికమైన మనస్సుతో, స్వరక్షణతత్పరతాశూన్యమైన మనస్సుతో, నియతేంద్రియులమై, కేవలభగవద్విషయక ప్రవృత్తి కల మనస్సుతో, 'బరమేశ్వరుఁడా! నన్నుద్ధరింపవా' యని యొక్క త్రుటి కాలము ధ్యానించిన నైన నాశక్తిమంతుఁడు, ఆదయాసముద్రుఁడు మనల రక్షించి తీరును. మన మట్టిచిత్తశుద్ధి, చిత్తదార్ఢ్యముఁ గలిగి యున్నామా? అట్టె రవంతసేపు స్వప్రయోజకత్వ విశ్వాసము, ఇట్టె రవంతసేపు సర్వేశ్వర చింత ఇందులో నొక్కయడుగు, అందులో నొక్కయడుగు. ఇట్టి సంకరపుబ్రదుకు బ్రదుకుచున్నాము. ఇట్టి యుభయభ్రష్టత్వపుబ్రదుకు బ్రదుకుచున్నాము. క్రొత్తకుండ, ప్రాఁతతెడ్డు. జగద్రక్షకా! జానకీపతీ యని జ్వరపీడిత యగుసహధర్మ చారిణిరక్షకై యాక్రోశించుచునే యున్నాము. Genaspirin పొట్లములు వేయుచునే యున్నాము. ఉత్తమర్ణుఁడు మనయాస్తి నొందుటకై జప్తు హకుముఁ దీసికొని రాఁగాఁ దహతహచే, 'శ్రీనివాసా,

శ్రియఃపతీ, రక్షింపు' మని మొఱపెట్టుచునే యున్నాము. చెంబుతప్పెలయు దొడ్డి దారిని బొరుగింటికిఁ బంపించుచునే యున్నాము. ఈచర్యకర్థమేమైన నున్నదా? ప్రయోజన మేమైన నుండునా? మనకంటెఁ బైవారెవ్వరు నిక్కడ లేకపోవుటచేతను, గొంచెము హెచ్చుతగ్గుగ నందఱు మొక్కటే తరగతిలోనివార మగుటచేతను సరిపోవుచున్నది గాని, దేవతలు మన యీ యసందర్భచర్యలను జూచునెడల వారు పైనుండి మనమొగములపై నుమియుదురేమో!

మనబుద్ధు లెంత, మనశక్తు లెంత, మనప్రయోజకత లెంత, మన పాండిత్యము లెంత, మనదూరదృష్టు లెంత, మనప్రయత్నము లెంత? తెలియఁదగిన యంశ మేదియు మనకుఁ దెలియనే తెలియదే. నిజమాలోచింపఁగ మట్టిలోఁ బొరలెడుకీటకములకంటె మనమెక్కువయో నాకు బోధపడలేదు. ఆహారనిద్రాదులతో నవియు మనముఁ గూడ సమానప్రతిపత్తితోఁ గాలక్షేపము చేయుచున్నాముగాదా? మనుష్యులమై పుట్టినందులకు, సృష్టికిఁ బ్రభులమని సిగ్గులేక చెప్పుకొనుచుందునందులకు, మనకు రవంత యదనముగ నేమైన సుగుణసంపత్తి యుండవలదా? భగవద్భక్తియే మనకు లేకుండునెడల నవియు మనము నొక్కమట్టములోనివారమే కాదా? ('కీటకములకు భక్తియున్నదేమో. మనమెట్లు చెప్పఁగలము' అని సభలోఁ గేక.) అటులైన మనము, కీటకములకంటె నధమప్రాణుల మనుటకు సందేహమేమి? చేసినప్రయత్నము లెన్నెన్నియో భగ్నములై పోవుచున్నవే. ఎంతెంత ప్రయత్నములో చేయుచున్నామే. ఎన్నెన్ని యాసలోఁ బెట్టుకొనుచున్నామే. ఫలము నందఁగలుగుచున్నామా? రామపట్టాభిషేకమునకు దశరథుఁ డెంతగాఁ బ్రయత్నించినాఁడు! వసిష్ఠుఁ డంతవాఁడు సుముహూర్త ముంచినాఁడే. శ్రీరామచంద్రునిహస్తమున కామహర్షి పట్టాభిషేక కంకణముఁ గట్టినాఁడే అన్నియు సిద్ధము చేయఁబడినవే. సీతారాము లుపవాసముచేసి రాత్రి జాగరముఁగూడ జేసిరే. మందుకొట్టింటుకొన్నట్లంతయు టప్పున నొక్కసారి యెగిరిపోయెనే. పట్టాభిషేకము లేదు సరికదా, పైఁగఁ బదునాలుగేండ్లు వనవాసమా? అప్పుడు శ్రీరామచంద్రుఁడు జనుల కేమి బోధించెనో వినుదురా!

గీ. జనులయత్నంబు లేపాటి శక్తిగలవొ
బుద్ధు లేపాటి ఘనములో బొమ్మలైన
నరుల నాడించు నది యేదొ నావిచిత్ర
పట్టమును గాంచి తెలిసికో వలయు జనులు
ఐహికము లశాశ్వతములో నందు మనుజు
లంద ఔరెఁజేసినయంశమే యంద ఔపుడు
మఱచుసంగతి యది యుండె మఱవకుండ
నాచరించెడివాఁడె జ్ఞా నాధికుండు
ఘనతరంగాహతాంగంబు కల్గి కరము
నెత్తి నది దాఁటుకరివోలె నెన్నియాప
దలు సుఖమును గదల్చిన విరసదూర్వ
దృఙ్మనస్కుఁడౌ నరుఁ డు త్తరించు భవము.

నాయనలారా! ఇవి మనకు బుద్ధిరాఁదగిన మాటలేకావా? ఎంత సేపు నధోదృష్టియే

మైన, యపకారమైన బంధము లేని యితర దేశీయులు స్వతంత్రులై, జ్ఞానసంపన్నులై, సౌఖ్యవంతులై, సర్వజనసములై కాలక్షేపము చేయుచున్నా రనియు, నిది మనచేతి కరదండ ములుగఁ, గాళ్ళకు సంకెలగఁ, గంటికి గంతలుగ, మనస్సునకు దిగమీఁకుడుగ నుండుటచే మన మెదుగు బొదుగులేక, శరీరమున నల్పులమై, జ్ఞానమున నంధులమై, కార్యమునఁ గాతరులమై, చిత్తమున బానిసలమై యున్నామనియు, నీపిశాచమునుండి యెంతత్వరగ విముక్తినొందుదుమో యంతత్వరలో మనకు సమస్తజనసోదరత్వమే కాక, సర్వజీవసోదరత్వ మును గ్రహింపఁ గల్గుదు మనియు, నట్లాచరించుటకుఁ దగిన వీర్యము, వెన్నెముక, విదగ్ధత కలవారమగుదుమనియు, మనదేశమునకు, మనజాతికీ యథార్థముగ మనుజజన్మమునకుఁ గూడ లాఘవకరమైన, లజ్జాకరమైన యీ ''నన్ను ముట్టుకొనకుఁదనపు'', బుద్ధిహీనపుపశు ప్రాయపుటేర్పాటెప్పుడు పరశురామప్రీతి యగునో యప్పుడే మనకు జాత్యైక్యము సంభవిం చుననియు, జాత్యైక్యముతో శరీరపాటవము; శరీరపాటవముతో సౌఖ్యసంపదయు; సౌఖ్యసం పదతోఁ జిత్తవికాసము; చిత్తవికాసముతో బుద్ధిస్థైర్యము; బుద్ధిస్థైర్యముతో నాత్మస్వాతం త్ర్యము సిద్ధించు ననియు మన ముపన్యాసపీఠములపై సింహగర్జనము లొనరించుచుండుట లేదా? ఇట్లు జాత్యైక్యసమారిజనసంరంభ మొకవంక జరుగుచునే యున్నది. వేరొకవంక, తూర్పు మంగళ్ల కొక్క కాన్ఫరెన్సు, పడమటి మంగళ్ల కొక్క కాన్ఫరెన్సు, వ్యాసరాయమత స్థుల కొక్కటి, కాసలనాటివారి కొక్కటి, వేఁగినాటివారి కొక్కటి, మెరవీధి తెలగాల కొకటి, పల్లపువీధి తెలగాల కొకటి, నపాదవైష్ణవుల కొక్కటి, నిష్పాదవైష్ణవుల కొక్కటి, పెదమాలపల్లి యాదిద్రావిడుల కొకటి, చినమాలపల్లి యాదిద్రావిడుల కొక్కటి జరుగుచునే యున్నవి. ఒక తెకవారి కట్టుపాటులు వేరొక్క తెగవారి కనిష్టములు పరిపూర్తిగ ననిష్టములు.

గీ. తెల్లరసుద్దకు మరి విభూతికి బడదు
సుద్దముక్కల రెంటికిఁ జుక్కయెదురు
పగిలిన విభూతిపండులోఁ బ్రబలతమము
లైనతెగల రెంటికిని షష్టాష్టకంబు
బొగ్గుదారి బొగ్గుది సుద్దబూడిదలకు
దాని కెప్పుడు నైధనతారవరున
అరవలకు నాంధ్రులకు గ్రుద్దులాటధాటి
పైఁగ బ్రాహ్మణాబ్రాహ్మణభండనంబు.

సభావేదికలపై సామరస్యము, గృహాంతరముల గ్రుద్దులాట, పలుకులలో మిత్రత, పనిలో శత్రుత, బోధనములో భూతదయ, ఆచరణలోఁ గత్తికోఁత.

(ఆతఁడొక్క త్రుటికాల మాఁగి గొంతు సవరించుకొని నావంకఁ జూచెను. ఈతఁడు పిచ్చివాఁడువలె మాటలాడుట లేదే యని నేను మనస్సున ననుకొంటిని. అంతలో నాతఁడు తిరుగ నారంభించినాఁడు.)

ఇంతటితో సరిపోయినదా: ఊహుఁ. మరియొకచోట నె ట్లుపన్యసించుచున్నారు? ''బెడ్డవ్రేట్లను సహించి రేగుచెట్లు మనకుఁ దీయని ఫలము లిచ్చుచున్నవి. పట్టులేక గాలిలో సర్వశ్రమములఁ బొంది యల్లాడుచు మేఘములు మనకు సుధాసన్నిభములైననీరము లిచ్చుచున్నవి. కత్తికోఁతను సహించుచు మేకఁలు మన కాహార మిచ్చుచున్నది. తమగడ్డి

మెఱసినంతలో వచ్చి యెగిరి గజేంద్రుని బండ్లతోఁ బీకినది. ఆతఁడు దానిని దంతములతో ఘట్టించినాఁడు. ఇది ముందు లాగ, నతఁడు వెనుక కీడ్వ, నది మీఁది కెగుర, నతఁడు తప్పించుకొన, నది కఱవ, నితఁడు కొమ్ములతోఁ గొట్ట నిట్లు సహస్రదివ్యవర్షములు గజేంద్రమకరేంద్రులు హోరాహోరిగఁబోరాడ గజేంద్రునకు బలము క్షీణించెను. మొసలి డస్సియు స్థానబలముచేఁ బటిష్ఠమై యుండెను. మొసలి ముందునకు లాగుచున్నది. నీరసించిన గజేంద్రుఁడు వెనుకకుఁ బోవ గింజుకొనుచున్న వాఁ డైనను మొసలిలాగినట్లే ముందునకుఁ బోవుచున్నాఁడు. గజేంద్రునకుఁ గాళ్లు పూర్తిగ మునిఁగిపోయెను. మొసలి యింకను ముందున కాకర్షించుచున్నది. గజేంద్రుఁడు బలహీనుఁడయ్యును నింక మొరా యించి వెనుకకుఁ దగ్గుచునే యున్నాఁడు. గజేంద్రునిశరీర మంతయు నీట మునిఁగినది. ఈఁదఁగలిగినను నాతనికిఁ గాళ్లు తేలిపోవుచున్నవి. ఇంతలోఁ దలకూడ మునిఁగినది. తుండమునకుఁ జివరనున్న ముక్కులములు మాత్రము నీటిమట్టమున కొక్కడుగు పైను న్నవి. ఇఁక నొక్క యీదుపుతో నరి యన్నట్లున్నది, అప్పుడు.

శ్లో. పరమాపదమాపన్నో మనసా చింతయద్ధరిం
సతు నాగవరశ్శ్రీమాన్ నారాయణపరాయణః.

సర్వరక్షణప్రయత్నమును బూర్తిగ విడుచుకొని నారాయణపరాయణుఁడై శ్రీమంతుఁడైన గజేంద్రుండు పరమాపన్నత నొంది శ్రీహరి మనసారధ్యానించెను. సర్వేంద్రియములు మనస్సు బుద్ధి యాత్మయుఁ బరమేశ్వరునియందు లీనమొనర్చి యొక్క క్షణకాలము ధ్యానింపఁగఁ దనపుట్టే మునిగిపోయినట్లు, తనకొంప గూలినట్లు లొక్కయె గురున

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగమున్ జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగడతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్క నొత్తఁడు వివాదప్రోద్ధతశ్రీకుచో
పరిచేలాంచలమైన మీఁడఁడు గజ ప్రాణవనోత్సాహియై.

అట్టి మహావిష్ణువు ప్రత్యక్షమై గజేంద్రుని రక్షించెను.

మరియొక యుదాహరణము చెప్పెదను. ఏకవస్త్రయైన ద్రౌపదిని దుశ్శాసనుఁడు కబరీవికర్షణ మొనర్చి సభలోని కీడ్చి తెచ్చి యా మహాపతివ్రతవస్త్రము నొలుచున్నాఁడు. అతఁడు పైట లాగుచున్నప్పుడు కత్తెరమాదిరిగ నీమెచేతు లడ్డుపెట్టుకొనుచున్నది. ఆతఁ డీమెచేతు లూడిపోవునట్లు చెఱఁగు గట్టిగ లాగుచున్నాఁడు. ఈమె వంగుచున్నది. ఇంకను లాగఁబోవఁగ ముడుచుకొని కూరుచుండుచున్నది. కొప్పుపట్టుకొని యామె నాతఁడు పైకి లేవఁదీయఁగ, నొకచేతితో శిరోజములు పట్టుకొని, యొకచేతిని జందెమువాదిరి వక్షమునం దుంచుకొని, యొకతొడపై రెండవతొడ హత్తించి, రవంత వంగియున్నది. మానరక్షణమున కెన్నిపాటులైనఁ బడుచున్నది. ప్రక్కకొత్తిగిల్లు చున్నది. గరిగిర తిరుగుచు న్నది. ఏమిచేసినను మహాపాపాత్ముఁ డగు నాతఁడు తనదుష్ప్రయత్నమును మానలేదు. మానప్రాణము లొక్కసారి యిఁక నొక్కపావుగడియలోఁ బోవునని నిశ్చయించుకొని, స్వరక్షణ ప్రయత్నమున లాభములేదని పూర్తిగ గ్రహించి, దానిని బరిత్యజించి, రెండు

చేతులు ప్రక్కను వ్రేలాడుచుండునెడలఁ బ్రమాదవశమున మానరక్షణ ప్రయత్నముచేసికొనఁ బ్రయత్నించుట సిద్ధించునేమో యని భయపడినదియై, రెండుచేతులు పైకెత్తి, మానభంగచింత లేశము లేనిదియై, ''శంఖచక్రపాణీ!'' యని మహార్తితో నాక్రోశించిన వ్పుడు కదా శ్రీకృష్ణభగవానుఁ డామె నుద్ధరించుట సిద్ధించినది! ఆపన్న రక్షకై శంఖచక్ర ములు చేతుల ధరించిన నీవు నన్నిప్పుడు రక్షింపకయే పోవునెడల నీచేతులనున్న శంఖచక్ర ములు నాచేతుల గాజులవంటివే యని తెల్పుటకుఁ జేతులు పై కామె యెత్తినదని బుద్ధిమంతు లగు వ్యాఖ్యాతలు చమత్కరించిరి.

నాయనలారా! దృఢచిత్తము మాత్రము మన కుండవలయును. దృఢచిత్తుఁడు కానివాఁ డిహమునకుఁ బనికిరాఁడు; పరమున కంతకంటెఁ బనికిరాఁడు. భగవత్కారుణ యందు, భగవద్రక్షణశక్తియందుఁ బరిపూర్ణమగు విశ్వాస ముంపవలయును, నిశ్చలవిశ్వాస మున్నవాఁ డెన్నఁడు చెడియుండలేదు. అవిశ్వాసి యెన్నఁడు బాగుపడలేదు. ''సంశయా త్మా వినశ్యతి'' యనుమాట నిశ్చయము. శ్రీకృష్ణభగవానుఁడు పరమదయాళుఁడై ప్రాణిలో కమున దరింపఁ జేయుటకై ప్రపంచమున కంతకుఁ గటాక్షించిన భగవద్గీతయందుఁ దేజోమయములగు నక్షరములతో నిట్లున్నది.

శ్లో. మయ్యేవ మన ఆధత్స్వమయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ–అత ఊర్ధ్వఁ న సంశయః

సెబాస్! ఇంతకంటెఁ గావలసినదేమి? ''నీబుద్ధిని, నీమనస్సును నాయందే నిరంతర ముగ నుంపుము. నీవు నిస్సంశయముగా నాయందు నివసింపఁగలవు'' అని భగవంతుఁ డానతిచ్చినాఁడే. సమస్త కష్టభూయిష్ఠమైన ప్రపంచనివాసమును వదలి సచ్చిదానందమయ తత్త్వమున శాశ్వతముగా నివసించుటకంటె జన్మమునకుఁ గావలసిన దేమి?

ఒకవేళ మనస్సును, బుద్ధిని నాతనియందే నిరంతరముగ మనము నిలుపలేకపోవునె డల నేమి చేయవలసినదను సందేహము మనకుఁ గలుగునేమో యని తా నెంచి,

శ్లో. అథ చిత్తం సమాధాతుం నశ్నోషి మయి స్థిరం,
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ.

అని సెలవిచ్చినారు. అట్లభ్యసించుటగూడ మనకుఁ గష్టమగునేమో యని,

శ్లో. అభ్యాసే ప్యసమర్థోసి మత్కార్మపరమో భవ,
మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి.

అట్లు తననిమిత్తమై కర్మములుగూడ మనము చేయలేకుందు నెడల.

శ్లో. అథైవ మప్యశక్తోసి కర్తుం మద్యోగమాశ్రిత,
సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్.

అని సెలవిచ్చిరి. మనము చేయు సర్వకర్మముల ఫలములుకూడఁ గృష్ణార్పణ మొనర్పవలయును. కర్మఫలత్యాగముకూడ మనకు మహాకష్ట మనుట నిశ్చయమే. దమ్మిడి విచ్చి క్రొత్తడబ్బు లాగఁజూచుచున్న మనము, గోఁచి నిచ్చి గొంగళిని గ్రహింపఁ జూచుచున్న

మనము, చేసిన కర్మములఫలము త్యాగ మొనర్పఁగలమా? అందు కంతస్వార్థపరిత్యాగ ముండవలయును? ఎంతవాఁ డంత పని చేయవలయును? అది గాక సర్వకర్మములఫలము త్యాగ మొనర్పవలయు నని మనము నిశ్చయించుకొనునెడల నొకవిషయముమాత్ర మున్నది; మనకు దుష్కర్మము లన్నియు నొక్కసారి కట్టుపడును. వ్యభిచరించి కృష్ణార్పణ మనఁగలమా? అసత్యమాడి కృష్ణార్పణ మనఁగలమా? తుట్టతుదకుఁ జుట్టఁగాల్చి కృష్ణార్పణ మనఁగలమా? నిష్కామ్యకర్మమును గూర్చి మీజంఘాలశాస్త్రిగా రిదివఱ కుపన్యసించియే యున్నారు. అందుచే నింకఁ జెప్పనక్కఱలేదు.

భక్తిమార్గము ప్రకృతి కెంతమాత్రము భిన్నమైన మార్గము కాదు. సహజములైన హృదయరసములనేమియు శోషింపఁ జేయనక్కఱలేదు. నీభార్యాపుత్రులందు నీకున్న నిశ్చలానురాగ మున్నదే, దానినే భగవంతునిపైఁ బఱపుము. నీ ప్రేమయొక్క గతిమాత్రమే, గమ్యస్థానముమాత్రమే భేదముకాని యంతకంటె భేద మేమియు లేదు. ఒక్కభగవంతుఁడు తక్క నీ వస్తువేదియు లే దని నీవు నిశ్చయముగా నమ్మవలయును. నీయాస్తి భగవంతునిది. నీయాలుబిడ్డలు భగవంతుని వారు. వారు నీయొద్ద భగవంతునిచే నుంపఁబడినవారు కాని నీవారు కారని నిశ్చయముగా నమ్మవలయును. భగవంతునిపై దృష్టిలేకుండ నొక్కతలఁపైనఁ దలఁపకుము; ఒక్కమాటయైన నాడకుము; ఒక్కపనియైనఁ జేయకుము. అట్లు నిరంతరాభ్యాస మొనర్చునెడల నెప్పటికైన సుగతి నిశ్చయము.

నాయనలారా! చాలసేపు చెప్పితిని. క్షమింపవలయును. శ్లోకములు చదువుచు వాని కర్థములు చెప్పుచు బడిపంతులు పిల్లలకుఁ జెప్పినట్లు చెప్పినమాటనే చెప్పితినేమో యని యనుకొనుచున్నాను. నేను మీకు బోధించుటకు రాలేదు. మీకుఁ దెలియని యంశములు కావు. దయ యుంచి వినినందులకు సంతసించుచున్నాను.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 6. వీరశైవులు

సాక్షి సంఘంలో మతవిషయక ఉపన్యాసాలు దాదాపుగా అన్నీ విష్ణుప్రశంసా ప్రధానాలుగా వుండడం గమనించదగినది. ఈసారి ఒక వీరశైవుడు వచ్చి సాక్షి సంఘసభలో ప్రసంగించాడు. అద్వైతి అయిన జంఘాలశాస్త్రి శివ సంబంధమైన వీరశైవగాథను ఏదీ చెప్పకపోవడానికి తనకు కారణం తెలియదంటూ—అది క్షమింపదగని ఉపేక్ష అన్నాడు. కనక—ఒక శివభక్తుని కథ చెప్పడానికి ఉపక్రమించి—పాల్కురికి సోమనాథుడు రచించిన 'బసవపురాణం' నుంచి కిన్నెర బ్రహ్మయ్య కథ ప్రారంభించాడు.

బ్రహ్మయ్య మహాశివభక్తుడు. ఒకసారి అతను శివనామం గానం చేసుకుంటూ, బసవేశ్వరుడి దర్శనం కోరి, బయలుదేరాడు. అతను సంగమేశ్వరం చేరడానికి ముందే బసవేశ్వరుడెదురువచ్చి మన్నించి తన యింటికి తీసుకువెళ్లాడు.

అదే వూళ్లో వున్న త్రిపురాంతక దేవాలయానికి దర్శనం కోసం బ్రహ్మయ్య వెళ్లాడు. అక్కడ బాటవెంట ఒక 'గొర్రె' మెడకు తాడువేసి లాగుతూ ఒక విటుడు తన ఉంపుడుగత్తె ఆరోగ్యం కోసం బలి ఇవ్వడానికి తీసుకుపోతున్నాడు. అది మెడతాడు తెంపుకుని బ్రహ్మయ్య దగ్గరకు వచ్చి నిలబడింది. కరుణాశీలి అయిన బ్రహ్మయ్య ఆ విటుడికి వెయ్యిమాడ లిచ్చి ఆగొర్రెను కొన్నాడు. దానికి విభూతి రక్షపెట్టి పంచాక్షరి దాని చెవిలో ఊదాడు.

విటుడు మరో గొర్రెను తీసుకొని వేశ్య ఇంటికివెళ్లి, గొర్రెను మార్చినందుకు తాపులు, తిట్లుతిని, బ్రహ్మయ్య దగ్గరకు వచ్చి తన గొర్రెను తిరిగి ఇమ్మన్నాడు. ఘర్షణ జరిగింది. విటుడు స్పృహ కోల్పోయి మరణించాడు. ఈవార్త చిలవలు పలవలు అల్లుకొని రాజు దగ్గరకు వెళ్లింది. విచారణకు వచ్చిన రాజుకు, త్రిపురాంతకదేవుడి సాక్ష్యంతో కళ్లు విడ్డాయి. మాయ నుంచి బయటపడి బతికిన విటుడు మహాశివభక్తుడయ్యాడు. బసవేశ్వరుడు బ్రహ్మయ్యను ఎంతోమన్నించాడు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

నాయనలారా! ఒక శివభక్తుండు మనసభలో నేఁ డుపన్యసించును. అతఁడు లింగధారి.

కేవలశైవుఁడు. మిగుల వయస్సు గడచిన వాఁడు. బుద్ధిశాలి. ఆతఁడు మాటలోనే వచ్చుచున్నాఁడు. లేచి నిలువఁబడి యా మహాభక్తుని గౌరవింపుఁడు. (అంద ఱట్లొనర్తురు) అయ్యా శంకరభక్తాగ్రణీ! దయచేసి పీఠ మెక్కి యుపన్యసింపుఁడు.

శైవవర్యుని యుపన్యాసము.

శివభక్తులారా! సాక్షిసంఘోపన్యాసములఁగూర్చి వినుచునే యున్నాను. ఇదివఱకు జంఘాలశాస్త్రి యనేకోపన్యాసము లిచ్చినాఁడు. జంఘాలశాస్త్రి మాధ్వుఁడు కాఁడు. శ్రీవైష్ణవుఁడు కాఁడు. అద్వైతియయ్యును హరభక్తినిగూర్చి యుపన్యసించి యుండలేదు. పత్తిక్కొల్లై నాచ్చియారువిశేష ముపన్యసించినాఁడు కాని బసవేశ్వరమహిమమును గూర్చి యుపన్యసించినాఁడా? ధనుర్దాసునికథ చెప్పినాఁడు కాని తేడర దాస్యయ్యకథ చెప్పినాఁడా? భక్తినిగూర్చి చెప్పిన యుపన్యాసములందైనను విష్ణుభక్తినిగూర్చియే చెప్పినాఁడు కాని వీరశైవభక్తినిగూర్చి చెప్పినాఁడా? శివుఁడు దేవుడు కాఁడనియా, శివభక్తులు భక్తులు కారనియా? ఆతని యుపేక్షకుఁ గారణమేమో తెలియఁజాలకున్నాను. ఏకారణమైననేమి జరుగఁగూడని యుపేక్ష జరిగినది. క్షమింపఁదగని యుపేక్ష జరిగినది. శివభక్తులారా! ఈసంగతి మీతో మనవిచేసి మీకొక శివభక్తునికథ నుపన్యసింపవచ్చితిని. సావధానచిత్తులరై వినఁగోరుచున్నాను.

అనఁగ ననఁగ నొక వీరశైవుఁడు. ఆతనితల్లి యెవతెయో తెలియదు. తండ్రి యెవఁడో తెలియదు. ఇంటిపే రేదో తెలియదు. అతఁ డేగ్రామనివాసియో యదికూడఁ జెప్ప వీలు లేదు. బొండూరని కొందరు బోడూ రని కొంద ఱందురు. ఆతని పేరుమాత్రము బ్రహ్మయ్య. ఆతఁడు,

ద్వి. వీరవ్రతై కనిష్ఠారమణుండు—
సారశివాచారపారాయణుండు
లోకైకపూజ్యుఁ డలో కానుసారి—
ఏకాంతభక్తి మహిష్ఠమండనుఁడు
నఘటితనాద విద్యాపండితుండు
నఘవినాశనకారణావతారుండు
విదితకారుణ్యసముదితానురాగ—
హృదయుఁడు సర్వజీవదయాపరుండు

నని కవి యాతనిమహామహిమమును గానమొనర్చెను. ఆతఁ డనేకవిద్యల నభ్యసించినవాఁడగుటచే సహస్రవిధముల ధన మార్జించి యంతయును మహేశ్వరమూర్తులక ర్పించి వారిని సేవించుచుఁ గాలక్షేపమొనర్చుచుండెను. ధనమంతయు నీరీతి వెచ్చ మొనర్చి క్షయించిన యాతఁడు శుద్ధినొందిన రసఘటికవలెఁ దేజస్స్వరూపుఁడై వెలిఁగి పోవుచుఁ గిన్నెరను జేతఁబుచ్చుకొని వీథివీథిని గాన మొనర్చుచుండెను.

''ఈశ్వరా! జగదీశ్వరా! పరమేశ్వరా కరుణాకరా'' యని యుచ్చైస్స్వరమున మ్రోళ్లు చిగుర్చునట్లు గాలి స్తంభించి వినునట్లు కైలాసాధిపతిని గానమొనర్చునతఁ డాతఁడే మనస్సు నకున్న చెవిచే వినుచున్నారా?

మనము వినుట లెక్కయేమి? శంకరభగవానుఁ డంతరిక్షమునఁ బ్రత్యక్షమై యానందనమున నుప్పొంగుచుఁ గిన్నరబ్రహ్మముఖోద్గత మధురగీతానుసార తాళానుగుణముగఁ దాండవించుట కుత్సహించి డమరుకమును వాయించుట కుద్యమించుచున్నాఁడే! గజచర్మపుముడుతలలోఁ దలల నిమిడ్చి, కునుకుచున్న సర్పములు శిరముల నెత్తి యదల్చి పడగలువిప్పి, జిహ్వలుముందునకుఁద్రోచి కన్నులుమాత్రమేకాక యొడలంతయుఁ జెవులు చేసికొని వీరశైవుఁడగు బ్రహ్మయ్య గౌరీశ్వరగానమును విని పరవశము లగుచున్నవే! మహేశ్వరజటాజూటస్థ యగు చంద్రరేఖ మహాగాయకగీతామాధురికిఁ జొక్కి చొక్కి అమృతమనుపేర నానంద బాష్పములను విడుచుచున్నదే. ఈమహాసన్నివేశమున కనాహూతులై వీణాధరులైన తుంబురునారదులు విచ్చేసి మహాగానామృతమునఁ దలమున్కలగుటచే నుక్కిరిబిక్కిరి యగుచు గ్రుడ్లుస్తంభింప నిశ్చేతనులగుచు నిలువఁబడినారే! వీరశైవశిఖామణీ! భక్తియనఁగనీ దేయగునుగాక! గాన మనిన నీదే యగునుగాక! జన్మమనఁగ నీదేయగునుగాక! మహా దేవుఁడు నీకు బిరుద మిచ్చినాఁడా! అందుచేతనే కిన్నరబ్రహ్మయ్య వైతివా?

ఆహా! భక్తికి గానమున కెంత చేరువ? భక్తి హృదయమున నంకురింపఁగనే గొంతుకలోని తంత్రులు తమంతతాము, మేళవించుకొని సిద్ధముగ నుండునే! భక్తి హృదయకోశమును రవంత సంచలింపఁ జేయ నా యూఁపుతో రైరై మని భైరవియో, శంకరాభరణమో యాలాపింప నారంభించునే. భక్తిహృదయమునఁ దాండవింప నప్రాపంచికగాన మమృతతరంగములతో నాకస మంతయు వెల్లివిరియునే! చెట్లు చిగుర్చునే! శిలలు కరఁగునే! నదులు పొంగునే! అగ్నిజ్వాల లంతరించునే! వాయువు చల్లఁబడునే! భవరోగములన్నియుఁ బటాపంచలైపోవునే! సృష్టియంతము ప్రేమదృష్టిచే నార్ద్ర మగునే?

గానశక్తి లేనివాఁడు గానమునకుఁ జెవి లేనివాఁడు కిరాతహృదయుఁడు, నరఘాతుకుఁడు, జీవద్రోహి యని యొకయాంగ్లేయకవి చెప్పినాఁడు. ఆమాటలు నా కంత నచ్చలేదు. ప్రపంచమున గానశక్తి లేనివాఁ డెవఁడు? గానానుభవశక్తి లేనివాఁ డెవఁడు? ఒక్కని గానఁ బరుపఁగలరా? కంటికి నచ్చిన కాంతను జూచి కూనురాగము తీయలేని మొద్దుముండకొడు కెవఁడయిన నున్నాఁడా? ఈకూనురాగములో గానమున్నదా? లేదా? తుంబురునారదులు పాడినట్లు పాడినగాని గానము కాదా యేమి? ఆఁడుకోడి నాకర్షించుటకు మగకోడి యెంతచిత్రముగ గానమొనర్చునో వినలేదా? మగకుక్క యాఁడుకుక్కపైఁ దాఁటఁ బోవునప్పుడు కుఁయికుఁయికుఁయిమని గాన మొనర్చుచుండుట లేదా? కాలువయొడ్డునఁ బొదలోని కీచురాయి యెందులకుఁ బైస్థాయిలో గానమొనర్చుచున్నది? ఆఁడుపురుగు నాశ్లేషమునకే కాదా? ఐహికానందరసము ననుభవించుట కేజీవము పనికిరాదో దానికిమాత్రమే గానము లేదు. సుఖదుఃఖముల కధీనముకాని ప్రాణ మొకటియైనఁ బ్రపంచమున నున్నదేమో చెప్పఁగలరా? నిశ్చేతనములకుఁ గూడ సుఖదుఃఖానుభవమున్నదని యిప్పటి ప్రకృతిశాస్త్రజ్ఞులు సిద్ధాంతీకరించుచుండఁ, జేతనములమాట సందేహింప నేల? ప్రాపంచికానందమువలన గాన ముద్భవించును. పరమేశ్వరానందమువలన గాన ముద్భవించును. రక్తిచే గానముద్భవించును. భక్తిచే గాన ముద్భవించును. సాంసారికానందమువలనఁ గలిగినగానము నిష్ఫలము. గుడిగుడి త్రాగుటచే గలిగిన మబ్బు తెరవంటి కైపుచేఁ బుట్టిన మోతాదైన యానందమున పాదుషాయీల వేయుట యెట్టిదో పణ్యవనిత తలదువ్వుకొనుచు విటుని వశపఱచుకొంటి

నను నానందమున ''చిన్నదానరా'' యని జావలి పాడుట యట్టిదే. పాదుషాయీల యెంత ప్రయోజనమో పణ్యవనిత జావళి యంతప్రయోజనము ఐహికానందమును గాన మొనర్పలే నివా రెవ్వరు? ఇట్టిగానము జీవుని మరింత ప్రకృతిబద్ధ మొనర్చుటకే పనికివచ్చును. సంసారసాగరమున జీవుని మరింత ముంచుటకే యక్కఱకువచ్చును. గానము లేనివారు క్రూరులు, ద్రోహు లని చెప్ప వలనుపడునా? గాన మొనర్పగలవారు లోకోపకారులై మిడుకుచున్నారా? సాలెపురుగు నాల్గువందలనంబరును మించిన మహాసూక్ష్మతంతువులచే నిర్మింపఁబడిన తన పద్మవ్యూహపు మహలులోని చంద్రశాలలోఁ దాను గూరుచుండి మధురగీత మాలాపించు టెందులకు? చుట్టుపట్టులనున్న యీఁగల నాకర్షించి మ్రింగుటకే కాదా? ఇది గొంతుకోఁత గానము కాదా? పాషాణహృదయుల మధుర గానమున కానపడి యెంద అమాయిక కాంతలు భ్రష్టలై పతితలై ప్రాణములఁ గోలుపోవలేదు? రోముపట్టనము నాల్గుమూల లంటుకొని మండిపోవునప్పుడు చక్రవర్తియగు ''నీరో'' అయ్యయ్యో యని యైన ననెనా? అంతఃపురములోఁ గూరుచుండి ఫిడేలువాయించు కొనుచు హాయిహాయి యనలేదా? ఎందుల కీ గానశక్తి? నాదనామక్రియకు సాధుప్రవర్తన కేమి సంబంధము? జంపె తాళమునకు స్వార్థపరిత్యాగమునకు సంబంధమున్నదా? ఐహికగానములవలన సదుస కుద్గతి లేదు. సంసారతరణమునకు లోకకల్యాణమునకుఁ గావలసినది భక్తిగానము. రక్తిగానము గానమే. భక్తిగానము గానమే. ఒకటి వేశ్యాజటామండలిలోని గులాబిపూవు. ఒకటి ఈశ్వరజ టామండలిలోని గులాబిపూవు. గానము లేనివాఁడు నరఘాతుకుఁడని చెప్పుట సమంజ సము కాదేమో? భక్తిలేనివాఁ డట్టివాఁడు. నిజముగా నట్టివాఁడు. భక్తులకథలు విని కరఁగనివాఁ డట్టివాఁడు. ప్రధానమైనది భక్తి. గానము దాని కుపలక్షణము. రక్తికిఁగూడ నదియే యుపలక్షణము. ఉపలక్షణమును బ్రధానముగఁ జేసి చెప్పుటచే నాంగ్లేయకవిమాటలు నచ్చలే దని చెప్పవలసివచ్చినది. గరళకంఠభక్త శిఖామణిగాథలో గానమునుగూర్చిన తగవులాట చెప్పినందులకు మన్నింపవలెను. మనభక్తాగ్రేసరుఁడగు బ్రహ్మయ్య బసవేశ్వర స్వామిని దర్శింపఁ బాదచారియై పయనమై పోవుచున్నాఁడు. అడుగడుగునకు, హరహరా! అంధకహర! భక్తపాపసంహర! గంగాధర! శశాంకరేఖధర! యని స్మరించుకొనుచుఁ బాడుకొ నుచు నాడు కొనుచుఁ బోవుచుండెను. కాని మనబ్రహ్మయ్యను సంగమేశ్వరమునకు ముందే యెదుర్కొనవచ్చుచున్న యా యలౌకికతేజోరాశి యెవరు? ఆహాహా! కన్నులు ధన్యము లగున ట్లవలోకించితిరా? మహారణ్యములో నొకమహాజ్వాల రెండవజ్వాలను దరియుచున్న ట్లున్నదే! సముద్రమున నొకహిమసౌధము (Iceberg) రెండవ హిమసౌధమును సమీపించు చున్నట్లున్నదే! బ్రహ్మయ్యగారిరాక యాతఁ డెట్లు గ్రహించెనో. స్వచ్ఛాత్మకు స్వచ్ఛాత్మకు నిస్తంత్రీతంత్రవార్తలు జరుగుచుండును గాఁబోలు. ఒకచుక్క రెండవచుక్కకుఁ గన్నుగీట, నొకయాత్మ రెండవయాత్మకు సన్న చేయకుండునా? కాని యావచ్చుజ్యోతీరూప మెవరో? ఎవరో–చెప్పుమందురా?

ద్వి. ''శాశ్వతసర్వజ్ఞ–శశ్వద్గుణాంక–
విశ్వేశ శ్రీగురవే నమో యనుచు

సద్యఃప్రసన్నానవద్య వేదాంత–
వేద్యాత్మ శ్రీగురవే నమో యనుచు

దత్తకైవల్యయుదాత్త సద్భక్త
విత్తేశ శ్రీగురవే నమో యనుచు
నమితపరంజ్యోతి రాకారదివ్య
విమలాంగ శ్రీగురవే నమో యనుచు
స్థిరతరసృష్టిస్థితిలయప్రపంచ
విరహిత శ్రీగురవే నమో యనుచు
సకలనిష్కళచరాచర రూపవిగత
వికృతాంగ శ్రీగురవే నమో యనుచు
నాద్యంతరహిత నిత్యామలతేజ
విద్యాత్మ శ్రీగురవే నమో యనుచు
నధ్వషట్కాతీత యవిపాతకౌఘ
విధ్వంస శ్రీగురవే నమో యనుచు
మోక్షార్థిరక్షణ దక్షకటాక్ష
వీక్షణ శ్రీగురవే నమో యనుచు
నజ్ఞానతిమిరసంహారార్థదత్త
విజ్ఞాన శ్రీగురవే నమో యనుచు
ధన్యాత్మ శిష్యమస్తకకృపాహస్త
విన్యాస శ్రీగురవే నమో యనుచు
నఘహరణార్థ శిష్యజనోపభుక్త
విఘసన శ్రీగురవే నమో యనుచు
నశ్రాంతభక్తజనాత్మాంబుజాత
విశ్రాంత శ్రీగురవే నమో యనుచు
ననఘగురు ప్రసాదామృతహృదయ
వినివాస శ్రీగురవే నమో యనుచు

చెన్నబసవఁ డేమహామహుని నోరార మనసార స్తుతియించెనో యాబసవేశ్వరుఁడే మన కిన్నర బ్రహ్మయ్యకు సాక్షాత్కరించెను. అట్లు ప్రత్యక్షమైన బసవేశ్వరునిఁ జూచి హరహరహర మహాదేవ శంభూ'' యని సాష్టాంగదండప్రణామ మాచరించెను. బసవేశ్వరుఁడు కూడ నాభక్తునకుఁ జాఁగిమ్రొక్కి, యనునయించి యతిథిపూజ నాచరించి ''సవిశేషతత్త్వానుభవ భవ్యగోష్ఠి'' సలుపుచుఁ దన నిలయమునకుఁ దీసికొనిపోయి యథార్థముగ గౌరవించెను.

ఆపురముననున్న త్రిపురాంతక దేవాలయమునకు మహాదేవదర్శనార్థమై బ్రహ్మయ్య వెడలెను. దేవాలయమునెదుట నొకచిత్రము జరుగుచున్నది. ఒక గొల్లమెడకుఁ ద్రాడు కట్టి యాత్రాటిని జేతఁబట్టుకొని యొకఁడు దానిని లాగుకొనిపోవుచుండెను. తానుంచుకొన్న వారాంగనకొఱకు దానిని బలి నిచ్చుటకై కొనిపోవుచుండెను. ఉంచుకొన్నదానికై దానిని వధించువెడల నామె యారోగ్యవతియై, యైశ్వర్యవతియై, తనయం దనురాగవతియై యుండునని యాతఁడు దాని నుత్సాహమున నీడ్చుకొనిపోవుచున్నాఁడు. కాని యాగొల్లె

యంతవేడుకతో నాతని వెంబడింపఁగలదా? ఉరికంబములయొద్ద కాతని మఱియొక్కఁ డీడ్చుకొనిపోవునెడల నింతయుత్సాహముతో నాతఁడు నడచునా? చంపుటకై తన్నుఁ దీసికొనిపోవుచున్నాఁ డని యది గ్రహింపకున్నదా? పెంచుకొనువాఁ డెవఁడో చంపువాఁ డెవఁడో యది యట్లె గ్రహింపఁ గలదే! దానికున్న తెలివికంటె నాతనితెలివి యేమంత హెచ్చు? తన తనువును బాడుసేయుచుఁ, దనధనము దోచుకొనుచు, వంశమర్యాదను వల్లకాఁడుచేయుచుఁ గీర్తిని భ్రష్టపఱచుచు సర్వవిధములఁ దనఁగొంతుకోయ సంకల్పించుకొనిన కులటాధనమను దనప్రాణరక్షకదేవతగఁ జూచుకొనుచు, గౌరవించుచు నారాధించుచున్న యీనిర్భాగ్యుఁడు గొఱ్ఱె కంటె నెట్లెక్కువ తెలివిగలవాఁడు? అహో! ప్రక్కనే త్రిపురాంతకుఁడగు మహేశ్వరుని యాలయ మున్నదే! మోక్ష ప్రదాతయైన యాదేవతాసార్వభౌముని పాదపద్మముల నాశ్రయింపక ముఱికితొత్తు పృష్ఠ మాశ్రయించిన బుద్ధిహీను నే మనవలయును?

గొఱ్ఱె గుంజుకొనుచు వెనుకకుఁ దగ్గుచున్నది. విటుఁడు హుంకరించుచు ముందునకు లాగుచున్నాఁడు. ''బే ఏ ఏ ఏ'' యని గొఱ్ఱె యాతనిహృదయము కరఁగునేమో యని యేడ్చుచున్నది. గుడిసెత్రేటిదాని బుడిబుడిబొల్లి దుఃఖములకుఁ గరఁగిన బొజుఁగుల రాయఁడు–ప్రాణోత్క్రమణసమయమున నోరులేని ప్రకృతి యొనరించిన యమాయక మైన యార్తిపూర్ణమైన యాక్రోశమునకుఁ గరగుఁటే! పరీక్షించుటకుఁ గన్నున్నయెడలఁ దెలిసికొనుటకు మనసున్న యెడల నజ్ఞమగు జంతు ప్రపంచముతోడనే కాదు, దూరమని మనము కొనుచున్న శాఖాప్రపంచముతోఁగూడ మనకున్న సంబంధ మెంతగాఢమో, యెంతనిర్భేద్యమో యెంతయన్యోన్యాభివృద్ధికరమో కొంతయైన గ్రహింపవచ్చును.

త్రాడుత్రెంపుకొని గొఱ్ఱె దేవాలయములోఁ దూఱినది. అట బ్రహ్మయ్యగారిచేతిలో మూతిపెట్టి నిలువఁబడినది. సెబాస్! చతుష్పదమా! నీవు ధన్యజన్మమవు. ప్రాణప్రయాణసమయమున నీకుఁ బరమేశ్వరదర్శన మైనది. గొఱ్ఱె వయ్యును. బ్రహ్మయ్యగారి వ్రేలనున్న నందికేశ్వరుని మూర్కొనుచున్నావు. శంకరభక్తుఁ డెవఁడో సానిమగఁ డెవఁడో కనిపట్టుటకు మీజాతి కెంత తెలివియున్నది! అతని యొద్ద హాయిగ నిలువఁబడితివి. ఇతనిని వదల్చుకొనుదాఁక తహతహ లాడితివి! తుద కితనిత్రాడు త్రెంపితివి. ఓవిటాధమా! నీవెప్పుడీయాలయములోనికిఁ బోవలేదు కదా! గొఱ్ఱెను దెచ్చుకొనుటకై యిప్పుడు పోఁదలఁచితివా? త్రిపురాంతకదర్శనమువలన నీకు లభింపవలసినది గొఱ్ఱెబొచ్చా! ఆగొఱ్ఱెను దెచ్చుకొని నీఱంకులాడిమొగమునకు దిగదుడిచి చంపుదావా? నీపుణ్య మేమనవచ్చును? అదిగో యాతఁడు గుడిలోనికి రాఁబోవుచున్నాఁడు. బ్రహ్మయ్యగా రాఁగు మాఁగు మని గద్దించుచున్నారు. అదరిపడి నిలువఁబడి యాతఁ డేమనియెనో విందురా? ''ఈగొఱ్ఱె నాది. దీనిని నేను గొంటిని. నాసానియారోగ్యార్థమై దీనిని బలి నిడ దానియింటికిఁ దీసికొని పోవుచున్నాను. నాగొఱ్ఱెను నా కిటుతోలిపెట్టుము'' ఇట్లాతఁడు పలుక, నాయనా! నేను దీనిలోనికాహ్వానించితినా? నేనేల పొమ్మని తోలిపెట్టుదును? ఇది ప్రాణభీతిచే బరమేశ్వరాలయము చొచ్చినది. దీనిని జంపఁదగదు. ఇది నన్ను శరణు చొచ్చినది. శంకరదాసుఁడ నగు నేను దీనిని వదలను. నీకు దీనికై యెంత సొమ్ము కావలయునో యంతయు నిచ్చెదను. నీ వీగొఱియపై నాశ వదలుకొని పొ'' మ్మని బ్రహ్మయ్య బదులు చెప్పెను. ''నీకు మతి

యున్నదా లేదా? శంకరదాసుండ నని చెప్పితివే! ఊరివారిసర్వస్వము నూరక చూఱగొను వారేనా శంకరదాసులు! గొప్పదాసుండవే బయలుదేరినావు. నీవంటిదాసుఁ డింకొకఁ డీ యూర నున్నయెడల నిఁక సంసారములకు నీళ్లు వదలుకొనవలసినదే కాదా? చాలు చాలు. నా గొట్టెను మారుమాటడక తోలిపెట్టెదవా, లేదా?'' యని విటుం డఱచెను. ''నేను నీగొట్టెను హరింపలేదు. ఇది ప్రాణభయార్తయై యిటుఁ జేరినది. దీనికి శంకరభగవానునిద ర్శన మైనది. దీనివలువ యెంతయైన సరే యిచ్చెదను. కఠినోక్తు లాడక నీకు రావలసినసొమ్మే దియో తీసికొనిపొ''మ్మని బ్రహ్మయ్యగారు ప్రత్యుత్తర మిచ్చిరి. ''అటులైన వేయి మాడ లిచ్చి గొట్టెను దీసికొ''మ్మని విటుఁ డర్థాశచేఁ గొంత, యంత విలువ నిచ్చుట కిష్టపడఁ డను నిశ్చయముతోఁ గొంత, పలికెను. భక్తుఁ డాసొమ్ము బసవేశ్వరుని యింటినుండి తెప్పించి విటున కిచ్చెను. విటుండు తెగినత్రాటితో వేశ్యయింటికిఁ బోయెను.

ఆగొట్టె నొసట రవంత విభూతి రాచి మెడలో నసఁటితడపతో మారేదుపత్రి గట్టి త్రిశూలముద్రాంగుళీయకముతో దాని కొమ్ముల నడుమ నొచ్చొత్తి ఓన్నమశ్శివాయ, ఓన్నమశ్శివాయ, ఓన్నమశ్శివాయ యని దాని దక్షిణకర్ణమూలమునఁ బంచాక్షరి నుపదేశించి శివధ్యానైక తత్పరుండై బ్రహ్మయ్య యటనే కూరుచుండెను.

కలకలలాడుచున్న మొగముతో గలగలలాడుచున్న కొంగుముడితోఁ జేత మరియొక గొట్టెతో విటుండు వేశ్యయింటికి సంతసమున దడదడలాడు హృదయముతో వచ్చి మందహాస మొనర్చెను. ''నీవెంత దొంగన వ్వేదుచున్నను నీది పనికిమాలిన పేడతట్ట ప్రాంతమొగమే కాదా? కాని యీగొట్టెది క్రొత్తమొగమై యుండుటకుఁ గారణమేమి?'' యని వీఁపుమీఁది తామరను విసరకట్టతోఁ గోఁకికొనుచు విటకత్తె పలికెను. ''ఉండు, తొందరప డెద వేల? ఈదినమున నీవు నన్నెంతమెచ్చుకొను పనిచేసితి ననుకొనుచున్నా'' వని, పలుకుచు వేయిమాడల కొంగుమూఁట నామెపాదములయొద్దఁ బెట్టి విప్పెను. ఆమె యానందించిన దయ్యును రొనరొనలాడుచు ''నీ వెట్లనైన నీధన దొంగిలించిన దగునేడల నింత బహిరంగముగా నిల్లు ప్రవేశించి యింత వెల్లడియగునట్లు నాయెదుటఁ బెట్టెదవా? ఓరిపనికిమాలినవందా?'' యని తిట్టి యిప్పుడైనఁ దలుపు మూయుము. దీనిని బ్రాతిపె ట్టుదు మని చెప్పఁగ, నాతఁడు నవ్వి పూర్వవృత్తాంతము నంతయుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పెను. ''వేల్పుల కని ముందే దత్తమైన గొట్టెను జచ్చు వేయిమాడల కమ్మితివా? నిర్భాగ్యపు ముండకొడుకా! నీకు సొమ్మే ప్రధానమా? ఆగొట్టెకుఁ బ్రతినిధిగ నింకొకదానినిఁ దెచ్చితివా? నీకు బదులుగా నల్వురు ముండకొడుకులను దెచ్చి నీయాలిప్రక్కలోఁ బట్టలేక పోయితివా? సిగ్గు మాలినచెనఁటీ! నీవు నాగొట్టెను దేనియెడల నీగొంతు కోసెద''నని యామిండకత్తె మండిపడెను.

''నీయిష్టమెటులో యటులే'' యనిపలికి, యామాడల నాతఁడు తిరుగ మూటకట్టు చుండెను. ''నీవు నామాడల నంటనేల? దుడుకున దుడుకున ముడివైచుకొనుచున్నావా? నీయబ్బసొమ్ము, నీతాతసొమ్మను కొంటివా? పో! ఒక్కమాడయైన నీయను. పోయి గొట్టెను దెమ్ము, కానియెడల గ్రుడ్లూడఁ దీసెదను. గొంతు పిసికి చంపెదను. నాగొట్టె నమ్మితివా? నీకూఁతు నమ్ముకొనలేకపోయితివా'' యని యతనిగుండెపై దనయైదువ్రేళ్లంటున ట్లొకచ ఱపు చఱచెను.

ఆహా! విటశేఖరా! ఎన్నితిట్లు తినుచుంటివయ్యా! మీయమ్మచే నొకతిట్టు తింటివా? అబ్బచేఁ దింటివా? అన్నమిచ్చి పోషించు నవనీధవునిచేఁ దింటివా? ఇది యెవతె యని తినుచున్నావయ్యా? డబ్బిచ్చి తిట్టించుకొనుచున్నావే. మడిమాన్యము లిచ్చి తిట్టించుకొను చున్నావే. వెట్టికొలువు చేసి తిట్టించుకొనుచున్నావే! నీవు మనుష్యుఁడవేనా? మతియున్న వాఁడవేనా? అహంకారము చంపుకొంటివే, రోసము. చంపుకొంటివే, మానాభిమానములు చంపుకొంటివే! పోనీ, మంచిపనియే జరిగినది. ఇన్నిటిని జంపుకొనినందులకు నీచూపు దుర్గంధభూయిష్ఠమై చెప్పుటట్టవలె నున్న సానిమొగమునఁ బఱపుటకంటె సర్వేశ్వరుని పాదారవిందములందు లగ్న మొనర్చునెడలఁ దరింతువే, ఉత్తమగతికిఁ జేరువనుచున్నావు. నిన్ను రక్షించువాఁడు పరమేశ్వరుఁడు తక్క మరియెవ్వఁడు లేఁడు! రా! ఇదిగో పరమేశ్వరా లయము.

ఆహా! అదిగో! విటుఁ డాలయమునొద్దకు వచ్చుచున్నాఁడు. తెల్లఁబారిన మొగముతోఁ దడఁబడుచున్న కాళులతో నంతరంగోద్రేకమున నదరుచున్న పెదవులతోఁ బట్టుదలను వెల్లడించు కన్నులతో భయంకరముగ ముడివడిన బొమలతోఁ జివరలంది త్తడిపొన్నులున్న చేపాటికఱ్ఱతో వచ్చుచున్న యారూపము నవలోకించితిరా? చావో బ్రదుకో దుఃఖమో సుఖమో నరకమో స్వర్గమో యేదోయొక్కత్రుటి కాలములోఁ దేలవలయు నను నాగ్రహముతో వచ్చుచున్నట్లు కానఁ బడుచున్నదా? "నాగొల్లెను నాకిచ్చెదవా చచ్చెదవా" యని విటుఁడు భక్తునిమీఁదికి వచ్చుచున్నాఁడు, "వేయిమాడలను దీసికొంటివి కదా! ఇంక నీగొల్లె యెట్లు ఇది త్రిపురాంతకుని" దని భక్తుఁడు నిమ్మళముగఁ బలికినాఁడు. "నేను దీని నీ కమ్మితినా? నీవు నాకు మాడలిచ్చితివా! దొంగముండకొడుకా! తల పగులగొట్టెదను. ఇచ్చెదవా లేదా" యని కఱ్ఱనెత్తి భక్తునినెత్తిపై వ్రేయ నాతఁడు చేతనున్న లాతాముతో దెబ్బను మరలించుకొనెను. చేతనున్న చేపాటికఱ్ఱ దూరమునఁబడఁగ విటుఁడు డబ్బాటున భక్తునిపైఁ గలియఁబడెను. భక్తునిచేతనున్న లాతాము విటునికణతపైఁ బ్రమాదమునఁ దగులుటచేఁ గాఁబోలు విటుఁడు గిజగిజ కొట్టుకొనుచుఁ గ్రిందఁబడెను. ఓన్నమశ్శివాయ యని భక్తుఁడాతని దక్షిణకర్ణమున నుపదేశ మొనరించుచుండఁగ నతఁడు ప్రాణములు విడిచెను.

ఎవడో భక్తుఁడు గ్రామమునకువచ్చినాఁ డనియు నాతఁ డొక గొల్లెను దొంగిలించె ననియు నది తన దని చెప్పవచ్చిన వానిని జంపి యాతని మూఁటలోనున్న వాల్లువేల మాడలను దీసికొనియె ననియుఁ జంపఁబడినవాఁ డుంచుకొన్న వాని కీతఁ డాసొమ్మిచ్చి దానిని జేరఁదీసె ననియు మరియింక నేమేమోవార్త లూరఁ బ్రబలెను.

ఆ. అప్రమాణవార్త యానోట నానోట
నిట్టె యిట్టె ప్రాఁకి యెల్లయెడల
వ్యాప్త మగునుగాదె వరుసైన ప్రాంతతా
టాకుటింటిమీఁద యగ్గివలెనె.

అందులో భక్తులఁగూర్చి కల్గు నపవాదముల వ్యాప్తికి హద్దున్నదా? నీటిమీఁద నైచినమానెచుక్క కూడ నంతవేగముగ వ్యాపింపదే, కారుచిచ్చుగూడ నంతశీఘ్రముగ వ్యాపింపదే. గాలి కూడ దానివ్యాప్తివేగమునకు జంకునే, పోయినకొలఁది పోయినకొలఁది

''రెఫల్'' దెబ్బవలె నది వలె నది విశాలమగునే. అడుగడుగునకుఁ గొత్త కల్పనలతో నిముసనిముసమునకు నూతన విజృంభణములతో నవనవాలంకారములతోఁ గొమ్మలపై రెమ్మలతో రెమ్మలపైఁ జిలువలతోఁ జిలువలపైఁ బలువలతోఁ బలువలపైఁ జిగుళ్లతో విరిసి విరిసి విజృంభించి పోవునే!

ఆగ్రామప్రభుని కీవార్త తెలిసినది. అత్యంతరహస్యవార్తలే యాతనికిఁ దెలియునప్పు డింత వ్యాప్తి నొందినవార్త తెలియకుండునా?

గీ. గాలి చొరనట్టి చోటులు గలవు కాని
యతనిచెవిని జేరనిరహస్యములు లేవు
అత్తకోడండ్ర దెప్పలు నాలుమగల
గుసగుసలు నాఁడుబిడ్డల రొనరొనలును
తోడికోడండ్ర వెడవెడకోడిగములు
మొదలుగా నన్ని సంచారములను గల్గు
ఛిద్రతతి యిట్టె యాతని చెవిని జేరు.
దాసి గదిలోన గాయకుఁ దన్నె ననుచు
గురువుగారింటిలోఁ గల్లుకుండ యనుచుఁ
జెవికొఱుకువారు తార్పుడు సేయువారు
కొండెకూఁతలవారును గోడెగాండ్రు
బానిసలు రాజుమెప్పుకై పలుకుచుండ్రు
మొలకతళుకులు బెళుకులు తులకరించు
కలికిపలుకులకులుకుల కవితకంటె
నధికముదమున వినుచుందు రవనిపతులు.

ఆకపటభక్తునిఁ జూచి యథార్థమును దెలిసికొని రమ్మని రాజు తన యుద్యోగిని బంపెను. భక్తుఁడు జరిగినది జరిగినట్లు చెప్పెను. నీకు సాక్షు లెవ్వరని యుద్యోగి యడుగ నీత్రిపురాంతకదేవుఁడే యని యాతఁడు బదులుచెప్పెను. ఈయంశము లుద్యోగివలన రాజు విని పరివారముతో నాలయమునకు వచ్చెను. భక్తుఁ డఁట! సానినుంచుకొన్నాఁడఁట! నాల్గువేలమాడలు దానికిచ్చినాఁడఁట! దానివిటుని జంపినాఁడఁట! అతఁడు నిర్దోషి యని త్రిపురాంతకుఁడు సాక్ష్యమిచ్చునఁట. ఇఁక నూరకున్నవా రాఁగుదురా? ఆబాలగోపాల మటకు వచ్చిరి. భక్తుఁడు జరిగిన వృత్తాంత మంతయు రాజుతో మనవిచేసెను. నీసాక్షిని బిలువుమని రాజు హేళనముగ ననియెను. అభ్యంతరమేమి? ఇదిగో యని ''ఓమ్ హరహరహ రమహాదేవ శంభూ'' యని యుచ్చైస్స్వరమున భక్తుఁడు పలుకుసరికి ''ఓ'' యని శంకరదేవుఁడు పలికినాఁడు. అయ ప్రాపంచిక నాదస్ఫూర్తితో భూమియదరినది. సూర్యుఁడు కంపమొందెను. చుక్కలు రాలినవి. గాలి స్తంభించినది. అచ్చటి ప్రాణులన్నియు నిశ్చేతన ములై పడిపోయినవి. శివభక్తులా! లేదు. ఇద్దరు మాత్రము నచేతనులై శంకరధ్యాన తత్పరులై నిలువఁబడినారు. ఒకఁడు మనభక్తుఁడు బ్రహ్మయ్య. రెండవవా రెవరు? ఎవరా? ఎవనినామ మును స్మరించుటవలనఁ బ్రాణులు మృత్యుసంసారసాగరమునుండి సముద్ధరింపఁ బడు దురో యాబసవేశ్వరస్వామియే. ఆయన బ్రహ్మయ్యకు మ్రొక్కి యిట్లు పలికెను.

ద్వి॥ సజ్జనశృంగార సత్యగంభీర
యిజ్జగధార యీశ్వరాకార
మంగళగుణధామ మహిమాభిరామ
లింగాభిరూప యభంగ ప్రతాప
నిర్జితాహంకార నిఖిలోపకార
దుర్జనదూర విధూతసంసార
కారుణ్యపాత్ర యకల్మషగాత్ర
వీరవ్రతాచార్య విపరీతశౌర్య
యంచితాగణ్య నిరంతరపుణ్య
సంచితసుఖీలీల శరణవిలోల
సన్నుతకీర్తి సాక్షాద్రుద్రమూర్తి
కిన్నర బ్రహ్మయ్య కృపసేయుమయ్య.

బ్రహ్మయ్య బసవేశ్వరునకు మ్రొక్కి శంకరభగవాను స్మరించి ''హే'' యని యుచ్చై స్స్వరమునఁ బలుక సృష్టి యథాక్రమము నొందెను.

ఒక్కగొర్రె కారణముగ గోళములన్నియు వ్యత్యస్తము లైనవే. ఆహా! ప్రపంచమున కపాయము తేఁజాలనంత యధమమై వస్తువున్నదా! సృష్టిలోజరిగిన-జరుగుచున్న మహాందోళనము లన్నిటికిఁ గారణము లరసి చూడ నత్యల్పములై యత్యధమములై కానఁబడునే. పదునెనిమి దక్షౌహిణుల ప్రాణములు తీసిన భారతయుద్ధమునకుఁ బ్రథమకారణము పాంచాలీ పరిహాసమేకాదా! గూనిదానికుట్రచేతనే కాదా కుంభకర్ణుఁడు రావణుఁడు చచ్చినది. అయిదు ఖండములందుఁగూడ నంటుకొనిన మొన్న మొన్నటి మహాహవము ప్రపంచపటమునఁ బల్లేరుకాయయంత ప్రదేశముకొఱకే కాదా?

ఈసంగతికేమి-దేవాలయమునొద్ద మూర్ఛ నొందినవా రెల్ల లేచిరి. వారితోపాటు గొర్రెకొఱకు ప్రాణములఁ బాసిన విటుఁడు కూడ లేచెను. ఇప్పు డాతఁడు విటుఁడా? మూర్ఛావసరమున బ్రహ్మముఖమునఁ బంచాక్షరీమంత్ర ముపదేశ మందిన యాతఁ డింక విటుఁ డగునా? అతఁడు బ్రహ్మయ్యకు సాష్టాంగపడఁగ, నాతని నతఁడు లేవనెత్తి ''నీకు నాకు సర్వ లోకమునకు గురుఁ డీ బసవేశ్వరస్వామి. ఈయనకు మ్రొక్కు'' మని యాతనికి మ్రొక్కికొంచెను. చెనఁటియైన కులటచేఁ జేవ్రేటుదిన్న యాతని గుండెపై నిప్పుడు శ్రీకంఠమూర్తి ప్రకాశించుచున్నాఁడు. ఆతని హృదయోపరిభాగమున వేశ్యయైదువే ళ్లెల్లం బెనో యాతని హృదయాంతర్భాగమునఁ బంచాక్షరి యట్లంటెను. పైపైనున్న దశాశ్వతము లోలోనిదే శాశ్వతము కాదా? బసవేశ్వరస్వామిని బ్రహ్మయ్యను జయజయధ్వానములతో న్మూరేఁగించి రాజు వారికి సాష్టాంగపడి సెలవుతీసికొని కోటకుఁ బోయెను.

చిత్రమైన యీగాథ పాల్కురికి సోమనాథకవి ప్రణీతమైన బసవపురాణములోనిది. దానిలో మహావిచిత్రములైనగాథ లనేకమున్నవి. ఈగ్రంథము నూతనముగ దేశోద్ధారక నాగేశ్వరరావుగారిచే నచ్చొత్తింపఁబడి ప్రకటింపఁబడినది. మహేశ్వరభక్తులైన మహామహుల విచిత్రగాథలన్నియుఁ జదివి యాంధ్రసోదరులు తరింతురుగాక!

**ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.**

# 7. ఉన్మత్తుని యుపన్యాసము

**జం**ఘాలశాస్త్రి విశాఖపట్నం వెళ్లి పిచ్చి ఆసుపత్రికి వెళ్లాడు. పిచ్చివాళ్ల మాటల ధోరణి వినడం అతనికి ఇష్టం. పూర్వం స్త్రీపురుష సౌందర్యం గురించి, పరిణామక్రమం గురించీ తనతో మాట్లాడిన పిచ్చిమనిషి వుంటాడేమోనని అతనుండిన కొట్టుదగ్గరకు వెళ్లాడు. అతను లేడుగాని మరొకాయన వున్నాడు. ఆయన తను కూర్చుండే తాటాకు చాపలో ఆకుల్ని చీలుస్తున్నాడు. జంఘాలశాస్త్రి ఎందుకలా చేస్తున్నారని ప్రశ్నించాడు.

'సృష్టిలో ఉన్న ఒక్కొక్కడి ఆకు ఇలా చింపుతున్నా'నని–ఉపన్యాసం ప్రారంభించాడు. సృష్టి పనికిమాలినదనీ, అర్థంలేనిదనీ, నశించడమే మంచి దనీ ప్రకటించాడు. సృష్టికర్తను గురించి తెలియకపోవడమే జ్ఞానమని నిర్వచించాడు. ఇక్కడ పాతవిభేదాల స్థానంలో కొత్తతరహా మానవ విభేదాలు తలెత్తడం ఒక్కటే విశేషమన్నాడు. మనుషుల రెండు నాల్కల ధోరణిని విమర్శించాడు. ప్రతివారూ ప్రేమతత్త్వాన్ని, సామరస్యాన్నీ వేదికలెక్కి ప్రబోధించేవారే! –క్రియకు వచ్చేసరికి అంతాదొంగలే. దేశభక్తుల పేరిట చెలామణీ అయిపోతున్న వారి రంగుల్ని ఎండగట్టాడు. నిజమైన దేశభక్తి అంటే దేశీయ దేవతల్ని ఆరాధించడం, దేశీయ ఋషులు బోధించిన వేదాలననుసరించి కర్మ చేయడం దేశీయ జనాన్నేకాదు, సర్వభూతాలను తనతో సమానంగా చూసేవాడే దేశభక్తుడని నిర్వచించాడు. శాంతి, సహనం లేకుండా ఎవడికి వాడే నాయకుడనుకునే వాడే కద! అని ఈసడించాడు–

జంఘాలశాస్త్రి ఆయన మాటల తీరుచూసి ఆశ్చర్యపోయాడు. ఆయన, తనుపిచ్చివాణ్ణి కాదనీ, మేనబావను చూడ్డానికి ఇక్కడకువచ్చి –అతను తప్పించుకుపోగా, గత పద్దెనిమిది నెలలుగా ఇక్కడే వుంటున్నానని చెప్పాడు. వీలైతే ఈ 'చెర' నుంచి విడిపించ మన్నాడు.

**జం**ఘాలశాస్త్రి యిట్లు పలికెను.

నాయనలారా! మొన్న విశాఖపట్టణమునకుఁ బోయి యచ్చటి పిచ్చి యాసుపత్రిలోని కేఁగితిని. నాకుఁ బిచ్చివారిమాటలను వినుట కెంతయో కుతూహలమగుటచే నచ్చటికిఁ

బోయితిని. పూర్వమునఁ బురుష సౌందర్యమునుగూర్చి, సృష్టిపరిణామక్రమమునుగూర్చి యుపన్యసించిన యున్మత్తునిఁ జూచుటకై యాతని కొట్టునొద్దకుఁ బోయితిని. ఆతఁ డేమయ్యెనోకాని కానఁబడలేదు. కాని యాతనివంటివాఁడే యొక్కఁడాకొట్టులోఁగూరు చుండి యాస్తరణముగ నున్న తాటియాకు చాఁప యాకులను దీసి చీల్చుచున్నాడు. అయ్యా! యని యాతనిఁ బిలిచితిని. తన పైకెత్తి నాల్క రవంత కఱచికొని తిరుగఁ దల వంచుకొని యాకులను జీల్చుచుండెను. అయ్యా! యని మరియొకసారి పిలిచితిని. ఇంతలో నొకభటుఁ డేమూలనుండియో వచ్చి ''ఎవ రక్కఁడ! పిచ్చివానితో మాటలాడుచుంటివా? పో! ఆవలికిఁ బొ''మ్మని నన్ను గద్దించెను. ఆతనిచేతిలో నాలుగణా లుంచి, ''రవంతసేపు వినోదమునఁ గాలక్షేపము చేయుదును క్షమింపు'' మని యాతని వేఁడుకొంటిని. ''సరే. అట్టేసే పుండుటకు వీలులే'' దని చెప్పి యాతఁ డావలికిఁ బోయెను. ''అయ్యా'' యని పిచ్చివానిని బిల్చితిని. ఆతఁడు మాటలాడలేదు. సరికాదా, ఈసారి తలయెత్తనైన లేదు. ''అయ్యా! తాటియాకు లట్లు చీల్చుచుంటి వెందుల'' కని నే నంటిని.

పిచ్చివాని సంభాషణము

''సృష్టిలోనున్న యొక్కొక్కని యా కిట్లు చింపుచున్నాను. ఈ సృష్టినంత నాశమొన ర్చుటయే మంచిది. సృష్టి, పనికిమాలిన సృష్టి, అర్థము లేనిసృష్టి, నశించుటయే సమంజ సము. దీనిలో నొక యుద్దేశమున్నదా? నీతి యున్నదా? శాసనమున్నదా? ప్రేమయు న్నదా? ఒక క్రమమైన నున్నదా? మనఋషు లే మని చెప్పిరో వింటివా? సత్తులేదు, అసత్తులేదు. చావులేదు, శాశ్వతత్వము లేదు. పగలు లేదు, రాత్రిలేదు, ఒక్కటియే యున్నది. అది తనంత తానే యున్నది. దానికంటె వేరు లేదు. ఉన్న దనున దేదో దానినుండియే వచ్చినది. ఇ ట్లెందులకు వచ్చెనో దానికే తెలయును. అదికూడ నెఱుఁగు నని చెప్పవలనుపడదు. ఇక్కఁడకు సృష్టికర్తస్థితి యెట్లున్నది? జ్ఞానమున్నది, లేదు. Will ఉన్నది, లేదు. ఉనికి యున్నది, లేదు. తనునుండి సృష్టికలిగిన దనుసంగతి యని యెఱుఁగును, ఎఱుఁగదు. ఇట్టి తత్త్వమని మనఋషులు స్థిరపఱచినారు. ఇది తెలియుటా, తెలియకపోవుటా? తెలియుట కాదు, తెలియకపోవుట కాదు. తెలియకపోవుట, తెలియుట యనఁగా నిదియే. సృష్టికర్తను గూర్చి యెఱుఁగకపోవుటయే జ్ఞానము. ఎఱుఁగుట యజ్ఞా నము. ఇవి మహావాక్యము లని మనవా రెల్ల రంగీకరించినారు. సృష్టిప్రారంభము నుండి యిప్పటివఱ కిట్టి మహోత్కృష్టవాక్యములు పుట్టలేదు. ప్రథమ కారణమునుగూర్చి పాశ్చా త్యప్రకృత్యాది శాస్త్రములన్నియు దప్పులుచేసి దిద్దుకొని, తిరుగఁ దప్పులుచేసి మరల దిద్దుకొని, తుట్టతుద కీమహావాక్యములే సత్యము లని యంగీకరించుచున్నవి. అవి యంగీక రించుటచే మనకు ఘనత యున్న దని నేను జెప్పుటలేదు. కాని మనమహావాక్యముల ననుసరించియే మనవారిలో నాటికిఁ దొంబదుగురవఱకు నడచుచుండుటచే మనకు మహాఘనత వచ్చుచున్న దని చెప్పవలసి వచ్చినది.

మన కాప్రథమకారణమువలెనే జ్ఞానమున్నది, లేదు. ఉద్దేశమున్నది, లేదు. బుద్ధియు న్నది, లేదు. Will ఉన్నది, లేదు. పనిచేయుచున్నాము, చేయుచుండుట లేదు.

వర్ణవిభాగ మంత పనికిమాలిన యేర్పాటు లే దనియు, భారతీయుల బానిసతనమునకుఁ బ్రధానకారణ మదియే యనియు, నిట్టి యసందర్భమైన, యసహజ

మైన, యపకారమైన బంధము లేని యితర దేశీయులు స్వతంత్రులై, జ్ఞానసంపన్నులై, సౌఖ్యవంతులై, సర్వజనసములై కాలక్షేపము చేయుచున్నా రనియు, నిది మనచేతి కరదండ ములుగc, గాళ్ళకు సంకెలగc, గంటికి గంతలుగ, మనస్సునకు దిగపీకుడుగ నుండుటచే మన మెదుగు బొదుగులేక, శరీరమున నల్పులమై, జ్ఞానమున నంధులమై, కార్యమునc గాతరులమై, చిత్తమున బానిసలమై యున్నామనియు, నీపిశాచమునుండి యెంతత్వరగ విముక్తినొందుదుమో యంతత్వరలో మనకు సమస్తజనసోదరత్వమే కాక, సర్వజీవసోదరత్వ మును గ్రహింపc గల్గుదు మనియు, నట్లాచరించుటకుc దగిన వీర్యము, వెన్నెముక, విదగ్ధత కలవారమగుదుమనియు, మనదేశమునకు, మనజాతికీ యథార్థముగ మనుజజన్మమునకుc గూడ లాఘవకరమైన, లజ్జాకరమైన యీ ''నన్ను ముట్టుకొనకుcదనపు'', బుద్ధిహీనపుపశు ప్రాయపుటేర్పాటెప్పుడు పరశురామప్రీతి యగునో యప్పుడే మనకు జాత్యైక్యము సంభవిం చుననియు, జాత్యైక్యముతో శరీరపాటవము; శరీరపాటవముతో సౌఖ్యసంపదయు; సౌఖ్యసం పదతోc జిత్తవికాసము; చిత్తవికాసముతో బుద్ధిస్థైర్యము; బుద్ధిస్థైర్యముతో నాత్మస్వాతం త్ర్యము సిద్ధించు ననియు మన ముపన్యాసపీఠములపై సింహగర్జనము లొనరించుచుండుట లేదా? ఇట్లు జాత్యైక్యసమారిజననరంభ మొకవంక జరుగుచునే యున్నది. వేరొకవంక, తూర్పు మంగల్ల కొక్కc కాన్పరెన్సు, పడమటి మంగల్ల కొక్కc కాన్పరెన్సు, వ్యాసరాయమత స్థుల కొక్కcటి, కాసలనాటివారి కొక్కcటి, వేcగినాటివారి కొక్కcటి, మెరవీధి తెలగాల కొకటి, పల్లపువీధి తెలగాల కొకటి, నపాదవైష్ణవుల కొక్కcటి, నిష్పాదవైష్ణవుల కొక్కcటి, పెదమాలపల్లి యాదిద్రావిడుల కొకటి, చినమాలపల్లి యాదిద్రావిడుల కొక్కcటి జరుగుచునే యున్నవి. ఒక తెకవారి కట్టుపాటులు వేరొక్కc తెగవారి కనిష్టములు పరిపూర్తిగ ననిష్టములు.

గీ. తెల్లరసుద్దకు మరి విభూతికి బడదు
సుద్దముక్కల రెంటికిc జుక్కcయెదురు
పగిలిన విభూతిపండులోc బ్రబలతమము
లైనతెగల రెంటికిని షష్ఠాష్టకంబు
బొగ్గుదారి బొగ్గుది సుద్దబూడిదలకు
దాని కెప్పుడు నైధనతారవరున
అరవలకు నాంధ్రులకు గ్రుద్దులాటధాటి
పైcగ బ్రాహ్మణాబ్రాహ్మణభండనంబు.

సభావేదికలపై సామరస్యము, గృహాంతరముల గ్రుద్దులాట, పలుకులలో మిత్రత, పనిలో శత్రుత, బోధనములో భూతదయ, ఆచరణలోc గత్తికోcత.

(ఆతcడొక్కc త్రుటికాల మాcగి గొంతు సవరించుకొని నావంకc జూచెను. ఈతcడు పిచ్చివాcడువలె మాటలాడుట లేదే యని నేను మనస్సున ననుకొంటిని. అంతలో నాతcడు తిరుగ నారంభించినాcడు.)

ఇంతటితో సరిపోయినదా: ఊహుc. మరియొకచోట నె ట్లుపన్యసించుచున్నారు? ''బెడ్డవ్రేట్లను సహించి రేగుచెట్లు మనకుc దీయని ఫలము లిచ్చుచున్నవి. పట్టులేక గాలిలో సర్వశ్రమములc బొంది యల్లాడుచు మేఘములు మనకు సుధాసన్నిభములైననీరము లిచ్చుచున్నవి. కత్తికోcతను సహించుచు మేకcలు మన కాహార మిచ్చుచున్నది. తమగడ్డి

తాము దినుచు గోవులు మనకుఁ గుంభవృష్టిగ మధుమధుర క్షీరముల నిచ్చుచున్నవి. పేఁడచేఁ బెంటచే సంతుష్టినొంది సమస్తధాన్యసమృద్ధిని సర్వంసహాదేవి సమకూర్చుచున్నది. పశువులు సైతము ప్రాణహీనములగువస్తువులు సైతము స్వార్థపరిత్యాగ మాచరించి పదార్థసంవిధాన మొనర్చుచున్నవి. ప్రేమతత్త్వమే సృష్టికి మూలాధారమై యున్నది. ఎక్కడఁ జూచినఁ బ్రేమ. ఎక్కడఁజూచినఁ బ్రేమ. గ్రహములందుఁ బ్రేమ. నక్షత్రములందుఁ బ్రేమ. అంతరిక్షమునఁ బ్రేమ. గాలిలోఁ బ్రేమ. నీళ్లలోఁ బ్రేమ. భూమిలోఁ బ్రేమ. ప్రపంచమునందలి ప్రతిపరమాణువునందునఁ బ్రేమ. పరమేశ్వరుఁడు ప్రేమస్వరూపుఁడు. ఆతని స్వరూపమున సృష్టినందిన మనుజుఁడు ప్రేమస్వరూపుఁడనుట కేమైన సందేహమా? బుద్ధుఁ డెట్టివాఁడు? ఏసుక్రీస్తెట్టివాఁడు? రామానుజుఁ డెట్టివాఁడు? చైతన్యుఁ డెట్టివాఁడు? ఇట్టి ప్రేమైకనిధానములైన మహానుభావు లవతరించిన భారతభూమి ప్రేమరససిక్తమై, ప్రేమరసార్ద్రమై, ప్రేమరసైకనిధానమై ప్రకాశించుచున్న దనఁగా నాశ్చర్యమేమి? ప్రేమరసవాహినులచే భారతదేశ మంతయుఁ జల్లనై యున్నదనఁగ వింత యేమున్నది? పైనిమంచు కొండల బారువలనఁ గలిగిన చలువ, మూఁడు ప్రక్కలఁగూడ నావరించినమున్నీటి చలువ, గంగతల్లి మొదలు కావేరమ్మవఱకు నడుమనున్న పవిత్రనదుల చలువ, శ్రీకృష్ణవిరహమున గౌరాంగుఁడు వర్షించినయశ్రుధారల చలువ, బుద్ధదేవుని ప్రేమమతపుఁ జలువ, పుట్టతేనెతోఁ గలిపిన శ్రీరామనామామృతపుఁ జలువ, మహర్షులదయాదృష్టులచలువయుఁ గలిగిన భారతదేశమునఁ దీవ్రత కెక్కడనైనఁ దావున్నదా? కఠినత్వమున కెక్కడనైన నవకాశమున్నదా? క్రూరత్వమున కేమైన నెడమున్నదా? హింస కెక్కడనైనఁ జోటున్నదా? మనకాలిక్రింద నడఁగిపోవు పురుగునకు మనకుఁ దత్త్వమున భేదమేమైన నున్నదా? నిన్ను నీవెట్లు ప్రేమించుకొనుచున్నావో, నీతోడిమానవులనందఱ నట్లు ప్రేమింప వలయును గాదా? మానవులకంటె భిన్నములైన జంతువులఁగూడ నీవట్లే ప్రేమింపవలయును గాదా? పరుఁడని నీవనుకొనుచున్న ప్రతి ప్రాణియుఁ గూడ యథార్థముగ నీవే. కావునఁ దలఁపులోఁగాని, మాటలోఁగాని, చర్యలోఁగాని యెవ్వరికిఁ గూడ నీవలన నపకారము జరుగఁగూడదు. పరకష్టమాత్మకష్టము. పరదుఃఖ మాత్మదుఃఖము. పరహింస యాత్మహింస. పరత్వ మనునది యథార్థముగ నాత్మత్వమే కాని వేరు కాదే? సూర్యుఁడు దాను గర్భానలజ్వాలాజాలముచే మండి పోవుచుఁ బ్రపంచమున కారోగ్యమును బ్రాసాదించునట్లు సర్వకష్టనిష్ఠుర తల కోర్చి జనోపకార మాచరింపుము.

ఇట్టిమాటలు సభావేదికలపైఁ బలుకువా రొకరా, యిద్దరా? కాదు, వేలు. ఆమోదించువారు శిరఃకంపనమొనర్చువారు, నెట్టి యాచరణమునకైన శపథము లొనర్చువారు లక్షలు. ఏదీ, తుదకు ఫలమేమి? ఏమున్నది? ఆలుమగల తిట్లు; తన్నులు; తండ్రికొడుకుల త్రోపులాటలు, తాపులాటలు; అన్నదమ్ముల యర్ధచంద్రప్రయోగములు, విషప్రయోగములు; అత్తకోడండ్ర గ్రుద్దులాటలు, కూపపతనములు; తోడికోడండ్ర యట్లకఱ్ఱవ్రేటులు, రోఁకలిపోటులు; శ్వశురజామాతలచీకొట్టుటలు, చెంపపెట్టులు. ఒక్కకుటుంబములోని హార్దిప్రేమమే యిట్లు వెలిఁగిపోవుచుండఁగ నింకఁ బరులపై ప్రేమ మెట్లులున్నదో వేఱ చెప్పవలయునా? కన్నపుదొంగతనములు, కొంపలఁ గాల్చుటలు, తలఁగొట్టుటలు, స్త్రీలఁ జెఱుపుటలు, న్యాయసభలో వ్యాజ్యెములు, చార్జీలు, కారాగృహవాసములు, ఉరిశిక్షలు -ఇవిగాక భూమిమీఁద యుద్ధములు, నీటిలో యుద్ధములు, గాలిలో యుద్ధములు. పరుని

యెడ నొక కఠినవాక్యమైనఁ బలుకఁదగదని నోటఁ బలుకుచున్నాము. పరరాష్ట్రమునకై ఫిరంగి చెవుల నిప్పంటించుచున్నాము. పరులసుఖములో మన సుఖ మున్నదని బోధించుచు న్నాము. పరప్రాణములు పొట్టఁ బెట్టుకొని సుఖించు చున్నాము. అనేక పుణ్యనదులచేఁ జలువయెక్కిన మనదేశమందుఁ దీవ్రత కవకాశము లేదని నోటఁ బలుకుచున్నాము. జాతివైషమ్యములచేఁ బరులకొంపలఁ గాల్చి పరుల వేఁడినెత్తుటిచే మాతృభూమినిఁ దడిపి మహానదుల నపవిత్ర మొనర్చుచున్నాము. మనకు బుద్ధియున్నదా, లేదా? ఉన్నది–లేదు. ఆలాపములలో బుద్ధి, ఉద్యోగరంగమున బుద్ధిహీనత. కూపములేని కుగ్రామ మున్నది. కోమటిదుకాణములేని కుగ్రామ మున్నది. బ్రాహ్మణ బ్రువుఁడైనలేని కుగ్రామమున్నది. దేశభక్తులులేని కుగ్రామమున్నదా? లేదు. లేనేలేదు. గతించిన దుష్టకాలములో నాలుగుశతాబ్ద ములకో, పదిశతాబ్దములకో యెవ్వఁడో యొక దేశభక్తుఁడు కాలానుసరణముగ నుదయిం చుట, కొంతకాలము నిశ్శబ్దముగ నిరాడంబరముగ నిశ్చలముగ నిరుపద్రవదీక్షతో వ్యత్యస్తప రిస్థితులను సరిచేయుట, ప్రజాహిత మాచరించుట, దేవసేవామార్గమును గానఁబఱచుట, తిరోధానమగుట జరుగుచుండెడిది. ఇప్పు డటులా? ఏమి విచిత్రకాలము? ఎనిమిదిసంవత్స రములలోపల నీ భారతవర్షమున బయలుదేరిన దేశభక్తులసంఖ్య మిగిలిన సర్వప్రపంచమందు నెనిమిది వేలసంవత్సరకాలములోఁ గలిగిన దేశభక్తుల సంఖ్యకంటె నెన్నిమడుగులో హెచ్చని భావింపవలసినట్లున్నది. అసాధారణమైన, యాశ్చర్యకరమైన, యద్వితీయమైన యీయభి వృద్ధి యారోగ్యలక్షణమా, యామయలక్షణమా? కండల పెటపెటయా, క్రొవ్వు తవత వయా? నరములసారా, నంజునీరా? ఓయేమియుపన్యాసముల ఝూంకారములు! యేమి యుద్బోధనలయహంకారములు! సర్వభూత సమత్వమునుగూర్చి, స్వార్థపరిత్యాగమును గూర్చి, శాంతినిగూర్చి, నిర్మలాంతఃకరణమును గూర్చి, నియతేంద్రియత్వమునుగూర్చి, దేశభక్తిని గూర్చి, దేవభక్తిని గూర్చి యేమి వావదూకతావైభవము. తిట్లు దీవనచే నడఁగుననియుఁ, గొట్టు పెట్టుచే శాంతించుననియుఁ, గత్తివ్రేటు కౌఁగిలిచేఁ బోవు ననియు, శత్రుత్వము మిత్రత్వముచే నడలు ననియుఁ, నెట్టేయెట్టేమాట లాడుచున్నారు? ఆహాహా! బుద్ధదేవుఁ డాడఁదగినమాటలే? రామానుజుఁ డాడఁదగినమాటలే? దేశోద్ధరణమును సంకల్పించుకొనిన మీరు వట్టిమాటలతోఁ గృతార్థులు కాఁగలరా? మాటల కనుగుణమైన తత్త్వము మీలో నున్నదో లేదో పరిశీలించుకొంటిరా? ఆధ్యాత్మికవిద్యలో నేమంతఁ గృషిచేసినా రని మీరు దేశభక్తు లనిపించుకొనుచున్నారు? ఆధ్యాత్మిక విద్యదాఁక నెందులకు? ఐహికవిద్యలో మీరేమంత పరిచితి కలవారో యోజించుకొనరాదా? నాల్గవతరగతి పరీక్షలోఁ గృతార్థులు గాలేక దేశభక్తిలోఁ బడినవారు కొందరు, పంచకావ్యపఠనములో నందుగొట్టుటచే దేశభక్తిలోఁబడినవారు కొందరు; పదిజమీందారీయాస్థానములను దిబ్బలుచేసి, నిలువఁ జేసిన ధనము లక్షలకొద్ది మూల్గుచుండ నకస్మాత్తుగా స్వార్థపరిత్యాగులై దేశభక్తిలోఁ బడినవారు కొందరు, నేవిధముగాఁగూడఁ గీర్తి రాకుండ నున్న దని యేరక్షకభట నిర్భాగ్యునో పనిలేక కొట్టి శ్రీకృష్ణజన్మస్థానముఁ జేరి దేశభక్తిలోఁ బడినవారు కొందరు, నిట్టివారే కదా నూటికీ దొంబదుగురు దేశభక్తులు! పూర్వ మొనర్చిన జాతిద్రోహములు, మిత్రద్రోహములు, దేశద్రోహములు, మతద్రోహములు, దైవద్రోహములు, ఖద్దరుటోపితో సమూలముగ నెగిరి పోయినవా? ఇంకను నిల్చియున్నవేమో? లోనికి దృష్టిని గాఢముగఁ బఱపి పరిశీలించుకొ నరా? మిమ్ము దేశభక్తులను జేసినది దేశీయవస్త్రధారణమేనా? అంతకంటె నేమైన

మున్నదా? పంగనామములచే భాగవతోత్తముఁడవు కాఁగలవా? ఆనపకాయచే సన్న్యాసివి కాఁగలవా? ఖద్దరు నీయొడలిమీఁదనా యుండవలసినది? నీమనస్సులో నుండవలయును. నీమనశ్శాటిలోని పడుగుపేక స్వదేశీయభావతంతువులతో నెప్పుడు చేయఁబడినదో యప్పుడు నీవు దేశభక్తుఁడ వగుదువు. తెలుచాఁపగుడ్డ మొలకు బిగించుట గాదు. వేదవిహిత కర్మములచే మనస్సును బిగింపవలెను. స్నానములేక, సంధ్యావందనము లేక కట్టుకొనిన బట్టయైన మార్పకుండఁ, బదునాల్గుసార్లు మూత్రము విడిచినగుడ్డతో నేఁడుగంటలైనఁగా కుండ నేగూడుదురులోనో, యేయేలూరులోనో యాఁకలి రవంతయైననాఁపలేక యాంగ్లేయ భోజనమందిరములలోని కల్లుర్రొట్టెతో కాఫీతోఁ గడుపు నిండించుకొనుచున్ననీవు దేశభక్తుఁడవేనా? దేశభక్తున కుండవలసిన నియతేంద్రియత్వముమాట దేవుఁ డెరుఁగును. ప్రప్రథమ సోపానమైన యాహారనియమమే నీకులేదే? తాటిపాకనవారు తలపాగబరువును మోయఁగలిగిన నీవు రవంతవ్యతిరేకపుమాట సహింపలేనపుడు తుల్యనిందా స్తుతుఁడగు దేశభక్తుఁడ వగుదువా? వదినెగారికి మనువృత్తి నీయవలసివచ్చు నని యెంచి యామె వ్యభిచరించిన దని యపవాదము కల్పించితివే. దేశభక్తుని కుండవలసిన సర్వప్రాణిసమత్వము మాట యటుంపుము. స్వబంధుభక్తియైన నీకున్నదా? ఇంతయేల? కల్లుపాకలనుండి కులటల గుడిసెలనుండి పవిత్రములగు రాట్నపుజెండాలతో వెలువడిన దేశభక్తు లెంద రున్నారో యెరుఁగుదురా? అట్టి వారిని జూచుటతోడనే దేహముచచ్చినది. దేశము చచ్చినది, భక్తి చచ్చిన దనవలయునుగాదా? దేశభక్తి యని తెగసాగెద రెందులకు? స్వార్థపరిత్యాగి దేశ భక్తుఁడు, మీరు చేయుచున్న పనులందు వేనిలో స్వార్థపరిత్యాగమున్నదో చెప్పుఁడు. తాడికాయ నిచ్చి తాటికాయలాగఁ జూచుచున్న మీకు స్వార్థపరిత్యాగమా? స్వార్థపరిత్యాగ మెంత వైరాగ్యము గలవానికి కలుగవలెను? ఒక్క వైరాగ్యమే కాదు. ఎంత యధ్యాత్మికజ్ఞాన మున్నవానికి కలుగవలయును? తనకుఁ బరునకుఁ దత్త్వమున భేదము లేదనియు, భేదము మిథ్య, యేకత్వము సత్యమనియు నెఱిఁగి యనుభవములోనికిఁ దెచ్చుకొని యాచరించు వానికిఁ గాని స్వార్థపరిత్యాగముకలుగునా? అట్టి మనస్థితి నీకు లభించువఱకు పరోపకార మని భ్రమపడి నీవు చేయుచున్నపను లన్నియు డాంబికములు డబ్బుదండుగలు.

దేశభక్తి దేశభక్తి యని యందువుకద, దేశమునకు ముక్కా, నోరా? తలయా? తోఁకయా? దేశము నారాధించుట ఎట్లు యెఱుఁగుదువా? దేశీయదేవతల నారాధించువాఁడు దేశభక్తుఁడు. దేశీయుల ఋషులనుండి యుద్భుద్ధములైన వేదముల ననుసరించి కర్మముల నాచరించువాఁడు దేశభక్తుఁడు. దేశీయజనులనే గాక సర్వభూతములను తనతో సమానముగఁ జూచుకొనువాఁడు దేశభక్తుఁడు. తాను తన విద్య, తనబుద్ధి, తనసర్వస్వము దేశీయజనసేవ కని త్రికరణశుద్ధిగ నమ్మి ప్రతిఫలవాంఛాశూన్యుఁడై ప్రజాసేవ యొన ర్చువాఁడు దేశభక్తుఁడు. అంతేకాని వచ్చినధనముతో సంతుష్టి లేక, సంభవించిన యాపద లలో శాంతి లేక, తెచ్చినఋణము లెగఁబెట్టుటకు జంకు లేక, సంభాపీఠమున నిలువఁ బడి యసత్యమును బలుకుటకు బిడియములేక, కర్మానుష్ఠానమున కోపిక లేక, త్యాగ మొనర్చుటకు బుద్ధిలేక, యధమాధమ వృత్తులు చేసికొని జీవించునయ్యలు, నమ్మలు మనఃపూర్వకముగ మృతమహానుభావుల నిధులకై యర్పించినధనముతో రైలుఖర్చులు, ఫలాహారపుఖర్చులుఁ బెట్టుకొని యామూలానుండి యామూలాకు, నామూల నుండి మరి యొక మూలకుఁ బనిలేక తిరుగుటకు వినుగువిరామములేక యల్లలాడు నద్భుతతరపురుషు లగు మీరు దేశభక్తు లగుదురా?

మీరు బోధించుచున్న జాత్యైక్యముమాట ముందు చూచుకొనవచ్చును గాని మీలో మీ కేమాత్ర మైక్యమున్నదో సెలవిండు. ఒక్క తెగగా బయలుదేరిన దారుమాసములైనఁ గాకుండ రెండు తెలైనవిగదా? అవి యిప్పటికిఁ బదునాలుగైనవికదా? ఇంకొక పదునాల్గు చీలికలు పైసంవత్సరములోఁ గావని యెవరు చెప్పగలరు? క్రిందఁబడిన పాదరసపుబుడ్డివలె నిన్నిముక్కలైన మీరు వర్ణవిభాగమును మాన్పనుపన్యసించుచున్నారా? ముక్కలైన త్రాటితోఁ గట్టెలమోపుఁ గట్టవచ్చునా? మొన్న మొన్న విడిపోయిన తెగలను సవరించుకొన లేక యెన్ని వేల సంవత్సరములనుండియోయున్న వర్ణవిభేదములను మాన్పఁ బ్రయత్నించు చున్నారా? తలకుఁ దగని తలఁపులా? నోటికిఁ దగని మాటలా? చేతికిఁదగనిపనులా? చెప్పినమాటవినక నిల్లు విడనాడిపోయిన చంచలాక్షిమగఁడు ఆంధ్రపత్రికలో స్త్రీవశ్యపుమందుఁ బ్రకటించునెడల మీరు వెకవెక లాడరా? అట్లే మిమ్ముఁ గాంచి పరులు వెకవెక లాడుదు రనుబుద్ధి మీకేల యుండక పోవలయును?

అదిగాక మీలో నెవ్వరైన సరే యొకని యగ్రయాయిత్వమున కంగీకరింతురా? ఏవ్యక్తికావ్యక్తియేగజ్జెకట్టి కలాపము వినిపింపవలయు ననుకుతూహలతతో నుండుటయే కాని యాతఁడు మననాయకుఁడు, ఆతని ననుసరించి మనము పోవుద మను శాంతిచిత్తత, సహనశీలత, మీలో నెవ్వని కున్నదో యొక్కనివ్రేలు మడఁచి చెప్పఁడు? మీయేలుబడిలో ముందు దేశీయజనుల నుంచుకొనఁ దలఁచినవారు కదా? మీలో నొక్కఁడైన నొక్కనికి విధేయుఁడై ప్రవర్తింప లేకుండు నప్పుడు మీవలన మేము నేర్చుకొనవలసిన దేది? మీకు విధేయత లేనప్పుడు మావలన విధేయత మీ రెట్లపేక్షింపఁగలరు? ఏలఁబడువాఁడే యేలికయగుట కర్హుఁడు. విధేయతఁ జూపఁగలిగినవాఁడే యాజ్ఞనిచ్చుటకుఁ దగినవాఁడు. వినదఁదగినవాఁడే చెప్పఁదగినవాఁడు.

''జంఘాలశాస్త్రి! నిన్నునే నెఱుఁగుదును. సాక్షిసంఘమున నీయుపన్యాసములు కొన్నిసార్లునేను వింటిని ఇంతసేపటినుండి మాటలాడుచుంటిని గదా, నాయభిప్రాయము లతో నీవేకీభవింపక పోవచ్చును. కాని, నే నేమైన నున్మత్తుఁడు మాటలాడినట్లు మాటలాడి తినా'' యని నన్నడిగెను. ''నేను నందులకే యాశ్చర్యపడుచున్నాను. నీవిచ్చటికేల వచ్చితి'' వని యాతని నడిగితిని. ఆతఁ డిట్లు చెప్పెను; ''ఈ కొట్టులోఁ గొంతకాల ముండిన పిచ్చివాఁడు మామేనత్తకొడుకు వచ్చితిని. ఆతఁడు నన్నుఁ జూచి నాతోఁ గొన్ని యసందర్భపుమాటలాడి 'నీవిచ్చటఁ గొంతసేపు గూరుచుండుము. నేను జలస్పర్శమునకుఁ బోయివచ్చెద'నని పోయెను. ఒకగంటసేపు కూరుచుంటిని. ఆతఁడు రాలేదు. ఇంతలోఁ గారాగృహాధిపతి వచ్చి 'యింతరాత్రి యైనను నీ వింక నిటనే కూరుచుంటి వేల' యని నాపైఁ దీండ్రించెను. 'అయ్యా! పిచ్చివాఁడు జలస్పర్శమునకుఁ బోయినాఁడు. నే నాతనిబావను. ఆతనికొఱకే చూచుచున్నా'నని కారాధీశునితోఁ జెప్పితిని. చేతిలోనున్న లాంతరు పైకెత్తి నామొగముఁ బరిశీలించి పిచ్చివాఁడు నా మేనత్తకొడు కగుటచేత నాతనిరూపమునకు, నారూపమునకు భేద మెంతమాత్రమును లేకున్న కారణమున కొరడాతో నొక్క దెబ్బకొట్టి నన్నీకొట్టులోనికిఁ ద్రోచి తలుపువైచినాఁడు. పదునెనిమిదిమాసములనుండి యిచ్చటఁ బడియున్నాను. నే నెవ్వరితో నేమి చెప్పుకొన్నను లేశమైన వినియోగింపలేదు. నా కింతవఱకుఁ బిచ్చియెత్తలే దనుకొందును. ముం దేమగునో తెలియదు కాని

మనుష్యజాతిమీఁద నాకుఁ గలిగిన యసహ్యత యింత యంత కాదు. గుణగ్రహణమును మానివైచి యెంతసేపు దోషగ్రహణమే చేయుచు, మనుష్యులనెల్లఁ దిట్టుచుఁ గాలక్షేపముఁ జేయుచున్నాను. నీకుఁ జేతనగునెడల నాస్థితిని వెల్లడించి నన్నీ చెఱనుండి విడిపింపుము'' అని చెప్పి యాతఁ డూరకుండెను.

హరిహరీ! పిచ్చివాఁ డైనమఱఁదిని జూచుట కితఁడు వచ్చుట యేమి, పిచ్చివాఁడు పారిపోవుట యేమి, పిచ్చిలేనివాని కీ కారాబంధన మేమి! ఏమిచిత్రము! కర్మమార్గము దుర్గ్రహము కదా?

ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః

# 8. ప్రకృతిశక్తులు

జంఘాలశాస్త్రికి, పిచ్చివాళ్లని పలకరించి వారిచేత మాట్లాడించడంలో ఆసక్తివుంది కదా! క్రితంసారి విశాఖపట్నం పిచ్చిఆసుపత్రికి వెళ్లి, ఒక మనిషిని పలకరించి, అతను సృష్టిలో నీతి, శాసనం లేవనే పద్ధతిలో మాట్లాడగా—ఆసంగతి మనకు శాస్త్రి చెప్పాడు కదా! ఈసారి కూడా అదే మనిషిని పలకరించగా, ఆయన విజృ...ంచ ప్రకృతిశక్తుల గురించి మాట్లాడాడు.

సృష్టిలో 'క్రమం' అనేది సున్న. శాసనం అనేది ఎండమావి. ప్రేమ అనేమాట పచ్చి అబద్ధం. చెప్పక తప్పదంటే, స్వార్థప్రేమే తప్ప పదార్థప్రేమ ఈ ప్రపంచంలో లేదు. 'ప్రేమ' అనే మాటకి—'చంపి తినడం' అని అర్థమైతే, సృష్టిలో కావలసినంత ప్రేమ వుంది. ఎంతసేపు మనిషికి తన తిండి, తన సుఖం, తన డబ్బు, తన కీర్తి—తనకి ఎంతవరకు ఉపయోగపడుతుందో అంతవరకే ఆలోచన. అంతకుమించి పోడు. ఇందులో కొంచం హెచ్చు తగ్గులుండవచ్చుగాని మూలసూత్రం మాత్రం స్వార్థమే. 'పరోపకారం' అనేది ఎక్కడైనా పొరపాటున వుంటే, అది కూడా 'మారువేషం వేసుకున్న' స్వార్థమే.

ఆపిచ్చివాడి లెక్కప్రకారం—మూలకారణమైన అనిర్వచనీయమైన మహాశక్తినుంచి అనేక అంధప్రాయాలైన శక్తులు పుట్టాయి. మనుషుల్ని పునాదుల్లోకంటూ కదిలించి ఆకారణంగా జాతులకు జాతుల్నే కూల్చేసే ప్రకృతిశక్తులివి. ఆటలమ్మ, మశూచి వంటివి జబ్బులుకావు. ఇలాంటి అకారణ, ఉన్మత్తశక్తులే. ఈసృష్టిలో క్రమం అనేది లేదు. అక్రమమే సహజం. ఇన్ని అస్తవ్యస్తాలున్నా మనదేశం ఆచారాలలో ఇంకా అనేక ఇతర విషయాలలో విలక్షణమైంది. భయంకర శక్తుల్ని సైతం దేవతల పేర్లతో పూజిస్తాం—అయినా మనుషులకి మతిలేదు అని తేల్చాడు. జంఘాలశాస్త్రి ఈఉపన్యాసంతో ఏకీభవించలేదు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

పిచ్చి యాసుపత్రిలోనిపిచిచ లేనివానిని జూడవలయుననుపిచ్చిచే దిరుగ నాతనియొద్దకుఁ బోయి నిలువఁబడి, ''అయ్యా! క్రిందటిసారి నిన్నుఁ జూచినప్పుడు సృష్టిలో

నీతి లేదని శాసనము లేదని ప్రేమ లేదని యీపనికిమాలిన సృష్టి నాశన మొనర్చుటయే మంచిదని యేమేమో చెప్పితివే'' యని నేనింక నేమేమో యనుచు నుండఁగనే తీవ్రముగ నాతఁ డిట్లనియెను.

''క్రమమా? క్రమమే!! అబ్బ! క్రమము లేకపోవుటయే క్రమము. శాసనమా? అబ్బ! శాసనహీనతయే శాసనము. ప్రేమలఁట! అబ్బ! సృష్టిలో నఁట-కథలలో నాటకములలో నుపన్యాసములలోఁ-గలలలోఁజో అంతేకాని ప్రత్యక్షసృష్టిలోఁ బ్రేమమే! ప్రేమతత్త్వమును బ్రపంచములో నొక్కపగలుమాత్రమే యాచరణములో నుంచుట తటస్థించునెడల సృష్టిలో నున్న సర్వజీవము లొక్కసారి నాశన మగుట కేమైన సందేహమా? ఒక్కజీవము మరియొక్క జీవమునకు జీవనాధారముగా నున్నప్పు డింకఁ బ్రేమ యుండుట కవకాశమేమున్నది? మనుజుఁడు తనతత్త్వమునకు సరిపోయిన యన్నిజంతువుల నన్నిశాకములఁ దిను చున్నాఁడు. సరిపడక పోయినవానిని మాత్రమే మిగుల్చుచున్నాఁడు. ఒక్కమధ్యాహ్నభోజన ములో నైదారు జంతువుల జీవనములు నన్నములోఁ బదివేల శాకముల జీవనములును ద్రాగునీటిలోఁ బదిలక్షల సూక్ష్మ జంతువుల జీవనములును మనుజుఁడు తన పొట్టఁ బెట్టుకొ నుచున్నాఁడు. వాయుభక్షణమున నెన్నికోట్ల సూక్ష్మజంతువులను నాశన మొనర్చు చున్నాఁడో చెప్పఁదరమా? ప్రేమమునకు లక్షణము చంపి తినుటయే యగునెడల సృష్టిలోఁ గావలసినంత ప్రేమ మున్నది. దినమునకు నాల్గుకోట్లజీవనములను గుటుక్కున మ్రింగి గఱ్ఱునఁ బొట్ట నింపుకొని, బఱ్ఱునఁ ద్రేంచి, ప్రపంచము ప్రేమమయ మైయున్న దని సభాపీఠముల బోధించు మనుజు నే మనవలయును? మోసగాఁ డనినఁ జాలునా? కటికవాఁ డన్నఁ జాలునా? ఆతని నేమనునెడలఁ దగియుండునో చెప్పుము-ఓ! లొడలొడమని యుపన్యసించువాఁడవుకదా? ఏదీ? నీతర మగునా? మనుజుఁడు చేయుచున్న యక్రమచర్య కాతని కనుగుణమైన తిట్టు శబ్దజాలమునఁ జూపఁ గలవా? 'ఏవో కొన్ని జంతువులను గొన్ని శాకములనుమాత్రమే మనుజుఁడు బుద్ధిపూర్వకముగఁ దప్పునినరిగఁ దనలోఁ బడి నశించు ప్రాణులవిషయమున నాతఁ డేమి చేయవలసిన దని నీ వందువేమో? ఏమి చేయవలసినదా? ఇఁకఁ బ్రేమోపన్యాసములు పలుకక తప్పనియెడల స్వార్థప్రేమమే కాని పరార్థప్రేమము ప్రపంచమున లేదని స్పష్టముగాఁ జెప్పవలసినదని చెప్పుము. ఎంతసేపు తనతిండి, తనసు ఖము, తనధనము, తనకీర్తి-అంతే తన కెంతవఱకు కుపయోగించునో యంతవఱకే తలఁపు; అంతవఱకే మాట; అంతవఱకే చేష్ట. అస్వార్థపరత్వములోనే పెద్దతల యున్న వానికిఁ బెద్దతలఁపు. పెద్దనో రున్నవానికిఁ బెద్దమాట. పెద్దచేయి యున్నవానికిఁ బెద్దచేష్ట. పెద్దబుద్ధి యున్నవానికిఁ బెద్దయాశ. పెద్దకడుపున్న వానికిఁ బెద్దతిండి. పెద్దబల మున్నవానిది పెద్దపెట్టు. చిన్నప్రకృతి వాని కన్నియుఁ జిన్న-ఇదియే భేదము. ఇంతకంటె భేద మేమియు లేదు. అందరుకూడ స్వార్థపరులు. పెద్దవారి స్వార్థపరత్వముచేఁ జిన్నవాఁడు బాధపడుచుఁ దనకంటెఁ జిన్నవారిని దాను బాధించును. రాజుగారు మంత్రిని జీవాట్లు పెట్టఁగ మంత్రి తనయింటికిఁ బోయి యిల్లాలి నడ్డమైనతిట్లు తిట్టును. ఆమె తనపిల్లను గోపమున దౌడపై నొక్కటి వ్రేయును. ఆపిల్ల యుడుకుఁబోతుఁదనమునఁ దనబొమ్మను నేలవైచి పగులఁగొ ట్టును. ఎంతసేపు నొకనిచేయికంటెఁ దనచేయి పైనున్నదను సంతోషము తనకు మిగులవల యును. ఒకని బాధించుటకుఁ దగినశక్తి తన కున్నదనుసంతోషము తనకు మిగులవల యును. ఎట్టిపనిలోనైనఁ దనయాధిక్యము తనసంతోషమే కావలయును. అందుకొఱకే,

యంత వఱకే యితరులతో సంబంధము యాజ్ఞవల్క్యమహర్షి యెంత సత్యములైన మాటలాడెనో యెఱుంగవా? నీసుఖముకొఱకే నీభార్యను నీవు ప్రేమించుచున్నావు. నీసుఖముకొఱకే నీవు నీపుత్రునిఁ బ్రేమించుచున్నావు. నీకు యథార్థమైన ప్రేమము నీయందే తక్క నితరులెవ్వరి యందును లేదు. ఇవి యెంత వింతగఁ గనబడుమాటలో యెంత సత్యములైనమాటలు! వీనిసత్య మెట్టిదో రవంత పరిశీలింతము.

రెండేండ్లపిల్లవాని తత్త్వమును బరీక్షింతము. అంతపిల్లవాని నేల పరీక్షింపవలయుననఁగా, నాతనిలోఁ బ్రపంచసంబంధమైన మోసము, దాంభికము, మాయ, యిచ్చకము మొదలగు నేదోషము లింక సంక్రమింపలేదు. సాంకర్యరహితమై స్వచ్ఛమై సహజమై యతనితత్త్వము పుట్టినది పుట్టినట్లున్నది. ఇదియే పరీక్షింపదఁగిన సమయము. ఆదర్శ స్వచ్ఛతను దెలిసికొనవలయు నెడల దానిపై మాలిన్య మేమియుఁ జేరనప్పుడే పరీక్షింపవలయును గాదా! గాలిలోనిచెమ్మ దానిపైఁ జేరకుండునప్పుడే పరీక్షింపవలయును గాదా! ఎదుటను బ్రక్కనున్న వస్తువుల చాయలు దానిపైఁ బడకుండునప్పుడే పరీక్షింపవలయును గాదా! పుట్టుకతోఁ బుట్టినగుణము లేవో తెలిసికొనఁదలచినయెడల నట్టిబిడ్డనే పరీక్షింపవలయును. బిడ్డచేతి కద్దమిచ్చిన సరే, బొమ్మనిచ్చినసరే, మఱియేది యిచ్చినసరే, దాని నేల నడుచికొట్టును. నాశన మొనర్చుటయే దానిప్రకృతి యని తెలిసికొనవలసినది. ఎవఁడైన మఱియొక పిల్లవాఁడు తనయొద్దకు వచ్చునెడల వానిని గొట్టి పీఁకినదాఁకఁ దహతహలాడి పోవును. సహజజాతితో నంతత వైరమే మనుజప్రధానగుణ మని తెలిసికొనవలసినది. తనతల్లి క్రొత్తగ వచ్చినపిల్లవాని నెత్తుకొనువఱ కక్కఱలేదు. దరిఁజేర్చుకొన్న యెడలఁ దలఁ గొట్టుకొని యేడ్చును. తనస్థితి నెవరైన నాక్రమింతురేమో యను నసూయయే ప్రధానగుణ మని తెలియఁదగినది. తండ్రి పెద్దమిఠాయి పొట్ల మింటికిఁ దీసికొనిరాఁగ, నన్నకొక్కయుండ పెట్టవలనుపడునా? అక్క కొక్కయుండ పెట్టవలను పడునా? పొట్ల మంతయుఁ దనచేతి కీయవలయును. ఇచ్చినదాఁక నింటిపెంకు లెగురఁ గొట్టుచునే యుండును. కేవలము స్వార్థలోలతాగుణ మిందు జాజ్వల్యమానముగాఁ బ్రకటన మగుచుండుటలేదా? కేవలము పిల్లవాఁడు కావునఁ గ్రమ్మకొనుటకు మోస మెఱుఁగనివాఁడు కావున నతని స్వార్థలోలత బట్టబయ లొనర్చుకొనినాఁడు. వాఁడే పెద్దవాఁ డగుపిమ్మట నట్లు పలుకునా? అట్లాచరించునా? మోసకాఁడై కపట ప్రేమఁగల చూపులఁ జిలుకుచు నళికవైరాగ్యప్రతిపాదకములగు పలుకులఁ బలుకుచు మాయానమస్కృతులతో, మాయాపరీరంభములతో, మహామాయామందహాసములతో నాపాదశిరఃపర్యంత మాక్రమించిన స్వార్థలోలతను మాటుఁ జేసికొని యంతయు మీదే యంతయు మీదే యని వట్టిచేయి వారివంకఁద్రిప్పి సర్వముఁ దానే కబళించును. మాటలు బైరాగిమాటలు. తిండి దయ్యపుతిండి. ధరించినది శాటి. వరించినది బోడి. చదివినది వేదము. చేసినది ద్రోహము. స్వార్థపరత్వమే నరుని ప్రధానగుణ మనుట స్పష్టము. పరోపకార మెటనైన నెప్పుడైన గనఁబడినట్లున్న యెడల నదికూడ మారువేసమందిన స్వార్థపరత్వమే కాని మరియొకటి కాదని నిశ్చయముగ నమ్మవలయును. పైని పాదరసము రాచిన రాగిడబ్బు. కరకరంగుపూసినమునలిమీసము. సృష్టిలోఁ బ్రేమను గూర్చి యిది చాలును.

ఇక సృష్టిలోని క్రమమునుగూర్చి చెప్పెదను. మూలకారణమగు ననిర్వచనీయమైన

మహాశక్తినుండి యనేకములైన యంధప్రాయములగు శక్తులుద్భవించినవి. పంచభూతముల యొక్క మహోన్మత్తచర్యలు జగద్విదితములేకదా? కారణము లేకుండ నవి చెలరేఁగినవా యని యందువేమో? కారణములా? అబ్బ! మొదట సృష్టికిఁ గారణమున్నదా? సృష్టించె నని మన మనుకొనుచున్న మహాశక్తికే కారణము కనఁబడనప్పుడు నీవు గంగవెఱ్ఱులకుఁ గారణము చెప్పఁబూనెద వెందులకు? ఇఁకఁ గార్యకారణసంబంధము నాయెదుటఁ జెప్ప కేమి. నీ మనస్సునకు సంతుష్టికలిగినట్లు నీమొగము చెప్పుచుండుటలేదు. బందరు గాలివానకు బరామీటర్‌లోని పాదరసశలాక యని atmosphere అని, density యని, Nature abhors vacuum అని చప్పనిసారహీనమైన చచ్చు Science మాటలు నాతోఁ జెప్పఁ బూనెదవా? నామనస్సు పరబ్రహ్మ మని చెప్పఁబడు మహాశక్తివంక కెగురఁ జూచుచుండఁ బనికిమాలిన ప్రకృతిమాటలు పలికి దానిని దిగలాగెద వేమి? పూర్వోత్తర సందర్భశూన్య ముగ బుడబుడక్కులధోరణిని సత్యపురసాక్షిసంఘమునందుపన్యాసము లిచ్చుటకాదు. ఆలోచించి మరి మాటలాడుము.

కూలిముండకొడు కొక్కఁడు కునికిపాట్లు పడుచు నెఱ్ఱజెండా చూపుటకు బదులు పచ్చజెండా చూపినంతమాత్రమున ధూమశకటము పట్టాలనుండి జారి తిరుగఁబడుటా? వందలకొలఁది జనులు మహాఘోర మరణము లొందుటా? అద్భుతమైన, యనిర్వాచ్యమైన, యద్వితీయమైన మహాశక్తివలనఁ గలిగినసృష్టి నొక్క రెప్పపాటుకాలములో ధ్వస్తమొనర్చుట కొక్కమనుజ కీటకాధమము సమర్థమైనదా? అట్లనుటకంటెఁ బరిహాసాస్పదమైనపలుకు వేరొక్కటియున్నదా? చావవలసినవారు మహాకాలునిచేఁ జావనే చచ్చినారు. ''నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్'' అని శ్రీకృష్ణుఁడు చెప్పలేదా?

భూకంపములచే నెన్ని వేలపట్టణములు దించుకొని పోలేదు! ఎన్నికోట్లజీవములు సజీవసమాధుల నొందలేదు! వీరందఱ కైకకాలిక లోకాంతర ప్రాప్తియగుటకు వీరందఱ జన్మపత్రములలో మారకాధిపతి దశలే యానిముసమున సంభవించినవా? ధరామండలగ ర్భాంతరవాయు సంచలనమే దానికిఁ గారణ మని యంటివేని తత్సంచలనమునకుఁ గారణమేమి? సంచలనముమాట కేమి, మొదలు తత్తునకుఁ గారణమేమి? సన్యాసిమఠము దించుకొనిపోయినది. సానికొంప దించుకొని పోయినది. కల్లుదుకాణము దించుకొనిపోయి నది. కాళికేశ్వరియాలయము దించుకొనిపోయినది. గోమారకవిపణిశాలయుఁ గూలినది. గోరక్షకసంఘనిలయము కూలినది. ఇంతటితో నయినదా? పదివందల ధూమశకటముల గొట్టములలోనుండి వచ్చుపొగకంటె హెచ్చుగఁ బర్వతవదనగహ్వరమునుండి పొగ యుబ్బెత్తుగఁ బ్రబలవేగముతో నెగయుచున్నది. రోదసీకుహర మంతయుఁ గ్రమ్మచు న్నది. అకాలగాఢాంధకారభయంకర పరిస్థితిచేఁ బట్టపగలు కీచుకీచు మనుచు గీరుగారు మనుచుఁ బక్షులు రొదసేయుచున్నవి. ఆవు లంభా యని యార్చుచున్నవి. పందులు నెలుకలు గాడిదలు మొదలగునవి ఘుర్ఘురించుచుఁ గిచకిచలాడుచు నోండ్రపెట్టుచు నటు నుండి యిటు నిటునుండి యటు నొడలు తెలియని యవస్థతోఁ బరుగు లిడుచున్నవి. బంధుఁడు లేదు మిత్రుఁడు లేదు తల్లి లేదు తండ్రి లేదు తమ్ముఁడు లేదు కొడుకు లేదు. ఎవరిమట్టునకువారు మహాభయోద్రిక్తహృదయములతో స్వప్రాణము లెట్టులయినఁ గాపాడు కొను నాత్రముతో నాచీకటిలోనే కనఁబడనియాదుర్దశలోనే యెక్కడికో యెఱుఁగకుండఁ

బాఱిపోవఁ జూచుచున్నారు. గానుగయెద్దుల లాగున నందరు తిరిగినదారులలోనే యల్లాడు చున్నారు. ముందునకుఁ బోయినవారేరి? తెన్నా? కన్నా? ఏమున్నది? ఇంతలోఁ బటల ములు పటలములుగఁ బైకెగయుచున్న ధూమరాశిలో నుండి చిన్నచిన్న విస్ఫులింగములు చిటచిటాయమాధ్వనులతో మించి నక్షత్రములవలె రాత్రి తమాలవృక్షమునఁజేరిన మిడుఁగు ఱులకోటులవలెఁ గానఁబడుచున్నవి. భయంకరగాఢాంధకారము రవంత పలుచఁబడినది. రవంత పాయయిచ్చినది. కన్ను కన్ను రవంత కనఁబడుచున్నది. అంతలోఁ జండప్రచండ మగు జ్వాలాజాలములు కోట్లకొలఁది జిహ్వలతోఁ గొన్ని యెఱ్ఱగఁ గొన్ని పచ్చగఁ గొన్ని తెల్లగఁ గొన్ని నీలిగ బయలుదేరి యాకసమంత గ్రమ్ముకొనుచున్నవి. సాయంకాలమున సంధ్యారాగ కాంతిచేఁ బశ్చిమ పార్శ్వమున నాకాశ మెట్లుండునో యావదాకాశముఁగూడ నట్లే యున్నది. జను లాకాఁకాకు నిలువలేక, చర్మములు బొబ్బలెక్క, దాహముచే జిహ్వ లీడ్చుకొనిపోవ, నతికాంతిచేఁ గన్నులు చీకటులు గ్రమ్మ, దయ్యములు పట్టినవారివలెఁ బిచ్చివారివలె జుట్లు పీకికొనుచు గుండెలు కొట్టుకొనుచు నట్లిట్లు పోవుచు నాకసము పగులునట్లాక్రోశ మొనర్చుచున్నారు. ఈయేడ్పులు విన్నవారెవరు? దయ యెవరికి? దాక్షిణ్య మెవరికి? అంధప్రకృతిలోని యంధతరశక్తులకు జాలియే? కడవలంత బానలంత ద్రోణములంత చుట్టుగుడిసెలంత యెఱ్ఱగఁ గ్రాగినఱాలు, సలసల తెల్లగ మరిఁగిన గంధక ధారలతో ధారాపాతముగ శతకోటిశత కోటిధ్వనులతో వర్షించుచున్నవే! చెదలున్నపుట్టలోఁ దాటియాకు మంట పెట్టినయెడల నేమగునో యదియే యంతకంటె భయంకరముగ బీభత్సముగ నైనది. తెల్లవారునరి కెటు చూచినఁ బదిమైళ్లవఱకు యున్నది. దానిక్రింద మహాశ్మశానమున్నది.

వాంతులతో భేదులతో మూత్రబంధములతో, నెక్కుపట్టిన నరములతోఁ, గంటిగుం టలతో, నొడలిచలువతో, నాసన్న మరణలాంఛనమగు నాభీలశిరోవేదనతో, భరింపరాని బాధలుపడుచున్న జనులనూడ్చి పెట్టుటకుఁ దోఁకచుక్క యంతచీఁపురు చేతఁబట్టుకొని మురికికాలు వలప్రక్కలను గోడిరెట్టలగుట్టలనడుమను గొట్టాలమ్మ తాండవించుచున్నదే! షడుత్తరశతపర్యంత మెగఁ బ్రాఁకిన జూర్తిమహార్తితో నిముసనిముసమునకు నోరెండిపోవఁ జేయుచున్నదగవగతో బాహుసందులఁ బగిలిన, పగులుచున్న, పగులనున్న బొబ్బలవలని బొబ్బలతోఁ గన్న కొడుకైన నొద్దలేక, యెటులున్న దని యడుగువా రైన లేక, గుండెలు పగుల నేడ్చుచున్న నిర్భాగ్యులను గఱకఱ నమలి గుటుక్కున మ్రింగుదు నని యార్చుచు నోరుతెఱచి హాహాకార మొనర్చుచు మారికామహాదేవత మృతమూషకగిరిసింహాసనమునఁగొ లువుచేయుచున్నదే! వీరి తోఁబుట్టువు లగు చఱుకులమ్మ స్ఫోటకదేవత మొదలగువారు వారివారి పరివారములతోఁ బ్రజపై దాడివెడలి భూమినంతయు నేడ్పులతో రక్తముతో శవములతో దుర్గంధముతో ధ్వస్త మొనర్చుచున్నారే! ఇవి రోగము లని యిప్పటివఱకుఁ బాశ్చాత్యులు భ్రమించు చున్నారు కాని యివి ప్రకృతిశక్తులని, వీనికి మందీయ నక్కఱ లేదని, బ్రదికినవారు మందుచే బ్రదికినవారు కారని, చచ్చినవారు మందులేక చచ్చినవారు కారనియు, నేనుక్రీస్తు పుట్టముందే మనవారు చెప్పినారు. ఎందుల కీశక్తులుండి యిట్లు చెలరేఁగవలయునో వానికే కారణములు తెలియనప్పుడు మన కెట్లు తెలియును? అధర్మ శిక్షకుఁ బాపనాశనమునకు నిట్టివి బయలుదేరి యుండునేమో యనుకొందమన్నఁ బాపాత్ములతోఁ బుణ్యాత్ములుగూడఁ బుంఖానుపుంఖములుగఁ బూర్వపక్షము లగుచు

న్నారే! ధర్మహీనులతో ధర్మసహితులుగూడఁదండోపతండములుగ మండిపోవుచున్నారే! కుటుంబములు కుటుంబములు నామహీనముగ నశించిపోవుచున్నవి కదా! అన్ని కుటుంబ ములోనొక్క పాపదూరుఁడైన లేకపోయెనా! పెద్దవాండ్రు, పాపాత్ములు తఱచుగా నగుచుం దురు. కావున వారు శక్తిచే శిక్షితులై యుండవచ్చును గాని మూఁడుదినముల గ్రుడ్డుకూడ మృతినొందనేల?

అది యసత్యము. ఆశక్తుల కొకరిని శిక్షించు నుద్దేశము లేదు. వాని కేవిధమైన క్రమములేదు. ఎందులకో చెలరేఁగుచున్నవి. గ్రుడ్డిత్రోపుగ నొక్కపెట్టున నన్నిటినిఁ దుడిచివైచుచున్నవి. దానిదారిలో నున్న వన్నియు నశింపవలసినదే! దయలేదు. పగలేదు. ధర్మములేదు. అధర్మము లేదు. చిన్నలేదు. పెద్ద లేదు. పుణ్యము లేదు. పాపములేదు. క్రమములేదు; అక్రమము లేదు. సృష్టిశక్తులస్వభావ మిట్లున్నది.–

''క్రమములేదు క్రమములేదని యింత గింజుకొందువేల? సూర్యచంద్రగ్రహాదుల యుదయాస్తమయము రొక్కని మేషమైనవ్యతిరేకము లేకుండ జరుగుచున్నవికాదా? ఋతు క్రమము ననుసరించి పుష్పఫలాదులు కలుగుచున్నవి కాదా? పై కెగురవైచిన బరుగువస్తువు భూమి మీఁదనే యెల్లప్పుడు పడునుగాని పై కెగిరిపోవుచుండుట లేదుకదా?'' యని నీ వందువుకాఁబోలు. ఇదియా నీకున్నపట్టు? మహోన్మత్తుని ప్రలాపములలోనైనఁ గొన్ని టియందుఁ గ్రమముండునే! ఆంత్రజ్వరితుని యసాధ్యసన్నిపాతపుఁ గేకలలోనైనఁ గొన్ని కారణబద్ధములై యుండునే! అత్యసత్యాలాపియుఁగూడ ''నీమెయేనా నిన్నుఁగన్నతల్లి'' యని యడుగ, సత్యమాడక తప్పదే! అంధుఁడు వైచిన పదిరాతి విసరులలో నొక్క ఱాతివిసరుచేనైన మామిడి కాయయొక్కటి రాలవచ్చునే! సిరాలో మునిఁగిన సాలెపురుగు కాగితముమీఁదఁ బ్రాకినప్పు డన్ని చికిబికులలోను బ్రమాదమున నొకయక్షరముండవ చ్చునే! ఇంతయేల? ఆఁగిపోయిన గడియారమైనను దినమునకు రెండువేళల సరియైన కాలము చూపునే! అక్రమములో నక్కడక్కడ క్రమముండక తప్పనే తప్పదు. అక్రమము, క్రమము ననునవి యన్యోన్యాశ్రయస్థితులుగాని స్వతంత్రమును కావే! మనము చూడవలసిన దేదనఁగా సృష్టికిఁ గ్రమము సహజమా, యక్రమము సహజమా యనునది. అక్రమమే సహజమనుట సిద్ధాంతము.

సృష్టికర్తనుగూర్చి చెప్పవయ్యా యని యెందఱు సన్యాసులో బతిమాలఁగ బుద్ధదేవుఁ డేమనియెనో విందువా? ''ఈమూలతత్త్వమున్నప్పటికి మీ కది లేనట్టిదే. ఆతత్త్వమునకు మీముక్కు మూఁతల సమాధు లక్కఱకు లేదు. మీనిలువుకాళ్ల తెలివితక్కువ ప్రార్థనము రక్కఱలేదు. మీపసిఁడికుండల దేవాలయము లక్కఱలేదు. మీకర్పూరపుహారతు లక్కఱ లేదు. మీసాతాళించిన సెనగ లక్కఱలేదు. మీ పుణ్యములఁ గాంచి మీమ్మాతఁడు తొడపైఁ గూరుచుండఁ బెట్టుకొనువాఁడు కాఁడు. మీ రాతత్త్వమును దలపెట్టనక్కఱలే''దని చెప్పలేదా? చెప్పినఁగాని వలనుపడ దని యామహానుభావుని నిరోధింపఁగ నాతఁ డేమని యెనో విందువా? ''ప్రపథమమున సత్తున్నది. ఇది కేవలము జ్ఞానశూన్య మైనది. ఈయవిద్యా మహాసముద్రమునఁ గొన్ని యంధశక్తు లుద్భవించిన'' వని యాతఁడు పలికినాఁడు. సత్తులేదు, అసత్తులేదని మనవారు చెప్పినారు. సత్తున్నది కాని యది యసత్తుకంటె భిన్నముకాదని యాతఁ డనినాఁడు. శక్తు లజ్ఞము లని వారు వీరుకూడ నంగీకరించినారు.

వేదప్రమాణము నంగీకరింపని బుద్ధదేవుఁడు కూడ వేదర్షులు పలికినట్లే పలికినాఁడు. అదియే సత్యమని తోఁచుచున్నది. ఆశక్తులకుఁ బుణ్యాపాపవిచక్షణమే యుండు నెడలఁ బ్రపంచస్థితి యిట్లుండనేల? ఎట్లు?

గీ. మొద్దువటుఁ డొకనతి లేక మొత్తుకొనఁగ,
వృద్ధునకు నల్వు రిల్లాండ్రు, వేశ్య కొనరు,
నీతిమంతుఁడు గతిలేక నింద నొంద
బానిసీనికి ద్రోహికి బ్రహ్మరథము
ఇచ్చువానినె తిట్టుదు రెల్లవారు
పిసినివానికె పెద్దపెద్ద బిరుదచయము
పాంసులాత్మకు ఫలముపైఁ బ్రబలఫలము
ఏకపుత్ర మరణము నుశ్లోకునకును
సత్యవాగ్దీక్షునకుఁ జెరసాల త్రోపు
అనృతవాదికిఁ దూఁగుటుయ్యాలకైపు
మెత్తనగువానికంటికిఁ జిత్తవాన
మఱి కసాయిమీసాలకు మల్లెనూనె
సృష్టిలో నిట్టిమార్మెలి యిట్టివెలితి
గలుగ నేలొకొ చెప్పఁగాఁ గలఁ డెవండు?

సీ. చక్రవర్తులు సర్వసంపదలఁబాసి
 పరితపించుచు ఘోరవనములందొ
తత్పాదుకలనైనఁ దలమోపఁ దగనట్టి
 యధము లీశులయి రాజ్యంబులందొ?
మగనాండ్రహృదయముల్ మండిపోనేడ్చుచు
 నసురుల కారాగృహంబులందొ?
సుతులఁ గాటికిఁ బంపి పతులగొంతులఁగోయ
 ధూర్తలు బంగారుతొట్లెలందొ?
గీ. శమదమాద్యులౌమునులు రాక్షసులనోళు
లందొ? పరమచండాలురౌ నసురహతకు
లామునులమగువలప్రక్క లందొ? యకట!
దైవమా! మంచిచెడ్డలు లేవె నీకు?

సీ. సత్యసంధులు కష్టచయముల మునుఁగుటో?
 దొంగ లుప్పొంగుచుఁ ద్రుళ్లిపడుటొ?
తలగొరిగించుకో దాతకు లేకుంటొ?
 కృపణుఁడు లక్ష్మీసమృద్ధిఁ గనుటొ?
విద్వాంసు లుదరముల్ వెన్నంటి యేడ్చుటో?
 మూఢులపొట్టలు పాణక లగుటొ?
కాసు గల్గినవానిబాన వేదం బౌటొ?
 **బువ్వలేనతనివి బూతు లగుటొ?**

గీ. త్వత్పదారాధకులు ముష్టిదానరయ్య
లగుటొ? నాస్తికుల్ వారల మొగములందు
నుమియుటయొ! యేమి యిది కన్ను లున్నవె? మతి
యున్నదే? యుంటివే? చేయుచున్న దిదియె?

సృష్టిలో నిట్టివ్యత్యస్తత యున్నదనుమాట సత్యమే కదా! ఒక్కొక్క వ్యక్తికిఁ గొన్నివ్య త్యస్తపరిస్థితులు సిద్ధింపవచ్చును. మనము జాతిమీఁద జూచుకొన్నగాని సత్యమును నిర్ణయిం పలే మని నీ వందువేమో? మనజాతిస్థితియే యోజింతము. మనజాతి యెంత ఘనమైనదో ప్రపంచమంతయునెఱిఁగిన సంగతియేకదా! విశ్వవంద్యములగు వేదములు మనజాతిమూల పురుషులవలననేకాదా యుద్బుద్ధము లయినవి? ప్రపంచమున నొక్క చదరపుటడుగులో నూఱంగుళములు వ్యాపించిన మతమును బోధించిన బుద్ధభగవానుఁడు మనలోనివాఁడే కాదా? ప్రపంచమం దేదేశమందయిన నేకాలమందైన ధనము తీసికొనకుండ విద్యాప్రదాన మొనర్చుట జరిగియుండెనా? మనభరతఖండమున జరిగినది ఇప్పటికి జరుగుచునే యున్నది. బిచ్చగాండ్రకు నన్నమిచ్చుట, బియ్య మిచ్చుట, డబ్బిచ్చుట యెచ్చటనయిన జరిగియుండెనా? ఇచ్చట జరిగినది. ఇప్పటికిని జరుగుచున్నది. ఇతరదేశములందు భిక్షుకులువీథిలోఁగనఁబడునెడల రక్షకభటులు వారినిఁ గారాగృహములం దుంతురు. మనము భుజించుచుండఁగా మాధుకర మొనర్చుకొను నాతఁడు సీతారామాభ్యాం మనః యని జోలితో రాఁగ మనము నోటి కెత్తుకొనుచున్న కబళమును దిరుగ విస్తరిలోనుంచి, యాయతిథి కన్నమిడిన తరువాతనే యాకబళమును నోటఁ బెట్టుకొన వలయునన్న నిబంధన మొక్క భరతఖండమునఁ దక్క మఱియెచ్చటనయిన నుండుట కవకాశము న్నదా? అతిథికి ముందు పీఁట, ముందు విస్తరి, అతఁ డాపోశన మొనర్చి ప్రాణాహుతు లయినఁ దీసికొన్న తరువాతఁగాని యేగృహస్థుఁడైనఁ బరిషేచన మొనర్చునా? ముందుగఁ గాకబలి, శ్వానబలి లేకుండ నెవఁడయిన మెదుకుఁ నోటఁ బెట్టునా? ఆతిథ్యములో నత్యంత సూక్ష్మము లయిన యేర్పాటు లిచ్చటఁ గాక మఱి యెచ్చట నున్నవి? ఇందువలన నాతిథ్యగుణము మనదేశమున నెంత పరిపూర్ణముగఁ బరిపోషింపఁబడినదో తెలియవశమా? చీమలకుఁ బిండి బెల్లము ప్రతిదినము వైచువా రెంద ఱున్నారో యెఱుఁగుదువా? తుదకుఁ బాములకుఁ జిమ్మిలి, పాలుపోయుచున్న కాంతలెంద ఱున్నారో యెఱుఁగుదువా? శత్రువులకుఁగూడ నాతిథ్య మిచ్చినవారు మనజాతివారే కాదా? నూఱేసి యంతరువుల మేడలున్న యమెరికాదేశ మొకదేశమా? దోమకుట్టుబాధ నివారించుటకుఁ బశువులకయి రాపిడి స్తంభములున్న మనదేశమే దేశ మగునుగాక! జాతి కుండవలసినది భోగవాంఛయా? భూతదయయా? మనజాతి కీసుగుణసంపత్తియుంతయు నున్నది కదా! ఇది నీమతానుసా రముగఁ బుణ్యమే కదా! సరే.

సాలగ్రామములపై నిర్మాల్య భారమును దీసివేయనివాఁడు ధరాభారముగ నెన్నఁబ డుచున్నాఁడు కాదా? మైలుమైలున కొక్కదేవాలయ మున్నదే. ఫర్లాంగు ఫర్లాంగున కొక్క భజనమందిర మున్నదే! ప్రతిదినము నేదోయొకవేళనయిన దైవధ్యాన మొనర్పని భారతీ యుడెవఁడయిన నున్నాఁడా?

అబుద్ధిపూర్వకముగనైన దైవనామస్మరణ మొనర్పనివాఁ డీపుణ్యభూమిలోనివాఁడు

కాఁడే? పాశ్చాత్యులలో దైవచింత యెంత యరుదుగా నున్నదో యంద ఱెఱుఁగినదే కాదా? వారికి దైవచింతకుఁ దీఱిక యెక్కడిదో? దైవనామస్మరణ మొనర్చుటకు నైనఁ దెఱపి యెక్కడిది? పొగయంత్రములలో, నీటియంత్రములలో, వాయుయంత్రములలో, విద్యుద్యంత్రములలో, సముద్రగర్భములో, సంతలలో, నక్కడ యిక్కడ యని లేక, సర్వతోముఖముగఁ దిరుగుచు క్షణము పోయిన ధనము పోవు ననునాందోళనముతో సత్వాతురతతో దేవులాటయుఁ దిరుగులాటయుఁ బరుగులాటయు నెగురులాటయుఁ బ్రాఁకులాటయుఁ బొరలాటయుఁ దక్క నంతకంటె మఱేమియులేదె! ధనచింతా ప్రాబల్యమే కాని దైవచింతాలేశమయిన నెప్పుడైన నున్నదా?

మనకట్లా? దైవనామస్మరణ మొనర్చుచు నుదయమునఁ గనుదెఱచినది మొదలు, దైవనామస్మరణ మొనర్చుచు రాత్రికనుమూయు పర్యంతము మనము దైవముపేరు పెట్టుకొని చేయుచున్నపను లిన్నిన్నియా? కొడుకులకుఁ, గూఁతులకు, మనుమలకు మనుమరాండ్రకు దేవుని పేరు పెట్టుకొని నోరాఱఁ బిలుచుకొనుచున్నాము కాదా? ఏదో యొక దైవముతో సంబంధింపని పేరు మనలో నెవరికైన నున్నదా? మత్స్యనాథరావు కూర్మనాథరావు వరాహరావను పేళ్లుగూడ మనలో నెందఱికో యున్నవికాదా? ఎటు వచ్చినను గడ్డయ్య-పెంటయ్య-పుల్లయ్య యనుపేళ్లు కారణాంతరములచేఁ గొందరు శిశువులకున్నను బాల్యగండములు దాఁటిన పిమ్మట వారినిఁ బవిత్రనామధారులుగాఁ జేయుచుండుట లేదా? ఏసుక్రీస్తుపై మహాభక్తి పాశ్చాత్యులలో నున్నదికదా-అతని పేరు కొడుకులకుఁ గూఁతులకుఁ బెట్టినవా రెందఱున్నారో యెఱుఁగమా? మొగములందు భుజములందు మనము దేవుఁడని నమ్మినవారి లాంఛనములను ధరించుచుండుట లేదా? మెడలో శంకరమూర్తులను ధరించువా రెందఱు లేరు. ఇంటిగోడలకు విష్ణుపాదము లంటించినవా రెందఱు లేరు? ఎటుపోయినను దేవునిరూపమో, యెటువిన్నను దేవుని పేరో, యెటు చూచినను దేవునిగుఱుతో, యెటఁ జదివినను దేవుని కథయో మనకు లేనిపరిస్థితి యీజాతి పుట్టినప్పటి నుండి యిప్పటివఱకున్నదా? ఇఁక ముందుండునా! ప్రహ్లాదునివంటి భక్తుఁ డితరప్రపంచమున నుండెనా? హరిశ్చంద్రునివంటి సత్యవాదికథ పాశ్చాత్యుల గ్రంథజాలములో నొక్కటియైన నున్నదా? భగవద్దాసు లని, బైరాగు లని, యతు లని, సన్యాసు లని, పరమహంస లని, యోగు లని, సాధువు లని, యింక నేమేమో యని దేశసేవచేయుచు నీదేశమున నెన్నిలక్షల జనమున్నదో చెప్పఁగలమా? ఈజనసంఖ్యలో సహస్రాంశమైన నితరదేశములందున్నదా?

మరియొక్క విశేషము: ఏగ్రుడ్డివో యేవడ్డివో యేక్రూరమైనవో యేగొంతుకోఁతవో యగు భయంకర ప్రకృతిశక్తులనుగూడ శ్యామలాంబ యని మరిడమ్మ యని పేళ్లతో మనము పూజించుచుండుట లేదా? దైవముకొఱకే తను వంతయు మనస్సంతయు నాత్మ యంతయు నర్పణ మొనర్చుకొన్నజాతి మఱియొకటి ప్రపంచముననున్నదా? ఈభూతదయయు, నీదైవభక్తియు మహాపుణ్య మని యాచరించుచున్న యీ జాతి యెంత యున్నతస్థితిలో నుండవలసినది? సృష్టిమహామూలశక్తికి దయాదాక్షిణ్యములే యుండునెడలఁ బుణ్యపాపవిచక్షణతయే యుండునెడల, ధర్మాధర్మవిభేదమే యుండునెడల, మనహృదయములోని తన యందలి ప్రేమమును దెలిసికొనుటకు జ్ఞానమే యుండునెడల, మనయవస్థను

జూచుటకుఁగన్నే యున్నయెడల మనదేశమునకీ మహాదుర్గతియేల? ఇతర రాష్ట్రములలోని వారు వారి రాష్ట్రములను వా రేలుకొనుచుండ, మనమేమి చేయుచున్నాము. మనమేడ్పులను మన మేడ్చుచున్నాము. బొంబాయి రేవులో నుండి పొగయోడలోనికిఁ జేరినయెలుక ప్యాసుపోర్టు అక్కఱలేకుండ ఏ అమెరికాదేశమునకో యింగ్లాండునకో పోవుచున్నదే! ఎలుకకున్న జన్మస్వాతంత్రమైన హిందువునకు లేదే.

సాక్ష్యపన్యాసములు తిరుగ నారంభింపఁబడిన వని వినఁగనే యాపిచ్చియానుపత్రిలో నివారందఱేమిచేసినారో యెఱుఁగుదువా? వారందరు 'దిఫిలాసఫర్సు కాన్ఫరెన్సు' అనుపేర నొకసభచేసి సాక్ష్యపన్యాసములు పడుచున్నంతకాల మాంధ్రపత్రికను మనము తెప్పించు కొంద మని తీర్మానించుకొని యట్లు తెప్పించుకొనుచున్నారు. మతియున్న వారికంటె మతిలేనివారికే నీయుపన్యాసము లెక్కువ రుచించునట్లు కనఁబడుచున్నదే! నీవుకూడ వారిజట్టులోని......''

''కోన్‌రే వహాఁ! దివానాసే గుప్తగో కర్తాహై! జారే'' యని యొకమహమ్మదీయుఁ డఱచెను. నేను వెడలివచ్చితిని.

నాయనలారా! సృష్టిశక్తులనుగూర్చి యీతఁడు చెప్పినమాట లన్నియు మీతోఁ జెప్పితిని. ఈమాఁటలు మీ కెట్లున్నవో కాని నాకు సమంజసముగఁ గనఁబడలేదు. ఈయుపన్యాసమును గఠినముగ విమర్శింప వలసియున్నది. ఈతఁ డింక మతిలేనివాఁడు కాలేదు. కాని మనుజ దూషకుఁడైనాఁడు. నిష్కారణముగఁ దనకుఁ గారాబంధమును గలుగఁ జేసి, యవమానించిన మనుజులను శిక్షింపలేదని దేవదూషణమునకుఁ గూడఁ బూను కొనినాఁడు. ఈతలతిక్క తత్త్వజ్ఞాన మిందుమూలమునఁ గలిగినది. ఇతనికిఁ గారాబంధమో క్షము వేగముగ నగుఁగాక!

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 9. ఉన్మత్తుని ప్రలాపము

మద్రాసులో తిరువల్లిక్కేణి సముద్రతీరానికి షికారు వెళ్లాడు జంఘాలశాస్త్రి. అక్కడ రకరకాల మనుషుల్ని చూశాడు. అద్భుతమైన సముద్ర సౌందర్యాన్ని సాయం సంధ్యా సౌందర్యాన్ని చూసి పరవశించ కుండా, నానా సంసార విషయాలతో సతమతమయ్యేవాళ్ల ధోరణిని ఏవగించు కున్నాడు. కంటికి తనివి తీరనంతగా చూడదగింది ఆకాశం. అలాగే చూడదగిన రెండోది సముద్రం.

సముద్రపు హోరునే శ్రుతిగా చేసుకుని పాడుకుంటూ ఉత్తరం దిక్కుగా నడిచాడు శాస్త్రి. అక్కడ బాడిదె కర్ర తెప్ప మీద ఒక్కడూ కూర్చున్నాడొక పిచ్చివాడు. దేశభక్తుడో, దైవభక్తుడో అనుకుని దగ్గరకు వెళ్లాడు.

ఆపిచ్చివాడు ఉద్యమాల్ని, ఉపన్యాసాలిచ్చేవాళ్లనీ తెగ తిడుతూ జంఘాలశాస్త్రితో మాట్లాడాడు. దేశభక్తి, జాతీయ ఐక్యం గురించి ఉపన్యా సాలు ఎవరూ ఇవ్వరాదని నిషేధిస్తున్నాడు. ఇప్పటి జాతి భేదాలకు, కులభేదాలకు, మనుషుల మధ్య పరస్పరం కుమ్ములాటలకు కారణం ఈదిక్కుమాలిన ఉపన్యాసాలే అన్నాడు. ఈఉపన్యాసాలు చెప్పేవాళ్లంతా స్వలాభం కోసం పాకులాడే శుంఠలే నన్నాడు. ఈ ఉపన్యాసాల వ్యాధి ప్రబలడానికి ముందు దేశంలో జాతులు, కులాలు నిజంగా సఖ్యంగానే వున్నాయన్నాడు. అప్రయత్నంగానే బాగావున్న స్థితిని ప్రయత్న పూర్వకంగా తగలబెట్టార న్నాడు. మీ ఉపన్యాసాలే సందేహాలకీ, అవిశ్వాసాలకీ కారణమన్నాడు. రాట్నపు ధ్వని తప్ప, నోటితో మాటలాడరాదని నిషేధించాడు. ఆచరించని మనుషులున్నంత కాలం జాతి కర్మ మింతే అన్నాడు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

మదరాసులో సముద్రతీరమున నీనడుమ నొక సాయంకాలమునఁ దిరుగుచుంటిని, పవనభక్షణమునకై కొందఱు, పడుచు విలాసినులఁ జూచుటకై కొందఱు, పనిలేక కొందఱు నటకువచ్చి క్రిందిచూపులతో నిట్టులట్టు లల్లాడుచు, నిట్టె కలియుచు, నట్టె వేఱగుచు, వంక దండములతో, మాయాకరచాలనములతో, దొంగనవ్వులతో, వింత యిగిలింపులతో

సంధ్యాసమయమును సంపూర్ణముగఁ జంపుచున్నారు. మనుజహృదయము నెట్టె యట్టె వ్యాపింపఁజేసి, యట్టె యట్టె విశాలమగునట్లు చేసి ప్రకృతి పరీవాహమున లీనమగునట్లు చేయఁగల సన్నివేశములు సృష్టిలోఁ బ్రధానముగ రెండున్నవి: మొదటి దాకాశము; రెండవది సముద్రము. కన్ను తనివి లేకుండఁ జూడఁ దగినది మొదటిది మిన్ను; రెండవది మున్నీరు. సంధ్యాకాలమున నీరెండును మదరాసులోని తిరువళ్లిక్కేణి ప్రక్క నెంత మహాసౌందర్యసమన్వితములై యుండునో యనుభవింప వలసినదే కాని వచింపఁ దరమా? అట్టి పరమోత్కృష్టమైన స్థలమునఁ జేరినజను లేమిచేయుచున్నారో విందురా? అత్తగా రాఁడు బిడ్డచీరలకై యింటిలో బియ్య మమ్ముచున్న దని భర్తతో భార్య చెప్పుచున్నది. సంసారచౌర్య కథనము సముద్రతీరముననే కాని సముచితముకాదా? ప్రకృతి సౌభాగ్యరంగమునఁ బనికిమాలిన పడమటింటి గొడవ యెందులకు? ప్రకృతిసౌందర్యగ్రహణశీలుం డగుభర్త భార్య మాటలు వినుచుఁ బల్లెవానితో రొయ్యపప్పు బేరమాడుచున్నాఁడు. పాఠశాలలలోఁ జదువుకొనుచున్న బాలురు నారీకలాశాలలలోని వితంతువుల వింతలు చెప్పుకొనుచు వెకవెకలాడుచున్నారు. నాలుక యల్లాడు చున్నంతకాలము నారీమణి నధిక్షేపింపఁజాలనిమూఢుఁ డెవఁడు? ఆమాటలు రవంతవిన్న యొకయాంధ్రోపాధ్యాయుఁ డచ్చటి యబలాసంఘము లందలి యద్భుత సన్నివేశములవంటివి మఱెక్కడ నుండవని తా నుంచుకొన్న పూఁటకూటింటి పూవుఁబోఁడికి బోధించెను. ప్రభువులపైఁ, బడుఁతులపైఁ బనికిమాలిన ప్రసంగము లొనర్చుట కేమంత ప్రయోజకత్వము కావలయును? నోటిలోఁ జేయిపెట్టినఁ గఱవఁ జాలని శక్తిహీనుఁడైన నందులకు సమర్థుఁడే కాదా? మఱియొక చోటఁ గొందఱు సై మనువ్యవహార సందర్భమునఁ దురకలనోటనుండి వెడలిన బూతులఁ గూర్చి, చేతినుండి వెడలిన చెడావులఁగూర్చి చెప్పుకొనుచున్నారు. ఇటులె పనికిమాలినవార్తలతో, దిక్కుమాలిన సోదెలతో, నవకతవక గాథలతో, ననర్థము లయిన యెత్తిపొడుపులతో నచ్చటివారు కాలక్షేపమొనర్చుచున్నారు. పెద్దమీఁత కాలిపైఁ బ్రాఁకఁగఁ గంపమంది గగ్గోలయి యెగురఁబోయి నెత్తిపై మునుగు జాఱఁ గ్రిందఁబడిన వితంతు నారీమణిని గాంచి హేహేహే యనువారె కాని రాజధానీకళాశాల వెనుక నారికేళవృక్షముల తోఁపులో సహస్రకోటిజపాకుసుమతేజోరాశియై యధఃపతన మందుచున్న నభోమణిని గాంచి హాహాహా యను వాఁడెవఁడైన నున్నాఁడా?

ఈగొడవ నా కెందుల కని యిట్టి మహావిచిత్రప్రకృతి కధీశుఁడగు పరమేశ్వరుని సముద్రపుహోరు నుతిగఁ జేసికొని గాన మొనర్చుకొనుచు నుత్తరదిశాభిముఖుఁడనై కొంత దూరము పోయితిని. అక్కడ బాడిదెకఱ్ఱ తెప్పపై నొక్కఁడు కూరుచుండి యున్నాఁడు. అతఁడు ఖాదీవస్త్రములను ధరించి యున్నాఁడు. ఎవఁడో దేశభక్తుఁడు, దేవభక్తుఁడని నిశ్చయించుకొని యాతనియొద్ద కేఁగి నిలువఁబడితిని. నన్నుఁ జూచి యాతఁ డిట్లనియెను:—

''బైరో బైరోభే!.....కూతుకొండు రాయరే కూతుకొండు. ఆడడా! ముఝాళ్—ఉకార్—ఉకార్—బస్ కూరుచుంటివా బస్—కం. ఊరక రారు మహాత్ములు, మీరలు మాయింటికిపుడు మేలొనఁ గూడెన్, గూరిమి మీఱిన పలుకుల, ధోరణితో విం దొనర్చి తుష్టుం జేతున్. ఆశుకవిత్వము చెప్పఁగలవయ్యా? ''సీ. బిరుదైన కవిగండ పెండేరమున కీవ తగుదని నాదుపాదమునఁ దొడిగె'!నని యన్నవాఁడు పెద్దన్నయే కాదా? తాళ్లపాక చిన్నన్న యుండుటచేతనే యాతఁడు పెద్దన్న యైనాఁడు. Relativity of knowledge అనఁగ నిదియే

సుమా! నీవెప్పు డుంటివో నే నప్పుడున్నా నన్నమాటయే. నీవు నా కాధారము, నేను నీకాధారము. అన్యోన్యాధారము మన కెక్కడకుఁ బోయినను దప్పనేతప్పదు తెలిసినదా? అంత తప్పనియాధార మున్నను గేవలము మందభాగ్యముచేఁ దార్కికుల కుపాదానకారణము కలిగినది. భవతి భిక్షాం దేహి యని భగవంతునైనను మోక్షమును గూర్చి యాచించుట తప్పయినపుడు మారాజ్యము మా కిమ్మని సర్కారువారిని యాచింతుమా. థూ; అది నామర్దా. I am the monarch of all I survey; నిన్నడ్డుకొన్నవాఁ డెవఁడు? నీయిష్టము వచ్చినంత రాజ్యము పరిపాలింపవయ్యా. ఈప్రపంచములో నీదికాని దేమున్నదయ్యా! మూఢుఁడవై, బానిసవై, తుచ్ఛుఁడవై, భిక్షుకుఁడవై, దేహి యని చేయిచాఁచెదవా? చాఁచినచే తితో బ్రహ్మరంధ్రముమీఁదఁ గొట్టుకొని ప్రాణములను విడువుము. అది నీకు గౌరవము, అది నీకు మనుష్య ధర్మము. అంతే కాని తెలివిమాలిన యుద్యమము లెందులకు? హరతాళము లెందులకుఁ జేయుచున్నారు? ఏమి యూహము? ఏమి ప్రయోజనము? అంతకంటెఁ దెలివిమాలిన యూపన్యాసము లెందులకు! ఇంక నుపన్యాసము లిచ్చినయెడల నీగొంతుకోసెదను. హె హె హె ఖబర్ దార్. దారులలోకెల్ల జమీందారీయని పిచ్చిరామశాస్త్రి చెప్పిన మాట జ్ఞప్తియున్నదా? ఒక్కజమీందారి యాస్థానములో నొకదాసి గుజ్జుది పెంపఁబడు చున్నది. పదుమూఁడేండ్లది, బనారసుకాజా! గులాబ్‌జామిన్! బురాఖ్ బొమ్మ–వహవ్వ! సహజపండిత సాంబయ్య చెప్పినట్లు తులముతులము మోతాదు చొప్పున గుటుకు గుటుకున మ్రింగిఁ దగినది. దానికిఁ గన్నె చెఱఁ బావుటకై యెవఁడైన మహారాజుపుత్రుని దెచ్చితి వేని మాజమీందారీ నీకు దానవిక్రయాదిసర్వస్వాతంత్ర్యములతో ధారాదత్త మొనర్పనియెడలఁ జెవి కదపా.''

''అయ్యా, అంతటితో నాఁగుము. తప్పుధోరణిలోఁ బడిపోవుచున్నావు. దేశభక్తిని గూర్చి, జాత్యైకమత్యమునుగూర్చి యుపన్యాసము లీయవల దని యెందులకు చెప్పినావు? రవంత మనస్సు శాంతపఱచుకొని చెప్పుడు'' అని నే నడ్డు తగిలితిని.

''ఉపన్యాసముల సంగతియేనా? చెప్పకుందునా? తొందరపడకోయి ఫూల్. ఉపన్యాసము, ఉపన్యాసము, సన్న్యాసము, సన్యాసము. సన్న్యాసి యగువాఁడు 'అథవా విధవాశ్లేష' మను సాపత్న్యాయముచేత విటుఁడైనప్పుడు వితంతువు యోగినియైనట్లా? సన్యాసి సంసారి యైనట్లా? ధర్మసూక్ష్మ మాలోచించి మరిచెప్పుము. శూద్రుఁడు యజ్ఞోపవీతధారణ మొనర్చినాఁడు; గాయత్రికి శూద్రత్వము వచ్చినట్లా? శూద్రునికి బ్రాహ్మణత్వము వచ్చినట్లా? బ్రాహ్మణుఁడు మహమ్మదీయమతానుసారముగ నుపనయనము చేసికొన్నప్పుడు బ్రాహ్మణునకు మహమ్మదీయత్వ మెంత వచ్చి యేడ్చినదో శూద్రునకు ద్విజత్వ మంత వచ్చి యేడ్చినది.

'విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః.

అను భగవద్గీతాశ్లోకమున కిక్కడఁ బప్పుడుక దయ్యా, తెలిసినదా. కం. ''పప్పేవన బ్రాహ్మణులకు, నుప్పేవన రుచులకెల్ల నువిదలకెల్లన్, గొప్పేవన'' యన్నాఁడుగదా. ఇక్కడఁ గవి యువిదతనమునకుఁ గొప్పునకు నవినాభావసంబంధము చెప్పినాఁడుకదా! వితంతుత్వము వచ్చినప్పుడు కొప్పెగిరి పోయినది. పోలేదా? కాని స్త్రీత్వమున కేమిలోపము

వచ్చినదయ్యా? నేను బ్రతిపాదించిన పూర్వపక్షము నీకు బోధమైనదా? తెలివిమాలిన మొగముతో నట్లు నిరర్థకమైనజూపు చూచెదవేమి? బ్లాక్ హెడ్ ! అదికాక వితంతువు మైనవస్తువును మన మంటఁగూడదు. కావున నాచారకాండ ననుసరించి దానిని వినర్జింతము. వదలితివికదా! ఇక నావైపున నాళపెట్టుకొనవుకదా! సరే పుణ్యస్త్రీనే తీసికో. ఉభయతారక మైన పద్ధతిని మన మవలంబించుటకు సందేహమేల? ఇప్పటి పుణ్యస్త్రీలకుమాత్ర మందఱకుఁ గొప్పున్నదా? ఉంగరాల గిరజాలుంచుకొన్నంత మాత్రముచేత నువిదతన ముడాయించినదా? క్రాపువెంద్రుక లుంచుకొన్నంతమాత్రము చేత ప్రధానమైన సుదతీ త్వము సున్నయైనదా?

పదము "మెడను గుత్తికకంటు లేదోయి నాస్వామి
మొగముమీఁదను బొట్టు లేదు
కప్పుకొప్పుబదులు క్రాపోయి నాస్వామి
మగఁడు మిగిలిన కురిడీనఱకు"

"ఇఁకఁ జాలింపవయ్యా ఒక్కటే పనికిమాలినధోరణియా? ఉపన్యానము లిచ్చువారి గొంతు కోసెదనంటివే. దానికిఁ గారణ మేమని నే నడిగితిని."

"జ్ఞప్తిలేక మానివేయలేదయ్యా! స్టుపిడ్ ! జ్ఞప్తియుండియే మఱచిపోయినాము. చూచి తివా, విరోధాభాసాలంకారమునకు మన వాణియే ప్రాతిపదిక.

ఆగజానన పద్మార్కం గజానన మహర్నిశం,
అనేకదంతం భక్తానా మేకదంత ముపాస్మ హే.

గజదంత మని గ్రంథములలోఁ బ్రయోగమున్నది. "తత్రహేతు రదంతతా" యను టచే మనుష్యదంత మని ప్రయోగమున్నది. మేకదంత మను ప్రయోగ మేమిరా? నీమొగ మని సాగఁదీసి యొక్క లెంపకాయ నిన్నుఁ గొట్టునెడలఁ గవికి బుద్ధివచ్చును. చెప్పవచ్చినవా నిని జెంపకాయ కొట్టినప్పుడు పైయూరివా రా పాముకాటు నిమ్మదించినదా లేదే? మే మసంబద్ధముగా మాటలాడువారము కాము. మాకు మతి లే దనుకొనుచున్నావు కాఁబోలు. మతి లేకపోవుట నీకా, నాకా? నామతిలేని మాటవలన దేశమున కేమినష్టి వచ్చినదో నీవు చెప్పు, మీమతిలేనిమాటలవలన దేశమున కెంతదుర్గతి వచ్చినదో నేను జెప్పుదును. కాచికో, చూడు. ఆ. ఇప్పుడు తెర రవంత తొలఁగిన ట్లున్నది. మన స్సిప్పుడు రవంత నిర్మలముగా నున్నది. ఈసమయములోనే చెప్పవలసిన దేదో యొక్కవాయలో నలఁగఁ గొట్టెదను.

పదిపదునాల్గు సంవత్సరములక్రిందట దేశములో నింత యశాంతి యున్నదా? ఇన్ని మతకక్ష లున్నవా? ఇన్ని శాఖావైషమ్యము లున్నవా? ఇన్ని తిట్టులాట లున్నవా? ఇన్ని కొట్లాట లున్నవా? ఇంత రక్తపాత మున్నదా? ఇంతమహారోదన మున్నదా? మీతెలివిమాలిన యుపన్యాసములే దేశము నింత భ్రష్టపఱచినవి. ఇంతకుముందు బ్రాహ్మణులు నబ్రాహ్మ ణులు నెంత కలసి మెలసి యుండెడివారు. అన్నా, మామా, బావా, యను వరుసలతో నొకరి నొకరు పిలుచుకొనుచు నొక్కకుటుంబములోని వారివలె నుండెడివారు కారా! వీరి వారి స్త్రీ లత్తా, వదినా, అక్కా యనువరుసలతో నొకరి నొకరు పిలుచుకొనుచు నీరక్షీరన్యా యముగా నుండెడివారు కారా? ఇప్పుడు గజకచ్ఛపన్యాయముగానున్నారా లేదా? పంచము

లతోనెన్నఁడైన మన కరమఱిక యుండెనా? వారు మనముంగిళ్లలోనికి, పెరళ్లలోని కెంత స్వేచ్ఛగా వచ్చుచు; బోవుచుండెడివారు? వారు మనయెడల నెంతదయతో, నెంతవిశ్వాసముతోఁ బ్రవర్తించుచుండెడివారు? దొంగలవలన మనయాస్తి కపాయము, వస్తువుల కపాయము సంభవించునప్పుడు మనలఁ గంటికి ఱెప్పలవలెఁ గాపాడిన వారు వారే కారా? ఏవో జాతిసంబంధములైన పూర్వపు కట్టుపాటుల ననుసరించి తనువులు వేరుగ నుండెనుగాని వారికి మనకు మనస్సులయందెంత యైక్యముండెడిదో మీ రెఱుఁగరా? వా రెఱుఁగరా? భారతదేశ రక్షక దేవత లెఱుఁగరా? వారికి మనకు నిప్పుడు మూషకమార్జాలవైషమ్య మెందులకుఁ గలిగెను? మీ బుద్ధిహీనోపన్యాసముల మూలమునఁ గలిగినది. వారి యస్పృశ్యత తత్‌క్షణము మానుపవలయుననియు, వారిని దేవాలయములోనికి వెంటనే రానీయవలయుననియు, వారితోఁ బం క్తిభోజనము లుత్తరక్షణముననే కానీయవలసిన దనియు మీరు లొడ లొడ యుపన్యాసము లిచ్చినంత మాత్రమున మీరు ద్వంద్వాతీతులైన మహావేదాంతులొక్కసారి యైపోయినా రని వారనుకొనినారా? మీయుపన్యాసములోఁ జీవ యున్నదో, చెత్తయున్నదో వారెఱుఁగుదురా? ఆకస్మికముగ మీ కవతరించిన ప్రేమలలో గుల్ల యున్నదో, గట్టియున్నదో వారు కనిపట్టలే రనియే యనుకొనుచున్నారా? మీరు సమయానుసారవ చోవిభవాభిరాములైన నటకశిఖామణు లని వారు గుర్తెఱుఁగ లేనంత మూఢులా? మీ నవ్వులు దొంగ నవ్వు లని, మీ యేడ్పులు మొసలి యేడ్పు లని, మీరు స్వలాభోద్దేశము చేతనే యీమహామాయానాటక మాడుచున్నా రని తెలిసికొన లేనంత బుద్ధిహీనులా? వా రట్టిబుద్ధి హీనులని మీరు నిశ్చయపఱచుకొన్నట్లు వారు తెలిసికొని మీయందు మరింత యాగ్రహగ్రస్తులయి యున్నా రన్న సంగతి యెఱుఁగరా? స్వరాజ్య వాంఛాసమన్వితు లైన మీరు జాత్యైక్యము కొఱకు వారి నిప్పుడు కూడఁగట్టుకొనుచున్నారు. స్వరాజ్యము వచ్చుట యెన్నఁటికైన సిద్ధించునెడల గేదెకు గేదెయే, దూడకు దూడయే. అప్పుడు తల్లి పిల్ల సంబంధము తెగవలసినదే యని వారికిఁ దోఁపక పోవునా? వారి మాట యెందులకు? మీతలపై రామాయణముఁ బెట్టి మిమ్మడుగు చున్నాను. మీకుఁ బంచములపై స్వలాభచింతాశూన్యమైన యవ్యాజ ప్రేమ మున్నదా? వెఱ్ఱి మొగము వైచికొని యూరకుందు రెందు వలన? మీలో నందఱి కట్టిప్రేమ ముండనక్కఱలేదు. ఒక్కనికైన నున్నదా? వట్టిమాట, లేదు. దేశభక్తులని బిరుదును నెత్తికిఁ గట్టుకొనఁ గలవు గాని బుద్ధున కున్న ప్రేమము హృదయమునఁ బెట్టుకొనఁ గలవా? నీవు రామానుజుఁడ వైనప్పుడు నీ కట్టినిర్వ్యాజప్రేమము కలుగును. ఇఁక మాటలాడక, ఒక్కనిమిషమైన నాలస్య మొనర్పక, కలుపులాగివేసినట్లు, బిరుదు లూడఁదీసికొనుఁడు.

హిందూమహమ్మదీయ సఖ్యమును మీయుపన్యాసములే ప్రధానముగఁ బాడుచేసినవి. మహమ్మదీయులకు మనకు మతవిషయములైన భేదాభిప్రాయము లున్నను సామాన్య ప్రాపంచికవ్యవహారములందెల్లఁ గావలసినంతసఖ్యము చిరకాలమునుండి యుండి యుండెను. మహమ్మదీయచక్రవర్తి యిచ్చిన యీనాములను, రాజ్యములను ననుభవించువా రిప్పటివఱ కెందరున్నారో యెఱుఁగరా? వారి రాజకీయవ్యవహారములందు మనవా రెంత తోడుపడి యుండిరో యెఱుఁగరా? వారికి మనకు నిచ్చిపుచ్చుకొను బాంధవ్యముకూడఁ బూర్వమున నుండలేదా? ఏది యెటులున్నను ప్రత్యక్షవైషమ్య లేశమైన లేకుండఁ బదునాలుగు సంవత్సరముల క్రిందటివఱకు సరళముగ, సౌమ్యముగ, సలక్షణముగ జరిగియుండలేదా? అప్రయత్న

ముగ బాగుగ నున్నస్థితిని బ్రయత్నమునఁ బాడుచేసితిరే? మీరుపన్యాసము లీయకుండునెడల నిట్టియిక్కట్టు తటస్థించియుండునా? ఏకీభావమున నుండినప్పు డుపన్యాసము లెందులకు? మీయుపన్యాసములే సందేహమునకు, విశ్వాసరాహిత్యమునకు, మనస్సులోని మాయకు నిదర్శనములై యుండలేదా? కిక్కురు మనకుండ నూరకుండినయెడల యథాపూర్వకముగ దినములు దొరలిపోయి యుండునే? జాతికి మరింతయైక్యమును సంకల్పించుకొని మీయుపన్యాసముల మూలమునఁ బ్రయత్నించినతరువాతనే జాతి కింతవిభిన్నత కలిగినది; జాతిలో నిన్నివైషమ్యము లేర్పడినవి; ఇన్నికల్లోలములు కలిగినవి. జాతిలో నైక్యమభిమానముచేత, నాదరణముచేత, నన్యోన్యసానుభూతి చేత, ననురాగపూర్వకములైన యాచరణములచేతఁ గలుగునుగాని గొంతుచింపుకొనినందువలన, బల్ల గ్రుద్దినందువలన, గంతులు వైచినందువలనఁ గలుగునా? దేశభక్తులారా! జాతిసర్వాంగకముగఁ జచ్చునంతటి యాపదకు దానిని దెచ్చినారు. ఇప్పుడైన మీయుపన్యాసములకు శాంతిఁ జెప్పెదరా? ఇఁక మాటలాడ మని శపథ మొనర్చుకొనరా? మీ రిఁకఁ బెదవులు గదల్పకుండునెడల మనస్సులలోఁ గలిగిన నలుకులు, తమంత తా మదుకుకొనును. చిత్తమునఁ గలిగిన పుండ్లు తమంత తాము మానును. సన్నిపాతరోగికి నిద్రపట్టినతరువాత దేహము స్వస్థమైనట్లు దేశము సొమ్మసిల్లి రవంత శాంతిపడి, తనంత తానే సుఖస్థితికి రాఁగలదు. మనము చేయవలసినపనియేమి? మనము చేయుచున్నపని యేమి? 'సర్వేజనాస్సుఖినోభవంతు, లోకాస్సమస్తా స్సుఖినో భవం' తని సర్వదా సర్వేశ్వరుని బ్రార్థింపవలసినవారము కామా? ఇంతవిశాల హృదయమైన ప్రార్థన ప్రపంచమున నెచ్చటనైన నున్నదా? మీరట్లు దైవధ్యాన మొనర్చుకొనుచు మాటలాడకుండ నుందురా? ఒక్కటే మాట–రాట్నపుధ్వనితప్ప నోటిమాట భారతదేశమున నీదినమున నుండి వినఁబడఁగూడదు. అట్లు మీరాచరింపఁగలరా? అయ్యయ్యో, ఆచరింపరా? ఆచరింపరా? దేశకర్మ మిఁక నింతే? జాతికర్మ మిఁక నింతే? ఇంతే?''

అని యాయున్మత్తుఁ డేడ్చుచు లేచినాఁడు. 'అయ్యా కూరుచుండు'మని నే నంటిని. 'నాకు నీబలాత్కారమా Rascal, డొక్క చీల్చెదను. జాగ్రత్త'యని యాతఁడు నాచేయి విదల్చుకొని పాఱిపోయినాఁడు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 10. ఆయుర్వేదవైద్యుని యుపన్యాసము

సాక్షి సంఘసభలో రకరకాల విషయాల గురించి—జంఘాలశాస్త్రి అప్పుడప్పుడు కాలాచార్యులు, ఎప్పుడో ఒకసారి వాణీదాసు, బుద్ధిపుట్టి నప్పుడు సాక్షి మాత్రమే ఉపన్యాసాలివ్వడం కాకుండా—ఇతర విషయాలమీద కూడా, ఆయా రంగాలకు చెందినవారి చేత మాట్లాడించడం కూడా వుంది.

ఒక ఆయుర్వేద వైద్యుడు ఈసభలో మాట్లాడుతూ—అయినదానికీ, కానిదానికీ శస్త్రచికిత్సలకు ఎగబడే మన దేశీయుల మూర్ఖత్వాన్ని గట్టిగా విమర్శించాడు.

మల విసర్జన విషయంలో బాధ వున్న వారికి—ఆబాధ తీర్చడానికి ఆముదం వుండగా ఎనీమా అనవసరం. పుప్పి పన్నుకు మూలికావైద్యం వుండగా పన్ను పీకించే పద్ధతి అనవసరం. అలాగే వ్రణాలలోని క్రిముల్ని బయటకులాగే ఓషధులున్నాయి. ముల్లుగుచ్చుకున్న మనిషి కంటిలో రెండు పసరు చుక్కలు వేస్తే, ఎక్కడి ముల్లు అక్కడ బయటపడే వీలుండగా, ముల్లు పీకడానికి కత్తులు, కఠారులూ ఎందుకు? కాలి బెణుకు తక్కువ సర్దుకోవడానికి ఆముద వైద్యం వుండగా, ఆకాలు తొలగించవలసిన స్థితి ఎందులకు తెచ్చుకోవాలి? రాచకురుపు హరించడానికి ఒక మూలిక పస రుంది. ఇంజెక్షనులు, టీకాలు ఎంత అసహజాలు? శస్త్రవైద్యం పనికిరాని వ్రణాలెన్నో వున్నాయి. వాటికి ఆయుర్వేదం మందులున్నాయి. స్త్రీలకున్న మలబద్ధత హరించడానికి మందులున్నాయి. కడుపులో గడ్డలకీ, గుల్మాలకీ, లోపలికి మందు వాడాలి గాని శస్త్రచికిత్స కాదు. శస్త్రచికిత్సవల్ల కార్యనాశ నమే కాని, కారణ నాశనం కాదు. అందువల్ల దేశీయతను నమ్ముకోవాలి. దేశీయతలో పుట్టి, పెరిగి, మరణించడం ఒక్కటే సరైన దారి అని ముగిం చాడు వైద్యుడు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

నేను సభకుఁ బోవునరికే యొక యాయుర్వేద వైద్యుఁ డుపన్యసించుచుండెను. అంతకుముం దేమి చెప్పియుండెనో కాని నేనుసభలోఁ బ్రవేశించినపిమ్మట నాతఁ డిట్లు పలికెను:

''ఆముదముండగా నెనీమా (Enema) యెందులకు? కడుపులో నున్నకల్మషములు ద్రోచివైచుట కది మంచిదా, యిది మంచిదా? అధోమార్గమున నెక్కించిన నీ రేమాత్రము లోని కెక్కఁగలదు? ప్రేగుల చుట్టలోని చిట్టచివర భాగములోఁ గొంతవఱకే యెక్కఁగలదు కాని యంతకుఁ బై కెక్కఁగలదా? అందువలన నచ్చటి కల్మషమే తొలఁగి పోవును గాని పైనున్న ప్రేగులలోని కల్మషముమాట? నోరు స్వాధీనము కాకుండ నున్నప్పుడు, పండ్లు గట్టిగ దగ్గఱఁబడినప్పుడు రెండవ మార్గ ముండనే యున్నది కాని, గిన్నెలకొలఁది కాఫీ త్రాగుటకు, బుడ్ల కొలది సోడాత్రాగుటకు, పుంజీలకొలఁది నారింజపండ్లు మ్రింగుటకు దినములకొలఁదినుండి యుపచారములను జేయువారిని జెడమడ తిట్టుటకు నోరు విచ్చలవి డిగ విశృంఖలముగఁ బనిచేయుచుండఁగ గోఁచిలోపల గొట్టమెందులకు? పోనీ! ఎక్కించితివ య్యా—వసరు పోయినదా—క్రిమిపోయినదా? ఆమము పోయినదా? ముంగిలి తుడిచినంతమా త్రమున నిల్లంతయు శుభ్రపడినదా? అదిగాక జ్వరభేదమువలననేమి, ప్రేఁగులలోని వేడిమి గల నీరే రోగుల కందఱ కుపయోగపరుచుచున్నారే. అందుచేఁ గొందరప్రేవు లుష్ణాధిక్యముచేఁ గుమిలిపోవుచున్నవి—కొందఱప్రేవులు హీనోష్ణతచేఁ బచ్చిచేసి పట్టుపట్టుచు న్నవి. ఉష్ణాధిక్యము చేసిన ప్రేవులనుండి రక్తము పడుచున్నది. పచ్చిచేసిన ప్రేవులలో శూల యారంభమగుచున్నది. కొందఱ కేబాధయు లేక సరిపోవుచున్నది. పోనీ! కొందరైన సుఖముగా నున్నారని సంతోషింతమన్న, వారి బ్రదుకు లెట్లున్నవో చెప్పుదునా? ప్రాతఃకాల మున యథాపూర్వముగ మలమోచనము జరుగదు. ఎప్పుడు జరుగును? చిలుకకొయ్య కెక్కిన సీమ యినుపరేకుడొక్కు గొట్టములోఁ గ్రిందికి దిగవలయును. పంచపాళిలోఁ గ్రాఁగుచున్న నీరు దానిలోఁ బడవలయును. నపుంసకుఁడు పెండ్లాముగదిలోనికిఁ బోయి తొంగిచూచి గిరుక్కున మరలినట్లు గొట్టపుఁగొన యాసనములోనికిఁ బోయి మరలవల యును. అప్పటికిఁ గృతార్థత—అప్పటికి మహేంద్ర పదవి—అప్పటికి సప్తపురుషాంతరములం దలి పెద్దలు తరించుట! ఆహా! ఎంతపనికిమాలిన బ్రదుకు బ్రదుకుచుంటి వయ్యా! ఆరుపైసల యాముదము నీకు, నీయిల్లాలికి, నీకొడుకునకుఁ గూడ సర్వసంవత్సరమువఱకు వచ్చునే! స్వదేశీయమై, సర్వవిధముల నీకు సరిపోవు నాముదమును మాని, మానసనాళధ మని నంటఁగట్టుకొని బ్రదు కడవి యధ్వాన్నము చేసికొంటివే. మూర్ఖా! నిన్నేమి చేయవలయును? పొరుగూరికిఁ బోవలసివచ్చునప్పుడు చెంబుకంటె, గుడ్డలమూట కంటె, బ్రక్కచుట్టకంటె, భోజనపాత్రల దొంతరకంటె, దేవతార్చనపుఁ బెట్టెకంటె నీవిరేచ నపుడొక్కు ముందా?

రామరామా! కొందఱాఁడువారుగూడ నీప్రయోగమున నద్వితీయ లనిపించుకొను చున్నారే! పెండ్లికిఁ బోవునప్పుడు పన్నీటిబుడ్డికంటె నీపాయిఖానాపాత్ర ముఖ్యమైనదే! అయ్యయ్యో! ఆరోగ్యముమాట యటుంపుఁడు. బ్రదుకుమాట యటుంపుఁడు. అన్నిటి కంటె ముఖ్యములైన సిగ్గుబిడియములు బుగ్గియగుచున్నవే! అంతటినుండి పెండ్లిండ్లలో వియ్యపురాలి యలంకారములలో, నాఁడుబిడ్డ కట్నములలో, నీయ మాంగళ్యపుగొట్టము చేర్తురు కాఁబోలు! అల్లుని కెక్కుటకు గుఱ్ఱములతోఁబాటు, బండ్లతోఁ బాటెక్కించుకొను టకు నీబహిర్దేశపుఁ దిత్తిని జేర్తురుకాఁబోలు. మనబుద్ధు లింత పాడగునప్పుడు దేశసౌభా గ్యము తొలఁగిపోయె ననఁగ నాశ్చర్య మేమి? తాను తనది యనునభిమానము పోయినపి మ్మట మోక్షమైన రావలయును, బైత్యమైన రావలయును. మన స్వార్థపరిత్యాగము పదార్థస్వీ

కరణముకొఱ కైనది కావున మన కీరెండవది దాపురించినది. కావున మొదట బాగుచేసికొనవలసినది దేశముకాదు, బుద్ధి వదల్చుకొనవలసిన బానిసతనము దేశసంబంధమైనది కాదు, మనస్సంబంధమైనది. దేశములో నీవు లేవు—నీలో దేశమున్నది.

మఱియొక సంగతి. పుప్పిపటించే బాధపడునపు డేమిచేయుచున్నావు? దంతోద్ఘాటన ప్రవీణుఁ డగు దామోదరన్ దగ్గఱకుఁ బోయి పంటి నూడఁదీయించుకొనుచున్నావా? —పంటిలోఁ బురు గూడఁ దీయింపవలయునా? ప న్నూడఁదీయింపవలయునా? రేపు ముక్కునకు బాధకలిగినయెడల ముక్కూడఁ దీయింతువా? కంటిలోఁ బూవువేసిన యెడలఁ బూవును హరించుట వైద్య మగును గాని కంటిని బెఱుకుట వైద్యమగునా? ఏకోశమున నైన దోష మేదైనఁ జేరునప్పుడు దోషసంహరణ మొనర్చుట తగునుగాని కోశసంహారణ మొనర్చుట తగునా? గోరుచుట్టు వేసినయెడల వ్రేలూడఁదీయవలసినదే! ఇది చికిత్సాక్రమమేనా? ఇది మనుష్యపద్ధతియేనా? మనుష్యపద్ధతిమాట యటుండుఁడు. తోఁకపై నీఁగవ్రాలినయెడల దానిని వదల్చుకొనుటకై కుక్క తోఁకను జెటకాయించును గాని కొఱికివైచుకొనునా? అధమప్రాణిపద్ధతికిఁగూడ వ్యతిరేకమైన యీపద్ధతి మనకెందులకు? పురుగు చేరినదంతమును బెఱికివేయుటే—పూచినవాల్కనుగూడ లాగించుకొనలేకపోయినావా? దంతములోఁ బురుగు నూఁడదీయుట కెన్ని చికిత్సలులేవు? అవి యన్నియు నిరుపయోగము లనియే యెంచితివా? అట్టి చికిత్స లేర్పాటు చేసిన యవతారపురుషులు వెఱ్ఱిముండకొడుకు లనియే యెంచితివా? ఒక్క యోషధిలోని కాకర్షింపఁబడునే! ఎంతమహిమగల యోషధియో యొకసారి పరీక్షించుటకైనను నీకు బుద్ధి పుట్టనప్పుడు నీకు మొదలే బుద్ధిపుట్ట లే దనుకొనవలయును గాని బుద్ధి కొంతకాలముండి తరువాతఁ బోయిన దనుకొనుచున్నావా? వ్రణములలోని క్రిమిజాల మంతయుఁ బైని కట్టినమూలికలవలన వెలుపలికి వచ్చునే? మఱియొక చిత్రము: ఒకని కొడలినిండఁ గుఱుపులు వేసినవి. ఒకవైద్యుఁడు వచ్చి యొకమూలికను దెచ్చి దాని నాతని యొడలికిఁ దగిల్చి బురదనీటిలోఁ బ్రాతిపెట్టెను. రెండుదినముల కామూలిక చచ్చెను. వెంటనే రోగి శరీరమందలి కుఱుపులన్నియు నంతరించెను. శరీరమందలి రక్తములో నున్న యాటవికజ్వరసంబంధమైన క్రిమిసమూహమునుగూడ వనమూలికలు చంపఁగలవు. దినమునకు రెండుసారులు, దినము విడిచి దినము, మూఁడుదినముల కొకసారి వచ్చు చలిజ్వరము లవలీల నుచ్చాటన మొనర్పఁగల మూలికలు మన కుండ, రక్తములోనికి విషమును సూదితో నెక్కించుకొని తపించి తపించి యేలచావునకు సిద్ధమగుదువు? నాడీస్థానమునఁ గట్టిన యోషధివలన నాళమందలి రక్తములోని పురుగు చచ్చుచుండఁగా దంతములోని పురుగుకొఱకు దంతమును గారుచే లాగించుకొంటివా? దంత మూఁడిపోయిన దనియుఁ, దెఱపిని బడితిమనియు సంతోషించుచున్నావేమో కాని యందువరన నీనరములలో నెన్నిరోగములకు బీజము వేయఁబడినదో గ్రహించుకొంటివా? మెదటికిఁ దగిలిన యదటువలన నీకుఁ దలతిరుగుడు రావచ్చును. ఉన్మాదముకూడ రావచ్చును. దృష్టి సున్న కావచ్చును. ముక్కునుండి రక్తస్రావము కలుగవచ్చును. ముఖమునకుఁ బక్షవాతము రావచ్చును. మూర్ఛ రావచ్చును. పన్నూడఁదీసిన యుత్తరక్షణముననే పక్షవాతము వచ్చినవారిని, మూర్ఛవచ్చినవారిని నేను జూచితిని. ఒక్కమూలికతో నిర్మూలన మొందవలసిన పంటిరోగము కొఱకుఁ బ్రాణమున కింత ముప్పు తెచ్చుకొనుట తగునా?

పాశ్చాత్య దేశచక్రవర్తులలో నొక్కనికిఁ గాలిలో ముల్లు గ్రుచ్చుకొనినది. వైద్యులు సూదితోఁ గుట్టినారు; శ్రావణముతో లాగినారు; కత్తితోఁ గోసినారు. ముల్లూడిరాలేదు. క్రమముగా నాభాగమంతయు వాచినది. జ్వరము వచ్చినది. పరాకు పుట్టినది. అస్వస్థత హెచ్చినది. శస్త్రవైద్యులు పరీక్షించి మోఁకాలిచిప్పపై నైదంగుళములవఱకుఁ గాలు ఖండింప వలయు నని సిద్ధాంతీకరించినారు. ఖండించినారు. తత్క్షణమే ధనుర్వాతముతో రోగి చచ్చినాఁడు. ఈసందర్భమునం దెఱుఁగవలసినయంశ మేమనఁగా, ఒక్కయాకుపసరు తెచ్చి రెండు కన్నులలో రెండు చుక్కలు వైచినయెడల శరీరమున నెక్కడ గ్రుచ్చుకొన్న ముల్లయినసరే, యొక్కదినములో నూడిపోవును. అన్నిటికి శస్త్రచికిత్సయేనా? కత్తి, కారు, సూది, తంటసము, అంపమే రోగ నివారకసాధనము లైనప్పు డింక వైద్యశాస్త్ర మంతయు నరేబియా సముద్రమునఁ బాఱవేయవలసినదేకదా? సమగ్రమైన శాస్త్రములేనివా రేమిజేసిన, నెట్లుచేసినఁ జేయుదురుకాక. కలిగియు మనకర్మ మిట్లు కాలిపోవ నేల?

కొంతకాలము క్రిందట నొక్క చక్రవర్తిపుత్త్రుఁడు మనదేశమును జూడవచ్చినాఁడు. గుఱ్ఱ మెక్కుటలోనో, దిగుటలోనో, నడకలోనో, నిద్రలోనో, బంతియాటలోనో, జంటనా ట్యములోనో యాతనికి మోఁకాలు బెణికినది. కాలు వాచినది. సలుపు, పోటు హెచ్చినది. రోగి కూరుచుండలేఁడు, పండుకొనలేఁడు; ప్రక్క కొత్తగిల్ల లేఁడు. రేయుంబవళ్లు కురరివలెఁ గూయుచున్నాఁడు. నిద్రపట్టుటకు మందు లిచ్చినారు. నూదు లెక్కించినారు. పై బాధ హరించుటకుఁ బట్లు వేసినారు. కాపులు కాచినారు. జెలగ లంటించినారు. మంచునీటి తుంపరలు తగిల్చినారు. ఊహుఁ. గాఢముగ యోజించుచున్నారు. కాలు ఖండింపవలసిన దని కట్టకడకు కాంగ్రెసులో సిద్ధాంతీకరించినారు. రోగి యేమి గతిలేని వాఁడా? సామా న్యుఁడా? అయ్యయ్యో! మహాచక్రవర్తి జ్యేష్ఠపుత్త్రుఁడే! చక్రవర్తి మూఁడువేలమైళ్ల దూరములో నున్నాఁడే! ఆతఁ డంగీకరింపకుండ నీతని కాలు కొట్టివేయుట సాధ్యమగునా? ఆయనకుఁ దంత్రీ మూలమునఁ దెలియఁబఱిచినారు. ఇరువదినాల్గుగంట లుపేక్షించినయెడల కాలు ఖండించినను రోగి బ్రదుకఁ డని Concensus of medical opinion (వైద్యుల యేకగ్రీవాభి ప్రాయము) కలిగినది. రోగి రోగి యని వారందు రెందులకు? రోగ మెవరికి? కాలు బెణుకుట రోగమా? ఇదేమి జ్వరమా? జలోదరమా? అతిమూత్రమా? అండవాతమా? నాపిండ కూడు? రోగ మెవరికి? అందఱు శస్త్రచికిత్సకులు చేరి రోగము శాసించినప్పుడు కా దనఁగలవా రెవ్వరు? అన్ని పరీక్షలలో నారితేఱినవారామాత్రమైనఁ దెలిసికొనలే రని చెప్పుట విద్యాద్రోహము కాదా? అందులో నొకరా, ఇద్దఱా-ప్రాణమున కొక్కఁడుచొప్పున నైదుగురు కలసి రాద్ధాంత మొనర్చినపుడు బుద్ధిమంతులు మొద్దులాగున నుండవలసినదే కాని పెదవులు కదల్పఁదగునా? చరణఖండనమునకై చక్రవర్తిగారి యంగీకారముకొఱకు శస్త్రవైద్యులు క్షణ మొక్క యుగముగా నిరీక్షించుచున్నారు. ఇంతలో నొకదేశీయమహారాజునొద్ద నుండి యొవైద్యుఁడు వచ్చెను. ఆతఁడు కుమ్మరి. వయస్సుమీరిన వాఁడు. మహారాజలేఖతో శస్త్రవైద్యుల నాతండు దర్శించెను. ఇతఁడు Quack అని యొక వైద్యుఁ డనెను. ఇతఁడు ''ఫూలు'' అని మరియొకఁ డనియెను. నీయోగ్యతాపత్త్రములు (Certificates) చూపుమని మఱియొకఁ డనియెను. మహారాజులేఖను మన్నింపవలదా యని మఱియొకఁడు సందేహించుచుఁ బలికెను. మహారా జైన సరే, మహారాజాధిరా జైన సరే, నల్లని భారతీయుని నమ్మఁగూడ దను నర్థమిచ్చునట్లు మరియొకవైద్యుఁడు తల యడ్డముగ నూఁపెను.

''వైద్యులారా! మీరింత గుబ్బెటలు పడనక్కఱలేదు. నేను లోపలి కేమియు మందీయను. మీ చక్రవర్తిపుత్త్రు నొక్కసారి చూచెదను. అనుజ్ఞ నీయవలయు''నని కుమ్మరివైద్యుఁడు పలికెను. ఈవైద్యునికి రోగిని చూపుటా మానుటా యనునంగతినిగూర్చి యైదుగురుగూడఁ గొంతసేపు పూర్వపక్షరాద్ధాంతము లొనర్చుకొనిరి. ''హృదయము చాల దుర్బలముగా నున్నది. ఇట్టిసమయములోఁ గ్రొత్తవానిని చూచుట వలన నందులో నల్లని 'బ్లాక్ హెడ్'ను జూచుటవలన, రోగికిఁ గొంత (Shock) యదటు కలుగవచ్చును. అందువలన హృదయ మాకస్మికముగ నాఁగిపోవచ్చును'' అని యొకఁడు పలికెను. ''రోగి మొగమును జూడవలసినపని యేమున్నది? మొగమున కెదుట నొకదిట్టమైన తెరయడ్డు కట్టుదము. బాధ కాలిమీఁదఁ గావునఁ దెర కట్టవలదు. అది గాక హృదయము మిక్కిలి దుర్బలముగా లేదు. రోగితోఁ జెప్పియే యాతని నందుకు ''ప్రిపేర్'' (సిద్ధము) చేసియె యాతనికి దర్శన మిప్పింపవచ్చునని మఱియొకఁడు తన యభిప్రాయమును వెలిపుచ్చెను. ''ఎందులకైన మంచిది, "Strophanthus" strong dose (పెద్దమోతాదు) చేసి యిచ్చియే దర్శనము చేయింపవచ్చు''నని యింకొకఁ డనియెను. ''ఆమాత్రపు టదటున కాఁగలే నివాఁడు పెద్ద 'ఆపరేషను' కెట్టాగునా యని నాకుఁ జాలభయముగా నున్నది. I have my own serious doubts'' అని మఱియొకఁడు గుర్రపుమొగమంతకోలనైన మొగము కలవాఁడు బిఱ్ఱబిగియుచు దుమదుమలాడుచుఁ బలికెను. ఏలాగైన నేమి, తుట్టతుదకుఁ గుమ్మరిని లోనికిఁ దీసికొనిపోయిరి. కుమ్మరి కొంతసేపు చూచి చక్రవర్తిపుత్రుని మోఁకాలిపైఁ జేయివైచుట కనుజ్ఞనిమ్మనెను. No No (నొ నొ) యని తలకు రెండేసి ''నోల'' చొప్పునఁ బది నో లొక్కసారి రావణాసురు నుండివలె బయలువెడలినవి. మోఁకాలిపై నీఁగ వ్రాలిననైన సహింపలేఁడు కావున వీలు కాదని యందరు చెప్పిరి. మరేమియుఁ దొందరలేదు –బాధ తగ్గింతు నని కుమ్మరి యావైద్యులతోఁ జెప్పెను. చేతులు పరీక్షించి ''పర్మాంగనేట్ ఆఫ్ పొటాషు''తో నాతనిచేతులు గడిగించి, తుడిచి, నిప్పుసెగను గాపించి, తుదకు మోఁకాలిని స్పృశించుట కనుజ్ఞ నిడిరి. చక్రవర్తి పుత్రుని మోఁకాలిపైఁ గుమ్మరి చేయి వైచి యంటియంటనట్లు కొంతసేపు రాచెను. చక్రవర్తిపుత్రుఁడు దూఁ యనలేదు. ఆఁ యనలేదు. ఉహూఁ అనలేదు. ఆహా! పిల్ల యేడ్పునకుఁ దల్లి జోకొట్టెట్టిదో బెణుకునొప్పికిఁ గుమ్మరిపట్ట ట్టిది. అట్లాతఁడు రెండునిముసములు రాచి జేబులో దాఁచిన యొక తెల్లనిసీసా పైకిఁ దీసెను. నాన్ సెన్సు వాటీజ్ దట్ (బుద్ధిహీనుఁడా! అదియేమి) అని వైద్యులు కుమ్మరిని గద్దించిరి. ''ఇది యాముదము. దీనితో రవంతసేపు తోమెద'' నని కుమ్మరి బదులు చెప్పెను. ''అది Perchloride of mercury వంటిPoison కావచ్చును. కెమికల్ యెగ్జామినేషను ''చేసినఁగాని వీలులే'' దని ఘంటాపదముగ వైద్యులు సెలవిచ్చి యట్లు చేసిరి. అంత నాతఁ డాముదమును మోఁకాలికి రాచి, నిమ్మళముగ రాచి రాచి, యద నెఱిఁగి కీలెఱిఁగి, మార్దవముతో బింకముగ నొక్కనొక్కు నొక్కెను. దానితో టక్కుమని ధ్వనియైనది. అంత వైద్యులు భయభ్రాంతులై మతులుచెడి కుమ్మరిని జేతులు పట్టికొని యావలికి లాగిరి. పదునైదు దినములనుండి నిద్ర నెఱుఁగని యాతఁడు గురుకపట్టి గాఢముగ నిద్రించుచున్నాఁడు. ఆతనినాడి నొకరు చూచుచున్నారు. హృదయపరీక్ష నొకరు చేయుచున్నారు. గుల్లుచూచి న్యూమోనియా యేమో యని యొకఁడు సందేహపడినాఁడు. ఎందులకైన మంచిది రోగిలేచువఱ కీకుమ్మరిని గారాగృహ మందుంచుట మంచిదని వైద్యులు తీర్మానించినారు. మఱునాఁటికే చక్రవర్తి లేచి

తిరుగాఁడ మొదలిడినాఁడు. మహారాజు ప్రాణముపై మహారాజు వైద్యుల కందఱ కంతయభి మానము, నంతయాదర ముండవలసినదే. కాని చికిత్సా పద్ధతియం దంతకంటె తెలివిమాత్ర ముండవలయును.

చిట్టచివరకుఁ దేమనఁగా, చీటికి మాటికి శస్త్రచికిత్స చేయఁదగదు. శస్త్రచికిత్సాసా ధనము లాయుర్వేదమునఁ దక్కువగానున్న వని దాని నధిక్షేపించుట పరులయాచారమై యున్నది. అది దానికలంకము కాదు—అలంకారము. అది దానితప్పు కాదు—ఒప్పు. అది దానియధిక్షేపణము కాదు—అభినందనము. శస్త్రవైద్య మంతయావశ్యకము కాదనియే యాయుర్వేదాభిప్రాయము. ఏవో కొన్ని జాతి వ్రణములకుమాత్రమే యది యావశ్యకము. మిగిలిన వ్రణములన్నియు నోషధీమాహాత్మ్యముననే మాన్పఁదగును. అంగసంఘాతములో నొక్కయంగము చెడిపోయి మిగిలిన యంగములఁ బాడుచేయు ననుభయము కలిగినప్పుడు శస్త్రవైద్య మావశ్యకము. రాచపుంటికిఁ గూడ శస్త్రవైద్య మక్కఱలేదు. శస్త్రవైద్యమునఁ గాని యది లొంగదను నభిప్రాయము సమంజసము కాదు. దాని కొక్కచిత్రమైనచికిత్సా పద్ధతి కలదు. ఆకుఱుపుసంబంధమైన కదు మెంతవఱకు వ్యాపించునో యంతవఱకుఁ జుట్టు నొకమూలికపసరు రాయుదురు. కొన్నిగంటలైన పిమ్మట గోడమీఁదనుండి పిడుక యూడిన ట్లాభాగ మంతయు నొక్కదిమ్మలాగుననుండి పడిపోవును. పిమ్మట నామూలి కయే నూనెలోఁ గాచి యావ్రణమునకుఁ బూయుచుండవలయును. కొలఁదిదినములలో మాను పట్టి మచ్చపడును. ఇది విచిత్రమైన చికిత్సాక్రమము. ఇట్లు చేయునాతఁడు జోలార్ పేటలో నున్నాఁడు.

శాస్త్రవైద్యము కోటి కొక్కమాఱు విధిలేకుండునప్పుడు మాత్రమే జరిగింపవల సియుండఁగా నిప్పుడు దాదాపుగా నన్నిరోగముల కదియే యవలంబించుచున్నారు. ఇంజెక్షను శస్త్రవైద్యము కాదా? నెత్తుటిలోనికిఁ బోయినది సూది యైన నేమి, కత్తి యైన నేమి? మందేమి, విందేమి—నోటిగుండఁ బోవవలసినదే. నోటిద్రవములతోఁ గలసి పదనై పరిపక్వమై యుదరకోశములోనికిఁ బోవలసినదే. అచ్చట వివిధము లగుజాఠ రరసములతో మేళన మొంది రక్తములోఁ జేరి యన్ని కోశములందు సహజమై సంచలన మొంది సౌఖ్య మీయవలసినదే—ఈక్రమమావస్థలలో మందున కేలోపము కలిగినను నది సహజమైన గుణ మీయదు. భగవంతుఁ డేర్పాటుచేసిన క్రమ మది. దానికి వ్యతిరేక మగుపద్ధతి యసహజము కావున ననర్థము, అనుచితము. తాత్కాలికముగ ఇంజెక్షనువలనఁ గొంత గుణ మగపడినను నది ప్రబలాపాయమునకు ముందు ముందు కారణము కాకమానదు. ఇంజెక్షనువలని యపాయము లిప్పటి పాశ్చాత్యశాస్త్రజ్ఞులు కొందరుకనిపెట్టి యాచికిత్సాపద్ధతికి నిరు త్సాహ మిచ్చుచున్నారు. మనూరిటీకాలుమాత్రము? వానియందు జనుల కెంతగౌరవ ముండెను? ఎంతనమ్మక ముండెను? పాశ్చాత్యులలోనే టీకాలు ప్రాణాపాయకరము లని వాదించు నొకతెగవారు బయలుదేరినారా, లేదా? అసహజములైన పద్ధతు లన్నియు నప్పుడో, యటుపిమ్మటనో యపాయకరములే; అనువినాశకము—అందుచే ననవలంబనీయ ములే. నిద్రకింజెక్షనా? నిద్ర కింజెక్షను తీసికొన్నవారికి రక్తమందసహజమైన వేఁడిమి బయలుదేఱి పిత్తాధిక్య మొనరించి, కార్జ్యమును బాడుచేసి యెంత శాశ్వతమైన యపకృతి నాచరించినదో యెఱుఁగుదువా? ప్రజల కన్నివిషయములందుఁగూడ శాంతి, యోపిక,

యోజనము, దూరదృష్టి పూర్వవస్త్వభిమానము తొలఁగిపోవుటచేతనే వారు తాత్కాలిక సుఖముకై దేవులాడి దేహమనస్తత్త్వములు శాశ్వతముగాఁ బాడుచేసికొనుచున్నారు.

నూదిపోటే తత్త్వవిరోధ మని, తప్పని, తగ దని చెప్పినప్పుడు కత్తికోఁత యెట్టిదో వేఱ చెప్పవలయునా? కొన్ని కొన్ని వ్రణములకుఁ దప్పనిసరి యైనప్పుడు శస్త్రచికిత్స యుండనే యున్నది. అన్ని వ్రణములకు మాత్రము శస్త్రచికిత్స సాధ్యమగునా? గొంతుక లోని వ్రణముమాట యేమి? అది కంటికి దొరకునా? కత్తి కందునా? వ్రేలికందునా? పట్టికి లొంగునా? ఇట్టివ్రణములను శస్త్రసంపర్కము లేకుండ బాగుచేసినవా రెందఱులేరు? రోగికంటికిఁ గ్రంతలు గట్టిగ గట్టించి పాదరసపుఁ బొడి నాతనిచే లోనికిఁ బీల్పింపఁజేసి వ్రణమును సులువుగా బాగుచేసినవారు వ్రణవైద్యులుకారా? కత్తితోఁ గోసినవాఁడే శస్త్రచి కిత్సకుఁడా? శస్త్రవైద్యమున సంపూర్ణప్రజ్ఞ నొందిన పాశ్చాత్యులు నారకుఱుపున కేమి చేయఁగలరు? కత్తితోఁ, గోయఁగలరా? చిమ్మటతో లాగఁ గలరా? పరిపక్వదశ కైనఁ బట్టువేయఁ గలరా? అదికూడ నక్కఱలేదు. కురుపుస్థాన మేదో నిర్ణయింపఁగలరా? ఏమి చేయఁగలరు? రోగి మాసములకొలఁదిఁ గోండ్రింపవలసినదే! లోనుండి నిమ్మళముగ వచ్చునారను జిన్నపుల్లకుఁ జుట్టుకొని భద్రముగఁ బాట్లు పడవలసినదే? త్రాడు తెగిన యెడలఁ దనువంతయు నార ప్రాకవలసినదే? నరలోకానుభవము నరలోకమున నొందవలసి నదే? దీనికిఁ జికిత్స లేనేలేదా? లేకేమి? గురివెంద గింజయెత్తుగల యొకమందు నరఁటి పండులోఁ బెట్టి యేడుదినము లిచ్చిన యెడల నార యంతయు నొక్కసారి యూడి యీవలఁ బడిపోవును. ఏండ్ల కేం ఙ్లేడ్పించెడునట్టి దేడుపూఁటలలో సంపూర్ణముగ బాగగును. విచిత్రమైన యోషధికాదా? రసమా, విషమా, గంధకమా, పాషాణమా? ఏమియుఁగాదె! కంబము గిద్దలూరు మారికాపురము నంద్యాల బళ్లారి హుబ్లి ఆదోని మొదలైన తావులందే కాక యుత్తరదేశ మందీ కుఱుపు బాధ పడువా రనేకు లున్నట్లు వినుచున్నాము.

కావునఁ జెప్పఁబోవున దేమనఁగా?—శస్త్రవైద్యము పనికిరాని వ్రణము లెన్నివిధములై నవో యున్నవి. వ్రణములకే దానిపని యక్కఱకు రానప్పు డితరరోగములకు శస్త్రచికిత్స నాచరించుట హాస్యాస్పదము కాదా? జలోదరమునకు శస్త్రచికిత్సయెందులకు? కాళుల కుబ్బు కలిగినప్పుడు, మొగమున కుబ్బు కలిగినప్పుడు రంధ్రము పొడిచి నీరు తీయుచు న్నారా? మందిచ్చి యానీటిని హరింపఁజేయు చుండునప్పుడు జలోదరమునకు శస్త్రచి కిత్స యెందులకు? నీరొకసారి తీసివేసినప్పుడు రోగి కర్మముచాలక జీవచ్ఛవమువలె బ్రదికియున్నను మూఁడవసారి చచ్చుట ముమ్మాటికి నిశ్చయము కాదా? ఈరోగమున కనుపమానములైన యాయుర్వేదౌషధము లుండఁగా వానిని సేవింప నొల్లకపోవుట జీవింపనొ ల్లకపోవుటకంటె భిన్నమా?

స్త్రీల కందఱకుఁ బ్రధానముగ మన్నవ్యాధి మలబద్ధత. గృహిణీ ధర్మమును యథావిధిగ నిర్వర్తించుటకైరేయుంబవళ్లింటిలోనే యుండి మంచిగాలి వెల్తురులేక, తగినవ్యా యామములేక, వేళపట్ల భోజనము లేక పచనాదిక్రియములందుఁ దడిగుడ్డలు కట్టుకొనినఁగాని పనికి జరుగుపాటు లేక, పిల్లలయేడ్పులతో రాత్రి నిద్రలేక పడుచున్న బాధలవలన మొట్టమొదట మలబద్ధత యారంభమై యదియే మందాగ్నిగఁ బరిణమించును. అడ్డబాస యున్నయాఁడు దిప్పు డెట్లు లేదో యజీర్తి లేని యాఁడు దట్లు లేదు. మొగమునకు మెరుఁగు

రాచికొనుటయందు వీరి కున్న శ్రద్ధలో సగమైన మందాగ్నిని గుదుర్చుకొనుటలో వీరి కున్నయెడల వీరి కొంటిపూఁటసాపాటు లుండునా? భర్తల కణాబిళ్లలపై సంతకము లుండునా? బిడ్డల కూసరపొట్టలు సుద్దకట్టు లుండునా? అగ్నిమాంద్యమున కాయుర్వేదౌష ధములు సేవింపలేక, యథావిధిగాఁ బథ్యముసేయలేక, జిహ్వాచాపల్యము నడఁచుకొనలేక, యంతకంతకు రోగవృద్ధి చేసికొనుచున్నారు. మన మందులు మంచివి కా వని మహర్షులను దిట్టుచున్నారు. ఆసుపత్రులకుఁ బోయి యానీ రీనీరు త్రాగుచున్నారు. దొరసానులచేఁ బరీక్ష చేయించుకొనుచున్నారు. వారిచేఁ గడుపు కోయించుకొనుచున్నారు. మరణోన్ముఖలై బిడ్డలపుణ్యమున మరల బ్రదుకుచున్నారు. మందాగ్ని తగ్గినదా? దేహమునకుఁ బాటవము తగ్గినది. నరములలో శక్తితగ్గినది. మొగములోఁ దేజస్సు తగ్గినది. కంటికి దృష్టి తగ్గినది. మనస్సులో నుత్సాహము తగ్గినది. బ్రదుకునం దపేక్ష తగ్గినది. అంతేకాని మందాగ్ని తగ్గులేదు! జిలజిల మని జిల్లుమని జాఠరరసములు కడుపులోని కూరుట లోనికిఁ దీసికొన్న రసాయనమువలనను, గల్పముల వలనను గలుగవలయును గాని కత్తికోఁతవలనఁ గలుగునా? భగవంతుని నిర్మాణము ననుసరించి కడు పెట్లున్నదో దాని నట్లే యుండనీయవలయును గాని దానిని మామిడికాయతరిగినట్లు తరిగితరిగి కుట్టి దానిని గురూపను జేసినతరువాత నది సహజమైనపని చేయఁగలదా? భగవంతుఁ డేర్పఱచిన సంచలనము దాని కిప్పుడు చెడినదా లేదా? లోని యాహారమును నొక్కఁగలశక్తి, నలుపఁగల శక్తి, గిరగిర త్రిప్పఁగలశక్తి, ముందునకుఁ ద్రోయఁ గలశక్తి కత్తివ్రేటు తిని కుట్టుపడిన కడుపునకు దైవనం కల్పమున నుండిన ట్లుండుట కవకాశ మున్నదా? పంటికుసి (దంతకుసి) కత్తిచేఁ గోయించుకొనుటచే దౌడపై నరయంగుళము లొట్ట యున్నవాఁడు సెనగలు నీయంత విశృంఖలముగ నమలఁ గలఁడా? ఏయవయవమునకుఁ గత్తికోఁత కలిగినదో యాయవయవములోఁ దీఱనిలోపము చేరిన దన్నమాట. మూలశంకరోగమునకు శస్త్రచికిత్స చేయించుకొన్నవాని కాసనరం ధ్రము మునుపటికంటె శాశ్వతముగాఁ దగ్గినదా లేదా? గంటల కొలఁది వీరు పెరళ్లలోఁ గూరుచుండి విరేచనము తెమలకపోవుటచేత, నెంతకు సంతుష్టి లేకపోవుటచేత బ్రదు కెల్ల భ్రష్టమైనదని యేడ్చుచున్నారా లేదా? మూలశంక నిర్మూలన మైనయెడల నీయేడుపులు గణింపవలసిన పని లేదు. పోయినదా? ఆ. సొమ్ము–సుఖమొందుదు మనునాశ–అంతేకాని యది పోవులేదు? తిరిగి పిలుకబయలు దేరుచున్నదే. గులాబికొమ్మ మొదలంటఁ గత్తిరించి తిమి. తిరుగ నంకురించినదా లేదా? మొవ్వులోని కనఁటెని నఱకి వైచితిమి–తిరిగి మొలకెత్తి నదా లేదా? ''కాటరైజు'' (కాల్చుట) చేసితిమికాన నింకరాదని వైద్యులు చెప్పినమాట నమ్మవలదు. భూమిని గాల్చివైచినను జికిలింత మొలవలేదా? చీఁపురుమొక్క తలయెత్త లేదా? కాల్చుటచేత మరింత శీఘ్రముగ, మఱింత యెత్తుగ నంకురించినది. అటులే కడుపు కోయుటచేతనే యజీర్తి మఱింత వృద్ధియగుచున్నది.

కడుపులో గుల్మములు, గడ్డలు మొదలగునవి యన్నియు లోనికౌషధమును తీసికొని కరఁగించుకొని నిర్మూలించుకొనఁ దగినవేకాని కత్తిచేఁ గోయించుకొనఁదగినవి కావు. తాత్కాలిక మగుదోషమే కత్తి నివారింపఁగలదు కాని దోషకారణమును నాశ మొనర్పఁగలదా? కారణమును గనుఁగొని దానిని భేదించినయెడలఁ గార్యముఁ నాశన మగును గాని కార్యమును దొలఁగించినయెడలఁ గారణము నశింపఁగలదా? చింతచెట్టును జంపఁ దలఁచినవాఁడు తల్లివేరు తెగవ్రేయవలయును గాని చింతాకు దూయునా? ఈసందర్భమున నొక్క సంగతిమాత్రము చెప్పి విరమింతును.

జ్వర మనునది మఱియొక వ్యాధికి లక్షణము కాని యది ప్రత్యేక వ్యాధి కాదు. అజీర్తిచేఁ, బసరుచే, వాముముచే, బడలికచే, నింక ననేక కారణములచే జ్వరము రావచ్చును. ఆహారనిద్రావ్యత్యస్తపరిస్థితులచేఁ గలిగిన వాతపిత్తశ్లేష్మదోషములవలనను, వాని సంయోగము లవలనను గలిగిన జ్వరములుమాత్రమే చికిత్సార్హములు జ్వరము ప్రధానవ్యాధి కాదు. కావునఁ బ్రధానవ్యాధి యేదో కనిపట్టి దానికొఱకు మందీయవలసినదే కాని జ్వరము తగ్గించుట కెన్నఁడును మందీయఁదగదు. జ్వరమునకు మనము తఱచుగా శీతాంకుశరసము, ఆనంద భైరవి, స్వచ్ఛన్నభైరవి, వసంత మాలిని, వైష్ణవీరసము, కాకకూటము, వాతరాక్షసము మొదలగు నౌషధములు వాడుదుము. అన్నియుఁ గూడ నన్నిజాతులజ్వరములకుఁ బూర్వులే శాశ్వతములైన (Prescriptions)గా నేర్పాటుచేసి యుండిరి. శుద్ధపిత్తజ్వరమున కొకటి. శుద్ధశ్లేష్మజ్వరమున కొక్కటి. శుద్ధవాతజ్వరమునకొక్కటి. శీతపిత్తజ్వరమున కొక్కటి. శ్లేష్మపిత్తజ్వరమున కొక్కటి. శ్లేష్మవాతజ్వరమున కొక్కటి. ఈకూడికలలోఁ గలుగునవాంతర భేదములకు మరికొన్ని మహర్షులు నియమించిరి. ఇవి జ్వరౌషధము లన్నమాటయే కాని జ్వరము దగ్గించున వెంతమాత్రమునుగావు. జ్వర కారణములగు దోషములను హరించును. వీనిలో శుద్ధిచేసిన నాభికలసిన మందులు గొన్నియున్నవి. అవి మాత్రము జ్వరితుని దేహమునుండి రవంత చెమటను వెలువడఁజేయును. ఆస్పిరిన్ ఫినాసిటెన్ మొదలగు మందులు వాడఁదగదు. ఆమందులు తఱచుగ నిచ్చి జ్వరము చప్పున జారిపోవు దుష్టస్వభావమును దత్త్వమునకు ముప్పుఁగూడదు. అదియెంత ముప్పునకైనఁ గారణము. వానివలన హృదయకోశము బలహీన మగును. రక్తములో వేఁడి తగ్గిపోవును. నరములకుఁ బటుత్వము క్షయించును. ఆనంద భైరవ్యాదిరసములు హృదయబలమును గాపాడుచు, రక్తోష్ణతను రక్షించుచు, నరములకు వాతదోషము రానీయకుండ దోషకారణ మును దొలగించి జ్వరవిముక్తి చేయును.

పర్యవసాన మేమనఁగా:—శస్త్రచికిత్సవలనఁ గార్యనాశనమే కాని కారణనాశన మెన్నఁడుఁ గాదు. కారణనాశనమున కౌషధసేవ కంటె వేరుమార్గము లేదు. అవసరానుసార ముగ నన్నిచికిత్సలాయుర్వేదమున నున్నవి. మీకుఁ జదువుకొనుట కోపిక యుండవల యును; తెలిసికొనుటకు బుద్ధి యుండవలయును; ఆచరించుటకు దీక్ష యుండవలయును. అన్ని యునుండియు నేమియు లేన ట్లేదుప్రదేశము ప్రపంచమందిది యొకటియే. శ్రుతు లున్నవి; స్మృతు లున్నవి; శాస్త్రములున్నవి; పురాణము లున్నవి; సమస్త కళ లున్నవి; కాని మనది యను నభిమానము మాత్ర మింతవరకుఁ బూర్తిగ కలుగలేదు. ఇప్పు డిప్పు డేదో మాఱువడి దేశకాలములందుఁ గలిగినట్లు కానఁబడుచున్నది; కావునఁ జెప్పుచు న్నాను. దేశీయదేవతల నారాధింపుడు; దేశీయర్షులను బూజింపుఁడు; దేశీయ గ్రంథములను జదువుఁడు; దేశీయకళ లభ్యసింపుఁడు; దేశీయ కర్మముల నాచరింపుడు; దేశీయతలోఁ బుట్టి, దేశీయతలోఁ బెరిఁగి దేశీయతలో మృతినొందుఁడు.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 11. సభావ్యాపారములు

సాక్షి సంఘానికి వచ్చే ఉత్తరాలు చదివి వినిపించడంగాని లేక తమ సంఘానికి సంబంధించిన లెక్కాడొక్కాలు, సాధక బాధకాలు చర్చించు కోవడం రెండు నెల్లకో మూడు నెల్లకో ఒకసారి అలవాటే.

ఈసారి రెండు ఉత్తరాలు చర్చకు వచ్చాయి. మొదటి ఉత్తరం బళ్లారి జిల్లా ఆనెగొంది నుంచి—సి. బాలనాగమ్మ అనే స్త్రీ సాక్షిసంఘంలో సభ్యత్వం కోరుతూ రాసినది. చేర్చుకోతగునా? తగదా? అని వాణీదాసు, కాలాచార్యులు, జంఘాలశాస్త్రి చర్చించారు. చివరికి సాక్షి నిర్ణయానుసారం ఆమెను సభ్యురాలిగా జేర్చుకోవడానికే నిర్ణయించారు. స్త్రీ అనేక రంగాలలో పురోగమిస్తున్న దృష్ట్యా ఈనిర్ణయాన్ని జంఘాలశాస్త్రి సమర్థించాడు.

రెండో ఉత్తరం గంజాం జిల్లా ఉర్లాం గ్రామం నుంచి ఒక 'సత్యవాది' వ్రాశాడు.

చిత్రలేఖనంలో కొందరు లేఖకులు స్త్రీలను అవమానపరిచే విధంగా రచిస్తున్నారనే విమర్శను ప్రస్తావించాడు. పురుష చిత్రకారులే కాక, మహిళా చిత్రకారులు కూడా కొందరు ఈదారినే నడుస్తున్నారని హెచ్చరించాడు. ఆపైన కవుల వర్ణనల ప్రస్తావన తెచ్చి—వారు ఎలాగ తమ కావ్యాలలో స్త్రీల అంగాగ వర్ణనలు చేశారో చెప్పి, వారు చిత్రకారులకంటె ఘోరమైన దండనకు అర్హులని గర్హించాడు. అటువంటి వారు తెలుగు కవులలోనే కాదు; సంస్కృత కవులలో కూడా వున్నారని జ్ఞాపకం చేశాడు. ఇంగ్లీషు భాషలో కూడా ఈధోరణి రచనల్ని ఉటంకించాడు.

జంఘాలశాస్త్రి ఈవిమర్శకు జవాబు చెపుతూ—కవుల ప్రస్తావన చేసినప్పుడు చెపుదామనుకున్నాననీ ఈలేఖకుడు తన పని తేలిక చేశాడనీ అభినందించాడు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

సోదరులారా! సభావ్యాపారములు రెండుమాసములనుండి చూచుకొనుటయే లేదు. సాక్షిసంఘముపేర నిదివరకు వచ్చినలేఖలలో ముఖ్యములైనవానిని జదివెదను.

సాక్షికి–నమస్కారములు–మీసంఘమున నిదివఱ కైదుగురుండెడివారు. ఇప్పుడు మీతో నల్వురే యున్నారు. అయిదవవారి నెవ్వరి నైనఁ జేర్చుకొనుట కుద్దేశ మున్నదా? అట్టియుద్దేశము మీ కుండునెడల స్త్రీని జేర్చుకొందురా? ఆస్త్రీ సత్యపుర గ్రామవాసినియే యైయుండవలయునా? అక్కఱలేదా? ఈసంగతులు నాకుఁదెలుపఁగోరెదను.

చిత్తగింపవలయును, విధేయురాలు,
సి. బాలనాగమ్మ,
ఆనెగొంది, కమలాపురము పోష్టు, బళ్లారి జిల్లా.

సోదరులారా! ఈలేఖను వింటిరా? ఈసోదరీమణి మన యుపన్యాసములను విని సంతోషించుటయే కాక, మనసంఘములో నొక సభ్యురాలై మనసంఘోద్దేశ నిర్వహణకార్యమునందు మనకు సహాయయై శ్రమపడు చుండుట కుత్సహించుచున్నట్లు తోఁచుచున్నది. బళ్లారి జిల్లాలోనున్న హేతువుచేత నెప్పుడో కాని మన కామె దర్శనమిచ్చుట కవకాశము లేనిదైనను, దనయభిప్రాయములను దఱచుగ మన కామె పంపవచ్చును. అందుచేత నామెను జేర్చుకొనుటయే నాయభిప్రాయము, వాణీదాసా! నీ వే మందువు?

వాణీ–స్త్రీని సభ్యురాలిఁగఁ జేసికొనవచ్చు నని మనసంఘశాసనములలో నున్నదా?

జంఘా–చేర్చుకొనఁగూడ దని లేదు.

వాణీ–స్త్రీని గూర్చిన ప్రసక్తియే లేనప్పుడు స్త్రీనిఁ జేర్చుకొనుట కవకాశ ముండదు.

జంఘా–సభాశాసనములకు విరుద్ధము కాని పనిని జేయుట తప్పుకాదు.

వాణీ–సభాశాసనములు చెప్పనిపని చేయుట తప్పు.

జంఘా–కవీ! మొండివాదము చేయకుము. మనసోదరీమణు లిప్పుడు మిగుల మున్నతదశలలోనికి వచ్చుచున్నారు. విదుషీమణు లగుచున్నారు; గాయనీమణు లగుచున్నారు; కవయిత్రు లగుచున్నారు; చిత్రలేఖిక లగుచున్నారు. వక్తృత్వమున వారిని మించిన వారు లేరనిపించుకొను చున్నారు. శాసనసభలలో, సంఘసంస్కరణసభలలో, మతవిషయక సభలలో, న్యాయసభలలో, రాజకీయసభలలో సభ్యురాండ్రై లోలాక్షీమణు లెందఱు లోకకల్యాణమునకుఁ దోడుపడుచున్నారో నీవెఱుఁగుదువా? స్త్రీలు సర్వసభలలో సభ్యురాండ్రుగ నుండుట సభలకే కాక దేశమునకుఁగూడ నలంకారము. అందుచే నామె కోరునెడలఁ జేర్చుకొనుటయే నాయభిప్రాయము.

వాణీ–నాయభిప్రాయ మేదో చెప్పితిని. మార్చుకొనవలసిన కారణము నాకగపడలేదు.

జంఘా–కాలాచారీ! నీయభిప్రాయ మేమి?

కాలా–నాయభిప్రాయమున కేమున్నది? నాకు స్త్రీయైన నొకటే, పురుషుఁడైన నొక్కటే, ఆరెంటిలో భేదమేదో నామనస్సున కెక్కలేదు. వేదాంతశాస్త్ర మాత్మకు లింగము లేదని చెప్పుచున్నది. పైస్వరూపమువలననే యీవ్యక్తి యాఁడుది, యీవ్యక్తి పురుషుఁ డని పామరులు గ్రహించుచున్నారు. కాని పరమార్థ మాలోచింపఁగ స్త్రీ పురుష భేదము లేనే లేదు. అందుచేత–

జంఘా—కాలాచారీ! ఇంకఁ జాలించు. స్త్రీపురుషభేదము నీ మనస్సున కెక్కలే దని చెప్పితివి కదా! నాలుగేండ్లక్రిందట వివాహమాడుటకు దక్షిణదేశయాత్ర పోయి యక్కడ నీయలౌకికచర్యలచేఁ గారాగృహప్రవేశ మంది చావునకు సిద్ధమయితివే. జ్ఞప్తి లేదా?

కాలా—అప్పుడు నేను బుద్ధిపూర్వకముగఁ బోయితి ననుకొంటివా? ఏదో యితరుల ప్రోత్సాహముచే నట్లు జరిగినది?

జంఘా—సరే. నీయభిప్రాయ మేమని నిర్ణయించెదవు?

కాలా—నాకుఁ బ్రత్యేకాభిప్రాయ మేమియు లేదు. పెద్దల యభిప్రాయమే నాయభిప్రాయము.

జంఘా—అది యేదో స్పష్టముగఁ జెప్పుము.

కాలా—వాణీదాసుఁడు చెప్పినట్లు స్త్రీని జేర్చుకొనకుండిన మంచిది. నీవు చెప్పినట్లు చేర్చుకొనినను మంచిదే.

జంఘా—సరే నీయభిప్రాయము నపుంసకము కావున నది గణింపఁబడదు. వాణీదాసా! స్త్రీని జేర్చుకొనవచ్చుననియే సాక్షి యభిప్రాయము. ఆయభిప్రాయ మీలేఖమీఁదనే వ్రాయఁబడియున్నది. హెచ్చుసంఖ్యగల సభ్యులచే నామోదింపఁబడుటచేత స్త్రీని జేర్చుకొనుటకే నిర్ణయింపఁబడినది.

వాణీ—సాక్షియభిప్రాయ మట్లున్నదని మొదటనే ఏల చెప్పలేదు.

జంఘా—ఇదిగో! మఱియొక లేఖ—గంజాము జిల్లా—నరసన్నపేట పోష్టు—ఉర్లాము గ్రామము నుండి యీలేఖ వచ్చినది. దీనిని జదివెదను.

సాక్షికి నమస్కారములు.

అయ్యా! మీరు చిత్రలేఖకుల దిగంబరవిగ్రహములఁ గూర్చి యిచ్చినయుపన్యాసములోని సంగతు లన్నియు బాగుగాఁ దెలిసికొంటిని. ఉపన్యాసము బాగుగనే యున్నది. అట్టిదోష మెంతశీఘ్రముగఁ బరిహరింపఁబడునో చిత్రకళ కంత క్షేమము. కొందరు స్త్రీలు కూడ నట్టివిగ్రహములను జిత్రించుచున్నారని తెలియుచున్నది. ఇది మరింత ఘోరము. ఇప్పటి చిత్రలేఖకు లేవోపిచ్చియూహలు పెట్టుకొని, చిత్రించుచున్న కన్నులనుగూర్చి యుపన్యసించెద నని చెప్పియున్నారు. ఆయుపన్యాసముకొఱకు వేచియున్నాము. తప్పకుండ నట్టి యుపన్యాసము త్వరలో వెడలవలయును. వారు చిత్రించుచున్న కన్నులనుజూడ నెంత రోఁతయైనఁ గలుగుచున్నది. మీరు ముఖ్యముగా విమర్శింపవలయును. అదిగాక వంగీయకళ తప్పకుండ మీవిమర్శనమునకు గుఱి కావలసియున్నది. కాని యొకసంగతి. అనదుమను: గొంతకాల మెండి మొండైన చిత్రకళ నూతనముగ నిప్పుడే యుజ్జీవింపఁబడుచున్నది. లేలేఁతరెమ్మలు నైమచుఁ జిగుర్చుచు మొగ్గదొడుగుచు నెదుగుచున్నది. మీవిమర్శనము కేవలము ఖండకముగానుండక, కొంతపరిపోషకముగా నుండవలయు నని చెప్పుచున్నాను. వెఱ్ఱివెఱ్ఱి తలలను గఱకుకత్తితోఁ దెగనఱకఁగూడ దని నాయభిప్రాయము కాదు. అట్టినఱకులవలన, మిగిలిన చెట్టు మునుపటికంటె బలముగలదియై, మునుపటికంటె

వ్యాప్తికలదియై, మునుపటికంటె హెచ్చుచిగుళ్లు, హెచ్చుమొగ్గలు కలదియై యుండునట్లు మాత్రము చూడవలయును. అది నాకోరిక.

మరియొకసంగతి–ఆడుదాని మర్యాదకు భంగకరములైన పటములను జిత్రించు చిత్రలేఖకులను భారతమాత చేతికొరడా వ్రేటున నట్టిశిక్ష కర్హతరులైన కవుల నుపేక్షించి, చిత్రలేఖకులమీఁదనే మీరు దాడివెడలుట తగదు. ఆడువారి యవయవరహస్యముల బయటఁబెట్టుటలోఁ గవులకుఁ జిత్రలేఖకు లందుదురా? ఒక్కొక్క యవయవమున కెన్నేసి పద్యములను జెప్పినారు. వారు వర్ణింపనియవయవమున్నదా? చిత్రలేఖకుల పటములలో నాభి కానఁబడుచున్నదని మీరు వారి నంతతీవ్రముగ విమర్శించితిరే! నాభిపై నొక్కొక్కకవి యెన్ని యెన్ని శ్లోకముల నెన్నెన్ని పద్యములఁ జెప్పియుండలేదు? చెలమ లని, దిగుడుబావు లని, కొండబిలము లని మఱి యేమో యని యెన్ని వర్ణనములు కవులగువా రొనరించి యుండలేదు? అంతట నాఁగిరా? నాభిపై నున్ననూగారు, దిగువనున్న నూగారుగూడ వర్ణింపలేదా? ''నూగారు గూఢపదమా చెలికిన్'' అన్న వా రెవ్వరు? ఇఁకఁ బయోధర వర్ణనములకు హద్దుపద్దున్నదా? మనసులోని యుబలాటము తీఱునట్లు, నోటికసితీఱు నట్లు, చేతిదురద తీఱునట్లు పయోధరవర్ణనము లెంతబహుళముగా గ్రంథములందు వ్రాసినారు? ఎంత పెద్దవి యని చెప్పినను హృదయమున కింక సంతుష్టి లేక, అబ తీఱక, తాటకాయ లని, కుండ లని, కొండ లని, వారిమొగ మని మొఱపెట్టినవా రెవరు? కవులు కారా? పిఱుఁదులను వర్ణింప కుండినకవి యొక్కఁడైన నుండెనా? అవి పెద్దదిబ్బ లని, యినుకతిప్పలని, మెట్టలని, గుట్టలని వర్ణించి వర్ణించి, యంతటితో దయ్యపు టాఁకలి శాంతింపకపోవుటచే, భూవలయముతో వాని నంట గట్టలేదా? కాంతలరహస్యావయవము లను వర్ణించుటలోఁ గవుల కున్న రాక్షసవాంఛ చిత్రలేఖకుల కున్నదా? పిఱుఁదులవర్ణనలతో సరిపుచ్చిరా? ఎందులకు సరిపుత్తురు? సరిపుచ్చి యూరకుండఁగలరా? సరిపుచ్చి బ్రదుకఁగ లరా? సరిపుచ్చి కవు లనిపించుకొనఁగలరా? ఆకారముకాదు, రంగుగాదు, మఱియేదో కాదు, ఇం కేదో కాదు–ఎన్నెన్ని వివరములతో నోపికగా, శ్రద్ధగా, భల్లూకపుఁబట్టులోఁ దలఁపఁగూడని యవయవములను, గానరాని యవయవములను మనయెదుటఁ బెట్టలేదు; పోనిమ్ము. అంతటితో నాఁగిరా? ఆగుటే? హాహాకారమెత్తి నవ్వు డాగుటే–స్మరింపరాని సంభోగవర్ణనములను సంతసగ సాపుగ సముజ్జృంభణముగ సాగింపలేదా? అంతటితో నయిన శాంతిపడి మిన్నక పడియుండిరా? ఊహుఁ ''పునారతికౌతుకంబుతో'' లేచి గంటములు చేతఁ బుచ్చుకొని బింకముగఁ గూరుచుండిన మునలికవు లెందరు? ఈఘోరచర్యలోఁ దిరుగవేసి మఱుఁగవేసి, ఉల్లాసీదాల సౌభాగ్యము జూపినవారెందరు? చీ చీ! ఏచిత్ర లేఖకుఁడయిన నిట్టిసన్నివేశమును జిత్రించి సంతలోఁ బెట్టినాఁడా? ఈమోట మొండివ్యాపా రమునఁ గవులకంటెఁ జిత్రలేఖకు లెంతతక్కువ? చిత్రలేఖకులు కొరడావ్రేటుల కర్హులయి నప్పుడు కవులు కొఱత మేకుల కర్హులు కారా?

ఆంధ్రకవిత్వములో మాత్రమే యిట్లున్నదా? సంస్కృతములో నింతకంటె బా గేమైన నేడ్చిన దేమో యని చూడఁగ, నది యింత కంటె నధ్వాన్నముగ నున్నదే. జగన్మాతల స్తవరాజములలో గుహ్యాంగకములకుఁ బ్రత్యేక మొక్కొక్కస్తబకమా? తల్లిదండ్రు లగుపార్వతీ పరమేశ్వరుల సంభోగమును వర్ణించుటకు సాహసించినవారు సంస్కృత

భాషామహాకవులే కాదా? బ్రహ్మచారులు, వేదాంతులు, సన్న్యాసులు సయితము దేవీస్తవరాజ ములలో నెంతలజ్జాకరము లయిన విగ్రహములను నిర్మించినారు.

ఇంత నాంగ్లేయభాష యీసన్నివేశమున నేభాషకుఁ దీసిపోవునది కాదు. సమస్తభాషల లోనున్న యుద్గ్రంథములుగూడ నాభాషలోఁ బరివర్తన మొందియున్నవి. కావున సమస్తజా తులవారి కీపిచ్చి యెంతగాటముగ నున్నదో తెలియవచ్చును. Shakespeare రచించిన Sonnets లో, Venus and Adonis లో, The Rape of Lucrece లో స్త్రీల గుహ్యావయవము లెంత వ్రీడాకరముగ, నెంత జుగుప్సాకరముగ వర్ణింపఁ బడియున్నవి? Aristophanes వ్రాసిన హాస్యరసరూపకముల నవలోకించితిరా? పూర్వపువా రట్లు రచియించిరి కాని యిప్పటివారు భద్రముగనే యున్నారని యనుకొనకుఁడు. ఇటీవలి గ్రంథమైన "Leaves of Grass" లోని, "The love that awaits me" అను పద్యమాలికను జూచితిరా? ఎంతరోఁత కలిగించుచున్నదో! చెప్పఁబోవున దేమనగ—చిత్రలేఖకు లెట్టిదోష మొనర్చిరని మీరు చెప్పినారో, కవు లంతకంటె నెక్కువదోషముల నొనర్చినారు. వారిని దూషించి వీరి నుపేక్షించుట ధర్మము కాదు.

చిత్తగింపుఁడు.
సత్యవాది

జంఘా—ఈలేఖను వింటిరా! కవులందుఁ బాక్షికముచే నేను వారిని విడువలేదు; చిత్రలేఖకులందుఁ గోపముచే వారిని దూషింప లేదు. కవుల యీవెఱ్ఱినిగూర్చి చెప్పఁ దలఁచియే యున్నాను. చిత్రలేఖకులఁగూర్చి నేను జెప్పినప్పు డది సమంజసముగ నున్నదో లేదో చూడవలయును గాని కవులనుగూర్చి చెప్పలే దని యధిక్షేపింపవచ్చునా? నే నింకఁ జెప్పనివేళ యేది? ఉన్న దొక్క చిన్ననోరు: ఉపన్యాస విషయములు లక్షలు 'కవి'నిగూర్చి యీనదుమ నుపన్యసించితిని. కవి భేదములు మొదలగు నంశములఁగూర్చి యుపన్యసించున ప్పుడు కవుల యీపిచ్చినిగూర్చి సోదాహరణముగ సవిస్తరముగఁ జెప్పఁదలఁచితిని. కాని యుత్తమవిమర్శకుఁ డగు మన ఉర్లాముపండితుఁ డీవిషయమును గూర్చి వ్రాసి నాకు శ్రమలేకుండఁ జేసినందుల కాయన కనేకనమస్కారము లర్పించుచున్నాను. ఇఁకఁ జదువఁద గిన యుత్తరము లున్నవికాని యిప్పటి కివి చాలును.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 12. సాక్షిసంఘ పునరుద్ధారణ

సాక్షిసంఘాన్ని పునరుద్ధరించే ప్రయత్నం మరోసారి జరుగుతోం దని జంఘాలశాస్త్రి చెపుతున్నాడు. ఆంధ్రపత్రికలో సారస్వతానుబంధానికీ, సాక్షికీ అటువంటి సంబంధం ఏర్పడిందనీ, సారస్వతానుబంధం జరుగుతు న్నంతకాలం సాక్షి సభలు జరగవలసిందేననీ సాక్షిసంఘం భావిస్తోంది.

గత పదిసంవత్సరాలనుంచి సాక్షి వృద్ధుడైనప్పటికి కూడ దేశాటనం చేస్తూనే వున్నాడనీ, రకరకాల ప్రదేశాలు, అక్కడ రకరకాల మనస్తత్త్వాలు పరిశీలిస్తూనే వున్నాడనీ జంఘాలశాస్త్రి చెప్పాడు. ఈమధ్యనే తటస్థించింది. కనక–అక్కడ రకరకాల విభిన్న అంతస్థుల మనుషుల్ని గురించి కూడా మంచిచెడ్డల్ని ముచ్చటించుకునే అవకాశం కొత్తగా ఏర్పడింది.

ఇంకో విశేషం కూడా వుంది. ఇక ఈఉపన్యాసాలు సత్యపురంలో కాక, మద్రాసులో సముద్రతీరంలో జరుగుతాయి. ప్రతి శుక్రవారం సాయంకాలం ఉపన్యాసం జరిగి ప్రతి శనివారం సారస్వతానుబంధంలో ప్రచురణ జరుగు తుంది.

సముద్రతీరానికి విహారం కోసం వచ్చేవారి సొంత ప్రవృత్తులకీ, వారి కాలక్షేపాలకీ, ప్రలోభాలకీ, ఏ బంధం కాకుండానే ఆరుగంటల లోపలే ముగిసిపోతాయని జంఘాలశాస్త్రి 'హామీ' ఇచ్చాడు. ఏ సమయంలో, ఏవి షయం ప్రస్తావనకు వస్తుందోననే నిశ్చల దయతో సారస్వతానుబంధం చూడవలసిందిగా ఆంధ్ర మహాజనానికి శాస్త్రి విజ్ఞప్తి చేస్తున్నాడు.

'సాక్షి' తమను నడిపే చైతన్యమూర్తి, నాయకుడు అనీ, అతని సూచనలను బట్టి తన ఉపన్యాసాలుంటాయనీ జంఘాలశాస్త్రి విన్నవించాడు.

**జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.**

ఆంధ్రపత్రికలోఁ దిరుగ సారస్వతానుబంధము శ్రీపత్రికాధిపతి ప్రచురించుచున్నం దులకు మహానంద మొందితిని. సారస్వతాను బంధమునకు సాక్షికిఁ గల సంబంధము సర్వాంధ్రలోకమునకు విదితమే. సారస్వతానుబంధ మున్నచోట సాక్షి యున్నాఁ డన్నమా టయే. సారస్వతానుబంధము జరుగుచున్నంతకాలము సాక్షి సభలు జరుగవలసినదే.

పై వారమునుండి సాక్షిసభలు మదరాసులో జరుపవలయు నని తలంచు చున్నాము.

కడచిన పదిసంవత్సరములనుండియు, సాక్షి వృద్ధుం డయ్యును దేశాటన మొనర్చు చునే యున్నాఁడు. చిత్రవిచిత్రప్రదేశము లనేకములు చూచినాఁడు. పురుషులైన స్త్రీలను, స్త్రీలైన పురుషులను, పిల్లలైన పెద్దలను, పెద్దలైన పిల్లలను, ప్రభువులైన దాసులను, దాసులైన ప్రభువులను, భక్తులైన దొంగలను, దొంగలైన భక్తులను, బుద్ధిమంతులైన బుద్ధిహీనులను, బుద్ధిహీనులైన బుద్ధిమంతులను మఱియింక నెన్నియో మహావిచిత్రప్రకృతులను జూచినాఁడు. ఆతఁడు పాశ్చాత్యదేశములంగూడ నీనడుమనే చూచినవాఁ డగుటచేత నచ్చటి ప్రభువులం గూర్చి ప్రజలంగూర్చి కవులంగూర్చి గాయకులంగూర్చి చిత్రలేఖకులంగూర్చి నుపన్యాసము లీయఁదలంచినాఁడు.

ఈసారి సాక్ష్యుపన్యాసములు మా కారాధనమూర్తి యగు సూర్యభగవానుని సంతతానుగ్రహవిశేషమున వినోదకరములై విచిత్రతరములై విలక్షణములై యుండునట్లు సోదరులగు మీరాశీర్వదింతురు గాక! ప్రతి శుక్రవార సాయంకాలమున సముద్రతీరమున నీయఁబడు నుపన్యాసము మఱునాఁడే ప్రచురణార్థమై యాంధ్రపత్రికకుఁ బంపఁబడును.

కృతి పాడఁదగినది. కథ యూఁ కొట్టఁదగినది. నాటక మాడఁ దగినది. ఉపన్యాసము వినఁదగినది. ఓమదరాసుసోదరులారా! మీపట్టణమున సుమా రైదులక్షల జన మున్నది. మీలో నేఁబదివే లైన సముద్రతీరమునకు వచ్చి సాక్ష్యుపన్యాసములు వినుచుండవలయును. మీరు సాధారణముగా సాయంకాలమునందు సముద్రతీరమున కెందులకుఁ బోవుచున్నారో యెవ రెఱుగరు? ప్రకృతిసౌందర్య సౌభాగ్యవలోకమునకా? ఊహుఁ–పవనప్రాశనమునకా?–ఊహుఁ–దేహవ్యాయామమునకా? ఊహుఁ–విశ్రాంత్యనుభవమునకా? ఊహుఁ–గ్రామ్యకవితవలెఁ గడలు త్రొక్కుటకుఁ బోవుచున్నా రని మీరంద ఱెఱుఁగరా? లోక మెఱుఁగదా–లోకనాథుఁ డెరుఁగఁడా? నూర్గురిలోఁ బనికిమాలిన నిర్భాగ్యులగు నేపదిమందియో తప్ప మిగిలినవారందరు పైతిరుగుడులోని భావకవిత్వమును బ్రత్యక్షము చేసికొనుటకే పోవుచున్నారు కదా? నేనసత్యమాడు చున్నా నని యనుచున్నారా? ఆఁడుదాని నైదుదినములు సముద్రతీరమునకు సర్కారువారు రాకుండఁ జేసినయెడల సముద్రతీర మంతయును సహారా యెడారి యైపోవదా? మీప్రయోజకత్వ మేమున్నది? మిమ్మాకర్షించు యంత్రము లచ్చట నున్నవి. మీ ప్రక్కబారుటెగలింపులసొంపులు, మీవంకర చూపుల మెలికలు, మీతస్కరకరసంచాలనములగుర్పాటులు, మీముద్దుల ముద్రల విద్యుల్లతలు, మీ దొంగ యాలింగనముల యద్వైతబ్రహ్మానందములు మాయుపన్యాసమైన తరువాతనే ద్విగుణీకృతోత్సాహముతో గానిచ్చుకొనవచ్చును. పాపభూయిష్ఠములైన మీబ్రదుకు లెంతటివో సాక్షియెఱుఁగఁడా? మీరెంత ధనికులైనను, నెంత యుద్యోగులైనను, నెంత విద్యావంతులైనను, నెంత వర్తకులైనను, నెంత వక్తలైనను మీ కింటియొద్ద సుఖలేశమైన నున్నదా? చూచిన మొగమునే చూచి, ముద్దిడుకొనిన మూతినే ముద్దిడుకొని, పట్టినచేతినే పట్టి, పండుకొనిన ప్రక్కనే పండుకొని రుచిరచి లేని చొప్పదంటు జీలుగుబెండువట్టి గడ్డి సంసారపురోఁతను బడియున్న మీకుఁ బైయింటి తరవాడితోఁ బ్రాణము లేచిరాదా? ఎదుటింటి యయ్యంగారి యమ్మణ్ణిచేతి ప్రసాదము శ్రీమూర్తితీర్థప్రసాదముకంటెను స్థిరతరానందప్రదముకాదా? మీబ్రదుకుల కంతకును సాయంకాలమున సముద్రతీరమునఁ

గప్పగంతులలో నాకర్షణపు టీలలలో గుట్టుపు నకిలింపులలోఁ బొంచి కాచుటలలో నట్టె గ్రహించుటలలో నలికిడి ననుసరించి యట్టె పరిహరించుటలలో మీకు నిత్య మగుచున్న కాలక్షేపపు గడియలు నాలుగే యథార్థముగఁ గృతార్థములైనవి. మీజన్మ రాహిత్యమున కెన్నఁటికైన నవియే తోడ్పడును. పురుషులైన మీకు మీసొంత స్త్రీలపై నింతవైరాగ్యము, నవ్యవ్యక్తిపై నింత యనురాగము వంటివె మీస్త్రీలకు మీయం దేల యుండఁగూడ దనుజ్ఞానము మీ కున్నయెడల నింత యవకతవకచర్య కవకాశముండునా? ఉభయపక్షముల వారు రాజీపడియుందురా యని యనుకొనఁ దగినంత మితి మీఱియున్నదే. అటులైనఁ జేపలశాల వెనుక నొక పక్షమువారు, మేరీపాఠశాల కెదుట నొకపక్షమువారు, విశాలరంగమునఁ జెఱియొక వైపున నేకాంక నాటకము లాడుచున్నారా? అట్టి మీమహానంద మున కడ్డురాకుండ మాయుపన్యాసము నాఱు గంటలకు లోపలనే ముగించుకొందుము. మనుష్యత్వము పశుత్వమునకు దిగిపోవునంతవఱకు మీ రానందము ననుభవింపవచ్చును.

ఇట్టి నియమశూన్యత, యిట్టి నిరంకుశత, యిట్టిపనితనము, నిట్టి దిగదీఁత, యిట్టిక్షమము, నొక్క మీనీతియందే సిద్ధించినవా? దేహశక్తి యందో మనశ్శక్తియందో హృదయశక్తియందో యాత్మశక్తియందో శిల్పమునందో గానమునందో చిత్రలేఖనమునందో–యిప్పు డవియన్నియు నేల? సోదరులారా! ఒక్కటే ప్రార్థన–ఏవిషయమును గూర్చి యెప్పు డేవిసరువచ్చునో చూతమనుతలఁపుతో మాయందు నిశ్చలదయ గలవా రయి సారస్వతానుబంధమునకై యుత్సాహముతోఁ గనిపెట్టుకొని యుండవలయును. సారస్వతానుబంధవిజయము మీయాదరణములలో నున్నది. కాని మావంటివారిలో లేదు. సారస్వతానుబంధ మంత మహాదీప్తితోఁ బ్రకాశించును. మాకధికారి యగు సాక్షియొక్కతత్త్వమును నేను గొంత యెఱిఁగిన వాఁడను గావున నిట్టిమాట లనుచున్నాను. నేను గేవలము శక్తిహీనుఁడను. సాక్షి నాయందలి యనురాగముచేత సూచించు సూచనలనుబట్టి యాకాశమంత నోటితో నే నుపన్యసింతును. అదియే నాలోని విశేషము. అది లోపమందురా? మీయిష్టము. సోదరులారా! మొదటిసాక్షి యట్టె దీర్ఘముగ నుండఁగూడదు కావున సెలవు.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 13. పురుష ప్రయత్నము

పూర్వం ఒకసారి దశావతారాల గురించి ఉపన్యాసం ఇచ్చిన పిచ్చిమనిషిని చూడడానికి, మళ్లీ ఏమైనా చెపితే వినడానికి జంఘాలశాస్త్రి వెళ్లాడు. ఆయన పేరు ముష్టిచిట్టి వీరయ్యశాస్త్రి. అద్వైత విద్వాంసుడు.

'పురుషకారం' గురించి చెప్పమని జంఘాలశాస్త్రి ఆయన్ని అడిగాడు. అంటే ఈప్రపంచంలో స్వతంత్రంగా మనిషి చేసే ప్రయత్న మన్నమాట. దేనిగురించైనా ప్రయత్నాలు చేస్తాడుకదా! ఫలించవచ్చు, ఫలించకపోవచ్చు.

దీని మీద వీరయ్యశాస్త్రిగారు చెలరేగి మాట్లాడాడు.

ఫలానికి పురుష ప్రయత్నం కావాలంటున్నావు. మళ్లీ, అదే పూర్తిగా చాలదు, దైవ ప్రయత్నం తోడువడాలంటున్నావు. అంటే దైవప్రయత్నానికి క్రింద చోటుగా వద్నాలుగు పాళ్లు పురుష ప్రయత్నం ఉండాలంటావు! పూర్తిగా పురుషకారాన్నేగా గౌరవించాలి. పూర్తిగా దైవ ప్రయత్నాన్నేగా గౌరవించాలి. రెండింటిని తగలబెడుతున్నావు. పురుష ప్రయత్నం ఏమీ లేకుండా కేవలం దైవప్రయత్నాలేవీ లేవంటావా! పిడుగుపాటు, తుఫాను, భూకంపం వంటి వాటికి కారణం ఎవరి ప్రయత్నం!

ప్రపంచంలో ఒకేఒక్క అద్భుతశక్తి వుంది. అదే సర్వత్రా వ్యాపించి వుంది. మిగతా శక్తే ఇన్నివిధాల బహిర్గతమవుతోంది. అంతా అంధకారం. అంతా ఇంద్రజాలం. అంతా కల. అందులో బుద్ధి వున్న వాళ్లమనుకొని స్వభావం కాని ప్రయత్నంతో మనం తిరిగే తిరుగుడు ''నిద్రలో తిరుగాడడం'' దీని మీదే మనవాళ్లు సగుణతంత్రాన్నంతా నిర్మించారు అని –ముగించాడు. మొత్తం మీద 'మానవ ప్రయత్నం' అనేది ఒక మిధ్య అని తేల్చాడు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

నాయనలారా! దశావతారములఁగూర్చి యుపన్యసించిన పిచ్చివానిని జూడ మొన్నను వైద్యశాల కేఁగితిని. ఆపిచ్చివాఁడు తనగది వెలుపలఁగూరుచుండినాఁడు. నన్నుఁజూడఁగనే నమస్కరించినాఁడు. ఆశీర్వదించి నెమ్మదిగా నున్నదా యని యడిగితిని. రవంత పొడుమి

మ్మని సంజ్ఞచేసి చేయి చాచినాఁడు. నాయొద్ద నస్యము లేదయ్యా యని యంటిని. ఆవలికిఁ బొమ్మని నట్లాతఁడు సంజ్ఞచేసినాఁడు. ఏదైన నుపన్యాస మిమ్మని యడిగితిని. పొడుము తీసికొనివచ్చి మరిమాట లాడవోయి ఫూల్! ఆమాత్రపు పరేంగితజ్ఞాన మక్కఱలేదా? నోరార్చుకొనిపోయినప్పు డక్కఱలకట్టి, ముక్కులార్చుకొనిపోయినప్పుడు పొడుము, ఇంతకంటెఁ బరమహంసక్రియలు మరెక్కడివి? Well get up Right about turn March, left right left right అని యాతఁడు లేచినాఁడు గదిలోపలికిఁ బోవునేమో! పోయెనయెడలఁ దిరుగరాఁడేమో యని భయపడి "అయ్యా! ఇక్కడనే కూర్చుండుఁడు. ఒక్కనిముసములో నస్యము తెచ్చి యిచ్చెదను. అని పరుగెత్తి నస్యము తెచ్చి యాతని కిచ్చితిని. రా! ఆలాగున దారిలోనికి రా. అంతే! మన మనఁగాఁ బ్రజకు గడగడ. ఆమాత్రపుఁ భటుత్వము లేకుండ నన్నికోట్ల జనమును బరిపాలించుట లేదయ్యా. ఇప్పటి ప్రజలు తమంతఁ దామే పరిపాలించు కొందురఁట! వెఱ్ఱిముండకొడుకులు! తమంతఁ దాము తినవచ్చును. తమంతఁ దాము భార్యయొద్దఁ బండుకొనవచ్చును. అంతే కాని తమంతఁ దాము పరిపాలించుకొనుట యేమోయి? మతిలేనిమాట! పరిపాలకుఁడు వేరు. పరిపాలితుఁడు వేరు. ద్వైతవిశిష్టాద్వైతము లంగీకరించిన యంశమే కాదా? వారిద్దఱకు భిన్నత్వమే. ఇద్దఱకు తేజస్తిమిర న్యాయమే. తాను తానునై మరియొకఁడుగూడ నగుట యెట్లు సాధ్యము? ఇందులో నున్న తిరకాసు కనిపెట్టితివా? తన్ను తా నెందులకుఁ బరిపాలన చేసికొనఁగూడదు. అది నీవు నాతో వాదింతువా? మాటలాడ వేమి? ఓ! వాదభిక్ష నిచ్చుటకు సిద్ధముగా నున్నాము. పెట్టు, నీమాధుకరపుఁజోలి యక్కడఁ బెట్టు. అదిగో పెట్టుమనఁగాను! తన్నుఁ దాను పరిపాలించు కొన్నవాఁ డెంతవాఁడయ్యా? అట్టివాఁడు పాపభూయిష్ఠమైన భారతదేశమున కర్హుఁడా? పరమపదమున కర్హుఁడా? "అహందేహో నచాన్యోస్మి, బ్రహ్మైవాహం నశోకభాక్, సచ్చిదా నంద రూపోహం, నిత్యముక్త స్వభావవాన్."

"అయ్యా! అయ్యా! ఈపనికిమాలిన గొడవ నాకెందులకు? ఏదైన విజ్ఞానబోధ మొనర్పఁదగు నంశమునుగూర్చి యుపన్యసింపుము. ఎంతయో ప్రయత్నముచేసి నిన్నుఁ జూడవచ్చితిని" అని నే నంటిని.

తప్పు తప్పు, నన్నుఁ జూచుటకు నీవు ప్రయత్న మొనర్చితివా? నీవు ప్రయత్నము చేయుట! ఓ! ఎంత యహంకారివి! నీకేదైనఁ జేయుటకు స్వాతంత్ర్యమున్నదనుకొనుచు న్నావా? కన్ను లెంతమీఁదికి వచ్చినవి! నీవు నన్నుఁ జూచుటకు గొప్పప్రయత్న మొనర్చి తివా? సరే, మాట వరుస కొప్పుకొందము. నేను నీకొఱ కేమిప్రయత్నము చేసితి నని నీవు నాయెదుటికి వచ్చితివయ్యా? నీవైపునఁ బ్రయత్నము కావలసినపని నావైపున నప్రయ త్నముగ నేల యయ్యెను. పరమార్థ మేమనఁగ నిద్దఱివైపునఁగూడఁ బ్రయత్నమే లేదు. ప్రయత్నము చేసితినని నీయందుఁ గర్తృత్వమును బుద్ధిహీనుఁడవై యారోపించుకొనుచు న్నావు. దైవశక్తి మహిమను నమ్మి నేను కిమ్మనకుండ నూరకుంటిని.

"అదేమి? అదేమి? ప్రయత్నము లేకుండ కార్య మెట్లగును? పురుషకార మని వినియుండలేదా" అని నే నంటిని.

పురుషకారమా? స్త్రీకారముకాదేమి? అర్థములేని మాట లావలికిఁ ద్రోచివేయవోయి! వైష్ణవసంప్రదాయపుఁ జచ్చుమాటల ద్వైతసిద్ధినొందినవానియొద్ద నఁటోయి! చిత్రాన్నము

చిట్టిగారెలు రాగభోగాదులు పవళింపుఁగైంకర్యములు శ్రీపుష్పయోగములు సేవాకాలములు వైష్ణవ మతమున కక్కఱకువచ్చును గాని పరమార్థనిశ్చయమున కక్కఱకు వచ్చునఁటోయి.

పదము

దాసురాల రా రమ్మడియేన్ దాసీ నను మనిరే,
భాసురాంగితిరుమంత్రము చెప్పెద పఠనసేయుమనిరే ॥ గోవిందా॥
ముద్రధారణముచేసెద మని పెద్దమునుఁగువైనారే
మునుఁగులోనవా......హే హే హే!

ఏలాగు? ఆమాత్రపు రక్తి లేకపోయినతరువాత మత మెందులకోయి? ఏడువను, మొత్తుకొనను! మా శిష్యరాండ్రలోఁ బుణ్యస్త్రీ వితంతు భేదము లేదు.

వితంతుత్వసువాసినీత్వములు బహిరాగతములు కాని వస్తుతత్త్వమున నున్నవి కావు. ఒక్క స్త్రీత్వమే అచ్చాణియైన స్త్రీత్వమే–కమ్మి కలితి లేని స్త్రీత్వమే–స్వయంభువైన తత్త్వము. జ్ఞానులమైన మనకుఁ జేతాళములు పనికిరావు. అందుచేత మనము ''సర్వం ఖల్విదంబ్రహ్మం'' న్యాయముచేత–

అంతటితో నాఁగవయ్యా! దిక్కుమాలినధోరణిలోఁ బడిపోవుచున్నావు. పురుషప్రయత్నము పూర్తిగ లేదని చెప్పినావు. ఆసంగతి నిర్ధారణచేయఁగలవా! వెఱ్ఱిధోరణిలోఁ దిరుగఁబడిబోకుండ నిదానముగ–

ఉండు–అయ్యో–ఉండు మనఁగాను–''అద్వైతశాస్త్ర ప్రవీణుఁ డైనట్టి ముష్టి చిట్టివీరయ్యశాస్త్రిగారికి వెఱ్ఱిధోరణి పూర్తిగా నశించినది. ఇఁకఁ బదునైదుదినములలో వైద్యశాల నుండి యాతఁడు పోవచ్చును'' అని డాక్టరుగాడు మనకిచ్చిన యోగ్యతాపత్ర మాగోడమీఁద నున్నది. చూచుకో. ఈడాక్టరుగాడిదె కిప్పుడు తలతిక్క తీఱినది. నాకు మతిపోలేదు. నాకేవిధమైన జబ్బు లేదురా. నన్ను బాధ పెట్టకురా యని పదునాల్గుసంవత్సరముల నుండి చిలుకకుఁ జెప్పినటు చెప్పుచుంటినే! వీఁడు నామాట లక్ష్యపెట్టినాఁడా! ఉహు! పిచ్చియాసుపత్రి యనఁగా, పిచ్చివారి రోగమును కుదుర్చు నాసుపత్రి యని యర్థము కాదు. పిచ్చిడాక్టర్లు గలయాసుపత్రి యని యర్థము. వాఁ డిచ్చిన యోగ్యతాపత్రమును జూచి నే నేమంటినో యెఱుఁగుదువా? నాకుఁ బిచ్చి లేదని నీవు చెప్పుటచేత నీకుఁ బిచ్చిలేదన్నమాట నామూలమున సిద్ధాంతపడినది. కావునఁ బిచ్చిడాక్టరు లుండవలసిన వైద్యశాలలో నీవుండ నేల? మన మిద్దఱము కలసియే యావలికిఁ బోదము రమ్మని యంటిని.

''నాకీ సోదె ఏమియు నక్కఱలేదు. పురుషప్రయత్నమునుగూర్చి చెప్పుదువా లేదా'' యని యంటిని.

నన్ను బెదరింతువా? Nonsense, డాక్టరు ముండకొడుకు కొరడాదెబ్బలకు లక్ష్యపెట్టని వీరాగ్రేసరుడ నని యెఱుఁగవా? అవనికి మాలినవాని యోగ్యతాపత్రమును నేను గౌరవింతునా? నే నిక్కడనే యుందును. నన్ను వాఁ డేమిచేయునో చూతును. ఈనడుమ నొక్కయత్యంత చిత్రమైన యంశము జరిగినది సుమా.

''నీవిచిత్రాంశము నాకక్కఱలేదు. పురుషప్రయత్నమునుగూర్చి చెప్పుదువా పోవుదునా'' యని యడిగితిని.

బాబూ! నామాట విని యుండుము. ఈయొక్కటిమాత్రము వినుము. అటుపైని నీయిష్టమువచ్చిన యంశముపై B.N.R. పొగబండికూతతో నుపన్యసింతుము. రవంతసేపు బాబూ! శాంతింపుము. ఏమైన దనఁగా, ఈనడుమ నీడాక్టరు వీథివెంటఁ బోవుచుండఁగా నొకయింటిలో నొకయాఁడుది యేడ్చుచున్నట్లు వినవచ్చెను. ఆతఁడు లోనికిఁ బోయి చూడఁగ నొకముసలి వితంతువు మంచమునొద్దఁ గూరుచుండి యేడ్చుచుండెను.

సీ. ''అంతంత మొగములై యంతంతబొమ్మలై
యంతంత యుదరంబు లైన వింత
యాకారములతోడ నేకుముక్కలవలెఁ
బలుచపల్చని వెలవెలలతోడ
నిదురమబ్బులతోడ నిట్టూర్పుబుసతోడ
నీరుపట్టినకాళ్ల బూరతోడ
మెల మెల్ల నెదురీఁత యలపుల సొలపుతో
గాజుకాయలబోలెఁ గానఁబడుచుఁ

గుత్తుకుత్తను''......చున్న యొక్క చక్కని వ్యక్తి నచ్చటి మంచముపైఁ గాంచెను

"What is the matter" అని వైద్యుఁ డాముసలిదాని నడిగెను. ఏమియుఁ దెలియక యామె మరింత యేడ్చెను. అప్పు డా వైద్యుఁడు చేయి చూచి నవమాసస్ఫూర్తియైనట్లు ప్రత్యక్షముగఁ గానఁ బడుచున్న కడుపునకుఁ గుడివైపునఁ జెవిలో నొకగొట్టము పెట్టుకొని రెండునిముసములు నిదానించి 'వెంటనే midwife ను బిలిపింపుము. మరేమియు భయము లేదు. ఇది మొదటి కానుపే కాదా'' యని యడిగెను. ఔను నాయనా! ఇది మొదటి కానుపే తరువాత నన్నియు గంగలోఁ గలిసినవి కావా యని తన కానుపులసంగతి చెప్పి మాట లేదు, చూపు లేదు, రక్షింపు మని యాముసలి దాతని కాళులపైనఁ బడి యేడ్చెను. ఒక్కజామునకు delivery అగు ననఁగా కొందఱు కిట్టే fits వచ్చుసు. తొందరలేదు నేను బోయెదను. అని చెప్పి యాతఁడు పోయెను. హె హె హె ఎంత విచిత్రము! ఎంత విచిత్రము!

''అంత నవ్వేదవేల? ఇందుల నేమి విచిత్రమున్నది. నీ మొగము'' అని నే నంటిని.

ఉండవోయి dunce చెప్పుచుండఁగా నంతతొందరపడెద వెందులకు? ఆమంచము మీఁద నున్నదని చెప్పఁబడిన వ్యక్తి మగవాఁడు కాని యాఁడుది కాదు. వాఁడా ముసలిదాని కొడుకు. వాఁ డూరిలోఁ బ్రచురించిన ''శ్రీరామజనన'' నాటకములోఁ గౌసల్యపాత్రమును ధరించి, సొమ్ము రాకపోవుటచేత నాటకము మానివైచి చెడఁద్రాగి యుండుటచేత వేసము తీసివేసికొనవలయునను జ్ఞానములేక యిట్లు చేరుసరికి మైకము హెచ్చగుటచేత నిశ్చేతనుఁడై మంచముపైఁ బడిపోయెను. చూచితివా పాశ్చాత్యవైద్యులపని! ఇంగ్లండులోఁ గృతార్థుఁడై వచ్చిన వానిగతి యిది. ఈకీడును బాపుకొనుటకు వీఁడేమి చేసినాఁడో యెఱుఁగుదువా? కలకత్తాకు వ్రాసి ''కలియుగ ధన్వంతరి'' యను బిరుదమును పదుమూఁడు రూపాయలకు వి.పి. గాఁ దెప్పించినాఁడు. భగవదవతారమని చెప్పఁబడి ధన్వంతరి నెట్టివానిని జేసినారు! మతియున్న వాఁడో, మతిలేనివాఁడో యెఱుఁగని మతిలేని వానిని జేసినారు. గొంగళి పురుగునకుఁ గుక్కకుఁ గ్రోఁతికి స్వభావసిద్ధముగఁ దెలిసిన

స్త్రీ పురుషభేద మెరుఁగని మూఢశిరోమణిని సార్వభౌమునిఁ జేసినారు. జ్ఞానశూన్యు లగువారికి బిరుదము లిచ్చి ప్రాచీనమహోవ్యక్తులపరువును బరశురామప్రీతి యొనర్తురా యని వంగదేశ పరిషత్తువారికి నేను తెలియఁ బరుపఁగా–

ఈపనికిమాలిన గొడవ నా కెందులయ్యా నే నడిగిన పురుష ప్రయత్నమునుగూర్చి చెప్పుమని యంటిని.

సరే–కాచికో! నీవు ప్రయత్నించి, నీయూపిరి తిత్తులలోని కన్నుబున్నుల నాఁపగ లవా? హృదయకోశమునందలి తాళప్రసారమును గట్టివేయఁగలవా? నీవు పుట్టితివిగదా –నీపుట్టుకకు నీ వేమి ప్రయత్న మొనర్చితివో యెఱుఁగుదువా? నీమరణమున కెట్టి ప్రయత్నముఁ చేయఁదలచియున్నావో? ఎవ్వఁడైన గష్టమును కోరుకొనునా? దారిద్ర్య మును కోరుకొనునా? చెప్పఁగలవా? చావు కోరుకొనునా? జీవునకు ప్రధానవాంఛ యేది? స్వసౌఖ్యము. అప్రయత్నముగా భూమిపైఁ బడినదిమొద లప్రయత్నముగాఁ గాటిలోఁ బడువఱకు సర్వస్థల సర్వకాలసర్వావస్థలయందుఁ జేయుప్రయత్న మంతయు స్వసౌఖ్యము నకే కాదా? చావు దప్పించుకొనవలయు నని పుట్టినది మొదలు ప్రయత్నముఁ జేయుజీవుఁడు చావుకొఱకే ప్రయత్నించు చున్నాడు కాదా? చావువంకకే పరుగెత్తుచున్నాఁడు కాదా? ఇంకను బ్రయత్న మని, ఫలమని యేల వెఱ్ఱివడుదువు? ఇంతకాలమునుండి స్వరాజ్యసంపాద నప్రయత్నము జరుగుచున్నది కదా! ఇప్పటి కేమైనది. మన లెక్క యేమి. భగవానుఁ డైన శ్రీకృష్ణుఁడు కౌరవసభకు సంధి కొఱకుఁబోయి యేమి చేయఁగలిగినాఁడు?

''అయ్యా! చదువుకొననివాఁడు వాదించునట్లు వాదించుచున్నావు. నేను జెప్పిన దే మనఁగా, ఫల మున్నప్పుడు ప్రయత్నముండి తీరవలయును. ప్రయత్న మున్నచోట నెల్లప్పుడు ఫలము లేకపోవచ్చును. ఎందుచేత ననఁగా నెంత పురుషప్రయత్న మున్నను దైవసాహాయ్యము లేనియెడల నాప్రయత్నము ఫలింపదు. పురుషప్రయత్నము పదునాల్గు పాళ్లు, దైవప్రయత్నము రెండుపాళ్లు'' అని నేనంటిని.

ఈమాత్రపుబుద్ధి, యీమాత్రపుఁజదువు, యీమాత్రపువాదన శక్తి నాకు నున్నవి. సాక్షిసంఘములోని ప్రధానవావదూఁకుడ నని కన్నులు నెత్తి మీఁదికి వచ్చినవి. జాగ్రత్త! ఇక్కడ నే ననుదినము నంతరిక్షమున నవతరించిన యాదిత్యులసభలో నధ్యక్షుఁడనై యుపన్యసించు చున్నాను. త్రినేత్రి, సహస్రనేత్రాదులు ప్రత్యక్షములైన పంచ భూతములతోఁ గిక్కుఁరు మనకుండ వినుచున్నారు. నీయుపపాదన మేదో నాకుఁ దెలియకపోలేదు. నాపూర్వ పక్షవైఖరి నెఱుఁగకుండ మాటలాడుచున్నావు. మొదట నీ వేమంటివి? ఫలమునకుఁ బురుషప్రయత్నము కావలయు నని యంటివి. ఇప్పుడే మనుచున్నావు? పురుష ప్రయత్న మునకు దైవప్రయత్నము తోడుపడవలయు ననుచున్నావు. ఎంతపురుషప్రయత్న మున్నను దైవప్రయత్నము లేకుండ ఫలము లేదనుచున్నావు. అనఁగా దైవప్రయత్నమునకుఁ బదునా ల్గుపాళ్లపురుష ప్రయత్నము బోటుగాఁ గ్రింద నున్నఁగాని ఫలము లేదని నీయభిప్రాయము. గౌరవించినయెడలఁ బూర్తిగాఁ బౌరుషము నైన గౌరవింపుము. లేదేని దైవమునైన గౌరవిం పుము. అట్లు చేయక రెంటిని దగులఁబెట్టుచున్నావు. పురుషప్రయత్నమే లేకుండఁ గేవలము దైవికము లున్నవా, లేవా? వీథివెంటఁ బోవుచున్న యొకమునలిదానిపైఁ బిడుగుపడినది. ఇది కేవలము దైవిక మందువా? పదునాల్గుపాళ్లు పౌరుషముతో మేళవించిన దైవికమందువా?

ఇది దైవికము కానియెడలఁ బిడుగు పాటునకై ప్రయత్నించినవాఁ డెవఁడు? మేఘుఁడైన ప్రయత్నించె నని చెప్పఁగలవా? పోనీ–ఆవీథి నామునలిది యానమయమున బుద్ధిపూర్వకముగా నడచుటచేత దాని చావునకు నారీతిగఁ దానే ప్రయత్నించెనని చెప్పఁగలవా? దైవికము లున్న వని యొప్పుకొందువా, లేదా? ఇట్టివే కొన్ని తుపాను, భూకంపము, వహ్నిపర్వతసంక్షోభము మొదలగునవి యున్న వని యొప్పుకొనవలయు నని గొణుఁగుకొనుచున్నావా? నీబుద్ధి కందని విషయములలో నీశక్తికి మించిన సన్నివేశములలో నత్యద్భుతములై, యనిర్వాచ్యములై, యగ్రాహ్యము లగువిషయములతో మాత్రము ముక్కుచు, మూల్గుచు దైవిక మని యొప్పుకొని నీచప్పుచప్పున్నర కుంటి; గ్రుడ్డి, మూఁగ బుద్ధికందిన వంట పెంట గుడ్డగుడును వ్యాపారములలో–ఓ చెలరేఁగి, నాప్రయత్నము పదునాల్గు పాళ్లకు రవంత దైవము తోడుపడునెడల నఖిలైహికకార్యములు నేను చేయఁగల నని వీథులవెంట నోండ్రపెట్టుచు పరగడలు ద్రొక్కుచుంటివా? నీవింత దైవశక్తిద్రోహి వగునందులకు నీనాలుకఁ గోయింపవలదా? పోనీ–సాంసారికకృత్యములలో నైన నీ వనునట్లు నీప్రయత్నమునకుఁ గృతార్థత కలుగుచున్నదా? నీకళ్యాణమునకు నీవే కన్యాన్వేషణ మొనర్చితివే –జ్యౌతిషికపండితుఁడవైన నీవే జాతకపరీక్షఁ జేసితివే–నీవేకన్యాపూర్వ సంప్రదాయముల నెల్లఁ దడవితివే–అది మహాపతివ్రతయగు నని దానిఁ బెండ్లాడితివే–అది చపలయై చెలరేఁగి, జారులవెంట స్వారిపోవుచున్నదికదా. నీవు పురుషప్రయత్నముచే దాని నాఁపఁగలిగితివా? పాపము. నీపదునాల్గుపాళ్ల పురుషప్రయత్నమునకు దైవము రెండుపాళ్లతోఁ దోడుపడకపోవుటచేత నిట్లయిన దని లోలోన నేడ్చుచున్నావా? ఆలాగా? నీభార్య సైయాటలాడుట పరపురుషులకేకాక పరదైవమునకుఁ గూడ నిష్టమే యని యభిప్రాయపడుచున్నావా? దైవమే యామెను తప్పుతిరుగుడులలోఁ ద్రిప్పుచున్నా డనికూడ నమ్ముచుంటివా? అటులైన నింక నాలన్య మేల? పట్టు–మట్టిగిడిసలవంటి పదునల్వురుముండలను సంపాదించు బారుకొట్టులు గట్టి వారి నందు విడియింపుము. నల్గురు తార్పుడుకాండ్రను నియమించు. ఈధనమహోత్సవదినములలో నేడు రూపాయల జీతముపై బి.ఎ. గాఁడు వచ్చును కాని –యూరూర చాటింపించు పత్రికలలోఁ బ్రకటించు సోదరీ మానవిక్రయమహనీయుఁడవై కోటీశ్వరుఁడవై మానవజాతికంతకు మేటికిరీటమువలె–

చీ! ఆఁగు అంతటితో నాఁగు. నీవాదవైఖరి నాకేమియు బోధ కాలేదు. అంతయు దైవమే యందువా? అటులైనఁ బుణ్య మేమి? పాప మేమి? స్వర్గమేమి? నరక మేమి? బుద్ధిస్వాతంత్ర్య మేమి? నడవడి నూటియేమి? జాతీయన్యాయమేమి? మనుష్య విధి యేమి? నాపిండ కూడేమి? నల్లమదు గేమి? బుద్ధిహీనుఁడనై నీయొద్దకు వచ్చితిని. నేను బోదును అని నే నంటిని.

ఉండవోయి Nonsense ఆఁగవోయి! Idiot! నీవు బుద్ధిహీనుఁడవను మాట సత్యము. నీవే కాదు నీతోడి ప్రజ లందరు బుద్ధిహీనులు–బుద్ధిహీనుల రగు మీరు బుద్ధిమంతు లని భ్రాంతిపడుటచేత మఱింత బుద్ధిహీనులు. పశుపక్షికీటకాదులైన యితర ప్రాణులు మీయంత బుద్ధిహీనములు కావు. మీరు చెట్లకంటె బుద్ధిహీనులు. చెట్లెదుగుచున్నవా లేదా? ఏ ప్రయత్నముచేసి యెదుగుచున్నవి? ఇంతకు మఱ్ఱిగింజ యెంతో! మఱ్ఱిచెట్టు యూరంతయు నూడలతో నాక్రమించుచున్నది కదా! ఏమి ప్రయత్నముచేసి యట్లెదుగుచున్నది.

ఏమి ప్రయత్నమొనర్చి చచ్చుచున్నది. తన ప్రయత్న మక్కఱలేదు. ఇతరుల ప్రయత్నలేశ మైన నున్నదా. దానిలోని పురుగులు నీళ్లలోనిపురుగులు ఏమి ప్రయత్న మొనర్చి జీవించుచు న్నవి? ఏప్రయత్నలోపమునఁ జచ్చు చున్నవి. ఇటులే పైజంతువులకుమాత్ర మేల కాదు? ఏజంతువుకూడ స్వప్రయత్నమునఁ బుట్టదు. ఏజంతువుకూడ స్వప్రయత్నమున నెదు గదు. స్వప్రయత్నమున నశింపదు. ప్రయత్నమే లేదు. ప్రయత్నించుట కుద్దేశమైన లేదు. ప్రయత్నించుటకు స్వతంత్రతయే లేదు.

చూచితివా? ప్రపంచమున నెచ్చటనయిన నత్యద్భుత మయిన శక్తి యవాచ్య మయినశక్తి, యవర్ణ్య మయినశక్తి లేనియంగుళము అరయంగుళము అంతవఱకుకూడ నెందులకు? ఒకచుక్కయంత స్థలమయిన లేదు. ప్రమాదవశమున నోటనుండి జారినతుం పర రేపు అట్లాంటిక్కు మహాసముద్రమున నుండి బయలుదేరిన యావిరితోఁ జేరి యమెరికాలోని వర్షముల కాధారము లయిన యబ్దమండలముల కాదికారణమగుచున్నది. ఆశక్తియే చంపించుచున్నది. పుట్టించుచున్నది. పెరిఁగించు చున్నది. త్రిప్పించుచున్నది, తనలోఁ గలుపుకొనుచున్నది. తిరుఁగ దనలోనుండి మరియొకరూపమున మరియొక పరిస్థితిని తీయించుచున్నది. సాగించుచున్నది. మరల గుణించుచున్నది. టప్పుమనిపించు చున్నది. ఇంతకంటె మనుష్యస్థితి యెక్కువకాదు కాదు కాదు. మనుష్యునికి బుద్ధియున్నది కాదా? అందుచేతఁ బ్రయత్నము చేయుచున్నాఁ డని చెప్పుదువా? బుద్ధి యెక్కడ నుండి మనుజునకు వచ్చినది? పురుగునుండి వచ్చినదా? చెట్టునుండి వచ్చినదా? చేపనుండి వచ్చినదా? మృగమునుండి వచ్చినదా? క్రిందివారి కెవ్వరికిలేని యాతత్త్వము మనుజుని కెటనుండి వచ్చినది? మనుజుఁ డితర జంతువులవలెనే బుద్ధిహీనుఁడు. మనుజుఁ డక్కడకు వెళ్లినా ననుచున్నాఁడు. ఇక్కడకు వచ్చినా ననుచున్నాఁడు. ఇన్ని గంటలకు భుజించెద ననుచున్నాఁడు. ఇన్నిగంటలకు నిద్రించెద ననుచున్నాఁడు. అక్కడ ననఁగా నేమో, యిక్కడ ననఁగా నేమో, గంట అనఁగా నేమో, కాలము అనఁగా నేమో చెప్పఁగలఁడా? స్థల మనఁగా నేమి, కాలమనఁగా నేమి, స్థలము కాలము బాహ్యాస్తములే యని కొందఱనుచు న్నారు. స్థలమనఁగా నన్నిస్థలము లని కొందరు అనుచున్నారు. ఇన్నిస్థలము లెక్కడివి? ఉన్నదొక్కటే స్థలము. అది మనకు వెలుపల లేదనుచున్నారు. ఎక్కడ నున్నదని యడుగ నది మనస్సులోని యభిప్రాయ మనుచున్నారు. ఇక్కడకు తేలినది. కందస్వామియాలయ మునకుఁ గపాలేశ్వరునియాలయమునకును దూరము మదరాసులోనిది కాదు. సీతలకాయ లోని దనుచున్నారు. ఇటులే కాల మనఁగా నన్నికాలము లనుచున్నారు. భూతభవిష్యద్వర్త మానముల భేదము చచ్చినది నరేకదా! పగటిరాత్రి భేదముకూడ భగ్నమైనది. తుట్టతుదకుఁ గాలము కూడ మనస్సులోని యూహయనుచున్నారు. అటు లయిన ''ఎక్కడ''కు ''ఎప్పుడు''కు భేద మే మున్న దని యడుగఁగా లేకపోయిన లేకపోవచ్చు నని యనుచు న్నారు. ఈస్వల్పాంశమునుగూర్చియే మనుజుని యజ్ఞాన మింత గాటమైనప్పుడు మనస్సు నుగూర్చి, యాత్మనుగూర్చి యడుగ నేల?

మనుజుఁడు మహామందుఁడు! బుద్ధియున్న దనుభ్రాంతిచేత మఱింత బుద్ధి హీనుఁడు. సృష్టినంతయు నాక్రమించిన యద్వితీయశక్తి కెండిపోయిన యా కెంత యధీనమై చచ్చినట్లు దాని వినరునఁ బోవుచున్నదో మనుజుఁడుకూడ నాయపారశక్తికిఁజచ్చినటులే

నెక్కువగ నదీనుండై దాని విసరుచే నెగురుచు నేను విలాసముగా విహరించుచున్నానని తనప్రయత్నమును గొనియాడుకొనుచున్నాఁడు. దాని మరియొక విసరుచే నుత్తరక్షణమున సముద్రతరంగమునఁ బడి చచ్చితి నయ్యో దైవశక్తి నాప్రయత్నమునకుఁ దోడుపడలే దని యేడ్చుచున్నాఁడు.

అద్వితీయమైన యాశక్తిలో ననేకశక్తులు లీనమైయున్నవి. ఒక్కటి పుట్టించుశక్తి, యొకటి వృద్ధిశక్తి, యొకటి క్షయశక్తి, యొకటి వికాసశక్తి, యొకటి సంకోచశక్తి, యొకటి బహుమానశక్తి, యొకటి శిక్షణశక్తి, ఒకటి యానందశక్తి. యొకటి దుఃఖశక్తి. ఇట్లే యనేక కోటుల శక్తులున్నవి. ఇవి యన్నియు వేరుకావు. పరాత్పరుని శక్తి యిన్ని విధములుగా నగుచున్నది. ఆశక్తి కధీనుండై సముద్రముమీఁది నురుగువలె, గాలిలోఁ బరమాణువువలె బానిసయై కొట్టుకొనిపోవు మనుజుడు Chance చేత ననుకూలశక్తి విసరులోఁ బడినయెడల నప్రయోజకత్వమని యెగురుచున్నాఁడు. ఆ Chance చేతనే యననుకూల శక్తి విసరులోఁ బడినయెడలఁ బ్రారబ్ధమని యేడ్చుచున్నాఁడు. ప్రారబ్ధము కాదు. ప్రయోజకత్వము కాదు. మనుజుఁ డస్వతంత్రుఁడు. అప్రయోజకుఁడు. మహాశక్తి కధీనుండై పోవువాఁడే కాని వేఱు కాదు కాదు.

గీ. కుక్కగొడుగులవలెఁ బుట్టి క్రుంగు మనము
ప్రాక్తనప్రకృతిగతి ప్రవాహ మడ్డు
పఱతుమే? బుద్బుదములట్లు? పైన నూఁగి
యెటనొ టప్పన కుండఁ బ్రేలుటయె కాక.

గీ. వస్తు యాథార్థ్య మెఱుఁగక వస్తువునకు
నేదొ సంజ్ఞను మనముంచి యెరిఁగినట
లల్లాడుదు మిది యంత యైంద్రజాల
మందు దుముకులాడెడుబొమ్మలాట కాదె?

గీ. స్వప్నమునకంటె స్వప్నమై సత్యముగను
మాయకును మాయ యగుచు నమ్మకము గాఁగ
శూన్యములకంటె శూన్యమై సుస్థిరముగఁ
గనఁబడెడు దీని నే మని యనఁగవచ్చు?

అంతయు నంధకారము. ఆ యంధకారములో నింద్రజాలము, అందులో నిద్ర, ఆనిద్రలో స్వప్నము. ఆస్వప్నములో బుద్ధిమంతుల మనుకొనిచేయు నస్వభావప్రయత్నములచేతఁ గలిగిన Somnambulism (నిద్రలో తిరుగాడుట) ఇట్టి మహాదురవస్థలో నుపన్యాసము లిచ్చుచున్నాము. గ్రంథముల వ్రాయుచున్నాము. అందుచేతనే యవి యన్నియు నొక్క వస్తువునుగూర్చి యైన యథార్థజ్ఞానము నీయకుండ నున్నవి. అన్నియుఁ బరశురామ ప్రీతి కర్హములు. వేసవికాల మైననేమి? వేయ వోయి చలిమంట వేయవోయి! ఇదియే పరమార్థము. దీని మీఁదనే మనవారు సగుణతంత్ర మంతయుఁ గట్టినారు. అది యంతయు పట్టి మిథ్య. ఇదియే పరమార్థము. దీనిఁగూర్చియే చిరకాల మాలోచింపఁగ నాకు మతిపోయిన

దని యిచ్చటికిఁ దెచ్చినారు. నే నింటికిఁ బోవుదును. నీవు నాకుఁ బ్రతినిధిగ గదిలోఁ గూర్చుండఁగలవా యని యడిగెను.

నే నూరకుండునరికి Faithless fool అని నన్నుఁ దిట్టి తానే గదిలోనికి పోయెను.

ఇతఁడు తప్పుదారిని బడకుండ కొంతసేపటినుండి యుపన్యసించుచున్నాఁడు. పిచ్చి చాలభాగము కుదిరినది. అప్పుడప్పుడు రవంత కనఁబడుచున్నది.

ఇతని యుపన్యాసమునుగూర్చి నే నిప్పు డేమియుఁ జెప్పను. ఆలస్య మైనది. క్షమింపవలయును.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 14. అస్పృశ్యత

అంటరాని తనాన్ని గురించి ఎవరో పంపినఒక వ్యాసాన్ని సాక్షిసంఘానికి పంపారు. దానిని జంఘాలశాస్త్రి చదివి వినిపిస్తున్నాడు.

అస్పృశ్యత, చెప్పరానితనం–అనే రెండు లక్షణాలు ప్రపంచంలో ఏదేశంలోనూ లేవు. ఒక్క భారతదేశంలోనే వున్నాయి. భారతీయుల మనస్సులో వున్న రెండుకళ్లలోనూ రెండు పువ్వుల్లాగ వున్నాయి.

బ్రాహ్మణుడైనాసరే, అంటరానివాడైనా సరే, జ్ఞానసంపన్నుడైనవాడే తనకు గురువని శంకరాచార్యులవారు చెప్పారు. పూర్వ మహానుభావులంద రుకూడా పంచముల్ని ముట్టుకుని, ముట్టుకున్నాడని సంతోషించి కృతార్థుల య్యారు. అంటరానితనం అనేది చండాలత్వంలో లేదు, భగవద్భక్తి, విద్య, వున్న చండాలుడు పూజ్యుడే. పరమార్థజ్ఞానంలేని బ్రాహ్మణుడే అంటరాని వాడు.

అటువంటి పూజ్యులు ఇప్పుడెక్కడ వున్నారనే ప్రశ్నవద్దు. అలాంటి చండాలురూ లేరు; బ్రాహ్మణులూ లేరు. అయితే, మీమొగాలకు తగిన చండాలురు ఇప్పుడున్నారు. వారికి మీరేం చేస్తున్నారు? చండాలుర్ని అస్పృశ్యులుగా మనపూర్వులు భావించలేదు. బ్రాహ్మణుడెవరో, చండాలుడె వరో, బుద్ధుడు విభాగంచేసి చూపించాడు.

సహగమనం, వైధవ్యపాలనం, రజస్వలానంతర వివాహం, సీమవెళ్లిన వారిని బహిష్కరించడం, దేవరన్యాయం–వంటి అన్యవసర ఆచారాలు పోయి నట్టే, అంటరాని తనం కూడా పోవాలి. పోయినవన్నీ బాహ్యాచారాలు. మతానికి ప్రధానాలు దయా, సత్య, శౌచాలు, స్వార్థ రాహిత్యం అనేవి. పంచములుచేసే చాకిరీ, వారుచేసే ఉత్పత్తులు పనికివచ్చి వారిని ముట్టుకో వడం పనికి రాదా! ఈ అస్పృశ్యత అవశ్యం నశించాలి–అని ఆ ఉత్తరం సారాంశం.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

నాయనలారా! అంటరానితనమును గూర్చి యెవఁడో యొక యనామకుఁ డొక వ్యాసము వ్రాసి సాక్షిసభలోఁ జదువు మని పంపినాఁడు. దానిని జదువుట కనుమతి నీయవలయును.

నేను శ్రుతు లెఱింగిన వాఁడను కాను. స్మృతు లెఱుఁగను. శాస్త్రములు చదువలేదు. (ఏమియుఁ జేతకాని వాఁడవుకదా, నీ కుపన్యాస మేల నోరు మూసికొని యుండలేకపోయి నావా అని సభలోఁ గేకలు) ఈకాలమున నస్పృశ్యతను గూర్చి యందఱు చెప్పుచుండఁగా నాకుఁగూడ బుద్ధి పుట్టినది. (అంటరానితన మంటురోగమఁటయ్యా అని సభలోఁ గేకలు) ప్రపంచమున నితరజాతు లన్నియు వారివారి వర్తక వ్యాపారములు, వ్యావహారికధర్మములు, రాజకీయతంత్రములు, కళాభివృద్ధిమార్గములు, ధనసంపాదనతంత్రములు నిర్వహించుకొనుచుండఁగా మన మేమి చేయుచున్నాము? మన విద్యలను బైవారి కంటఁగట్టి, మన ధనమును బరులయొడిలోఁ బోసి, మన యాధిక్యమును మన్ను చేసికొని, మనప్రభుత్వమును బానిసతనము క్రింద మార్చుకొని, మనుష్య స్వరూపములతో మాత్రమే చచ్చినకంటె నెక్కువ హీనపుబ్రదుకును బ్రదుకుచు నీ యధమత్వములో నీయధమాధమత్వములో నీకంటె నే నెక్కువ యని నేను మడి యని నిన్ను ముట్టుకొనిన నే నొడలు గోయించుకొనవలెనని, నేను మోక్షార్హుఁడ నని నీవు చెప్పరానివాఁడ వనియు, నితరజాతులు వినిపోదురేమో యని సిగ్గుబిడియములులేక, మానాభిమానములు మంటఁబెట్టి సభలలో వాదించుకొనుచున్నాము. పత్రికలలోఁ బ్రచురించుకొనుచున్నాము. అన్నియుఁ బేడలోని పురుగులే యైనప్పుడు, ప్రక్కనున్న పురుగుకంటెఁ బైనున్న పురుగు ఘనత, గౌరవము, ప్రశస్త్యము, పరమయోగ్యత, యధికము లనవచ్చునా? అజ్ఞతములైన యర్భకులు సైతము నిట్టి యవాచ్య చర్యల కధీను లగుదురా?

అస్పృశ్యత, చెప్పరానితనము—ఈస్థితిమాత్రము ప్రపంచమందున్న దేశములలో నొక్క భారతదేశమునందు మాత్ర మున్నది. అమెరికాదేశస్థులుఁ నీగ్రోల నిట్లు హీనముగాఁ జూచుచున్నారని చెప్పుదురు. కాని యింత పాపము, యింత ఘోరత, యింత మూర్ఖత, యింత క్రౌర్యము మనదేశమందే తక్క మఱి యెచ్చటను లేవు. అంటరాని తనము చెప్పరానితనము నను నీ రెండు మాటలు నొక్కభారతదేశ సారస్వతమునందే యున్నవి. ప్రబలమైన మన యజ్ఞానమున కివి ప్రచండ నిదర్శనములై యున్నవి. భారతీయుల మనస్సులలో నున్న రెండు కన్నులలోను నివియే రెండు పూవులై యున్నవి.

మనపూర్వు లెట్టివారో, మనదేశ మెట్టిదో యీ సందర్భమున రవంత చూచుకొనవలసియున్నది కాదా? లోకమున కంతకును జ్ఞానతేజస్సును ప్రసాదించినవారు మనపూర్వులు. తత్త్వజ్ఞాననిశ్రేణికపై మనవా రెక్కినయెత్తువఱకుఁ దల లెత్తిచూడలేక కన్నులు దిరిగిపోవఁ బాశ్చాత్యతాత్త్విక విద్వాంసులా నిచ్చెన యడుగు మెట్టుదగ్గఱఁ గూలఁ బడియున్నారు. ఒక్కకళయందుఁ గాదు, ఒక్కశాస్త్రమందుఁ గాదు. అన్నిటియందుఁ గూడ మన పూర్వులు పరమావధియైన పరమార్థమును గనుఁగొనివారు. అత్యంతతపోనిష్ఠాగరిష్ఠతచే మనపూర్వు లగ్ని తేజస్సుతోఁ బ్రకాశించెడివా రగుటచేత వారంటరాని వారని చెప్పవచ్చును. వారియోగ్యతను గూర్చి చెప్పినతరువాత, నానోటితోడనే యితర జాతులను గూర్చి చెప్పఁగూడదు. కావున వారు చెప్పరానివారైరి. అంటరాని చెప్పరాని మాటల కర్థ మిది కాని మఱియొకటి కాదు.

అట్టివారి సంతతివార మైన మన మిప్పు డెట్లున్నాము? ఒకరు చెప్పనేల? మనకే తెలియును? లోకమున కంతకంటెఁ దెలియును. ''విద్యావినయసంపన్నే బ్రాహ్మణేగని

హస్తిని'' అని శ్రీకృష్ణదేవులానతిచ్చినారు. బ్రహ్మజ్ఞానసంపన్నుఁడైన బ్రాహ్మణునికిని, నీచజంతు వైనకుక్కకును, దానిని దినుజండాలునకును బరమార్థమున భేదము లేదని చెప్పినారు. అట్టిభేదముఁ జేయువాఁడు కుక్కకంటె నధముఁడు కాఁడా? కాలిక్రిందఁ బ్రాఁకుచీమకును, గగనమున వెలుఁగొందుసూర్యునకును దత్త్వమున నెంతమాత్రము భేదము లేదని బుద్ధదేవుఁ డానతిచ్చినాఁడు. ద్విజుఁ డైన సరే, చండాలుఁ డైనను సరే యెవ్వఁడు జ్ఞానసంపన్నుఁడో వాఁడే నాకు గురుఁ డని శంకరాచార్యులు సెలవిచ్చినారు.

ఇక చిత్రమైన సంగతి చెప్పెదను. పెరియనంబియు మార్నేరు నంబియు నను నిద్దఱు యామునాచార్యులవారియొద్దఁ జదువుకొనినారు. మార్నేరునంబి పంచముఁడు– పెరియ నంబి బ్రాహ్మణుఁడు. ఇట్లుండఁ గొంతకాలమునకు మార్నేరునంబి కవసాన సమయము సిద్ధించినది. అప్పుడాయన పెరియనంబిగారి కిట్లు వార్త నంపినారు. యామునాచార్యభగవా మనక శేషత్వ మొందిన యీతనువును బ్రాకృతులు ముట్టిలోఁగలుపుటకు నే నిష్టపడను. దేవరవారు నన్నుఁ గరుణించి నా యంత్య సంస్కారముల లాచరింపవలయు నని కోరు చున్నా నని వార్త నంపెను. ఆహాహ! ఇది యెంత యాశ్చర్యకరమైన విషయమో! వైష్ణవో త్తముఁడై బ్రహ్మజ్ఞానసంపన్నుఁ డైన యామునాచార్యశిఖామణి యేమి! ఒక పాదమునొద్ద బ్రాహ్మణుని, నొకపాదమువద్దఁ బంచముని గూరుచుండఁ బెట్టుకొని విద్యను బోధించుట యేమి! ఆహా! ఇది యిప్పుడెంత విశేషాంశము! పొట్లపిందెవలె వంకరటింకరలు వోయినమన బుద్ధులకు దేశమహాప్రారబ్ధముచేత దిగజాతి దిగజాతి నేలములగ చెట్టునకు నిచ్చెన వేయవల సివచ్చిన మనబుద్ధులకు–సర్వజాతిసామ్యము సర్వజనసోదరత్వము, స్వార్థపరతాశూన్యత, భూతదయయుఁ జిరకాలపు బానిసతనముచేత నంతరించిపోయిన మనబుద్ధులకు ఈయం శము విశేషాంశముగఁగనఁబడదా! యామునాచార్యులవారు మార్నేరునంబిగారికి బాలబో ధము చెప్పినారా? బ్రహ్మసూత్రభాష్యము బోధించినారు. ఆనంద వాచకపుస్తకము చెప్పి నారా! ఆత్మజిజ్ఞాసాశాస్త్ర్ర ముపదేశించినారే. ఇది యప్పటిదినములలో సామాన్యవిషయమే.

అప్పటిస్థితికి నిప్పటిస్థితికి నెంత యేతపుఁబెట్టుగా నున్నదో చెప్పవలయునా? మహాగౌరవముతో వంశపారంపర్యముగఁ బోషింపఁబడుచున్న వైదిక విద్యాంసుఁడు తన మహారాజునొద్దసైత మొక్కవేదవాక్యమైన వచింపఁడే! జపతపములులేని చదువు సందెలులేని మంచిచెడ్డలులేని ముండమోపిమిండఁడైన యేబాఁపనకుంత నైనను దగ్గఱఁ బెట్టుకొని యానిర్భాగ్యునిమొగము చూచుచు మహారాజునొద్ద వేదము వచించునే! ఆహా! ఇది యెంతదా రుణము. వీని వైదికపాండిత్యము మండిపోను! శూద్రుఁడు వేదము వినఁగూడదా? ఆతఁడు తరింపఁదగదా? ఇతఁడేనా పండితుఁడు. ఇతఁడేనా ప్రాజ్ఞుఁడు. ''ఓ బ్రాహ్మణుఁడా నీవే యపండితుఁడవు. నీవే పనికిమాలినవాఁడవు. నీవే తరింపఁదగినవాఁడవు. నీవే శాశ్వత శిక్షార్హుఁడవు. నీలో నున్న వేదజ్ఞానమందలి గౌరవముచేత నిన్నుఁ బోషించుచున్న మహారాజే బ్రాహ్మణుఁడు. అతఁడే వైదికవిద్వాంసుఁడు. అతఁడే తరించువాఁడు'' అని యనఁదగదా?

మార్నేరునంబి కోరికపై బెరియనంబి వచ్చి యాతనికి నమస్కరించెను. అప్పుడు పంచముఁ డిట్లు పలికెను. ''నేను దైవనామస్మరణ మొనర్చుకొనుచు మరణించునెడల నీవు నాకు బదిదినములు మైలపట్టి యుత్తరక్రియ లొనర్పవలయును. ఆచార్యవర్యుని స్మరించుకొ నుచు మరణించునెడల నొక్కదినముమాత్రమే మైలపట్టవలయును. నే నెవరిని స్మరింప

కుండ, నేతలంపు లేకుండ, నిర్మనస్కముగ మరణించునెడల నీవు నాకొఱకు మైలపట్ట నక్కఱలేదు. అగ్నిసంస్కారము మాత్ర మొనర్చిపొమ్ము'' అని చెప్పెను. బ్రాహ్మణుఁ డేమి? పంచమునకేమి అశుచి పట్టుట యేమి? ఔర్ధ్వదైహికక్రియ లాచరించుట యేమి? ఆహా! ఎంతవింత! తల్లిదండ్రులకుసోదులకుఁ జేసినట్లే పంచమునకు బ్రాహ్మణుఁడంత్యక్రియలు చేయుటయే! సర్వజనభ్రాతృత్వ మనుసంగతి మనకుఁదెలియును. వారికిఁ దెలియును. వారి కాచరణములో నున్నది. మనకు లేదు అదియే భేదము. తెలిసినవాఁడు విద్వాంసుఁడు కాఁడు. తెలిసి నట్లాచరించువాఁడే ఘనుఁడు. పెరియనంబి మార్నేరునంబికి బ్రహ్మమేధ సంస్కార మొనర్చి స్నానమైనఁ జేయకుండ, బట్టలైన మార్చకుండ, తిర్వారాధాన కానిచ్చుకొని భుజించినాఁడు. ఏశవమునైనను ముట్టుకొన్న పిమ్మట స్నానము చేయవలసియుండఁగా పంచమశవమును దాఁకియాతఁడు స్నానము చేయలేదు. ఆశ్చర్యకరము! భగవద్భక్తునియం దున్నమహిమము!

ఇందువలన నేమి తెలియఁదగిన దనఁగా:–పూర్వమహానుభావులందఱుకూడఁ బంచములను స్పృశించి స్పృశించితి మని సంతోషించి కృతార్థులైనారు. అందుచే నస్పృశ్యత మనునది చండాలత్వములో లేదు. భగవద్భక్తుఁడైన చండాలుఁడు పూజ్యుఁడే. విద్యగలచండాలుఁడు పూజ్యుఁడే. పరమార్థజ్ఞానాభావుఁడైన బ్రాహ్మణుఁడే యస్పృశ్యుఁడు.

అట్టి పూజ్యులైన చండాలు రిప్పు డెక్కడ నున్నారని బుద్ధిహీనమైన ప్రశ్నము వలదు. అట్టి చండాలురు లేరు. పెరియనంబి వంకరాచార్యులవంటి బ్రాహ్మణులు లేరు. కాని మీ మొగములకుఁ దగిన చండాలు రిప్పు డున్నారు కాదా. మీరు వారి కే మొనర్చినారు?

అదిగాక బుద్ధుని జంపుట కలవకుఁడు, నంగినమాలుఁ డని యిద్దఱస్పృశ్యులు వచ్చినారు. ఒకఁడు నరఘాతకుఁడు. ఒకఁడు నరమాంస భక్షకుఁడు. ఇద్దఱు కలసి బుద్ధదేవు రూపుమాపుటకు వచ్చినారు. దేవతాతేజస్సుతోఁ బ్రకాశించుచున్న దివ్యమంగళవిగ్రహము గాంచి తెల్లఁబోయినారు. ప్రేమావతార మగుబుద్ధదేవుఁడు వారిని గౌఁగిలించుకొని చెఱియొకతొడపైఁ గూరుచుండఁ బెట్టుకొని నీతిని బోధించి వారిని బుద్ధమతావలంబకులుగఁ జేసినాఁడు. పన్నిద్దఱాళ్వారులలో నొకఁడు పంచముఁడు. ఇందువలన యోగ్యతయే ప్రధానము కాని మఱియొకటి కాదు. చండాలు నస్పృశ్యునిగా మనపూర్వులు భావింపలేదు. బ్రాహ్మణుఁడెవఁడో చండాలుఁ డెవఁడో బుద్ధుఁడు చేసినవిభాగమును గూర్చిన పద్యములు నాల్గు వినదగినవి.

కాని యవి బుద్ధనాటకములో నుండుటచే నిట వ్రాయలేదు.

ఇప్పుడు మనల మనము గాఢముగాఁ బరిశీలించుకొన్నయెడల మనకున్న బ్రాహ్మణత్వ మేమో మనకుఁ దెలియును. మనకు వేదాధ్యయన మున్నదా? స్మృతులను శాస్త్రములను జదివితిమా? పురాణములు బూతులని మానినవైన వా రెవరు? పూర్వ బ్రాహ్మణాచారములైనఁ జేయుచుంటిమా? ఏకారణముచేత మనము ఘనుల మని చండాలురు నీచు లని మనము చెప్పఁగలము? యథార్థ మాలోచింపఁగ జ్ఞానశూన్యుల మైన మనమే యస్పృశ్యుల మేల కాము?

మన పూర్వాచారము లెన్ని నశించిపోయినవి? సహగమన మిప్పుడున్నదా?

పుణ్యాత్ముఁ డైనరాజా రామ మోహనరాయలు దీని నివారించుటకుఁ బ్రయత్నింపఁగా నాకాశ మంత నోరు పెట్టుకొని మనవారు వాదించియుండలేదా? మతము పోవు నని మొఱపెట్ట లేదా? మహజర్లు చేయలేదా, మామగలతో మేము చితి నెక్కినఁగాని మాకు మోక్షము లేదు లేదని స్త్రీలచేత సంఘవిజ్ఞాపనములు చేయింపలేదా? మత మిప్పు డేమాత్రము పోయినది?

వితంతువివాహము పనికిరాదని మనము ఘోషింపలేదా? అందును గూర్చి యెన్ని తగవులైనవి? ఎన్నివ్యాజ్యెములు పడినవి? ఎన్ని చార్జీలు జరిగినవి? మతము పోవు నని యెంత యల్లరి ప్రబలినది? సంస్కర్తల కెన్నితి ట్లయినవి? చిట్టచివర కవి బాహాటముగ జరుగుచుం డుట లేదా? అసలు పెండ్లికూఁతు మొగములోకంటె విధవపెండ్లికూఁతు మొగములో నెక్కువ పెండ్లికళను మనవారు చూచుచుండుట లేదా? పెద్ద లంద అట్టి పెండ్లిండ్లకు సంఘసంఘముల క్రింద నుత్సాహమున చేరుటలేదా? ప్రస్తుతపుమగఁడు పరమపదించినపి మ్మట మనమతని వితంతువును జేసికొంద మని కొంద రుబ్బుమాటలూరుచుఁ గనుపెట్టికొని యుండుటలేదా? ఇప్పుడు తమమత మేమైనట్లు? ఏమాత్రము పోయినదయ్యా!

రజస్వలావివాహమునుగూర్చి యెంత గందరగోళ మైనది? ఆచట్టమువచ్చినతర్వాత నోరు మూసికొని పడియుండిరా? లేదా? సీమవెళ్లినవారి నేమాత్రము బహిష్కరించుచు న్నాము? అట్టివారే వెళ్లనివారిని బహిష్కరించుటకుసిద్ధమైయున్నారుకాదా? పలపైతృకము మానిన తరువాత తమ మత మేమైనఁ బోయినదా? పూర్వపు దేవరన్యాయము మాటయేమి?

అదిగాక స్త్రీవిద్యయే కూడ దని యెంత యజ్ఞులమై వాదించితిమి. ఇట్టి మన యప్రతిష్ఠ యస్వాభావికత యనౌచిత్యము హిమాలయపర్వత ముండఁదగినంతకాల ముండఁదగినది కాదా? మన యానాఁటి యవకతవకమాటలు భారతకాంత కొడలిమీఁది వ్రాతలుగా నిల్చి యుండును గాని పోవునా? వేదాధ్యయనము లేదు. బ్రహ్మచర్యము లేదు. పోని గూడక ట్టయిన నున్నదా? యజ్ఞోపవీత మున్నదో లేదో తడిమి చూచుకొనుఁడు. త్రిమతస్థులలోని వైదికులకుఁగూడ కొందఱు సన్యాసులకుఁగూడ నుల్లిపాయల పెసరట్లు లేకుండ కాఫీ గడచుచున్నదా? ఇది గాక ఆంగ్లేయభోజనమఠములలో మనము దినుచున్న మాంసజాతులకు హద్దున్నదా? ఏలయుండును? పప్పునియమ మెప్పుడు దాఁటితిమో పందిమాంస మైన నేమి, నందిమాంస మైన నేమి, సవర్ణులుపయోగించుచున్న మాంసమును బ్రాందిని నేపం చము లుపయోగింపఁగలరు? మతమో మతమో యని యిఁక నేమొగము పెట్టుకొని దేవులాడుచున్నారు? తమ మిదివఱకే పోయినదా? ఇకఁ బోదు. ఇదివఱకుఁబోలేదా ఇంకఁ బోదు.

పోయిన వన్నియుఁ గూడ బాహ్యాచారములు, మతమునకు బహిర్లాంఛనములు. మతము విభూతిపండుతోఁగాని చిట్టిగారెతోఁగాని గోపీచందనముతోఁ గాని నిల్చునది కాదు. రాజునకుఁ గిరీట మెట్టిదో భటునకు డవాలి యెట్టిదో మతమున కాచార మంత కంటె నెక్కువది కాదు. నవనాగరకనారీశిరోమణి చీకటులఁ జిమ్ము జుట్టు కత్తిరించుకొని మోఁకాళ్ల వఱకు మాత్రము లాగుతొడిగికొని సైకిలెక్కి వీథులవెంట స్వారిచేసినంత మాత్రమున నామె స్త్రీత్వ మేమైన దగ్గినదా? మతమునకుఁ బ్రధానము లైనవి కొన్నియున్నవి. అవి పోయినయె డల మతము పోవును. అవి యేవన, దయ సత్యము శౌచము స్వార్థశూన్యత వైరాగ్యము భక్తి జ్ఞానము మొదలగునవి. వీనిలోఁ గొన్నియైన మనకుండునెడల మత మెన్నఁటికిని

బోదు. మనము తిరుగ నాంతరంగిక పరీక్ష చేసికొందము.

మనజాతి భూతదయకుఁ బ్రసిద్ధి కెక్కినది. ఈదేశములో జరుగుచున్న యన్నదాన మెచ్చటను జరుగుటలేదు. ఇన్ని దేవాలయము లెచ్చట నున్నవి. ఇన్ని చలిపందిళ్లు లెచ్చటనున్నవి? చెదల కాహారములే, చీమలకు చిందబెల్లములే, పాములకు క్షీరాభిషేకములే. తుదకు దోమలు కుట్టిన పశువులొడలు రాచుకొనుటకు రాతికంబములే. అట్టి మనము వితంతు స్త్రీలను భర్తలతోఁ గాల్చినప్పు డెంతదయఁ గనఁబఱిచితిమో చెప్పవలయునా? వితంతువులకు వివాహము లేకుండ వారికి భోజనమైనఁ దిన్నఁగ లేకుండ వారితలలపై గృహకృత్యభారఁ ముంచి వారిని బాధించునప్పుడు మనదయ యెట్టిదో లోకమునకుఁ దెలియుట లేదా? తోడిమానవులైన పంచములను, మన కెన్నివిధములుగానో యుపకరించు చున్న పంచములను నధమస్థితిలోనుంచి వారిని మనుష్యుల వలెఁ జూడకున్నప్పుడు తెలియలేదా? వారివ్యవసాయము మనకుఁ బనికివచ్చు నేమో? వా రిచ్చిన ధాన్యము మనకుఁబనికివచ్చునేమి? వారుమేపిన పశువుల పాలు మనము త్రాగవచ్చునేమి? వారుచేసిన శ్రమ యంతయు మనకుఁ బనికివచ్చునేమి? అట్టిచో నింత యుపకారకుల నేల యస్పృశ్యు లగా నుంచవలెను? కుక్క ప్రవేశించిన యిల్లు మైలపడలేదో? గాడిద లోనికివచ్చిన మైలపడలేదో? పంచముఁడు వచ్చిన యెడల మైలపడునా? మనము వారియెడల మనుష్యులవలెఁ బ్రవర్తించుటలేదు. ఆమనుష్యులను నీచజంతువులకంటె నీచముగాఁ జూచిన ప్పుడు మనము మనుష్యులమే కా మని పైవా రనుకొనినఁ దప్పేమున్నది?

ఇఁక సత్యమునుగూర్చి చెప్పెదను. సత్యము సృష్టి కాధారమై యున్నది. అట్టి సత్యము మనలో నెట్లున్నదో చూతము. ఏమి చెప్పవలయును. ఎవఁ డెఱుఁగఁడు. అసత్యముకొఱకే కానియెడల నిన్నికోర్టులెందులకు? ఇందరు న్యాయమూర్తులెందులకు? ఇందరు న్యాయవాదు లెందులకు? ఇందరు కక్షిదారు లెందులకు? ఇంతబిళ్ల కర్చెందులకు? ఇందరు సాక్షు లెందులకు?

పూర్వమున నివి యేవియైన నుండునా? తాటాకుపాయమే పత్రము –సూర్యచంద్రులే సాక్షులు–ఇప్పుడట్లాపత్రము వ్రాయుఁబోవునప్పుడే, యెగఁబెట్టుటకు సాధన మెట్లో స్థిరపఱుచుకొనుటకుఁ గట్టుదిట్టములైన యాలోచనలు చెప్పుటకు కల్పవృక్ష మైన ప్లీడరు మన కున్నప్పుడు చిక్కేమున్నది? అతఁడే లేనియెడల వితంతువైనవదినెగారు వ్యభిచారిణి కావున మనోవృత్తి వ్యాజ్యెము చెల్లఁగూడ దన్న చల్లనియూహ మనకుఁ జెప్పినవా రెవరు? భార్యను జంపిన పాపాత్మునికిఁ దాత్కాలికోన్మాద మని రుజువు పఱచి యురినుండి తప్పించిన బుద్ధిమంతుఁ డెవరు? ఎట్టిఘోరాపరాధ మొనర్చిన వానికైనఁ బెరుమాళ్లకంటె ప్లీడరే యెక్కువరక్షకుఁడు కాదా? వారిలో నసత్య ప్రోత్సాహకులు కొందరైన నుండుటచేతనే యిట్లు ప్రపంచ మింత దొరలిపోవుచున్నది.

ఇఁకఁ బాతివ్రత్యమును గూర్చి చెప్పెదను. భారతదేశమందుండిన ధనమంతయుఁ బడమటికిఁ బోయినప్పటికిని భారతదేశ సౌభాగ్యమంతయుఁ బరశురామప్రీతి యైనప్పటి కిని, భరతదేశ స్వాతంత్ర్యమంతయు భగ్నమైనప్పటికిని, మనకింక మిగిలిన తఱుగులేని విఱుఁగులేని విలువలేని ధన మొక్క స్త్రీల పాతివ్రత్యమే కాదా?

సత్యము, ధర్మము, దయయుఁ, బాతివ్రత్యము ననునవి Barbaric Virtues అనియును, నవి యనాగరకులయొద్ద నుండఁదగినవి కాని దమయొద్ద నుండఁదగినవి కావనియు గొందఱ యభిప్రాయము. మనవారు సత్యము ధర్మము దయము Virtues నుండి తీసివైచినారు. ఇఁకఁ బాతివ్రత్యమునుగూడ నట్లు తీసివేయుదురేమో తెలియదు. చంచలబుద్ధులగు మగవారట్లు తీసివై చిననుబూర్వమహాపతివ్రతలచలువ చేత నట్టి దుర్దశ రానేరదు.

వంక దాటులలో మగవారు ఘనులు
వంశమర్యాద యెన్నఁడు వదల దబల
యింటిపరిశుద్ధి యెల్లప్పు డింతి వలన
నిలఁబడును గాని మగవాని వలనఁ గాదు
ఆఁడుదాని యాచార మాహాత్మ్యమునను
బురుషు కానికూళ్లును దొంగపోకడలును
బైగనే కాని యింటిలోపలికిరావు
కాన నిప్పటికినిజాతి ఘనతదక్కె
కట్లు విడఁద్రెంపి చెలరేఁగ కాంత నడవ
దేశదుస్థితి సంజ్ఞగాఁ దెలియవలయు
నిట్టిదుర్దశ మనకు లే దింతవఱకు
భావిగతి యేదొ యెవ్వరు పలుకఁ గలరు?
ఎంత చెడినను మన స్త్రీలె యిలను గలుగు
నబలలం దుత్తమోత్తమ లనుట తగును
దేశనుభగత మగవాని తెలివిఁబట్టి
నిలువ దబలయోగ్యతఁ బట్టి నిలుచుఁగాదె?

తండ్రియిచ్చిన యవకతవక యాజ్ఞల నన్నియు నంత బుద్ధిహీనముగా వినుటయేనా? తన కామాత్రపు Judgment అక్కఱలేదా? అందుచే రాముఁడు వట్టి Blockhead అనుచున్నారు. హరిశ్చంద్రు నంతటివానిని భార్యావిక్రయ సందర్భమున Inhuman brute అనుచున్నారు. అతని సత్యరక్షణమును గూడ నెంతమాత్ర మిప్పటివారు మెచ్చకుండ నున్నారు. భార్య నొకనికి దాన మిచ్చిన రఘుమహారాజును At once an Emperor and go-between అనుచు డాఫరుజాతిలోని కీడ్చివేసినారు. సత్యవైరాగ్యస్వార్థరాహిత్యాద్యనేక గుణములు మోక్ష సాధనము లైనవి పోయినను మత మింక నిల్చి యున్నదా? ఇట్టి మనస్థితిలో నొక్కమాట నడిగెదను. యథార్థముగ నస్పృశ్యులు మనమా పంచములా? వారికి మనవిద్య లేదు. అందుచేత మనకున్న యింద్రజాలమహేంద్రజాలములు వా రెరుఁగరు. వారికి మనకున్న నాగరకతలేదు. అందుచేత మనకున్న కానికూళ్లు తప్పుతిరుగుడులు వారికిలేవు. అందుచేత మనమే మస్పృశ్యులము. మనయుద్ధరణము మాట యేమి? ముందు సృష్టిలోనో యీపై సృష్టిలోనో జరుగునో లేదో యను నంశమునుగూర్చి యిప్పుడు చింత యేల?

బ్రాహ్మణస్త్రీకి శూద్రునివలన గలిగినబిడ్డలు పంచములని చెప్పినారు. ఇది సత్యమో యసత్యమో యెవరు చెప్పగలరు? ఎటులైనను తలక్రిందు పెండ్లిండ్లు తగవని, యందువలనఁ గలిగినసంతానములు బహిష్కారయోగ్యము లని యిందువలన నిర్ణయించుట కవకాశము

న్నది. అయినను వారిదోషమువలన వారట్లు కాలేదు. మనదోషము వలన నైరి. ఎన్ని వందల సంవత్సరముల క్రిందటనోయైరి. అట్టినిర్దోషులను–అది గాక మనదోషముల వలననే యట్లు కావలసి వచ్చినవారిని సంఘములోనికి విద్యాబుద్ధులు చెప్పించుచుఁ దీసికొనుట మంచిది. ఎప్పుడో జరిగిన యీతప్పును గూర్చి యేల?

ఇప్పు డిట్టి తలక్రిందుపెండ్లిండ్లు ఎన్ని యగుచుండుటలేదు? ప్రత్యక్షముగ బాహాటముగఁ బ్రచ్ఛన్నముగ నరచాటుగ నెన్ని జరుగుటలేదు? అందువలన మన సంఘమందెన్ని సంతానములు కలుగుటలేదు. దినమున కట్టి సంతానములు భారతదేశమందు వేలకొలఁదిఁ గలుగుచుండుట నిస్సందేహము. అవి మన మెఱుఁగుదుము. ఎఱుఁగము. ఎఱిఁగియు నెఱుఁగక యున్నాము. ఎఱుఁగకుండ నెఱిఁగియున్నాము. అట్టివారిని మన సంఘమందుఁ బ్రాణప్రదముగ నుంచుకొనుచుండుట లేదా? వారి సంతానములను కర్షులైనప్పుడు–ఎన్నివేల సంవత్సరములక్రిందటనో మన దోషమువలననే బహిష్కృతులైన వారిని సంఘమున కేల తీసికొనఁగూడదు? సంఘములో నింత దొంగతనము–నింతపాపము–నింత క్రుళ్లుదాఁచుకొని దాఁచుకొని సహించు చున్నప్పుడు నిర్దోషులైన వారి నేల తీసికోఁగూడదు?

భారతీయ పూర్వాచారము లన్నియు నశించినవి. వానివలెనే యీ యస్పృశ్యతకూడ నశింపఁ దగినది. అది మనకు బాధ నిచ్చుట లేదు. కావున దీని నింక యట్లె యుంచినాము. ఇది మరింత పాపము.

మీకు మతము పోవునప్పటికి బ్రదుకుపోవునప్పటికి మోక్షము పోవునప్పటికి రామానుజులు గోపుర మెక్కి తిరుమంత్ర ముపదేశించినట్లు మీరు వారి నుద్ధరించుట మహాకార్యము. మీరట్లు చేయలేరా? ఇప్పుడే కాకపోయిన మరి యింక కొలఁది కాలమునకైన వారె మన స్థాన మాక్రమింతురు. ఇప్పుడే యట్లు చేసి మాట దక్కించుకొనునట మంచిది.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 15. కురుక్షేత్రము

జంఘాలశాస్త్రి ఒకసారి ఢిల్లీ వెళ్ళి అక్కడ నుంచి కురుక్షేత్రం యాత్ర చేశాడు.

రైలుదిగి, సూర్యకాంతికి ముచ్చటపడి ఆశ్చర్యం నుంచి తేరు కుంటూ అనుకున్నాడు. ఆశ్చర్యపడే శక్తి మనిషికున్న శక్తుల్లో ముఖ్యమైంది. ఆశక్తి నించే ఎంతటిజ్ఞానమైనా పుట్టింది–అనుకున్నాడు.

జంఘాలశాస్త్రి ఒక బ్రాహ్మణుడింటికి వెళ్ళి స్నానం, భోజనం ముగిం చుకుని, కురుక్షేత్రంలో యుద్ధభూమిని చూడటానికి వెళ్ళాడు. శ్రీకృష్ణుడు అర్జునుడికి గీతా బోధ చేసిన స్థలమేది?–అని అడిగి తెలునుకొని–అక్కడ నిలబడ్డాడు. ఆ స్థలం కొంచం ఎత్తుగావుంది. అక్కడొక మండపం వుంది. దాని వెనక చిన్నచెరువుంది. భూమ్యాకాశాలు కలిసేవరకు అక్కడ కనుచూపుమేర ఒక్కటే బయలు భయంకరంగా కనిపించింది. రక్కసికంపలు, జిల్లేడు మొక్కలు, వంటివి తప్ప ఇంకే మొక్కలూ లేవు.

ఇదేనా కురుక్షేత్రం! అని–భారత ఘట్టాలు తలుచుకుని–భగవద్గీతను తలుచుకుని–పరవశించాడు జంఘాలశాస్త్రి. అంతలోనే–ఢిల్లీలో తాను చూసిన పాదుషా దివాన్‌ఖానా గుర్తొంచ్చింది. దాని సౌందర్య ప్రశంస గుర్తొచ్చింది. కాని–జంఘాలశాస్త్రి–'మనకు కురుక్షేత్రమే స్వర్గం' అన్నాడు. ధర్మరాజు ద్వైధీభావ మనస్సునీ, అర్జునుడి అజ్ఞానతత్త్వాన్ని తలుచుకుని –కునుకు తీసిన శాస్త్రి ఒకకల వచ్చింది. అందులో వ్యాసమహర్షి కనిపించాడు. భగవద్గీతకు భిన్నభిన్న అర్థాలలో వ్యాఖ్యానాలు పుట్టాయెందుకని ప్రశ్నిం చాడు. ఆ వ్యాఖ్యలు సరియైనవి కావు అన్నట్టుగా ఆ మహర్షి చిరునవ్వు నవ్వాడు.–బస్సు మనిషికేకతో జంఘాలుడు మేలుకొన్నాడు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

నేను సభకుఁ బోవునరికి జంఘాలుఁ డేదియో యుపన్యసించుచున్నాఁడు. అంత కుముం దేమి చెప్పెనో గాని నేను వెళ్లినపిమ్మట నిట్లు చెప్పెను.

కురుక్షేత్రపుస్టేషనులో నేను దిగుట యేమి, సూర్యుఁ డుదయాద్రిపై నెక్కుడ యేమి.

ఆతఁడు కరకర లేచుచున్నాఁడు; నేను జర జర నడచుచున్నాను. సూర్యోదయము కాకమునుపే స్నానముచేసి, యర్ఘ్యప్రదాన మొనర్చి, సూర్యనమస్కారము లాచరింపవలసిన నేను దంతాధవన మైన లేకుండ సూర్యునివైపుదిరిగి చెంపలు గొట్టుకొనకుండ, మూట చేతఁ బట్టుకొని, మునిఁగిపోయిన ట్లూరిలోనికిఁ బోవుచున్నాను. సవితృమండలదర్శన మొనర్చి మనవేదర్షు లాతేజోవైభవమునకు, నాతమశ్ఛటా విచ్ఛేదనసామర్థ్యమునకు, నా సర్వమాలిన్య నివారణమహనీతయకు, నా యారోగ్యప్రదానప్రవీణతకు, నన్నిఁటిని మించిన యాహృదయతాపాపహరణశక్తికి, నాత్మ వికాసశక్తికి వింతపడి, యొడ లంత చూపుగఁ జేసికొని, యాచూ పంతయు మనసుగఁజేసికొని, యామన సంతయు నాత్మగఁ జేసికొని, యా యాత్మ నంతయుఁ బరమార్థ జ్ఞానసంపన్న మొనర్చుకొని కవులై, భక్తులై, గాయకులై, విరాగులై, వేదాంతులై యెన్నివేల సంవత్సరముల క్రిందటనో పాడినపాటలు, చేసిన నృత్యములు, వెదచల్లిన తత్త్వములు, భారతదేశమున కిచ్చిన వెలుఁగే కాదా? ప్రపంచమునం దంతయు నిప్పటివఱకుఁనిలిచి, సృష్టి పోయినను నిల్చునది యాతేజ మొక్కటియే యైనట్లు చెప్పకచెప్పుచున్నదే. ప్రకృతిలోని తేజస్సముద్రమును, సౌందర్యరాశిని, శక్తిసంపన్నతను, మహామహిమ విశేషమును గాంచి, యద్భుతపడని వాఁడు పనికిమాలిన పందలలోఁ బ్రప్రథముఁడు. చూడఁదగినవస్తువును జూచి శిరఃకంపనము చేయనివాఁడు పశువుకంటె నధముఁడు. ఆశ్చర్యపడుట యనుశక్తి మనుజశక్తిలలో ముఖ్యమైనది. ఆశక్తినుండియే యెంతజ్ఞానవిజ్ఞానములైన నుదయించినవి. సర్వదేశసర్వకాలసర్వవిధ సారస్వతములకం తయు నాశక్తియే మూలము. హృదయమునందుఁ దళుకు మిఱుగులేని రసోద్రేక మున్నవానికిఁగాని యాశక్తి యుండదు. అట్టిశక్తి యున్నవాని మెప్పే మెప్పు. నవ్వే నవ్వు. ఏడుపే యేడ్పు. బ్రదుకే బ్రదుకు. గగనమందుఁ గన్నులవైకుంఠముగఁ గ్రాలు బంగరుచట్టు జల తారునీలిచీర సింగారించిన ప్రకృతియువతిచేతిలోని సప్తమణివినిర్మిత చాపమును గాంచి చేతు లెత్తి గంతులువైచి యొడలు తెలియని యానందమున మత్తిల్లువాఁడే మనుజుఁడు. కాలిక్రిందఁ బ్రమాదవశమునఁ బడిన చీమ దేహాత్మావిచ్ఛేదనసమయమున నిచ్చినమూల్గు సింహగర్జనమువలె నాకర్ణించి కడుపుపగిలి కండలు కంపించునట్లు గాఢముగ నేడ్చువాఁడే మనుజుఁడు. అంతేకాని పట్టుమని తినలేక, యెంగిలిలంఘనములు చేయుచు, నొడలు తెలియనినిద్ర పోలేక యులికి యులికి యేడ్చుచు నేదైన వింతవస్తువును గాంచి వింతపడి 'హాయి హాయి' అని మఱవలేక తల కదలించి కదలుపనట్లు నోరు మెదలిచి మెదల్పనట్టు లేదో కొండనాలుకకు వెనకు గొణఁగుకొనుచు, నత్యంత ప్రియమైన వస్తువు జాఱిపోయినను గాలినయితము విని గడగడలాడున ట్లేడువలేక కుక్కపిల్లవలె కుంయి కుంయి మని వినఁబడి వినఁబడకుండునట్టు లేడ్చుచు, భోజనమునొద్ద షండులై పొలఁతియొద్ద షండులై పుస్తకము నొద్ద షండులై, యానందానుభవమున షండులై దుఃఖానుభవమున షండులై చావకుండఁ జచ్చియున్నవ్యర్థులు బానిస లీప్రపంచమున దాస్యమును, నీచతయు, నజ్ఞతయు, రోగ మును, చచ్చుటకుఁ దప్ప వేఱుకార్యమున కక్కఱకురాని జనాభాను వృద్ధిపఱచుటకును, దక్క మఱియెందులకు?

ఇట్లు పూర్వస్థితిని స్మరించుకొని సంతసించుచు, నిప్పటిస్థితిని స్మరించుకొని విచారించుచు, ముందునకు నడుచుచుంటిని. అచ్చటనొక్క బ్రాహ్మణునిజూచి యచ్చటికి యుద్ధభూమి యెంతదూరమున్నదని యడిగితిని. యుద్ధభూమిసంగతి నాకేమియుఁ దెలి

యదయ్యా యని యాతఁడు ప్రత్యుత్తర మిచ్చెను. అయ్యా! ఈయూరిబయట జరిగిన భారతయుద్ధమునుగూర్చి నీ వెఱుఁగనే యెఱుఁగవా యని యడిగితిని. "నిన్నగాక మొన్నజరిగిన వ్యాపారమే మఱచిపోదుముగదా. యెప్పుడో జరిగిన యుద్ధముమాట యెవనికి జ్ఞప్తిలోనుండునయ్యా యని నాకు సిగ్గువచ్చునట్లాతఁడు మందలించుచు బదులు చెప్పెను. పోనీ మీయింటిలో నాకీదినమున భోజనము పెట్టుదురా యని యడుగ నేను వృత్తిచేత వంటవూడివాఁడను గానున్నను నొక్కరూపాయినిచ్చినయెడల నాభార్యతోఁజెప్పి యాయు పకారము చేయింపఁగల నని యాతఁడు పలికెను. ఆతని యింటికిఁబోయి స్నాన మొనర్చి భుజించి మోటారుబస్సును మాటాడుకొని యుద్ధభూమి కేఁగి శ్రీకృష్ణభగవానుఁడు పార్థునకు జ్ఞానోపదేశమొనరించిన స్థలమేది యని యడిగి తెలిసికొని యచ్చట నిలువఁబడి తిని.

ఆస్థలము కొంచెె మెత్తుగా నున్నది. అచ్చట నొక్కమండపమున్నది. దానికి వెనుకభాగమునందుఁ జిన్నచెఱువున్నది. ఆచెఱువు నీటితోడనే రథాశ్వములను భగ వంతుఁడు కడిగినాఁడని యచ్చటిజలముతెచ్చి యొకమునలిది నాపైఁ గొంత చల్లెను. రెండుడబ్బులిచ్చి యామెను వదల్చుకొంటిని, భూమ్యాకాశములు గలయువఱకు నొక్కటే బయలు భయంకరముగ గనఁబడుచున్నది. చిన్నకంకరఱాలు, చికిలింతదుబ్బులు బల్ర క్కసి కంపలు జిల్లేడుమొక్కలు మొదలగునవి విరళముగ నున్నవి. చూపున కడ్డువచ్చు నొక్కనిలువుపాటి చెట్టయినను లేదు. అది యెండకాలమగుటచే నెండమావుల ప్రవాహములు మిక్కుటముగ నున్నవి. పిట్టపీచు మనుప లేదు. గాలియైన గట్టిగ వీచుటలేదు. భయంకరమ గునిశ్శబ్దతావస్థ ప్రబలియున్నది. శ్రీకృష్ణభగవానుని బ్రార్థించి యాపవిత్రస్థలమునకు సాష్టాం గపడితిని.

ఇదియేనా కురక్షేత్రము? ఇదియేనా మహావీరులమహాస్త్రముల మహాజ్వాలలచే మండి పోయిన భండనరంగము? ఇదియేనా పనునెనిమిదక్షౌహిణుల రక్తములఁ దడిసిన ప్రదేశము? ఇదియేనా భీష్ముఁడంపశయ్యపైఁ బండుకొని ధర్మబోధన మొనర్చిన పవిత్రస్థలము? ఇది యేనా పార్థవ్యాజమున భగవంతుఁడు ప్రపంచమున కంతకును ప్రజ్ఞాప్రదాన మొనర్చిన దివ్యక్షేత్రము? బంగరుగని యొకగనియా? వజ్రములగని యొకగనియా? శాసనములగని యొకగనియా? విగ్రహములగని యొకగనియా? రత్నాకరమొక రత్నాకరమా? జ్ఞానధన మెటనుండి యుద్భుద్ధమై ప్రపంచమంతయు వ్యాపించినదో యట్టి కురుక్షేత్రఖనియే ఖని.

నేనొక పాదుషా దివాన్‌ఖానా జూచితిని. అది పాలఱాతిదూలములతోఁ బలకలతో వాసములతో నిర్మింపఁబడినది. ఎదుట నెన్నియో దివాన్‌ఖానాలు నాకుఁ గనఁబడుచున్నవి. ఈప్రక్క నాప్రక్కను వెనుకగూడ నెన్నియో శాలలు గనఁబడుచున్నవి. ఈశాలల పొడువు నకు వెడల్పునకు హద్దే కనఁబడుకుండ నున్నది. లెక్కలేనన్ని నాస్వరూపములు నన్నుఁ జూచి వింతపడుచున్నవి. శ్రీరామచంద్రమూర్తి గాంధర్వాస్త్రమును విడిచినప్పుడు యుద్ధ సీమయంతయు నామయము నైనట్లు కనబడుచున్నది. నేను ముందునకుఁ బోవ నేనే నన్నెదుర్కొనుచున్నాను. మనస్సునకుఁ గలఁతగనుండి వెనుకకుఁ బోవ నాస్వరూపము నన్నే వెంబడించుచున్నది. మయసభలో నీరు లేనిచోట నీరున్నట్లు నీరున్నచోట నీరులే నట్లు భ్రమ గలుగుచుండెనను మాట జ్ఞప్తికి వచ్చినది. నీరున్నను లేకున్నను నీరున్న స్థలమని

నీరులేని స్థలమని రెండుస్థలములు వేర్వేఱుగ నచ్చట నున్నవి కాని యిచ్చట శాలలేని చోట శాల కనఁబడుచున్నది. ఒకటా? చెప్పలేనన్ని నేను లేనిచోట నేను గనఁబడుచు న్నాను. ఒక్క నేనా లెక్కలేనన్ని నేను గృహనిర్మాణకళా (architecture) సంబంధమగు నింద్రజాలమునకు వశుఁడ నై కలవరపడితిని. అంతలో మనసు రవంత గుదుటఁబఱచుకొని నన్ను నే నిట్లు నిందించుకొంటిని. ''సాక్షి శిష్యుఁడ వగునీ కీ బుద్ధిహీనత యేల? ఇది యొక్క భ్రమమా? ఇది యొక్క యింద్రజాలమా? ఇంతకంటె కోటిగుణములు భ్రమాపాదక మైన యింద్రజాలములో నఱువది సంవత్సరములనుండి పడియుంటివి కాదా? ఆ మహా మాయ కలవాటుపడియుంటివి కాదా ''ప్రకృతిలోఁ బ్రతిఫలించిన పరమాత్మగానఁబఱచిన మహామహేంద్ర జాలమేకాదా. ఇన్ని లక్షలగోళములు, ఇన్నికోట్లజీవరాసులు. అనంతమై యప్రమేయమై యద్వితీయమైన ఈసృష్టియంతయు మహేంద్రజాలమే కాదా? పరబ్రహ్మపా దకమైనభ్రమకు పరిపాటియైన నీవు పాదుషాభవనమున నిట్లు భ్రమపడెద వేల యని నన్ను నేను నిందించుకొంటిని. అంతలో నిమ్మళముగ ననినట్లు నాకు వినఁబడి ఉలికిపడి వెనుకకు జూచితిని. మావంక నేలచూచెద వని వెనుకనున్న నేను లన్నియుఁ నన్నుఁబ్రశ్నించెను.

మనస్సులోఁ గలిగిన తొట్రుపాటు నివారించుకొని నిదానముగ నచ్చటి చిత్రములన్నియుఁ బరిశీలించితిని. పైఁగప్పురాలపైఁ జెక్కఁబడిన పుష్పములు లతలు ఫలములు పక్షులు బొమ్మలు బంగారము మీఁది పనికంటె నెక్కువ సుకుమారముగ నున్నితముగ సురుచిరముగ నున్నవి. కొన్నిదూలములకుఁ గొన్నిస్తంభములకుఁ గొన్నిగవా క్షములకుఁ గొన్నివిగ్రహములకుఁబైన నుల్లిపొరవంటి బంగారురేకులు కప్పఁబడియున్నవి. నడుమ నడుమ నవసరానుసారముగ నలంకారార్థముగఁగల్ల కెంపులు వైడూర్యములు స్ఫటిక ములు పుష్పరాగములు మఱియు ననేకములుగా మణులు చెక్కఁబడి యున్నవి. జిగజిగలా మిలమిలలా తళతళలా! ఓ! వచించుటకు శక్యముకాని వింతకాంతులు ప్రజ్వరిల్లుచున్నవి. ఆసమయమున నెవఁడో వచ్చి యగ్గిపుల్లను వెలిఁగించెను. ఆహాహా! ఏమి వైభవము? నూఱింద్రధనువు లొక్క త్రుటికాలములో నచ్చట నవతరించి వెలిఁగిపోయిన ట్లయ్యెను. అత్యంత మాధుర్యమునఁ ద్వరలో మొగము మొత్తును. అత్యంతదీప్తిచేఁ గన్నులు జీకట్లు పడును. అత్యంతోష్ణముచే వేగఁ జలికలుగును. అత్యంతశీతలతచే జ్వరము కలుగును. అత్యంతసౌందర్యమున–మనసు మొద్దెక్కును. నిర్జీవసౌందర్య మెంతసేపాకర్షింపఁగలదు? జీవత్సౌందర్యమునకే దిక్కులేదే–కన్నుముక్కు తీరు నితరావయములసొరు, నెక్కడ నేయం గుండవలయునో యాయంగుల నన్నిఁటిని మించిన రంగుమాత్రమే కల యంగన సైతమొకదినము కంటె నెక్కువ యాకర్షింపలేదే. సౌందర్యము సంతతాకర్షణీయముగ నుండుట కెన్ని పరిస్థితులు తోడుపడవలయును. అవి తోడుపడని యెడల గోనెగుడ్డమీఁది నూనెబొమ్మయెట్టిదో యదియు నట్టిదే. ఈవిషయమునుగూర్చి ప్రత్యేకముగఁ జెప్పెదను గాని యిప్పుడు చెప్పఁదగదు.

సౌందర్యానుభవమునఁ జప్పఁబడిన మనసుతో నింటికై మరలిపోఁబోవఁగ నెదుట గోడపై బంగారువర్ణములుగల రెండు పంక్తులు గానఁబడెను. అవి హిందుస్థానివర్ణములు. ఆ వ్రాతఁలోని యభిప్రాయ మేమనఁగా:–భూలోకమందు స్వర్గమే యున్నయెడల నది యిదే. అది యిదే. అది యిదే. వెగటుపడినమనస్సుతో నుంటినేమో, నాకామాటలు మఱింత వెగటయ్యెను.

నాయనలారా! కురుక్షేత్రమునకు నాతోఁ దీసికొనిపోయిన మిమ్ముఁ బ్రసంగవశమున హస్తినాపురమునకుఁ దీసికొని పోయితిని. నాయం దనుగ్రహించి తిరుగఁ గురుక్షేత్రమునకు దయచేయుదురుగాక. ఉర్దుకవి వ్రాసిన వ్రాఁతలోని యర్థమును దెలిసికొంటిరికాదా? వారికిఁదెల్లరాతి పలకలు పాలసున్నము బంగరురేకులు విలువగలమణులు ఫలాహారములు షర్బతులు లవలవఅఱకు ముదురనినవనవయువతీమణుల మొగములే స్వర్గమైననగుఁగాక, వైకుంఠమైన నగుఁగాక, పరమపదమైన నగుఁగాక! కాని మనకుమాత్ర మీకురుక్షేత్రమే స్వర్గము. ఇచ్చటి కంకరరాలే రత్నరాసులు. ఇచ్చటి బుడ్డమేడిచెట్టులే కల్పవృక్షములు. ఇచ్చటిమట్టియే బంగారము. ఇచ్చటి యెండమావుల వెల్లువలే యాకాశ గంగాప్రవాహములు. ఎందుచేత? లోకములో నున్న అన్నిబంగారు గనులకంటెను నన్ని రత్నాలగనులకంటెను నత్యధికమైన విలువ గల భగవద్గీత యిచ్చట నుద్బుద్ధ మగుటచేత. నాయనలారా? ఆగ్రంథముచే మనము తరింతుము. అంతేకాని కాసులగోనె నెత్తిపైఁబెట్టుకొని వైకుంఠసోపాన మెక్కినవాఁ డెవఁడు? ధర్మరాజుతోఁ బైలోకమునకు వచ్చినది శునకముకాని ద్రౌపది కాదే. పోనిండు. ద్రౌపది యుమ్మడియాస్తి కావున నాతనితోఁ బోకపోవచ్చును గాని యెవరికిఁ దగిన సొంతసరకును వారు జాగ్రత్తపెట్టుకొనియే యున్నారు కాని, యుపేక్షింప లేదే. ధర్మరాజుమాత్రము తత్త్వవాక్యములలో శ్రుతపాండిత్యము సంపాదించినవాఁడుకాని ప్రక్కదాపు లేకుండఁ బండ్రెండుమాసములు గడపఁగలిగిన యెడలి స్తిమితత గలవాఁడా?

భగవద్గీతను లోకగురునిచే నుపదేశ మందిన నరునకుఁ బైలోకమేల రాలేదో యడుగ రేమి? అర్జునునకు జ్ఞానసంపాదన కధికారము లేదు. అతఁడు గుంటయోనమాలయొద్ద నున్నవాఁడే కాని యంతకుఁబైని బోయినవాఁడు కాఁడు. సోదరులను గురువులను బంధువులను జంపుట కిష్టపడక యుద్ధము మానుకొని యేడ్చుచుఁ గూరుచుండిన పార్థునకు ''శత్రువు లందఱు నాచేతనే చచ్చినారు. నీ పూరక ధనువు పట్టుకొని నిమిత్తమాత్రుఁడవై నిలుచుండి క్షత్రియధర్మమును నిర్వహించుకొను'' మని చెప్పిన కృష్ణునిబోధన యంతమాత్రమే నరునికి బోధమైనది కాని మిగిలినదంతయు నతని యాచరణములోనికి రానిదే యయ్యెను. సర్వకర్మములుకూడ జ్ఞానమందుఁ బరిసమాప్తి నొందవలసిన దని పురుషోత్తములుకూడ చేసిన బోధ మతని యంతరంగమున నెక్కినదా? అట్లాచరించినాఁడా! సర్వజ్ఞానసముదయము కూడ యుద్ధకర్మమునందుఁ బరిసమాప్తి యైన ట్లయినది.

ఇఁక ధర్మరాజుమాట—అతనికి రాజ్యమందున్న తృష్ణ యెవ్వనికిని లేదు. అతనికి జూదమం దున్నప్రీతి దేనియందును లేదు. అతని గడుసుమాటలు, కల్లయేడ్పులు, బొల్లినైచ్యములు, ముఖస్తుతులు; సమయోజితప్రవర్తనములు మఱి యింక నెన్నియో యతని నరకార్హునిఁజేసినవి. కాని యాసపడి యాసపడి యేడ్చియేడ్చి తెచ్చుకొన్న రాజ్యములో సర్వశూన్యతతక్క పెద్దవల్లకాడుతక్క నిత్యశ్రాద్ధాలుతక్క మఱి యేదియు లేకపోవుటవలనను బుద్ధిపూర్వకముగ నున్నను జంపించుటచేతఁ గలిగిన ఘోరపశ్చాత్తాపమువలనను నరకార్హత కొంత తప్పినది. అందుపై భీష్మునిధర్మబోధములు సమయోచితముగఁ గలుగుటచేత నాతని మనస్సునకు శాంతి కలుగఁ జేసినవి. అందుచేత నాతనికిఁ గొంతకాలమైన స్వర్గలోకవాసము కలిగినది. ఇట్లుగా ధర్మరాజు జ్ఞానమువలన నుత్తమలోకార్హుఁ డయ్యెను.

అట్టి జ్ఞానబోధ మీ కురుక్షేత్రమున జరిగినది. అందుచేత నీ భూమి మిగుల

పవిత్రమైనది. మనస్సులలో సాష్టాంగపడుండు కన్నుల కద్దుకొనుండు—కృష్ణా! ఆపదుద్ధారకా! సంసారసాగరతారకా! యని యా నేలపైఁ బడితిని. ఒకవిధ మగుకలఁతనిద్ర కలిగెను. దానిలో నొకస్వప్నము వచ్చినది. అది వినుఁడు.

రెండుకొండ లెదురుగఁ గనఁబడినవి కాని నడుమనున్న కోనలో నొక చక్కని యాశ్రమమున్నది. అచ్చటికిఁ బోయి పరిశీలించితిని. దానిలో నొక్క రావిచె ట్టున్నది. ఆచెట్టు భూలోకమందలి చెట్లవలె మూలము నొద్దనే యున్నదో పరీక్షింతు మని తలయెత్తగఁ జెప్పరాని, చూడరాని, తలఁపరాని వెలుఁగుచేఁ గన్నులు మనస్సుకూడఁ జీకట్లు పడినవి. పైకిఁజాడలేక చలువలు వెదచల్లుచున్న యాకులవంకఁ జూచితిని. ఒక యాకు తేజస్వంతమై యున్నది. ఒకటి నల్లగ నున్నది. ఒకటి తెల్లగ నున్నది. ఒకటి శ్రవణమనోహరస్వరమయమై యున్నది. ఈ యాకుల క్రింద నొక మహావ్యక్తి యాసీనుఁడై యుండెను.

ఈతఁడు కూరుచుండునప్పడే నాలుగడుగులకంటె నెత్తుకలవాఁడై యున్నట్లు కనఁబడినది. నల్లని శరీరకాంతికలిగి పచ్చని జటలుకలిగి యాతఁడు ప్రకాశించుచుండెను. ప్రక్కనొకకఱ్ఱ భూమిపై నున్నది. అప్పుడు ''ప్రాంశుపయోదనీలతనుభాసితు నుజ్జ్వలదండ ధారు'' అనుపద్యము జ్ఞప్తికివచ్చినది. అదిగాక యాచెట్టువైఖరి జూడ ''ఊర్ధ్వ మూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్'' అన్న శ్లోకము జ్ఞప్తికి వచ్చెను. అందుచే నీతఁడు వ్యాసమహ ర్షియై యుండునని యనుకొంటిని. అదిగాక యా యశ్వత్థవృక్ష పర్ణములైన వేదములనొద్ద నీతఁడు కూరుచుండి యుండెను. ఈతఁడు తప్పక వేదవ్యాసుఁడని నిశ్చయించి యెదుటికిఁ బోయి సాష్టాంగపడి యి ట్లంటిని.

మహర్షి శేఖరా? మీరు విభాగించిన వేదముల నెవ్వరు నిప్పుడు పఠించుట లేదు. స్పృశించుట లేదు. అంటరానితనము చెప్పరానితనము నీవేదములకు మనవా రంట గట్టినారు అవి యందుచే పై ఖండములవారి యధీనములయ్యెను. మీరు రచియించిన భగవద్గీతకూడ మొన్నమొన్నటి వఱకు బుట్టదాఖలై యుండెను. అది మిక్కిలి యుద్గ్రంథ మని పాశ్చాత్యులు స్తుతించుటచేత వారిమాటల నాధారము చేసికొని యిప్పుడిప్పుడే గ్రంథఘనత కచ్చెరు వొందుచున్నారు.

మహర్షిచంద్రమా! క్షమించునెడల నొక్కసంగతి యడిగెదను. భగవద్గీతకు బుద్ధిమం తులగు పండితు లందఱు వివిధములగా వ్యాఖ్యానములు చేయుచున్నారేల? శంకరాచార్యుల వలె రామానుజులు చేసినారా? వారివలె మధ్వాచార్యులు చేసినారా? యుద్ధకర్మము చేయుటకే యిప్పటివా రనుచున్నారు. మఱియొకరు భగవద్గీతను మీరు రచియింపనే లేదని తుండు తుపాకి నెగురఁగొట్టుచున్నారు. మీరను నొక వ్యక్తియే లేదని కొంద ఱనుచున్నారు. కృష్ణుఁ డన్న యాతఁడు దశావతారములలోనివాఁడు కాఁడని మఱికొందఱనుచున్నారు. ఈచచ్చు వాదములకేమి కాని యిన్నివిధములైన వ్యాఖ్యానములు బుట్టుటకు హేతువేది? కృష్ణభగవానుఁ డిన్ని యర్థములగునట్లు చెప్పెనా? కాక యాయన యభిప్రాయమును మీరు సరిగాషఁ దెలిసికొన లేక యిట్లు వ్రాసితిరా? కాక యన్ని విధములగు నర్థములకు లోపము మీవ్రాఁతలోనిదా? నాకుఁ దెలియక యడుగుచున్నాను దేవా! క్షమింపుఁడు.

మీవేదాంతసూత్రములకు మతత్రయవ్యాఖ్య లున్నవి. ద్వైతశ్రుతులు నద్వైతశ్రు

తులు వేఱువేఱుగా విరివిగా నుండుటచేత జ్ఞానమే మోక్షమసాధనమని తన బుద్ధిచే నమ్మిన శంకరాచార్యులు ద్వైతశ్రుతులను ముక్కముక్కలక్రింద నఱికి వాని కద్వైతార్థమునుగలిగించి నారు. భక్తియే మోక్షసాధక మని నమ్మిన రామానుజాచార్యు లద్వైతశ్రుతులకుఁ జచ్చిచెడి ద్వైతార్థమును గల్పించినారు. పూర్వాచార్యపురుషులగువా రిట్లే వారి వారిమనస్సులలోఁ దమయభిప్రాయములచేతఁ బూర్వమే నంకల్పించుకొన్న సిద్ధాంతములఁ బట్టి కాలస్థితులవలనఁ గలిగిన సొంత నమ్మకములఁ బట్టి వ్యాఖ్యానములు చేసినారేకాని మీగ్రంథ మందున్న యథార్థసత్యమును గ్రహింపలేదని యిప్పటి యాచార్యపురుషులనుచున్నారు. కాని యిప్పటివారి వ్యాఖ్యానములుకూడ నరిగా నిట్టి యధిక్షేపణకే లోనై యున్నవి. ఈ అత్తగారు తన్ను బాధించినదని యాక్షేపించిన యిల్లాలు తాను కోడలిని బాధపెట్టకుండ జరుపుకొన వలసినది. అట్లు జరుగుట కవకాశము లేకపోయినది.

మహర్షిపురందరా! భగవద్గీతకు నిజమైనయర్థమేదో నాకు బోధింపఁదగదా! యని ప్రార్థించితిని. ఆయన ముసిముసినవ్వులు నవ్వినాఁడు. దానివలన నా కప్పటి కేమి తెలిసిన దనఁగా పూర్వుల వ్యాఖ్యానములు నరియైనవి కావని యీయన యభిప్రాయపడినట్లు నాకు గోచరమైనది. కాని యీ యంశము నిశ్చయముగాఁ దేలకపోవుటచేత గ్రుచ్చిగ్రుచ్చి మఱియొకసారి యడిగితిని. అంతట నాతఁడు తన ప్రక్కనున్న కఱ్ఱనెత్తినాఁడు. కొట్టునేమో యని లేచి యిప్పటివారు చెప్పినట్లు భగవద్గీతకు బడితెబాజాయే యర్థమా యని యనుచుండఁగా నన్ను లేపినాఁడు. స్వప్నము నరి.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# 16. సభాస్వకీయ వ్యాపారములు

నెలకోకసారి ఉపన్యాసానికి బదులు సాక్షిసంఘవు సొంత వ్యవహారాలు చూసుకోవాలనే నియమం చొప్పున ఈసారి, సంఘానికి వచ్చిన ఉత్తరాలు చూడడానికి నిశ్చయించాడు జంఘాలశాస్త్రి.

ఒక ఉత్తరం శివచింతామణీ గ్రంధాలయ కార్యదర్శి వ్రాశాడు. వారి గ్రంథాలయంలో, సాక్షి ఉపన్యాస సంపుటాలు ఒకటి, మూడు మాత్రమే వున్నాయట. రెండు, నాలుగు సంపుటాలు 'ఉచితం'గా పంపమని అభ్యర్థన. అలాగ కవులు తమగ్రంథాలు పంపిస్తూంటారట.

ఈ లేఖ వ్రాసినాయన ఒకసూచన కూడా చేశాడు. కాలాచార్యులు, వాణీదాసు కూడా తరుచు ఉపన్యాసాలిస్తే బాగుంటుందని.

దానిమీద వ్యాఖ్య అనవసరమని తీర్మానించారు. రెండో ఉత్తరం, కృష్ణాగోదావరీ మండలాలలోని యావదాంధ్ర క్షౌరశాలల సామాన్యకార్యదర్శి నుంచి వచ్చింది. ఏలూరులో ఈ సంస్థకు సంబంధించిన ప్రధాన కార్యాలయంలో, పద్దెనిమిదవ వార్షికోత్సవం జరగమోతోందనీ, దానికి అగ్రసనాధిపతిగా రావలసిందనీ, జంఘాలశాస్త్రికి ఆహ్వానం.

దీనికి అంగీకరించడమా? మానడమా? అని చర్చకు పెట్టగా –వాణీదాసు, వెళ్లాలని చెప్పాడు. కాలాచార్యులు వ్యతిరేకించాడు. కాని –ఉపన్యాసం ఉంటుందని వినడానికి అక్కడకు జేరిన ఇతరశ్రోతలు ఊరుకోలేదు. వారిలోంచి ఒకదు లేచి, జంఘాలశాస్త్రి ఆ సభకు వెళ్లకపోతే వచ్చే నష్టాల గురించి చెప్పి, వెళ్లి తీరాలని ప్రతిపాదించాడు. మిగిలినవారు కరతాళ ధ్వనులతో ఆమోదించారు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

ఈదినమున నుపన్యాస మేదియును లేదు. పూర్వనియమాను సారముగా మాసమున కొకతూరి సభాసంబంధము లగుసంగతులను గూర్చి సల్లాపించుకొందుము. ఉపన్యాస ముండు నని పెద్ద లందఱు వచ్చినారు. కావున నాయనలారా! ఉపన్యాసము లేనందులకు క్షమించి మావ్యవహారములలో మీకుఁ దోఁచిన యభిప్రాయముల నొసంగి తోడుపడఁ గోరుచున్నాను. సాక్షికార్యాలయమునకు వచ్చినలేఖలఁజదివెదను.

మొదటిది.

శవచింతామణీగ్రంథాలయ కార్యదర్శియగు గొంగళి భుక్తసాకీన్ గొలాంగ్రతగారియొద్దనుండి

శ్రీ శ్రీ రాజమాన్యరాజపూజితులగు సాక్షిక్షి—

అయ్యా! మీ సంఘము తిరుగ స్థాపింపఁబడిన దని విని మిగుల నానందించుచున్నాము. మాపుస్తకాగారమున మీ సంపుటములలో మొదటిది మూఁడవదిమాత్రమే యున్నవి. రెండు నాల్గు సంపుటములు మాకుచితముగాఁ బంపవేఁడుచున్నాము. మానిలయము మిగుల దరిద్రస్థితిలో నున్నది. దైనికమగు నాంధ్రపత్రిక నా విశ్వదాత పంపుచున్నాఁడు. ఆయన కనేక నమస్కారములు. మాగ్రంథనిలయమునకుఁ గొందఱుకవులు వారి వారి గ్రంథములను ధర్మముగాఁ బంపుచున్నారు. ఆకవులకు నమస్కరించుచున్నాము. మీ జంఘాలశాస్త్రి యుపన్యాసములు వినుభాగ్యము తిరుగ మాకు లభించినందులకు సంతస మగుచున్నది. కాని యొకందులకుఁ గొంచెము వగచుచున్నాము.

1. జంఘాలశాస్త్రి నడుచు నడుమ నాంగ్లేయపదముల నుపయోగించుచున్నాఁడు. వాని కర్థము తెలియక చిక్కుపడుచున్నాము.

2. ఈయంశమునుగూర్చి తరువాతఁ జెప్పెద నని వాగ్దాన మొనర్చిన విషయము లెన్నియో గలవు. అవి యన్నియు నిప్పుడు చెప్పఁగోరుచున్నాము.

3. మీలో కాలాచార్యులు, వాణీదాసకవియు నున్నారుకాదా? వారుగూడ తఱచుగా నుపన్యాసము లిచ్చిన బాగుగా నుండునని నామనవి.

4. మాయూర నొకవైద్యుఁ డున్నాఁడు. ఆతఁడు మీయుపన్యాసము లన్నియు నప్పజెప్పఁగలఁడు. మీసంఘమునం దాతని సభ్యునిగాఁ జేర్చుకొనవలయును.

చిత్తగింపవలెను
గొంగళిభుక్త

కార్యదర్శి.

జంఘాలశాస్త్రి యిట్లు లేఖను బూర్తిచేసి దీనికిఁ బ్రత్యుత్తర మక్కఱలేదు కాదా యని సభవారి నడిగెను. అందఱున లే దనిరి.

జంఘాలశాస్త్రి రెండవయుత్తరమును దీసి యిట్లు పలికెను.

సోదరులారా! ఇది రెండవయుత్తరము దీనిని జదివెదను.

కృష్ణాగోదావరీమండలాంతర్గతసర్వాంధ్రక్షురకశాలసామాన్యకార్యదర్శియొద్దనుండి
—జంఘాలశాస్త్రిగారికి—

రామ్ రామ్,

ఏలోరులో స్థాపింపఁబడిన యీ సర్వక్షురకశాలాప్రధానకార్యాలయమునం దీసంఘసంబంధమైన పదునెనిమిదివార్షికోత్సవ మీనెల 27వ తేదిన జరుపుటకుఁ బెద్దలు నిశ్చయించినారు. ఆంధ్రదేశమునందుండు క్షురకవిద్యాపారీణుల కందఱ కాహ్వానములు పంపించుచున్నాము. చిత్రవిచిత్రోపన్యాసము లీయఁగల మంగలిమహావక్త లెందఱో రాఁగలరు. క్షురకవి

ద్యారహస్యము లెన్నియో వెల్లడింపఁ గలరు. అట్టి మహాసభకు మతాభిమానన్యాయముచేత మంగలియే యధ్యక్షుఁడుగా నుండఁ దగినది. కాని మొన్న జరిగిన కార్యనిర్వాహకసభలో మిమ్మధ్యక్షుఁడుగా నాహ్వానించుట కేకగ్రీవముగఁ దీరుమానించుకొంటిమి. మంగలికి రాఁదగిన మహాగౌరవమును మతాంతరున కిచ్చి స్వార్థపరిత్యాగమును మాసభవా రగపఱచి నారు. మీ రగ్రాసనాధిపతిగా దయచేసి మమ్మానందింపఁ గోరుచున్నాము—ఇట్లు విన్నవించు కార్యదర్శి.

ఉత్తరమైనది. దీనికిఁ బ్రత్యుత్తర మేమని సభలో జంఘాలశాస్త్రి యడిగెను.

అంత వాణీదాసుఁడు లేచి యిట్లనియెను. క్షురకసోదరశిఖామణులు మీ కిచ్చిన గౌరవమునకు మీరు సర్వవిధముల నర్హులు కావున నంగీకరించితినని లేఖ వ్రాయవలయును.

అంత కాలాచార్యులు లేచి యిట్లనియెను.

ఇది మతవిద్యతోఁ జేరినయంశము. మతవిషయక మగు నాసభకు మతేతరుఁ డధ్యక్షుఁడుగా నుండుట తగదు. అందుచే జంఘాలశాస్త్రి పోఁగూడదని నా యభిప్రాయము.

అంత సభనుండి యొక్కఁడు లేచి యిట్లనియెను.

సోదరులారా! కాలాచార్యులు చెప్పినమాట కేవల మనుచితముగ నున్నది. ఇందఱు మంగళ్లయభిప్రాయమును నిరాకరించుట తగదు. అందులో మతవిభేదమే కారణముగ నెన్నఁడును నిరాకరింపఁదగదు. మతసంబంధమగు పట్టుదలచేతనే జంఘాలశాస్త్రి నిరాకరించినాఁడని మంగళ్ల కేమాత్రము తెలిసినను వారు బ్రాహ్మణులపై సత్యాగ్రహమును జరిపి తీరెదరు. అప్పుడు బ్రాహ్మణులు గిజగిజలాడవలసి వచ్చును క్షురకర్మ మెట్లో స్వయముగాఁ దీర్చుకొందుమని పురుషులు లక్ష్యపెట్టక పోయినను స్త్రీలమాటయేమి? వితంతువులలోనే కాకుండ నీకాలములో సువాసినులకుఁగూడఁ దల కత్తిరించుకొనుటకై మంగలి యపేక్షగలదు. ఇదివఱకే యనేకభేదములుచే దేశ మల్లోలకల్లోలమై తపించుచుండ శక్తివంచనలేకుండ నుపశాంతిచేయుటకు బదులుగ వృద్ధిపఱచుటకై ప్రయత్నించుట బుద్ధిహీనతకంటె భిన్నమా? కావున జంఘాలశాస్త్రి యంగీకరింపవలసియున్నది.

ఈయుపపాదనమును సభవారందఱు కరతాళధ్వనులతో నంగీకరించిరి.

ఇంతకంటెఁ జదువఁదగినలేఖలు లేవు. చూడఁదగిన వ్యవహారము లంతకన్న లేవు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# 17. క్షురకసభ

ఏలూరులో జరిగిన క్షురకసభకు జంఘాలశాస్త్రి అధ్యక్షుడిగా వెళ్లాడు. సభకు ఏర్పాట్లు ఘనంగా జరిగాయి. జంఘాలశాస్త్రిని సభామందిరం దగ్గరకు సోడాబండిమీద కూర్చోపెట్టి లాక్కొని వెళ్లారు—గౌరవసూచకంగా—

రకరకాల పతాకాలు క్షురకసభకు గుర్తుగా అక్కడ సభాభవనం దగ్గరకట్టారు. దాదాపు వెయ్యిమంది దాకా ఆసభకు హాజరయ్యారు.

ఒక మంగలిసోదరుడు వేదికమీది కెక్కి, సాక్షి సంఘానికి చెందిన జంఘాలశాస్త్రిని ఎందుకు అధ్యక్షుడిగా ఉండమని కోరినమీద వివరించాడు. సాక్షిసంఘానికీ క్షురకమండలికీ ఉన్న పోలికలను వివరించాడు.

జంఘాలశాస్త్రి అధ్యక్షస్థానంనుంచి మట్లాడుతూ, ఈదినం శారదాచరిత్రలో అద్వితీయం కాగలదని నొక్కి చెప్పాడు. తను ఇక్కడ ఇలా వుండడం పూర్వజన్మ అనుబంధం అయి వుంటుందని సవినయంగా చెప్పాడు.

అనంతరం ఒక మంగలి సోదరవక్త పరిశోధకుడు, వేదికఎక్కి, క్షురకజాతికి బౌద్ధమతంతో వున్న సంబంధం, దేశ చరిత్రలో క్షురకజాతివారు, పాలక ప్రభువుల సన్నిధిలోవుండి చేయించిన మంచిపనులు, వివరించాడు. అయితే ఈ పరిశోధన ఉత్సాహంలో క్షురక, క్షత్రియ జాతుల్ని ఏకం చెయ్యడంవల్లనూ, మంగళ్లలో ఏలూరు మంగళ్లు ఎక్కువ పరిశుద్ధులనడం వల్లనూ, గొడవజరిగి, ఉపన్యాసం ముగించవలసి వచ్చింది.

మరొకవక్త వచ్చి—సున్నితమైన క్షురకర్మకీ, సారస్వత సృష్టికీ వున్న పోలికలు వివరించాడు. క్షురకర్మలో ఉన్న వేదాంతార్థాన్నికూడా విశదంచేశాడు. ఇంతలో సభారంగం బయట రణరంగంగా మారడంవల్ల, అధ్యక్షుడి ముగింపు వాక్యాలు లేకుండానే సభ ముగిసింది.

**జంఘాలశాస్త్రి** నేను వెడలినతరువాతి నిట్లు చెప్పెను:—

ఎన్నడుఁజూడలేదు. ఎన్నఁడు వినలేదు. అట్టివైభవము హేలాపురమున 27 వ తేదీని కాననయ్యెను. క్షురకసభాశాలపై వేలకొలఁది పతాకములు వివిధవర్ణవిరాజమానములై ప్రకాశించెను. ఒక జెండాపై మంగలికత్తి చిత్రంపఁబడియున్నది. మఱియొక్క జెండాపై దావిని

రాతిమీద విలాసముగ నూఱుచున్న యొక క్షురకుఁడు చిత్రింపఁబడినాఁడు. ఇఁక నొక్క జెండాపై తోలుపొది నాడిలోఁ బెట్టుకొన్న మహాలక్ష్మీదేవి చిత్రింపఁబడియున్నది. ఇంకొక్క జెండాపై శారాదాదేవి, చేతిలో నొక్కతక్కెడతో నవ్వుచు నిలువఁబడియున్నది. ఆత్రాసులో కొక చిప్పయందు గంటము, ఒంటె వెంట్రుక కుచ్చుతాపి ఉలియు, రెండవచిప్పయందుఁ గత్తెరయు నున్నవి. కత్తెరవైపున బరు వెక్కువగా నున్నట్లు కనఁబడుచున్నది. బహిరంగతకొఱకు నన్నొకసోడాబుడ్లబండి మీఁదఁ గూర్చుండఁబెట్టి యెనమండ్రు క్షురకవిద్యాపారంగతు లనేక శతమంగళవాద్యములు ఘోషించుచుండ సభకు లాగుకొని పోయిరి. అప్పటి కింక నుదయ మేడుగంటలకంటె నెక్కువ యైయుండపోవుటచేత సభయైనతరువాత నక్కఱకు వచ్చు ననికూడఁ దెచ్చుకొన్నపాదులను కొందఱు కరతాళధ్వనుల సౌకర్యముకొఱకు నాయొడిలోఁ బెట్టిరి. సోడాబండిదడదడలో నవి యూడిక్రిందఁబడునేమో యని కొన్నిఁటిని జేత గట్టిగఁ బట్టుకొనియుఁ గొన్నిటిఁ దొడల క్రిందఁ బెట్టి నొక్కియు వాయువేగముతోఁ బట్టుకొనియుఁ గొన్నిటిఁ దొడల క్రిందఁ బెట్టి నొక్కియు వాయువేగముతోఁ బోవుచు న్నాను. ఒక్కమంగలియొద్ద నొక్కపొదికంటె నెక్కువగా నుండవలసిన యగత్యము లేనప్ప టికి మంగలిసభాధ్యక్షుఁడనైన నాయొద్ద నేడుపొదు లేకకాలమందుండు నదృష్టము సిద్ధించి నది. ఎట్లో సభలోనికిఁ బోయితిని. సభ కన్నుల వైకుంఠముగ నున్నది. కదళీవృక్షచ్ఛటలు, వట్టివేళ్లతడకలు, చలువ చప్పరములు, కొబ్బరాకుల వీవనలు మందువేసవిని మఱవఁజేయు చున్నవి. సభలోఁవేయిమంది క్షురకు లున్నా రని తెలియవచ్చినది. ఇతర శాఖలవా రింక నెందఱో యున్నారు.

అంత నొక్కమంగలి చెంగు చెంగున నుపన్యాసరంగ మలంకరించి దైవప్రార్థన మిట్లొనర్చెను.

ఉ. ఎప్పుడు భూమిఁ బుట్టితిఱా యెప్పుడు జానకిచెట్టఁ బట్టితో
ఎప్పుడు కానమెట్టితిఱా యెప్పుడు రావణు గిట్టఁగొట్టితో
అప్పటి గాథలెల్ల నిల నార్యుల చిత్తములందు గట్టిగా
ముప్పిరి పేట నల్లుకొని పోయె రఘూద్వహ! మమ్ముఁ బ్రోవుమా.

సోదరులారా! ఈసభకు మన మెవ్వరినైన నధ్యక్షుని నియమించుకొనవలసియున్నది. సాక్షిసంఘమునకు క్షౌరశాలకు భేద మేమియులేదు. మనమొక చిన్నకొట్టులో మనదుకాణ మొకరిద్దఱుసాహాయ్యముచేఁ బెట్టుకొనినట్లే వారుకూడ నొకకొట్టులో నొకరిద్దఱితోడుతఁ జిన్న సంఘము స్థాపించుకొనినారు. మనలఁ జూచుటకు నిత్య మెందఱో వత్తురు. వారిని జూచుట కనుదిన మెందఱో వత్తురు. మనయొద్దకు వచ్చినవారిమనస్సున కాహ్లాదముగ మనము వర్తిల్లునట్లే వారియొద్దకు వచ్చినవారిమనస్సు కానందమగునట్లు వారు ప్రవర్తిం తురు. వారమున కొక్కదినమున ననఁగా నాదివారమున మనకు లెక్కలేనంత జనము వచ్చినట్లే, శుక్రవారమునాఁడు వారిసంఘమునకు నట్లే వత్తురు. ప్రధాన క్షౌరకుఁడు మనలో నొక్కఁడే యున్నట్లు వారిలోఁ బ్రధానవక్తయొక్కఁడే. మనసంఘమును స్థాపించిన పూర్వా చార్యుల పేరిటసంఘమెట్లు నడచుచున్నదో వారి సంఘముకూడ సాక్షిపేర నట్లే జరుగుచు న్నది. సాక్షి యుపన్యసించుటగాని, వ్రాయుటకాని యేమియు లేదు. మన సంఘస్థాపకుఁ డట్లలంకారముగా గోడపై నుండుటయేకాని యొక్కకత్తి నూఱినాఁడా? ఒక్కగడ్డము

తడిపినాఁడా? ఏమియు లేదు. దినములు దొరలిపోవుటకు మనసంఘమె ట్లేర్పాటయినదో వారి సంఘముకూడ నందులకే యేర్పాటయినది. దేశసేవ యని లోకోపకార మని, బుద్ధిహీనులు బోధించెడి బోధకాలిమాటలు బూటకములు. కోట్లకొలఁదిధనముతో వ్యవహరించు సంఘమైనఁ గూటికొఱకే-ఆరోగ్యప్రదానమునకై పాశ్చాత్యదేశీయు లిట స్థాపించిన యానుపత్రులు, ధర్మసంస్థలు మొదలైన వన్నియు దనసంపాదనకే. జ్ఞానబోధముకొఱకు మతగురువులను దేశదేశములకుఁ బంపుసంఘము లన్నియు నందేహరహితముగ సంపాదనకే –వారివలనలోకమునకేదియో యుపకారము జరుగుచున్నది కాదా యని యందురా? వారివలననే యన్నమాట యేమి? ఎన్నియో యీఁగలను దనపొట్టను బెట్టుకొని బల్లి యంటురోగములను బ్రాఁకకుండ నాఁపుచున్నది కాదా? బల్లి లోకోపకారమునకే యట్లు చేయుచున్నదా? పిల్లి యెలుకల నెన్నింటినో చంపి మారికావ్యాధి నరికట్టుచున్నదికాదా? పిల్లి లోకోపకారమునకే యట్లు చేయుచున్నదా? మాటలచే మనము మనల మోసపుచ్చుకొనుట తగదు. లోకమునఁ బ్రతిజీవమువలననే కాదు, ప్రతినిర్జీవవస్తువులనగూడ లోకోపకారము జరుగుచున్నది. వేపాకువలన మసూరిరోగము స్తంభించుచున్నది. తెల్లజిల్లేడు వలనఁ గానరోగము తగ్గుచున్నది. ఉమ్మెత్తవలన నుబ్బసమునకు వడిమఱలుచున్నది. బల్‌రక్కసి వలనఁ దేలుబాధ పోవుచున్నది. నాభివలన జ్వరము హరించుచున్నది. తుదకు మనకాలి క్రింద మట్టివలన జరుగుచున్న లోకోపకార మింతంతకాదు. ఇట్టి నిర్జీవపదార్థములవలనఁ బ్రపంచమునకు మేలు జరుగుచున్నట్లే జీవపదార్థములవలనఁ గూడ జరుగుచున్నది. స్వభావసిద్ధముగ మాత్రమే జరుగుచున్నది. ఉద్దేశపూర్వకముగ జరుగుట లేదు. లేదు. కావున సాక్షిశాల మనశాలకంటె భిన్నముకాదు. ఆశాలానిర్మాణమునకు, మన **Saloon** మార్గదర్శిని యని చెప్పక తప్పదు. సాక్షి మనకు జన్మసోదరుఁడే కాక వ్యాపారసోదరుఁడు కూడను. ఆసంఘప్రధానవక్తయగు జంఘాలశాస్త్రిని మనసభ కధ్యక్షునిగా నియమించుకొనుట మిక్కిలి ప్రశస్తము. సభవారిపక్షమున నే నీయుపపాదన మొనర్చుచున్నాను. అంత సభలోఁ గరతాళధ్వనులు.

తరువాత నొక్కఁడు లేచి యుపపాదనమును బలపఱచెను. నేను గరతాళధ్వనులన డుమ నధ్యక్షపీఠ మెక్కితిని. ఒక్కఁడు వచ్చి నా మెడలోఁ బుష్పమాలిక వైచెను. మఱి యొకఁడు వచ్చి నాచేత నొక కార్యక్రమపత్ర ముంచెను. నేను వినమ్రుఁడ నై లేచి యిట్లంటిని.

సోదరులారా! పాలలో మీఁగడయెట్లో చిన్నపూదేనిలోఁబలుకులెట్లో యాంధ్రక్షురక మహామండలిలో మీరట్టి యుత్కృష్టు లైనవారు. ఇది వసంతర్తువగుటచే నొక్క మంగలిదర్శనమగుటయే మహాదుర్లభమైయుండ, నిందఱదర్శన మయాచితముగ నగుట యనర్ఘుఁడ నగు నాపుణ్యమే కాక యఖిలాంధ్ర దేశపుణ్య మని చెప్పిన నతిశయోక్తికాదు. ఆంధ్రసారస్వతచరిత్రలో నీదినమర్య సువర్ణాక్షరములతో లిఖింపఁబడఁదగినది. ఈసభలో నెందఱో క్షురకవి ద్వాంసు లుండనెందఱో క్షురకోద్యోగులుండ, నెందఱో క్షురకకవు లుండ నెందఱో క్షురకవక్తలుండ, క్షురకుఁడనుగాని, నాకీగౌరవము లభించుట యాంధ్రశారదాచరిత్రలో నద్వితీయమగు నంశముగ నుండఁగలదు. అంబష్ఠజాతి కంతకు నాయందుఁ గల యవ్యాజాభిమానమును బట్టి చూడఁగా నేను పూర్వజన్మమున మంగలినై యుందు నేమో యని యనుకొనవలసి వచ్చుచున్నది. (సభలో కరతాళధ్వనులు) లోకమున నకారణాభిమాన

ములు సహేతుక ద్వేషముల పూర్వజన్మములందలి సంబంధవైషమ్య ములవలనఁ గలుగుచు న్నవి. ఒకనిని జూడ నహేతుకమైన కూరిమి. ఇంకొకనిఁ జూడ నహేతుకమైన కోపము. పూర్వభవానుభవజన్యములు గాని మఱియొకటి కాదు. ఇందునుగూర్చి పూర్వోపన్యాసము లలో విపులముగాఁ జెప్పితిని. చర్వితచర్వణము తగదు. మీవృత్తిమర్యాదలఁ గూర్చియు మీవృత్తిలోని విశేషములఁ గూర్చియుఁ గార్యక్రమపత్రములోఁ బేర్కొనఁబడిన వక్తలు చెప్పుదురు. అంతకుఁబూర్వ మాహ్వాన సంఘాధ్యక్షుని యుపన్యాసము జరుగవలసియు న్నది. స్వామిరావుగారూ! మీరు దయచేసి యుపన్యాసపీఠ మలంకరింపవలయును. అంత నొక బుగ్గమీసాల పురుషుడు నలువదేండ్లవాఁడు రంగమెక్కి యిట్లుపలికెను.

అధ్యక్షశార్దూలమా! మంగలిసింగములారా! ఆతఁడు కొంతసేపు గొంతుక సవరించు కొనుటతోడను, గొంతసేపు దగ్గుతోడను గాలక్షేపము చేసి యాత్మగౌరవప్రకటనార్థముగా నటునిటు చూచుచుండెను. అధ్యక్షశార్దూలమా! మంగలిసింగములారా! యని విచిత్ర సంబోధనచేసిన వ్యక్తి మిక్కిలి రోమకుఁడైయుండుటచేత వావదూకభల్లూకమా! యని పిలిపించుకొనఁదగినట్టున్నాఁడు. తరువాత నాతఁ డిట్లు మాటలాడెను.

మనజాతి మూలపురుషులలో నొక్కఁడైన మహామహుఁడు బ్రాహ్మణోత్తములగు మహాపండితులచే, వేదాంతులచే సాష్టాంగనమస్కారము లందినవాఁడు. ఆమహానుభావుఁడు మతబోధనమొనర్చుచుఁజేసిన పర్యటనమువలన భారతదేశమంతయుఁ బవిత్రమైనది. ప్రాగ్దే శములందే కాక, పాశ్చాత్యదేశములందుఁ గూడ నాతనిపేరు మ్రోఁగుచున్నది. అట్టిభగవానుఁ డెవరో యెఱుఁగుదురా, ఎఱుఁగరు. ఎఱుఁగరు మనకర్మ మట్లున్నది. మన యజ్ఞత యట్లున్నది. మన మతాభిమాన మట్లున్నది. బుద్ధభగవానునిప్రక్కన గూరుచుండు టకు జ్ఞానతేజముచే నధికారమున్నవాఁడు మనమూలపురుషులలో నొక్కఁడు, వింటిరా. అట్లు తెల్లఁబోయి చూచెదరేల, నే ననత్యమాడుచున్నానా? నే ననత్యమాడినను జరిత్ర లనత్యమాడునా? శాసనము లనత్యములాడునా? ఈశాసనములు, ఈచరిత్రములు తరువాతి వగుటచేత సత్యదూరములు కావచ్చునేమో? పోనీ–బుద్ధభగవాను నడుగుఁడు. జయాబుద్ధ దేవా! అని నమస్కరించి యడుగుఁడు. ఏమనుచున్నాఁడు? వినుడు! కర్ణములు పవిత్రముల గునట్లు వినుఁడు. అదిగో! అదిగో! దివ్యధ్వని వినఁబడుచున్నది. అవతారపురుషుఁ డగుట తక్క ఉపలివర్మగారు నాతో సమాను లని యనుచున్నారే. ఆమహాత్ముని పేరేది? (ఉపలి ఉపలి అని సభలోఁ గేకలు.) మహాపండితు లగు, మహాకస్యపమక్కశాచార్యాదిమహనీయుల కంటె ముందుగా బుద్ధదేవప్రసాదితమగు శాటిని బరిగ్రహించినవాఁ డెవఁడు? (సభలో ఉపలి అని కేకలు.) సర్వతోముఖ పండితులగు బ్రాహ్మణులకు సైతము నిరాకరింపఁబడిన సన్మాన మీమహానుభావున కయాచితముగ లభించినది. కళింగదేశమునం దంతను బుద్ధబోధనుధను వర్షించి జ్ఞానాంకురములు గలిగించిన గురుసార్వభౌముఁడెవఁడు? (ఉపలి యని సభలోఁ గేకలు.) అట్టి యాదిపురుషునిపేరు మనపిల్లలకుఁ గాని, మన పిల్లలపిల్లలకుఁగాని పెట్టుకొం టిమా? లేదులేదు. (సిగ్గుసిగ్గు అని సభలోఁ గేకలు) పోనీ ఇన్ని క్షురకశాల లున్నవికదా. ఉపలిమంగళాయతన మనికాని, ఉపలిదేవాలయ మనికాని దేనికైనఁబే రుంచితిమా? (సిగ్గు సిగ్గు అని సభలోఁ గేకలు) నాతనువును బుద్ధ మతసంబంధమైన పరిశోధనకార్యమందుఁ బవిత్రమొనర్చుకొనుచున్నాను. నేను మీకు బుద్ధమతమును నాల్గుముక్కలలో బోధింతును.

మీరు మీశాలలకు వచ్చువారికందఱకు క్షురకర్మకాలమందు బుద్ధమతమును బోధించుచుం డవలయును. అందువలన మీరు తరింతురు. మీపాదముల యొద్దకు వచ్చి మీ సమయమును కనిపట్టి మీవలనఁ గృతార్థులగుచున్న మీయాశ్రితు లందఱు తరింతురు.

ఇది కాక పూర్వమహాప్రభువులయాస్థానములలోఁ బ్రభుశిఖామణికి మంగలి యొక్కఁడు కొంచెము హెచ్చుతగ్గుగా వేడుకచెలికాని వంటివాఁ డుండెడువాఁడు. ఆతనికి నియమితమైన కొలు వేదియు లేదు. ఆతఁడు రాత్రియెనిమిది గంటలకు మహాప్రభువునొద్దకుఁ బోయి యాతని మంచమునొద్ద విలాసముగాఁ గూరుచుండి వేడుకకై యొక్కసారి యాయన కాళులపైఁ జేయివైచి యూరిలోనివింత లన్నియుఁ జెప్పుచుండె డివాఁడు. ఇట్టి మంగలిమహానుభావు లెందఱో మహాప్రభువులచేతఁ బ్రజలకు నీనాములిప్పిం చినారు. ఉద్యోగము లిప్పించినారు. బహుమానము లిప్పించినారు. మహాస్థానములలోనున్న యినాములన్నియు నిట్లు పుట్టినవే. మన ముత్తాతల ముత్తాత లిట్లు లెన్నిలేల కుటుంబము లకో యుపకృతు లొనర్చినారు. అట్టిగౌరవము మన కిప్పు డున్నదా? లేదు. అట్టి మహాప్రభువు లిప్పుడున్నారా? లేరు.

మనజాతిపుట్టుకనుగూర్చి యనేకములగు పాఠభేదము లున్నవి. ఈపాఠభేదము లన్నియుఁ బరిశీలించి నా విమర్శనశక్తి నంతయు ధారపోయఁగాఁ తుదకు నాకేమి తోఁచిన దనగా మంగళ్లు కత్తిచే జీవించువారగుటచేతను, క్షత్రియులు కత్తితో జీవించువా రగుటచే తను, వీరు వారుకూడఁ బౌరుషవంతు లగుటచేతను బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులన్న వర్ణవిభాగము సరియైనది కా దనియు, బ్రహ్మక్షురకవైద్యశూద్రులుననది సరియయిన దనియు మంగలిమహాజాతిలో క్షత్రియజాతి యంతర్లాపి యనియు నేను స్థిరపఱచినాను.

'తన్ను తన్ను' మని సభలోఁ గొందఱు రాజులు లేచిరి. రాజులీసభ కేల వచ్చియుండ రనఁగా నాదినమునఁ బశువుల సంతలోఁ బశువులఁ గొనుటకై వచ్చి జెండాలబండారముఁ జూచి యిది యేమోయని యిక్కడకు వేడుకకై వచ్చియుండిరి. అంత సభలోఁగొంత యల్లరియైనది. నేను లేచి క్షత్రియులను బతిమాలుకొని శాంతిపఱచితిని. క్షత్రియులు కొందఱు, బ్రాహ్మణులు కొందఱు సభనుండి లేచిపోయిరి. ఇట్లు పోయిన బ్రాహ్మణులకుఁ గాని, వారి బంధువులకుఁ గాని క్షౌరము చేయకుండుటకు మంగళ్లు రహస్యముగ నేర్పాటుచే సికొన్నట్లు వారి గుసగుసలవలన నాకుఁ దోఁచినది. వక్త తిరుగ నిట్లు చెప్పసాగెను.

కవులకుఁ దిట్లు తప్పవు. పరిశోధకుల కంతకంటె తప్పవు. భూమి తిరుగుట లేదన్నవాఁడు భూమిపై నున్నాఁడు. అది తిరుగ నని చెప్పినవాఁ డంతకపురియం దున్నాఁడు. నాపరిశోధన సత్యమును గ్రహించుటకుఁ బ్రజ లింకఁ దగినజ్ఞానముతో లేరు అయినను నీపట్టణసంబంధమగు నొక్కపరిశోధనము చెప్పి విరమింతును.

అంతట నేను లేచి యిట్లంటిని. "అయ్యా! నీపరిశోధనమున నీ కొక్కనికే ప్రాణముమీఁదికి వచ్చునెడల నెట్లయిన సహింపవచ్చును. అందువలన నాకు, నీపరిషత్తునకుఁ గూడ ప్రాణముమీఁదికి వచ్చునప్పుడు సహింపదగదు. చావునకు నీవలె నందఱు తెగించి యున్నారని యనుకొనఁదగ" దని బలుకఁగ నాతఁ డిట్లనియెను.

తొందర లేదు. ఈవిమర్శన యంత యపాయకరము కాదు. ఏలయ్య యను పేరుగల

యొకమంగలి తల్లిదండ్రులతో రామేశ్వరమునకు పోవుచుండఁగాఁ బురుహూతికాపీఠసమీప మున నాతని తలిదండ్రులిద్దఱు మరణించిరి. వారిపై నొక్క నదిని భగీరథునివలె (భగీ రథుఁడు మంగలికాదుగదా యని సభలోఁ గేక) ఆసంగతి వలదు—ప్రవహింపఁజేయ నెంచి పీఠమునొద్దఁ గూరుచుండి తపస్సుచేసి గంగను దెప్పించెను. ఏలయ్య తపస్సువలన వచ్చిన గంగ కావున నేలే రని దానికిఁ బేరు కలిగెను. అంతట నాతఁ డేలేశ్వర మను నొకగ్రామమును స్థాపించి రామేశ్వరమునకుఁ బోవుదారిలోఁ గృష్ణానదీసమీపమునఁ దపస్సు చేసికొను చుండఁగా "నీ విచ్చట నుండవలయు నని" స్వప్నమున నొకదేవత చెప్పిన ట్లయ్యెను. అప్పు డాతఁ డేలూరు స్థాపించి యిక్కడనే పరమపదించెను. ఏలూరిలోఁ బుట్టిన మంగళ్లుమా త్రమే యేలయ్య సంబంధమువలనఁ బరిశుద్ధులైన మంగళ్లు. నిజమైన మంగ ళ్లేలూరివారే. బెజవాడ మంగళ్లని, రాజమండ్రి మంగళ్లని పెద్దపేరేకాని వారి జన్మములలోఁ గొంతకలితి కక్కుఱితి కల వని నేను దృఢముగా.

"నీ సిగగోయుగ! నీగొంతుగోయ! మేము సంకరజాతివారమా! చూచెదరేమి" యని రౌద్రాకారులై పదిమంది మంగ ళ్లుపన్యాసరంగమునొద్దకు వచ్చిరి. నేను వారిని శాంతిపఱచి 'నీవు కూరుచుండుము. ఇఁక మాటలాడవల' దని యావక్తను శాసించితిని.

తరువాత నొక్కఁడు పీఠ మెక్కి యిట్లనియెను. సోదరులారా! మనవృత్తి విశేషములు నేను గొన్ని చెప్పెదను. వక్తను గాని హేతువుచే నుపన్యాసమును వ్రాసికొనివచ్చితిని. శిశువు గలిగినప్పుడు బొడ్డుకోయుటకు మనకత్తి యవసరము. ఉపనయనసమయమున మనకత్తి యవసరము. మంగళసూత్రధారణసమయమున మనకత్తి యవసరము. నిత్యకృత్యములందు మనకత్తి యవసరము. మగవాఁడు చచ్చినప్పుడాతని భార్యశిరోజములను దీయువేళ మనకత్తి యవసరము. అట్టియాచారము లేనిచోటనైనను మంగళసూత్రము ద్రెంపువేళ మనకత్తి యవసరము. పుట్టినది మొదలు చచ్చినపర్యంతము మంగలితోఁ బనియున్నది. పరిపాటిగల దలగొరిగించుకొను వితంతువులనొద్ద మంగలి యెంతదగ్గఱగాఁ గూర్చుండునో యెఱు గమా? సర్వస్త్రీలయందు మాతృభావము మనపవిత్రమైనవృత్తియే మనకు నేర్పుచున్నది. ఇంత పుణ్యవంతమైన వృత్తిమాత్రము ప్రపంచమున నింకొకటి లేదు. వీరాధివీరులగు రాజాధిరాజులనుగూడ మంగలి తనముందుఁ గదలకుండ మెదలకుండ గూరుచుండఁబెట్టు కొనునే. జుట్టు చేతఁ బట్టికొనినను వారు నోరెత్తుటకు వీలులేదే! ఓహో ఎంత మతగౌరవ ప్రవత్తులుగల వృత్తియో చెప్పవలయునా? ఈవృత్తి ఘనత పూజ్యత చెప్పుటకు నాల్కకు శక్తి చాలదు. తలఁచుటకు మనస్సునకు శక్తిచాలదు.

మనకు వృత్తి క్షౌరవముకాని గానముకాదు. సన్నాయిపాట బలిజీలు దూదేకులసాహే బులు మొదలగువారు నేర్చుకొనుచున్నారు. గానము క్షౌరమునకు రవంత సహాయకార్య ముగ మనలోఁగొంద ఱంగీకరించినారు. 'మనపూర్వపుఁగొయ్యపిడి చేఁతకత్తులకాల మునాఁటి క్షౌరపుసొగ సీనాఁడు లేదు. ఈనాఁడు కత్తిగుల్లయె పనికూడ నొల్లె గుల్లసొగను నునుపు, డాబేకాని పనివానితనపు పసందు లేదు. గుల్లకత్తితోఁ గూటీవచ్చునా? చేఁతకత్తి కది చెప్పిన సుగుణము. ఈచేఁత కత్తితోఁ జేసిన గడ్డము ప్రబంధకవిత్వమువలెఁ బ్రశస్తగాన మువలెఁ బ్రజ్ఞాప్రకటకమై ప్రకాశించును. చిత్ర లేఖనమువలె, గానమువలె క్షురకర్మ యొకక ళయే గాని శాస్త్రము కాదు. కవి యెట్లు పుట్టవలయునో, క్షురకుఁ డట్లే పుట్టవలయును.

ఆ. చేఁతక త్తిమహిమఁ జింతించి చెప్పంగఁ
బమ్మతరమె వాని బాబుతరమె?

యని మంగలి సుబ్బరామ కవి చెప్పిననావేశపూర్ణములగు వాక్యములు వేదవాక్యముల కంటె వేరుకావు.

క్షురకవృత్తిలోని రహస్యములఁ గొన్ని మనవి చేసెదను. ఒకగడ్డమును క్షౌరముచే యుట కొక్కఁ డొకగంట తీసికొనును. ఒక్కఁడైదు నిముసములలో మూఁడుగడ్డములుచే యును. ఆహ్వానసంఘాధ్యక్షుని మేనమామగారు గానుగయె ద్దొకచుట్టు తిరిగివచ్చులోపల నొకగడ్డమును బూర్తిచేసెడువాఁడు. వేగముగాఁ జేయువాఁడు నిమ్మళముగఁ జేయలేఁడు. నిమ్మళముగఁ జేయువాఁడు వేగముగఁ జేయలేఁడు. సారస్వతమందు మాత్రము? గొలుసుక ట్టుగ వ్రాయువాఁడు విడి యక్షరములు వ్రాయలేఁడు. విడియక్షరములు వ్రాయువాఁడు గొలుసుకట్టుగ వ్రాయలేఁడు. మెత్తని పదనుకత్తితోఁ జేయువాడు గరసుపదను కత్తితోఁ జేయలేఁడు. గరసుపదనుకత్తితోఁజేయువాడు మెత్తనిపదను కత్తితోఁ జేయలేఁడు. సారస్వత మందు మాత్రము? సన్నకలముతో వ్రాయువాఁడు ముదుకకలముతో వ్రాయలేఁడు. ముదుక కలముతో వ్రాయువాఁడు సన్నకలముతో వ్రాయలేఁడు. ఎడమచేతి వాటముకలవాఁడు క్షౌరము కుడిదౌడ నారంభింపలేఁడు. కుడిచేతి వాటముగలవాఁ డెడమదౌడను బని యారంభింపలేఁడు. సారస్వతమందు మాత్రము? బాగుగా మాటలాడఁగలవాఁడు బాగుగా వ్రాయలేఁడు. బాగుగా వ్రాయగలవాఁడు బాగుగా మాటలాడలేఁడు. చర్మము చిట్లకుండ కూటీతీయగలవాఁడు మిగులజాణ. అట్లుచేసియు ''కూటీ'' కాయలు మొలవ నీయకుండఁ జేసినఁవాడు మఱింతజాణ. సారస్వతమునందుమాత్రము? శబ్దాలంకారములకొఱకు దేవులాఁడువాఁడు రసపుష్టి కలుగఁజేయలేఁడు. రసపుష్టికిఁ జూచువాఁడు పద్యము కుంటిగఁజె ప్పును. ఈలోపములఁదీర్చువానికి గ్రంథచౌర్యము తప్పదు. ఇట్టిలోపములు సారస్వతమం దెట్లో క్షౌరమునం దట్లే. ఈలోపములను సాధ్యమైనంతవఱకు రానీయకుండ సవ్యసాచులై సంపూర్ణులై మీరుప్రకాశింపవలయునని నాప్రార్థన. అన్ని లోపములగూడ సాధ్యమైనంతవఱకుఁ జేఁతకత్తి తీర్పఁగల దనివాదృఢ విశ్వాసము. ఈచేఁతకత్తితోనే జగప తులు, గజపతులు కాలక్షేపము చేయించుకొనిపైలోకమునకు వెడలిపోయినారు. నిద్రవచ్చు నట్లు క్షౌరము చేయఁగలకత్తి చేఁత కత్తి. నూరాఱులు, వేయాఱులు, నగ్రహారములు సంపాదించిన దీచేఁతకత్తియే. ఒకసారి మాకుటుంబములో జరిగినచిత్రమును జెప్పెదను. మా పూర్వులలో నొకఁడు పెద్దాపురపుజగపతులలో నొకరికి క్షౌరము చేయుచుండెను. చేయుచుండఁగా కత్తికొయ్యపిడి వదలయినది. పిడి బిగించుటకై యాతఁడు టక్కుటక్కున ప్రభునినెత్తిపైఁ గొట్టెను. అంతట జొటజొట కన్నీళ్లు లాప్రభువునకు వచ్చినవి. కాని గోనేడవారు, పోలవరపువారు కుదుర్పలేక పోవుటచేత చిరకాలమునుండి బాధించుచున్న పోలవరపువారు కుదుర్పలేక పోవుటచేత చిరకాలమునుండి బాధించుచున్న పార్శ్వపునొప్పి మంఠల పిడిపోటుచే నెగిరిపోయినది. అనతి కందుకై యగ్రహార మొసంగబడినది. అప్పటి నుండియుఁ బార్శ్వపునొప్పియున్నవారు శిరోవాతమున్నవారు నాతనియొద్ద నట్లు నెత్తిపైఁ బిడి బిగింపించుకొనుచుండెడివారు. చేఁతకత్తితో గీఁకిన తలకుఁ గలుగు చలువు యావునే తితో గలుగదు. ఆముదముతోఁ గలుగదు. వేదాంతసంబంధమైన విశేషమొక్కటి కలదు.

బ్రహ్మరంధ్రమున నుండి యమృతబిందు వంగిటలోనికి మహాపుణ్యాత్మునికి మోక్షకాలమునందుఁ బడునఁట. అట్టిబిందువు మఱింత శీఘ్రమగు స్థానమునుండి జార్చి యంగిటఁ బడఁజేయుటకుఁ జేతకత్తిపిడిపోటు యోగశాస్త్రసాధనము లన్నింటికంటె సర్వోత్తమ మని యామహాపురుషుఁడానతిచ్చెడివాఁ డని వాడుక. అందుకొఱకు అనఁగ మోక్షమును సంపాదించుటకొఱ కొకఁడు ప్రయత్నించునట్లును మన పూర్వుని పిడిపోటుకాయింపుచేత నమృతబిందువు నోటిలోఁ బడఁగ వెంటనే యతఁడు మోక్షము పొందినట్లును వింతయైనకథ యున్నది. పామరులగు జనులేదో కొంత యల్లరిచేసినట్లుకూడ జనవాక్య ముండెను. ''అందఱు నా చేతఁ జావనే చచ్చినారు. నీవు చంపున దేమిటి నీమొగము. నిమిత్తమాత్రుఁడుగ నుండవోయి బుద్ధిహీనుఁడా'' యని నరునకు నారాయణుఁడు చెప్పిన భగవద్గీతానీతినే మనపూర్వుఁడు జ్ఞానహీను లగునప్పటి ప్రజలకు బోధించినాడఁట. అందుచేతనే నాతని కపరకృష్ణుఁ డని పేరు వచ్చెనఁట. జ్ఞానబోధమున నాతని యంత వాఁడు లేఁడు. మోక్షసాధనములలోఁ జేతకత్తి యంత సుఖమైనది లేదు.

భారతదేశమున బ్రజలుచేయు ప్రత్యాచారమునకును వేదాంతార్థ మున్నది కాని లేకపోలేదు. ఏపనికాని శరీరపోషణాదివృత్తులతో నెన్నఁడును మనము చేయుము. స్నానము దేహ పరిశుద్ధికిఁ గాదు. మనఃపరిశుద్ధితోఁ గర్మ మొనర్చుటకు భోజనము ప్రాపంచికకార్యము లొనర్చుట కైన దేహదార్ఢ్యమునకుఁ గాదు. యోగాదిసాధనములు చేసి మోక్ష మందుటకు. అటులే క్షుర కర్మమునకుఁగూడ వేదాంతార్థముండక తప్పదు. అది యేదియో యోచింతము. తలయే శరీరమందలి ముఖ్యభాగము. ఎందుచేత? మనస్సునకు స్థానమగుటచేత. మనస్సులోనే సర్వపాపము లుదయించి బయలు వెడలును. ఆ పాపములే వెంట్రుకల రూపమున తలనుండి వచ్చుచున్నవి. క్షురకర్మ మనఁగ పాపవిచ్ఛేద మన్నమాట. అందుచేత మతమే సమస్తమయినభారతదేశ మునమట్టుకు మతగురుండు మంగలి యని చెప్పునెడల సత్యమునకు దూరమై యుండదు. మోక్ష ప్రదాతలలో మంగలికూడ నొకఁడు.

మమ్ముఁ బరాభవించుటకే పిల్చినారా, మేము సంకరకులము వారమా? ఏలూరివారు పరిశుద్ధులా అని పెద్దకేకలు పాక వెలుపల వినఁబడుచున్నవి. అందుపై దళ్ల వెదురుకట్టలూడఁదీసి చూచెదరేమి తన్ను, కొట్టుమని యెందఱో కేకలువేసిరి. ఒక్క నిమునములోఁ బాకలోని వారందఱుఁ బైకి పోయినారు. పాకలోనుండి యంతకు ముందెప్పుడో కాని చల్లఁగ జాఱి వావదూకభల్లూకముగారు పాకవెలుపల నుపన్యాస మారంభించినాఁడు ''నాపరిశోధనలు తప్పులా? వేదపురుషులందఱు మంగళ్లని నిదర్శనములు చూపించెదను.'' అని యాతఁడు వెఱ్ఱి కేకలు వైచుచున్నాఁడు. ఇంతలో రక్షకభటులు వచ్చిరి. అల్లరికి కారణమైన వారు దొరకకపోవుటచేత నేమియు నెఱుఁగని నలుగురు బడిపిల్లలను, నాదారినప్పుడు చెంబుతో ముష్టికిఁ బోవుచున్న బలిజ వితంతువును బట్టుకొని కొట్టులోఁ బెట్టిరి. ఉపసంహారోపన్యాసమున నంతయుఁ జెప్పవలయునని ప్రారంభోపన్యాసమును నాల్గుముక్కలలోఁ గడతేర్చితిని. అవకాశములేక యుపసంహారోపన్యాసమును మానితిని. సభ తుద కిట్లయ్యె.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

# 18. సుఖప్రారబ్ధము

జంఘాలశాస్త్రి ఈప్రపంచం తీరుగురించి వివరిస్తూ—ప్రతి జీవికి కష్ట ప్రారబ్ధం ఎలాంటిదో, సుఖప్రారబ్ధం కూడా అలాంటిదేనని వివరిస్తు న్నాడు. అంటే, కష్టాన్ని తప్పించుకోలేనట్టే. నీవు నిర్ణయించివున్న సుఖాన్ని కూడా తప్పించుకోలేవురా! అని చెప్పడం.

భగవంతుడి తత్త్వాన్ని గురించి ఏమీ చెప్పకుండా మౌనంగా వూరు కున్న బుద్ధుడు సైతం మన కర్మాన్ని అనుసరించే ఉత్తర జన్మఫలం వుంటుందని స్పష్టంగా చెప్పాడు.

మన సంపదలకీ, మన ఆపదలకీ, మన జన్మలకీ, మన మోక్షానికీ,—ఇదీ అదీ అని లేదు. మనతో సంబంధించిన అన్నింటికీ కూడా కర్తలం మనమే. తిట్టుకోదలుచుకుంటే మనల్ని మనమే తిట్టుకోవాలి. కొట్టుకో దలుచు కుంటే మనల్ని మనమే కొట్టుకోవాలి. కోసుకోదల్చుకుంటే మనల్ని మనమే కోసుకోవాలి. ఇతరుల్ని పల్లెత్తు మాటకూడా అనకూడదు. పరిపాలకుల కేమి, ఈశ్వరుడికేమి, మనకర్మతో సబంధం లేదు. మన కర్మల్ని అనుస రించి ఈశ్వరుడు ఆయా కర్మఫలాన్ని పంచిపెడతాడు. కష్టకాలాన్ని కాని, సుఖ కాలాన్నికాని రవ్వంత కూడా పెంచడం సాధ్యం కాదు. మనమే ఒక ప్రపంచం. మనకు మనమే ఈశ్వరులం.

ఇందుకు ఉదాహరణగా, ఒక విరాగి జనక చక్రవర్తిని కలుసుకున్న ప్పటి ఉదంతాన్ని జంఘాలశాస్త్రి విపులంగా కథనం చేశాడు. సుఖప్రారబ్ధం అనేది, అడవులబట్టి పోయినా వెంటబడి వస్తుందని నిరూపించాడు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

నాయనలారా! ప్రపంచజీవులలో నాకారములందు భేదమున్నది. ఆయుఃపరిమితు లందు భేదమున్నది. గుణగణములందు భేదమున్నది. బుద్ధిజాతులందు భేదమున్నది. భాగ్యవైఖరులందు భేదమున్నది. అభ్యాసరీతులయందు భేదమున్నది. కాని కష్టసుఖానుభవ ములందు భేదము లేదు. ఎవనివంతు వచ్చినప్పుడు వాఁడు కష్ట మనుభవింపవలసినదే. సుఖముకూడ నట్టే యనుభవింపవలసినదే. నాకుఁ గష్ట మక్కఱలేదని నిరాకరించివ నదిపోదు. అనువాఁడు లేఁడుకాని నాకు సుఖ మక్కఱలేదని త్రోచివైచిన నదియుబోదు.

కష్టప్రారబ్ధ మెట్టిదో ప్రతిజీవునకు సుఖప్రారబ్ధ మట్టిదే. ఇప్పు డీసుఖప్రారబ్ధమును గూర్చియే నాల్గుమాటలు చెప్పెదను.

సాదీయను మహాకవి యొకకథను జెప్పినాఁడు. కథయన యసత్య మనుకొనకుఁడు సత్యగాథనే చెప్పెను. ఒకయూర నొకదుండగీఁ డుండువాఁడట. ఆతఁడు స్వభావదుష్టత చేత, ధనమదాంధతచేతఁ, బడుచుందనపు బొగరుచేతఁ, ద్రాగుడుమహిమచేత, ధనమదాంధ తచేతఁ, బడుచుందనపు బొగరుచేతఁ, ద్రాగుడుమహిమచేత, నెన్నితుచ్ఛపుఁబనులో చేయు చుండెడివాఁడు. ఆతని దుశ్చేష్ట లసంఖ్యాకములు. ఒకనాఁ డొకసన్యాసి వీథిలోఁ బోవు చుండఁగా నీదుండగీఁ డాతని కెదురుగఁబోయి పెద్దఱాయి తీసికొని తలపై గురిచూచివై చెను. అది యదృచ్ఛికముగఁ దలపైఁ బడక భుజముపైఁబడెను. సన్యాసి యేమిచేయఁ గలఁడు. తలవంచుకొని తన దారిని తాను పోయినాఁడు. మఱికొన్ని మాసములు కీతని దుర్నయములు మఱింత దుర్భరములు దుస్సహములుకాఁగా మహారాజాతని బట్టించి పెద్దబావిలోఁ బడవేయించెను. ఈ సంగతి యా సన్యాసికిఁ దెలిసి యొక పెద్దఱాయి చేతిలోఁ బట్టుకొని యానూతి యొద్దకుఁ బఱుగెత్తి యాఱాతి నాతనిపైఁ బడవైచెను. ''ఇట్లు చేసితివేమి'' యని యచ్చటివారు సన్యాసి నడుగ ''ఈ ఱాతితో నన్నాతఁడు కొన్ని మాసముల క్రిందట కొట్టినాఁడు. దీని నప్పటినుండియు భద్రపఱచి యిప్పుడు తిరుగఁగొ ట్టితి''నని యాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ''నిన్ను గొట్టినప్పుడే యా ఱాతితో తిరుగఁ గొట్టలేకపోయితివా'' యని ప్రజలడుగ ''నాతని కింక సుఖ మనుభవింపవలసిన దినము లుండగ నెవఁడేమి చేసిన వినియోగమేమి? అదిగాక యేమిచేయుటకు శక్తిగలవాఁడెవఁడు? ఇప్పటి కాతని సుఖప్రారబ్ధము తీరినది. అందుకొఱ కాతని ఱాతితోఁగొట్టుచు ''నాయనా! నన్నీఱాతితోఁ గొట్టితివి. తిరిగి నిన్నుగొట్టక తప్పకపోవుటచేతఁ గొట్టుచున్నాను. నీదుర్మా ర్గజీవనమునకుఁ బశ్చాత్తాప మొందఁదగిన యుత్కృష్ట సమయము సిద్ధించినది. పూర్వపాప మునకు వగచి భగవంతుని ప్రార్థించుకొనుము'' అని చెప్పియే యాతని గొట్టితిని. నామాటలు మీకు వినఁబడలేదు కాబోలు నని సన్యాసి చెప్పెను.

ఇందువలన జనుఁడు తన పూర్వకర్మము ననుసరించి తనవంతునకు వచ్చిన సుఖము లేశమైన మిగులకుండ నింట ననుభవింపక తప్పదు. అట్టి యనుభవమున కడ్డురాఁగలుగవాఁ డెవ్వఁడును లేఁడు.

సుఖముకాని కష్టముకాని యెప్పుడేది యేరీతిగా ననుభవించినను మనకర్మముయొక్క ఫలమునే మన మనుభవించుచున్నాము. కాని మన కెవ్వఁడుగూడ నిచ్చుటలేదని స్పష్టముగాఁ దెలిసికొనవలెను. అట్లిచ్చుట కెవ్వఁడును గూడ స్వతంత్రుఁడుగాఁడు. నీమట్టు వకు నీవే స్వతంత్రుఁడవు. నీబుద్ధికి నీశరీరమును జోడుపఱచి చేతులార, మనసార స్వతంత్రుఁడవై కర్మమును జేయుచున్నావు. ఫలకాలమందు దానిఫల మనుభవించు చున్నావు. భగవత్తత్త్వమునుగూర్చి మూకీభావమును వహించిన బుద్ధుఁడు సయితము మనతోఁ గూడ వచ్చునది మనకర్మ మొక్కటి తక్కవేరు లేదనియు, మనకర్మము ననుసరించియే యుత్తరజన్మఫల ముండుననియు విస్పష్టముగాఁ జెప్పినాఁడు.

గీ. ఎంతో నమ్మించి నీలో వసించునట్టు
లున్న ప్రాణమె నినుబాసి యుఱుకునపుడు

నీది యని చెప్పఁదగు వస్తువేది యిచట?
యపుడు నీవెంటవచ్చెడు నర్థి యేది?

ఏవియును గూడ రావన్ని యిచట నిలుచు
సుతలు మనుమలు బందుగుల్ సుతులు సతులు
తోడబుట్టువుల్ హితులు నీతోడరారు
ధనమురా దొకమొలత్రాడయిననురాదు.

వాఙ్మనఃకాయముల దేనివలన నైన
నీవుచేసిన కర్మమే నీదినుమ్ము
ఇదియె వదలక నిన్వెంబడించునర్థి
నీది యనఁదగినది మఱియేది లేదు.

నీడలాగునఁ గర్మంబు నిన్ను విడువ
దెపుడు దుష్కృతు లుపసంహరింపఁబడవు
ధర్మ కార్యంబు లెపుడు వ్యర్థములు కావు
భావిఫలసముచ్చయ దానవైభవము లగును.

మన సంపదలకే కాదు. మన యాపదలకే కాదు; మన జన్మములకే కాదు; మన మోక్షమునకే కాదు; మనతో సంబంధించిన యన్నిటికిఁ గూడ మనమే కర్తలము. కాని సుఖ మనుభవించునప్పుడు మన ప్రయోజకత్వమని యహంకరించి కష్టములు వచ్చినప్పుడు మాత్రము పైవారి నుత్తరవాదులుగాఁ జేయుచున్నాము. తిట్టించుటకు, నెట్టించుటకుఁ, గట్టించుటకుఁ, బ్రభువులు చాలియున్న కారణముచేత వారు తమ కపకృతిజేసినారని నిష్కారణముగా వారిని జనులు నిందించుచుందురు. ఇది యత్యంతపాప హేతువని నిశ్చయ ముగా నమ్మవలయును. నీ కర్మముతోఁ బ్రభువుల కేమిసంబంధము? ప్రభువుల కర్మముతో నీ కేమైన సంబంధమున్నదని నీవు చెప్పఁగలవా? వారి విషయమున నీకు సంబంధము లేనట్లే నీ విషయమున వారికిఁగూడ లేదను జ్ఞానము నీ కుండనక్కఱలేదా?

భారతదేశ దాస్యమునుగూర్చి పరిపాలకులను బరిపరివిధములుగా నిరసించుట కలదు. భారతదేశ ప్రారబ్ధమునకుఁ బాశ్చాత్యదేశప్రారబ్ధమునకు నేమిసంబంధము? తండ్రికర్మమునకుఁ గొడుకుకర్మమునకు సంబంధము లేనప్పు డనాత్మతత్త్వమునకు నధ్యాత్మతత్త్వమున నేమిసంబంధము? వారిప్పుడు సుఖప్రారబ్ధమున నున్నారు. మనము కష్టప్రారబ్ధమున మన్నాము అంతే! అంతకాక మరి యేమున్నది. మన వేదములను వదలుకొని, మన వర్ణాశ్రమధర్మములను వదలుకొని, మన మతమును వదలుకొని, మన యాచారములను వదలుకొని, మన విద్యలను వదలుకొని, మన స్వాతంత్ర్యములను వదలుకొని, మనజాతితత్త్వమును గూడ వదలుకొని, యేకాలమందుఁగూడ నేదేశమందుఁగూడ నేజాతికూడఁ జేయని చేయలేని మహాఘోరకర్మమును జేసినందులకు ఫలమిప్పు డనుభవించు చున్నాము. కన్నులు దెఱచి బుద్ధిపూర్వకముగ, సంతోషపూర్వకముగ జుట్టుచేతి కిచ్చిన మనము స్వతంత్రతకావలయునని యిప్పుడు గించుకొన్న వినియోగమేమి? ఒక్క స్వతంత్రతమాత్ర మెన్నడయిన వచ్చునా? మనము బుద్ధిహీనతచే వదలుకొన్న వేదాదులన్నియు వచ్చినప్పుడే

స్వతంత్రత వచ్చును. కావున వేదపఠనము మొదలుగా చేయవలసిన కర్మములన్నియు భారతదేశము తిరుగ ననుష్ఠించునెడల సర్వసౌభాగ్యములు సిద్ధింపఁగలవు. భారతదేశ మిప్పుడు చేయవలసినకర్మ మిదియే. రాట్నపు నుతితో వేదగాన మొనర్చుటకంటె వేరుసాధనము లేదు. కాని యది నిశ్చలముగ నిర్మలమనస్కతతోఁ జేయఁదగినది. అంతేకాని స్వాతంత్ర్యము కలిగిన పిమ్మట తిరిగి చల్లచల్లగా వదలుకొనునేర్పాటు మీఁద వేదాదుల సాహాయ్య మపేక్షింపతగదు. మనకుఁ బరిపాలకులు చేసిన యపకృతి లేదనియు మనము మనదేశమునకు, మతమునకు చేసిన యపకృతి ఫల మనుభవించుచున్నామనియు నమ్మవల యును. తిట్టుకోఁదలఁచుకొన్న యెడల నిన్ను నీవుతిట్టుకో. కొట్టుకోఁదలఁచినయెడల నిన్ను నీవుకొట్టుకో. కోసికోఁదలఁచినయెడల నిన్ను నీవు కోసికో. అంతేకాని పరులఁగూర్చి పల్లెత్తుపలుకైన పలుకఁదగదు. పరిపాలకుల లెక్కయేమి? మనకర్మముతో నీశ్వరునకే సంబంధము లేదు. ఏమియు సంబంధము లేదాయని యడుగు చున్నారా? లేనట్లున్నది. ఉండుటకంటె లేకుండుటయే మెరుగన్నట్లున్నది. మనకర్మముల ననుసరించి మనకీ శ్వరుఁడు తత్కర్మఫలమును బంచిపెట్టును. ఇంతకంటె నాతని ప్రయోజకత్వ మేమియు లేదు. అతఁ డందువలన మోతకూలి కాని దాతకాఁడు. ఆవెట్టిపనికే జను లాతని దిట్టుచు న్నారు. సుఖానుభవకాలము రవంత పెంచుటకుఁగాని కష్టానుభవకాలము కానంత త్రెంచుటకుఁగాని యీశ్వరునికి శక్తిలేదు. మనమే యొకప్రపంచము. మనకు మనమే యీశ్వరులము.

దేవతలు హిరణ్యకశిపుబాధ పడలేక, నెత్తినోరు కొట్టుకొనుచు రోదసీకుహర మదర వలవల నేడ్చుచుఁ బ్రతిక్రియ చేయలేక పరుగు పరగున శ్రీమహావిష్ణువు సన్నిధికిఁజేరి యసురసంహార మొనర్పుమని ప్రార్థింపలేదా? ఆమహానుభావుఁ డేమనినాఁడు? మాఱుమా టాడక యిండ్లకుఁ బొమ్మనినాఁడు. ఎందుచేత? ఎందుచేతనో వినుఁడు.

శా. వేధోద త్తవరప్రసాదమహిమన్ వీఁ డింతవాఁడై మిమున్
బాధం బెట్టుచు నున్నవాఁడని మదిం భావింతు భావించి నే
సాధింపం దఱికాదు కావునఁ గడున్ సైరించితిన్ మీఁదటన్
సాధింతున్ సురలార! యింక చనుఁడీ శంకింప మీ కేటికిన్.

అనియే కాదా భగవంతుఁ డానతిచ్చినాఁడు. ''సాధింపందరికాదు కావున'' నని కారణ మగపఱచినారు. అనఁగా నేమి? దేవతల కష్టానుభవ కాలములో రవంతయైన దగ్గించుట కవకాశముకాని, శక్తికాని తనకు లేని కారణమున–నసురుని సుఖానుభవకాల మింకఁ గొంత జరుగవలసి యున్నది కావున దానిని దగ్గించుట కవకాశముకాని, శక్తికాని లేని కారణమునను దేవతలకు సైరణ బోధించి నివాసములకుఁ బొమ్మనినాఁడు. కావునఁ బ్రభువులకు మన కష్టసుఖములపై నధికారములేదు. భగవంతునికిఁగూడ లేదు. పోనిండు. మనకష్టములపై మనకైన నధికారమున్నదా? లేదు. ఏడ్చుచుఁ గష్టము పూర్తిగ ననుభవింపవలసినదే. ఏడ్పువంటినవ్వుతో సుఖముకూడ నట్లే యనుభవింపవలసినదే! కష్టములను మనము తగ్గించుకొనలేము పోనిండు. సుఖములను తగ్గించుకొనలే కేమి? అట్లుకూడఁ జేయలేమా? ఊహూ, ఇందునుగూర్చి యొక గాథ యున్నది. దానిని జెప్పుదును.

జనకమహారాజునభాశాలలోని కొక విరాగి యాతని దర్శనార్థము వచ్చెను. అప్పుడే

మహారాజు పూర్వాహ్ణకృత్యములన్నియు నెరవేర్చుకొని యగ్నిశాలనుండి సభాశాలకు వచ్చుచున్నాఁడు. బ్రహ్మవర్చసము క్షాత్రతేజము నాక్రమించుకొనియుండెను. కన్ను లెండ గాయు చున్నవి కాని చెక్కిళులు పండువెన్నెల లీనుచున్నవి. పరమశాంతతపాల మంతయుఁ గప్పియుండెనుగాని కొలచినట్లున్నట్టిగడ్డము పట్టుదలను సూచించుచున్నది. శరీర మెట్టిసీ టివళుదయందుఁ బూర్ణచంద్రుఁడు ప్రతి ఫలించుచున్న ట్లున్నది. కవులు భావించి యేదో వెట్టిమొట్టిగ వర్ణింపఁ దగినయంశము. నాకేల? జయా! జనకచక్రవర్తి! యని వందిమాగధా దులు బిరుదావళులఁ బఠించుచుండ, నొకవంక బారులుగట్టి మునులాశీస్సులతోఁ బుష్పవృష్ తలు వర్షించుచుండ, సామంతరాజులు పాదాక్రాంతులగుచుండ, నుద్యోగులు నడుములు చేతులు కట్టుకొని యాజ్ఞలకై వేచియుండఁ, గవులు చక్రవర్తిపైఁ బ్రబంధములు పఠింపుచుండ, గాయకులు చిత్రవిచిత్రరీతుల గీతామృతములు వెదఁజల్లుచుండ, వారాంగన లుత్సాహమున నృత్యము లొనర్చుచుండఁ, జేతులు సాచి దోసిళులు పట్టి 'ఇటు దయచేయుఁడు, ఇటు, లనుచుఁ గార్యదర్శులు మార్గదర్శులై వెనుకకు నడచుచుండఁ గనుసన్నలతోఁ, జేతిజోడింపు లతో, శిరఃకంపనములతో, మందహాసములతో, వ్రేలియూఁపులతో, నభిప్రాయప్రకటనము లగు నాలోకనవిలాసములతో, నెవ్వరి నెట్లాదరింప వలయునో యట్లాదరించుచు మొకమా లుమదుగలపై నడుగు లిడుచు, నిమ్మళముగ సింహాసనము నొద్దకు వచ్చి, కూరుచుండుఁ డని యందఱకు సంజ్ఞచేసి తాను గూరుచుండెను. రాజకార్యపులెక్క లుద్యోగులు వినిపించు చున్నారు. కొందఱ కిచ్చుచున్నాఁడు. కొందఱకు బిగబట్టుచున్నాఁడు. కొందఱ కెగఁబె ట్టుచున్నాఁడు. సత్కార్యములందుఁ ద్యాగమెంతయో నిరుపయోగకృత్యములం దంతపిసిడి తన మగపఱచు చున్నాఁడు. న్యాయమెంతయో నిర్దాక్షిణ్య మంతకనఁబఱచుచున్నాఁడు. ప్రజలందుఁ బ్రేమ మెంతయో భయంకరత్వ మంతకనఁబఱచున్నాఁడు. ప్రజలందుఁ బ్రేమ మెంతయో భయంకరత్వ మంతకనఁబఱచుచున్నాఁడు. రాయబారుల బహుమానములు గొనుచున్నాఁడు. తాత్కాలికపుద్రోపుడుమాటలచే వారిని బంపుచున్నాఁడు. ఇష్టమయ్యును గొందఱితో మాటలాడకుండనున్నాఁడు. అనిష్టమయ్యును గొందఱితో మాటలాడు చున్నాఁడు. ఉబ్బెత్తుగ వచ్చిన నవ్వును బెదవులబిగింపుచే దబాయించు చున్నాఁడు. నడుమన డుమ కొన్నిగుల్లనవ్వులను జలామణీచేయుచున్నాఁడు. రాజ్యతంత్రమంతయు నెట్లు నిర్వ హింపవలయునో యట్లు నిర్వహించుచున్నాఁడు.

చక్రవర్తిని జూచుటకు వచ్చినాఁడని చెప్పియుంటినే ఆ విరాగితో నింక మాటలాడ లేదు. వేచియుండలేక యాతనిప్రాణము విసుగుచున్నది. రాజసభకుఁ బోయినపిమ్మట మనయిష్టమా? మన తొందర లక్కడఁ బనికివచ్చునా? సమయ మగువఱకు నోరుమూసి కొని పడియుండవలసినదే కాదా? సెలవు తీసికొని పోవువారు పోవుచున్నారు. తుట్టతుద కందఱు పోయిరి. మన విరాగి యొక్కఁడుమాత్రమే కొందరు రాజభటులతో మిగిలియుం డెను. అదిసమయ మని యెంచి యాతఁడు చక్రవర్తియొద్దకుఁ బోయి యాశీర్వదింప మీరెవ్వ రని యాతఁడు డడిగెను. నాతోఁ గొంత సేపు రహస్యముగ మీరు మాటలాడవలసియున్న దని విరాగి పలుక, భటుల నందఱ నావలికిఁ బొమ్మని చక్రవర్తి యాజ్ఞాపించెను. వారిద్దఱిట్లు మాటలాడుకొనిరి.

విరాగి:-చక్రవర్తీ! మంచుకొండలలోయలలోపలఁ గూడ నీకీర్తివిహరించుటచే దర్శ

నము చేయవలయుననివచ్చితిని. యాజ్ఞవల్క్య శిష్యుఁడనై కర్మయోగి వైన నీ వీజన్మముననే మోక్ష మొందగలవని పెద్దలవలన విని మీపుణ్యదర్శనమున నేనుగూడఁ దరింపవచ్చునని వచ్చితిని. మీదర్శనము నాకగునో కాదో, నేను వచ్చునరికి నీవు ప్రబలసమాధి నిష్ఠాగరిష్ఠత బ్రచ్ఛన్నచైతన్యుఁడవై యుందువో, కాక బహిరంగముగఁ బ్రాణాయామము బట్టిపై కెగురు చునుందువో యని యనుకొంటిని. నిన్ను జూచి డిల్లపడిపోయితిని. కర్మ యోగివని పేరొందిన నీవు భవభోగివని బిరు దొందుటకుఁ దగియున్నావు. ఏసంసారి కిన్నిభోగములు న్నవి? ఏపామరుని కింతభవలంపటత యున్నది? ఆహా! కిలిక్రిందనున్న పాదుకలక్రిందఁ గూడ పట్టుపురుపులు పఱపించితివే. పంచభూతములను బానిసలుగాఁజేసికొని వానిచేఁ గొలువు చేయించుకొనుచుంటివే. ఈపనికిమాలిన రాజ్యము నీ కెందుకు? శుఖపరవశుఁడవై నిన్ను నీ వేలుకొనలేక పోయినప్పుడు నీవొకరి నేలుటయేల? అయ్యయ్యో! ఈయాశ్రితు లేమి, ఈయుద్యోగులేమి, ఈరాయబారులేమి, ఈవిచారణములేమి, ఈశిక్షలేమి, ఈధన కాంక్షలేమి, ఈవేశ్యావృత్తగీతాదులేమి, ఈకవిగాయక మాగధాదిస్తోత్రపాఠములేమి, నిన్నుజూడఁగ నాకు వెళ్లేయెత్తుచున్నది. ఇట్లేలయుంటివో నాకుఁ జెప్పవలయును.

జన:-మునిచంద్రమా! నీవు బుద్ధిమంతుఁడవు. నాయందలి మహాభిమానముచే నిట్లు పలికితివి. ఇది యంతయు లాంపట్యమని నే నెఱుఁగక పోలేదు. ఈ మహాసంసారతంత్రమునఁ జిక్కుకొని తిరుగుచుంటినని యెఱుఁగకపోలేదు. కాని మూఢు నకు నాకు నున్నభేద మేమనఁగా నే నది వ్యర్థమని యెఱిఁగియుండియే తిరుగుచున్నాను. వాఁ డిదియే పరమార్థమని తిరుగుచున్నాఁడు. ఇద్దఱిలో నేనే దోషి నని తెలిసికొనకపోలేదు. ఎఱిఁగియుండియు నింక నేల యిందుఁ దిరుగుచుంటి వని యడుగుదువా? తప్పనిసరి యగుటచేత నానుఖప్రారబ్ధముయొక్క శేష మింక నున్నది. అదికూడ ననుభవించువఱకు నేను దీనిని వదలుకొని నను నది నన్ను వదలదు. నాయనా! నే జేసినకర్మముయొక్క ఫలమును నే ననుభవింపక నాకుఁ దప్పునా? 'శ్లో॥ అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం, నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి' అని మీ వంటి విద్వాంసులే యానతిచ్చిరికాదా? అందుచేతఁ బ్రారబ్ధఫలానుభవ పూర్తియగువఱకు నోరుమూసికొని చచ్చిన ట్లనుభవింపవలసినదే.

విరాగి:-చక్రవర్తీ! నీమాటలు నాకు నచ్చలేదు. నీవు వదలి వైచిన సౌఖ్యములు తిరుగ నీవెంట నంటివచ్చునా? రాజ్యమును దృణప్రాయముగ వదలివైచిన నీయల్లుఁడగు రామచం ద్రునితో సాకేతపుర రాజ్యము కూడఁ బోయినట్లు వినియుంటివా? స్వార్థపరత్యాగశక్తి నీ యొద్ద లేదు. అందువలన నిట్లు లాడుచున్నావు.

జన:- నాయనా! చాలసంతోషము. నా కీసౌఖ్యసంఘాతమంతయు వదలిపోయి తిరుగ రాకుండుటకు నన్నేమి చేయుమందువో చెప్పుము.

విరాగి:- నీవు సౌఖ్యమును వదలుకొనుటకు సిద్ధపడియుంటివా? మందది నాకుఁ జెప్పుము.

జన:- ఈ నిముసమందు వదలుకొందును. ఆసౌఖ్యములు నాకు తిరిగి రాకుండ నీవు చేయఁగలవా? ముందది నాకుఁ జెప్పుము.

విరాగి:- అందులకు నాది పూచీ, హిమాలయమునకు రమ్ము పోదము.

జనకచక్రవర్తి ప్రధానునితో నిట్లు పలికెను. "నాకుఁ గొంతపని. యున్నది. నే నీమునితోఁ బోయెను. నే నెక్కడకుఁ బోయెదనో నన్ను గూర్చి యేప్రయత్నము జేయవలదు. నాయిష్టమువచ్చినప్పుడు తిరుగవత్తును. నీవు నన్నేమియు నడుగవలదు."

అట్లు చెప్పి చక్రవర్తి విరాగితోఁ బోయెను.

* * * * * *

వారు మహారణ్య మధ్య భాగమున నడచుచున్నారు. చక్రవర్తికమితమగు దగవేసెను. చుట్టుపట్టుల మంచినీరము దొరకదయ్యెను. నే నెచ్చటికైనఁ బోయి తెచ్చిపెట్టెదనని విరాగి చెట్టుక్రింద నాతనని బండపెట్టి పోయెను. రాజునకు విస్మృతి కలిగెను. ఇంతలో జనకచక్రవర్తి యొక్క సామంతరాజొకఁడు తనకొడుకులను జక్రవర్తికిఁ జూపించుతలంపుతోఁ గొంత సైన్యముతో భటులతో నాశ్వికులతో సమస్తసామగ్రీ సమృద్ధితో బయలుదేఱి జనకచక్రవర్తి పండుకొన్న చెట్టుక్రింద నుండి పోవుచు నామహాతేజమును చక్రవర్తి యని యెఱిఁగియుండు టచే నీమహానుభావుఁ డిక్కడ పడియుండుట కేమి కారణమో యని తెల్లపోయి యాతనియొద్దఁ గూరుచుండి తన వైద్యులను బిలిపించి చక్రవర్తికి దాహశాంత్యాదులను జేయించెను. నిద్దుర మెలఁకువరాకుండ నిమ్మళముగఁబట్టుపఱుపులపై నాతని నుంచిరి. పైన తన పెద్ద డేరా వేయించి డేరా చుట్టు భటులను గుఱ్ఱపునవారులను గాఁపుగాయుచుండ నాజ్ఞాపించెను. తాపశాంతి కొఱకుఁ బన్నీరు భూమిపై జల్లించుచుండెను. పూవులసురట లతో దాసీ జనముచే విసరించుచుండెను. నిమ్మళముగ మెలఁకువ కలుగుటకై మిక్కిలి సున్నితముగ వీణావాదనము జేయించుచుండెను. మహాచక్రవర్తి యారోగ్యమునకై ద్విజులచేఁ బ్రార్థనలఁ జేయుచుండెను. ఒక్క గంటలోపల నిన్ని మార్పులు జరిగెను. అడవి పట్టణమయ్యెను. ఎందుచేత? ఇన్ని సౌఖ్యములు పొందవలసిన వాఁ డరణ్యమున నుండుట చేత.

రాజునకు మెలఁకువ కలిగినది. సామంతరాజుచే సంగతులన్నియుఁ దెలిసికొనెను. ఒకముని యెవరైన నాకొఱకు వెదకుచున్నారేమో కనుఁగొనమని చక్రవర్తి యాజ్ఞ యయ్యెను. లోనికి వచ్చెదనని యెంత సేపటి నుండియో యఱచుచున్న సన్యాసియొకఁడు వెలుపల నున్నాఁడు. సెలవు లేకపోవుటచేత రానీయలే దని యచ్చటివా రెవ్వరో చెప్పిరి. ముని లోనికి వచ్చి బంగారుపీఠముపైఁ గూరుచుండి తనకుఁ బాదాక్రాంతులైన సామంత రాజపుత్రుల నిద్దఱ నాశీర్వదించుచున్న చక్రవర్తిని గాంచి "కర్మయోకి చక్రవర్తీ! నావలన మహాపరాధము గలిగినది. నాకు బుద్ధి వచ్చినది. నన్ను క్షమింపుఁ"డని బట్ట మెడఁజుట్టుకొని సాష్టాంగపడెను. ఈసన్నివేశ మచ్చటివారి కెవ్వరికిఁ దెలియలేదు. మునిని లేవనెత్తి నీవు మఱేమియు ననుకొనవల దని చెప్పి యాతనిని వినమ్రుఁడై యనునయించి సామంత రాజపరివారముతో, విరాగితోఁ దనరాజ్యమునకుఁ బోయెను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# 19. సభావ్యాపారములు

ప్రత్యేకించి ఉపన్యాసం ఈ రోజు లేకపోయినా, జంఘాలశాస్త్రి ఒక చిత్రమైన ఉత్తరం చదివి వినిపిస్తున్నాడు.

ఒక అమ్మాయి గురించిన ఉత్తరమది. ఆమెకు పదో ఏట పెళ్ళి, పధ్నాలుగో యేడు దాటింది లగాయతు కాపరానికి యోగ్యంగా తయారైంది. తండ్రి ఇచ్చిపోయిన డబ్బు వుంది. భర్తకి ఈమె మీద వల్లమాలిన మమకారం. ఆమెకి మాత్రం భర్తంటే అంత వెర్రి లేదు.

ఇలా వుండగా ఒకసారి ఆమె తండ్రికి మేనమామికి మనవడు ఈమెను చూడడానికి వచ్చాడు. కొన్నాళ్ళున్నాడు. ఆమెకి క్రమంగా అతనితో చనువు పెరిగింది. భర్త మీద విముఖత కూడా పెరిగింది.

ఇలా వుండగా భర్త, పెద తండ్రికి ప్రాణం మీదికి వచ్చిందంటే, అతను చూడడానికి వెళ్లాడు. ఆ వెళ్లిన వాడు మళ్లీ తిరిగి రాలేదు.

చిత్రం-భర్త అడ్డు తొలగగానే తన ప్రణయ వ్యవహారంలో విజృంభించ వలసిన ఆమె, తన తండ్రి మేనమామ మనవణ్ణి అదే వూళ్లో వేరే యింట్లో వుండమంది.

మరి కొంతకాలానికి ఈమెకు పక్షవాతం వచ్చింది. ఆమె ప్రియుడు తరచు వచ్చి చూసేవాడు. చేతనైన సేవలు చేశాడు. పక్షవాతం పూర్తిగా తగ్గింది. కాని, భర్త బ్రతికి వుండగా, ఈ ప్రియుణ్ణి దరిజేర నివ్వని ఆమె, భర్త మరణించాడని తెలిశాక పెళ్లి చేసుకుంది. కాని పెళ్లినాటి రాత్రి, గర్భాధాన సమయంలో–ఆమె, తన పూర్వ భర్త తన గొంతు పిసుకుతున్నాడని భయపడింది. చిత్రం-మరికొంత సేపటికి ఈనూతన భర్త చచ్చిపడివు న్నాడు,–ఇదే ఉత్తరం సారాంశం.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:–

ఈదినమున నుపన్యాస మేమియు లేదు. సభలోఁ జదువఁబడుటకై వచ్చిన యుత్తర మొక్కటి మాత్రమే యున్నది, దీనిని జదివెదను. ఇది కొంత చిత్రముగానే యున్నది. దీనిని వ్రాసినయతనిపే రేదో తెలియదు. ఏయూరనుండి యిదివచ్చినదో యంతకంటెఁ

దెలియదు. ఉత్తరముపై నున్న ముద్రఁ జూడఁగ నస్పష్టముగ నున్నది. ఏయూరనుండి వచ్చిన నేమి? ఏవరు వ్రాసిననేమి? దానిలోని యంశములే మనకుఁ గావలసినవి కాదా? ఉత్తరమును జదివెదను.

సాక్షికి:- ఈయూర నొక బ్రాహ్మణి యున్నది. ఆమె కిప్పటికిఁ బదునాల్గు సంవత్సరములు. ఆమెతండ్రి మరణించి యొక సంవత్సరమైనది. ఆతఁడు శవవవహనాది క్రియలచేఁ గొంతసొమ్ము సంపాదించినాఁడు. బిడ్డను మేనల్లుని కిచ్చి వివాహము చేసి యాతనిని తనయింటనే పెట్టుకొనినాఁడు. ఆపిల్లకుఁ బదవయేట వివాహమైనది. పదునొకటవ యేఁట నామె యీడేరినది. రజస్వలాస్నానదినముననే గర్భాదానము గూడ జరిగినది. ఇట్లు తన బిడ్డయు నల్లుఁడును రెండు సంవత్సరములు కాఁపుర మొనర్చినతరువాత నాబ్రాహ్మణుడు మరణించినాఁడు. ఉన్న సొమ్మంతయుఁ గూఁతు నధీనమైనది. తాను మగఁడుమాత్రమే యింటిలోనుండ లేక భటు నొక్కని సాయముకొఱ కింటిలోఁ బెట్టుకొని నారు.

ఈబ్రాహ్మణికి భర్తయందు వెట్టిమమకారము లేదు. భర్తకు భార్యయం దెంతయను రాగ మైన నున్నది. ఆమెకనుసన్నలను మెలఁ గుచు నామెకు సమస్తోపచారములను జేయుచుండెను. తన్నాశ్రయించి సేవించినకొలఁదియు నాతనిపై నామె మనస్సునం దనిష్టత హెచ్చుచుండెను. భర్త మిగుల దేహదార్ఢ్యసంపన్నుఁడే. రూపవంతుడే. పరస్త్రీ పరాఙ్ముఖుఁడే. అయిననేమి? అతనియోగ్యతలన్నియు దోసములుగా నామెకుఁ గనఁబడుచుండెను. భర్త తలయెత్తి యామెను చూడఁగ నామె కనులు మూసికొని తలవంచుకొనుచుండెను. భర్త దగ్గఱకు రాఁగా నామె దూరముగఁ బోవుచుండెను. భర్త తనతో మాటలాడఁగ నామె విననట్లు భటునిఁ బిల్చి యేదియో చెప్పుచుండెను. ఇట్టిభర్త కేమిసుఖమున్నది? వీరి దాంపత్యములోని చిత్రములను వాణీదాసునివంటి కవి వర్ణింపఁదగినది. కాని నేను జెప్పఁజాలను. మీ జంఘాలశాస్త్రి వంటివాఁ డీదాంపత్య సౌఖ్యమును గూర్చి యుపన్యసింపవలయును గాని నావలన గాదు. చప్పనిమాటలతోఁ జప్పుచప్పుగా మాత్రమే వ్రాయఁగలవాఁడను.

ఇది యిట్లుండఁగా నీమెతండ్రికి మేనమాయ మనుమఁ డొకఁడు వచ్చెను. ఆతని నీసంసారిణి గౌరవించి యాదరించుచుండెను. ఆతఁ డట్టి రూపవంతుఁడు కాఁడు. శరీరదారుఢ్యముకూడ బాగుగా నున్నవాఁడు కాఁడు. ఈమెభర్త కాకపోవుటయే యాతని సుగుణమని యెన్నఁదగి యున్నది. ఆమెకు నతనికిఁ గొంతకాలము కనుసన్నలు నడచెను. తరువాత గొన్ని దినములు ముసిముసినవ్వుల 'లావాదేవీలు' జరిగెను. కొన్ని దినములు చిన్నచిన్నమాటలు జరిగెను. తరువాత సావకాశముగా బుక్కిటి పురాణములలోను, లోకాభి రామాయణములోను, లొట్టాబట్టీయములోను కొన్నిదినములు నడచెను. అందుపైన ప్రమాదవశమునఁ జేతులు చేతులు కలియుటలు, నెట్టినొచ్చుకొనుటలు, నిట్టెక్షమాపణలు జరిగెను. అందుమీఁద తొందరతొందరగ వదలువదులు హస్తస్పర్శములు, పిమ్మట కొంతబిగింపులు, రవంత గిలిగింతలు, కాసంత యిగిలింతలు చెలరేఁగెను. అటుపైన బెదరుబెదరు నాలింగనములు, అట్టెవిడిపోవుటలు కలిగెను. అందుపైన మూతిమూతి కలియుటలు, శిరఃకంపనములు మొదలైనవి జరిగెను. అంతటితోఁ గొన్ని దినములాగెను. స్వభావసిద్ధముగ నద్భుతమైన యీశృంగార గ్రంథము యొక్క ప్రతిపదార్థమంతయుఁ దనకు బాగుగఁ

దెలియకపోయినను రవంతభావమైనను భర్తకు తెలిసియుండకమానదు.

భర్తయెంత చేతగానివాఁడైనను భార్య యెంతస్వతంత్రురాలైనను భర్త యింటిలో నున్నంతకాలము భార్యకు విశేషస్వేచ్ఛయుండుట కవకాశము లేకపోయిన కారణముచేతఁ గాఁబోలు బాహ్యవిలాసముల తోడనే కాలక్షేపము జరిగినది. భర్త యిల్లు విడిచి లేచిపోయిన బాగుగ నుండునని భార్య యనుకొనినది. ఇంతలో దైవవశమున భర్త పెద తండ్రికి ప్రాణముమీఁదికి వచ్చినదని యాతనికి తంతివార్త వచ్చినది. అంతట నాతఁడు పోయినాఁడు.

భర్త యింటనుండినంతసేపు పైయపేక్ష కలిగియుండిన భార్యకు భర్త వెళ్ళినది మొద లావృత్తి నన్నగిల్లెను. ఇంటిలో నున్నవాఁ డెన్ని విధముల బతిమాలినను నీమె యంగీకరింప లేదు. అది గాక నింటిలో భర్త యున్నప్పు డెందఱు పరపురుషులున్నను బరిసిపాఱిపోవును గాని భర్తయింటిలో లేనప్పుడు మాత్ర మొక్కపురుషునినైన నింట నుండనిచ్చుట సానివృత్తి కంటె భిన్నము కాదని యెఱింగియుండి కాఁబోలు నాతని నాయూరనే మఱియొక్కయింట నుండుమని చెప్పెను. ఈమె మిక్కిలి నాగరికతగల స్త్రీ యగుటచేత ననేకులగు నుద్యోగు లీమెతోఁ గరచాలన మొనర్చి మాటలాడుటకు వచ్చుట గలదు.

తరువాత గొలదిదినములలోనే ఈమెకు పక్షవాతము వచ్చెను. అట్లామె యొక్క సంవత్సరము మంచముమీఁదనే యుండెను. ఆమె మిత్రుడు తఱచుగ వచ్చిచూచుచుఁ జేతనైనయుపచారములను జేయుచుండెడివాడు. భర్త యెక్కడ నున్నాఁడని యామె తఱచుగా నీతని నడుగుచుండెను. అతని పెదతండ్రి గ్రామములోనే యున్నాఁడనియు, నక్కడ నాతఁడు చిన్నపొలమును సంపాదించుకొని వ్యవసాయముచే జీవించుచున్నాఁడనియు, నిక్కడ కింక రాఁడనియుఁ దన కాయూరనున్న మిత్రుఁ డొకఁడు వ్రాసినాఁడని యామెతో నాతఁడు చెప్పెను. ఇట్లుండ నామెకుఁ బక్షవాతము పూర్తిగ నిమ్మళించెను. నామాట యేమని యామెను మిత్రుఁ డడిగెను. "నీవు నన్ను బెండ్లిచేసికొన వీలులేదు. నేను పడుచుకొనుట నాకిష్టము కాదు. నన్నేమి చేయుమంటివి" యని యామె పలికెను. "నిన్నే నేను వలచితిని. నిన్ను వదలువాఁడనుగాను" అని యాతఁడు పట్టుపట్టి కూరుచుండెను. ఇట్లుండ నొక్కనాఁడు భర్త పెద్దతండ్రియొద్దనుండి యామెకుఁ దంతి వచ్చెను. తనభర్త మరణించి నట్లు దానిలో నుండెను. ఇక్కడకుఁ బీడ వదలినదని యిద్దఱు కూడ సంతోషించిరి.

భర్తమృతికై యనేకు లీమెను బరామర్శించిరి. నెలదినములు కాకుండానే తాను దనమిత్రుని వివాహముచేసికొందునని యామె ప్రకటించెను. సహజమైన ప్రేమ, దేశకాలాబాధితమని యందఱు సంతోషించిరి. వివాహదినమున నీమెను జూచుటకు వచ్చిన యుద్యోగులకు లెక్క లేదు. ఒక హైకోర్టుజడ్జి కాఁబోలు నిందకొఱకు సెలవు పుచ్చుకొని Orr & Sons నుండి యొక హారముతో నామెను జూచుటకు వచ్చి యామెనాగరకతకు, యోగ్యతకు మిక్కిలి సంతోషించుచు నొక్క చక్కనియుపన్యాస మిచ్చెను. సిద్ధాన్నము కావున నారాత్రియే గర్భాధానము. రాత్రి గర్భాధానశయ్యయొద్దకుఁగూడ నెందఱో యుద్యోగులు వచ్చి యాయదృష్టవతిపై నభివందనములు వర్షించిరి. డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెం టొక్కఁ డామెతోఁ గరచాలన మొనర్చి కెంపుపొడి గలయొక బంగారపు సూది యామెపైటపైఁ గ్రుచ్చెను. ఉన్నతన్యాయస్థానాధికారి యొకఁడు వచ్చి యామె మస్తకమందు హస్తముంచి రెండవ హస్తముతో నామెబుగ్గలు పైకెత్తి పవిత్రప్రేమ పూర్ణమైన, దేవతా సంబంధమైన యొకముద్దును

నుదుటిపైఁ బెట్టుకొనెను. అందఱు కరతాళము లిచ్చిరి. వధూవరు లన్యోన్యప్రేమ గలిగి సుఖింతురుగాక యని యాశీర్వదించి గది తలుపులు వేసిరి.

ఇంతటినుండి విచిత్రమైనగాథ యారంభమైనది. చిరకాలమునుండి గాఢాశ్లేషమునకై యువ్విళ్లూరుచున్న దంపతులు కలిసి యొకరిపై నొకరు చేయి వైచుకొని, తాంబూలమును వైచుకొని, పండుకొని యురితీసినంత బింకముగాఁ గౌఁగిలించుకొనిరి. అంతట పుస్తకముల బీరువా ప్రక్కనొక్క నీడ యామెకుఁ గనబడెను. ఏమోయని కొంత సంశయించి బీరువానీ డయై యుండునని యూరకుండెను. ఈసారి మిగులగాటముగా ముద్దిడుకొనుచుఁ బ్రమాద మున వెనుకఁజూడఁగా నీడకదలుచున్నట్లుకన బడుచున్నది. కదలుట యేలనని జడిసి యానీడను భర్తకుఁ గనఁబఱచెను. అతఁడు చూచి మరేమియులేదు. పండుకొనుమని యామెకన్నులమూసి లేవఁబోవగా వద్దు, వద్దు, నాకక్కఱలేదు. నాపూర్వభర్త స్వరూపమ దిగో గొంతు పిసికెద నన్నట్లు సంజ్ఞయొనర్చుచున్నాఁడని బలవంతముగా నామె లేచికూరు చుండెను. ద్వితీయభర్త కూడ లేచిచూడఁగా నీడయు లేదు. జాడయునుగూడ లేదు. అంత నిద్దఱుగూడ నవ్వుకొనుచుఁ దిరుగఁ బండుకొని యిట్లు మాటలాడుకొనిరి. నాభర్త దయ్యమైనాఁడు కాఁబోలునని యామె యనఁగా దయ్యములు లేవు, భూతములు లేవు. నీహృదయమం దున్న యాతనివిగ్రహము నీయెదుటఁ గాంచుచున్నావు. ఇది మనస్సంబంధ మగు నింద్రజాలము గాని మఱొకటి కాదు. నీవు నాయొద్దఁ బండుకొనుటతోడనే పూర్వసంస్కారవిశేషమువలన నీభర్తను గాటముగా తలఁచుకొంటివి. అంత నాతనిస్వరూప మును పైనఁ గాంచితివని నూతనభర్త యామెను సమాధానపఱచెను.

గీ. కాతరుఁడు మదిఁ గలపాము గాంచు నెదుట
విరహి యెదుటఁ జూచును లోన వెలయు చెలిని
మెదటిలోని స్వర్గమును కవియెదుటఁ గాంచు
మనసు చూడు మన్నట్టులే కనులు చూచు.

ఈసారి తప్పకుండఁ బండుకొనవలయునని మహోత్సాహమునఁ బ్రయత్నము సల్పఁగఁ దిరుగ నానీడయే యిద్దఱకుఁ బ్రత్యక్షమైనది. ఇది యేమియును బాగుగ నున్నది కాదు. దీపమార్చి పండుకొందమని భర్త భార్యతోఁ జెప్పఁగ, నామె యెంతమాత్ర మంగీకరిం పలేదు. నాకు భయమువైచుచున్నది. అక్కడ నేమున్నదో చూచిరమ్మని భార్యభర్తను గోరెను. ఏమియు లేదు పండుకొను మని భర్త బలాత్కారప్రయత్నమునకు సిద్ధము కాఁగా నింతలో నేమయ్యెనో యెవ్వరికిఁ దెలియదు. కాని తెప్పపాటు కాలములో గర్భాధానపుఁ బెండ్లికొడుకు చచ్చిపడియుండెను. ఎట్లు చచ్చినాఁడో యెవ్వరికిఁ దెలియదు. కెవ్వుమని యింటికప్పెగిరి పోవునంత కేకవైచి యాతని భార్య క్రిందఁ బడిపోయెను. గదివెలుపలి వారు భయపడి తలుపులయుతక లెత్తి లోనఁ బ్రవేశించిరి. ఆమెకుఁ గొంతసేపటికిఁ స్మృతిరాఁగ నీసంగతులన్నియు నామెవలనఁ దెలిసినవి. ఈ సంగతి రక్షకభటులకుఁ దెలువగ, వా రేమో ప్రయత్నించుచున్నారు.

ఇది జరిగిన కథ. దీనిని మీరు ప్రచురించవలయును. చిత్తగించవలయును.

ప్రచురింపవలయునా లేదా యని జంఘాలశాస్త్రి సభవారి నడిగెను. పోలీసు విచారణలో

నున్న వ్యవహారమును గూర్చి మనయభిప్రాయ మేమో తెలుపఁగూడదని యొక్కఁ డనెను. వితంతువివాహములు చేసికొనఁదలఁచిన మన సోదరీమణుల కిది కొంత నిరుత్సాహముగా నుండును గావునఁ బ్రచురింపవలదని మఱియొక్కఁ డనెను. చచ్చిన భర్తలందఱు దయ్యములై తమ వితంతువుల ప్రక్కలలోనికి రాత్రిభాగమునందు వచ్చుచుండునెడల నింక వివాహము లెందుకు? క్రొత్తవారి విశేషముమాత్ర మేమున్నది? అందుచేత నిరుత్సాహముగా నుండదు. ప్రచురింపుమని యొక్కఁడనెను. ఇది ప్రధానసాక్షిలోఁ బ్రచురింపక సభావ్యాపార సాక్షిలోఁ బడవేయువలయు నని యింకొక్కఁ డనెను. అందఱుగూడ నీ కడపటి యభిప్రాయమును మన్నించిరి.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# 20. భవభూతి

సంస్కృత పండిత విమర్శకుడొకాయన సాక్షి సంఘ సభలో ఒక చిన్న విమర్శనం చదువుతానని కోరడం వల్ల జంఘాలశాస్త్రి, ఆ శాస్త్రిగారికి అవకాశం ఇచ్చాడు.

ఆ విమర్శనం భవభూతి మహాకవి గురించి

అతని కవిత్వం ఎంతో మృదువు. లలితం. ఎంత ప్రయోజకుడైనా, సమకాలికుల చేత ఎక్కువ తిట్లు తిన్నవాడు. శబ్దార్థాలకి రెండింటికీ సమాన గౌరవం ఇచ్చేవాడైనా, ఒక్కొక్క సారి శబ్ద వ్యామోహానికి లొంగిపోతాడు. అక్కడక్కడ మానవ ప్రకృతి పరిశీలనంలో తేలిపోతాడు. మాలతీ మాధవీయం, మహావీర చరిత్రం, ఉత్తరరామచరిత్ర అనే మూడు నాటకాలు వ్రాశాడు. ఈ కవి ఉత్తమ కవుల్లోని వాడే. ఈ కవి గర్వభూయిష్ఠుడు. తనను ప్రశంసించని వాళ్లని తిట్టే స్వభావం గలవాడు.

ఈ పండితుడు, భవభూతి స్వభావం బయటపడే శ్లోకాలను ఉదాహరించి వివరించాడు. 'సర్వథా వ్యవహర్తవమ్' అనే శ్లోకార్థాన్ని వివరిస్తూ విమర్శకుల్ని తిట్టడానికే అవకాశం భవభూతి ఉపయోగించుకున్నాడని చెప్పాడు.

కవిత్వం, చిత్రలేఖనం, ఇవి అభిరుచి ప్రధానమైన కళలు. కవులు గ్రంథాల్ని దేశం మీద విడిచి పెట్టినప్పుడే, ప్రజలకి వాటిని విమర్శించే అధికారం వుంది. కవులలో చాలా మంది తమ అభిరుచి ప్రకారం వ్రాశారు. ప్రకృతి సూత్రాల్ని బట్టి వ్రాయలేదు. విమర్శించేవారు తన అభిరుచిని బట్టి విమర్శిస్తాడు. ఈ తగవు పరిష్కారానికి సూత్రాలేమిటి? ఆ చింత అక్కడ లేదని ఆ సంస్కృత పండితుడి ఉద్దేశం.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:–

నాయనలారా! ఒక సంస్కృత పండితుఁడు విమర్శకుఁడు మన సభలో నొక చిన్న విమర్శనము చదివెదనని కోరిన హేతువుచేత నంగీకరించితిని. మీ రా విమర్శనమును శ్రద్ధతో వినవలయును. అయ్యా! శాస్త్రులుగారూ! మీరిఁకఁ జదువగోరెదను.

అంతనొక శాస్త్రులుగా రుపన్యాసరంగ మెక్కి కంటికి జోడు పెట్టుకొని యిట్లు చదివెను.

భవభూతి భారతీయ మహాకవులలో నొకడు. మాలతీమాధవీయము, మహావీరచరిత్రము, ఉత్తర రామచరిత్రము ననువేళ్లుగల మూఁడు నాటకము లీతఁడు వ్రాసినాఁడు. వానిలో నుత్తర రామచరితము ముత్తమమైనది. ఈకవి యుత్తమ కవులలో నొకఁడు. అతని కవిత్వ మత్యంతలలితమైనది. మృదుల మృదులతర మృదులతమాధికశబ్దములను వర్ణ్యవిషయానుసారముగా కూర్చి కవిత్వము జెప్పిన మహామహుఁడు. శబ్దార్థములు రెండును సమానగౌరవముతోఁ జూచునుద్దేశము కలవాఁడయ్యును నొక్కొక్కప్పుడు శబ్దముల యింద్రధనస్సు రంగులకు వ్యామోహపడి సందర్భమును కొంచె మలక్ష్యము జేయును. అదిగాక నచ్చటచ్చట మనుష్యప్రకృతి పరీక్షయందుఁ దేలిపోయినట్లు గనఁబడుచున్నది. ఈతఁడెంత ప్రయోజకుఁడయ్యును సమకాలికులచే మిక్కుటముగాఁ దిట్లుదినిన వాఁడు. సమకాలికులచే దిట్లు తినుటకు ప్రయోజకతాప్రయోజకతాభేదము లేదు. పరోపకారవేశమున ద్యాగమును జేయువారిని కీర్తిభిక్షుకులనియును, స్వగౌరవప్రకటకులనియుఁ బ్రజలు దూషించుచున్నారు. ప్రజాసౌఖ్యాభివృద్ధికై భాషాగౌరవవృద్ధికై పాటుపడు ప్రభువులను బరిపాలక బిరుదవాంఛాలాలసులని ప్రజలు నిందించుచున్నారు. దేవభక్తిచే మహాక్షేత్రములందు దేవాలయములను నిరతాన్నశాలలను స్థాపించువారిని పూర్వకృత బ్రహ్మహత్యాదిదోషనివారణకై చేయుచున్నారని జనులు దూషించుచున్నారు. ఏపని యెట్లు జేసినను దిట్లు తప్పవు. చిత్రలేఖకునికిఁ బాంచాలికారచనయందుఁ గల్పన లేదనియు రహస్యముగాఁ దీసికొని దాఁయుంచిన ఫొటోలను బెద్దజేసి వ్రాయు దొంగయనియు ప్రజలు తిట్టుచున్నారు. తంత్రజ్ఞునికి గాత్రము లేదనియు, గాత్రజ్ఞునికి దంత్రములేదనియు, రాగకల్పన పూర్తిగా నున్నవానికిఁ బల్లవిజ్ఞానము తక్కువ యనియు, నందఱుకూడ ముండలముతాదారులనియు గాయకులను దూషింతురు. ఇక గవిబద్రు కెట్లున్నదో చెప్పనా. కవిత్వమల్లిన వాని కొక్క మునలిదియో, పడుచుదియో, యటునిటు కానిదియో, సువాసినియో, వితంతువో, యటునిటు కానిదయో యొక్కతె ప్రక్కదాపుగా నుండక తప్పదని జనులనమ్మకము. దేవుడున్నాడను నమ్మకము కంటె జనుల కిది దృఢతరమై యున్నది. దేవీభక్తుఁడగు నమ్మకము కంటె జనుల కిది దృఢతరమై యున్నది. దేవీభక్తుఁడగు కాళిదాసునకుఁ గూడ నీనింద తప్పినది కాదు. కవియనఁగా సోమరి, ప్రపంచజ్ఞానశూన్యుడు. తిక్కతత్త్వము గలవాడు, స్వతంత్రమైనవృత్తిచే జీవించువాడు కాడు. ఒకని నీడను దిరిగి బ్రతుకువాడు. అందఱికు దాసుఁడు. కాని ఎవడు చెప్పిన మాటనువినువాడు కాడు. అందఱిని దిట్టువాడు. కాని ఎవడు చెప్పిన మాటనువినువాడు కాడు. అందఱిని దిట్టువాడు, అందఱిచేత దిట్లుతినువాడు. దరిద్రతలో నింతతెగనీల్గు మఱి యెచ్చటనులేదు. చేతగానితనములో నింతగర్వము మఱియెచ్చటనులేదు. ప్రత్యక్షమందుఁ జేత రాగికాను లేకున్నను భావనలోఁ తలక్రింద మేరువుగలవాడు. ఆపూట కన్నము లేక చావు. ఆచంద్రార్కముగా శాశ్వతుడనను నమ్మకము కలవాడు. బ్రహ్మదేవుఁడు తన్ను బాగుజేయు యత్నించినను బాగుపడువాఁడు కాఁడు. కాని ప్రపంచమునంతను బాగుచేయుటకు బ్రయత్నించువాడు. కవి యిట్టివాడు. ఇంతకంటె దిక్కువాఁడు. మఱి యింతకంటె కొనవెఱ్ఱివాఁడు. అతని వెఱ్ఱికి ప్రజలే కొంత కారణము. ప్రజలాతని దిట్టి రేఁగఁగొట్టుచున్నారు. రేఁగినప్పుడు మాత్రము వెఱ్ఱికుక్కవలె

నాతఁడందఱుఁ గఱచును. కవిని దిట్టఁజాలనంత మొద్దు ప్రపంచమున లేదు.

సీ. బండిఱాయన నెద్దుబండియా పోతుల
బండియా యనెడు మొద్దుండవచ్చు
గుక్కఁగొడు గనగ గుడ్డదో దాటాకు
దోయని యడుగు మొద్దుండవచ్చు
దాంద్రబెత్తనఁ దాటితాంద్రయో, మామిడి
దోయని యడుగు మొద్దుండవచ్చు
జాముండి యనగ ముసలిముండ యొబాల
రండయొ యడుగు మొద్దుండవచ్చు

తే. నుర్వి నెటువంటి మొద్దయిన నుండుగాని
యాధునికకవి కవితయం దన్ని దోష
ములె యటంచుఁ బల్కఁగలేని మొద్దు లేదు
సర్వదేశంబులను సర్వజాతులందు.

పనికిమాలినకవి పస్తుపడుచునైన బద్యమల్లకమానడు. అల్లిన వాఁడు తనలోఁ దాను నంతోషించి యూరకుండునా? ఉహూఁ! ప్రత్యాసక్తిగ పనికట్టుకొని బండికర్చుపెట్టుకొని బత్తెము మూటఁ గట్టుకొని పోయి పదిమందికి వినిపించినదాఁక కొట్టుకొనునే కాని యితని దిక్కుమాలిన సోదె యెవఁడు వినును.

సీ. తలను గొట్టుకొని మెదడు జింపుకొని యొక్క
గద్యమో పద్యమో కవిత యల్లి
జనులకు వినిపింపఁ గనుబొమ చిట్లించు
నొకఁ డడ్డముగ మొగ మూఁపు నొకఁడు
ఒక్కఁడోష్ఠము విఱుచు నొకఁడు వంకగ నవ్వు
నొక్కఁడు పూర్వగవుల నుబ్బిపొగడు
ఎట్లున్నదదండి యం చేడ్వగ నకిలించి
ఊ యున్నదని సాగఁదీయు నొకఁడు

ఆ.వె. వ్రాయుచుండ బాధ వ్రాయుపిదపఁ దిట్లు,
కడుపుమంట మిగులు గలుగు కవిగఁ
బుట్టుకంటె ఘోరజన్మ మెరబ్బ
కఠినఫలము లేదుగాదె యకట!

అని ఒక్కకవి కూనురాగమునకు బెద్దయేడ్పునకు నడుమనున్న కంఠమాధుర్యముతో నేడ్చెను.

భవభూతికూడ నెల్ల ప్రజలవలనఁ దిట్లు తినినవాఁడే. కోపము పట్టలేక యతఁడు ప్రజలఁ దిరుఁగబడి తిట్టినాఁడు.

శ్లో. యేనామ కేచిదిహనః ప్రథయంత్యవజ్ఞాం
జానంతు తే కిమపి తాంప్రతి నైషయత్నః
ఉత్పత్స్యతే మమ తు కోపి సమానధర్మః
కాలోహ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ.

ఈకవి గర్వభూయిష్ఠుడు. తన్ను స్తుతింపని వారిని నిందించు స్వభావముగలవాడు. ప్రజలు కవిదూషణము చేసినప్పుడు కవి ప్రజాదూషణ చేసిన తప్పేమున్నది. కవుల కెంతసేపు నాత్మస్తోత్రము, పరహేళనము, వానితోపాటు గర్వము ననూయయు సాధారణ మగు నవగుణములు. కవులకున్న పౌరుషము యుద్ధవీరులకు లేదు. వారికున్న యసూయ జారులకు లేదు. వారికున్న స్వస్తోత్ర పరనిందలు పడుచుసానులకు లేవు. తిట్లు తిట్టుటయందుఁ దినుటయందుఁ గూడ మహాఘనులు. తన కవిత్వమును ప్రజలు నిందించు చున్నారని కడుపు మండుటచేత చిత్తము పుండగుటచేత భవభూతి యీశ్లోకమును జెప్పినాఁడు. దానియర్థమిది. ''ఎవ్వరైన మా తిరస్కారము బ్రకటింతురు గాక! వారుగూడ నేదియో కొంచెము తెలిసినవారే యగుదురు. అట్టివారికొఱకు నేనీ గ్రంథమును వ్రాయలేదు. కాల మంతములేని దగుటచేతను, భూమి విశాలమగుటచేతను, నేకాలమందైన నేస్థలమందైన నావంటి బుద్ధిధర్మముగలవాఁడు పుట్టగలఁడు'' కాని దీని యాంతరంగికాభిప్రాయమేమనఁగ, ''నా కవిత్వము మిగుల సారవంతమైనది. దానిలో నున్న విశేషమును, రసమును నాస్వాదిం చుట కీకాలపువా రశక్తులై పోయినారు. గుడ్లగూబ తన యక్షిరోగమును నిందించుకొనక యర్కతేజమును నిందించునట్లు లీయసమర్థులు తమ రస గ్రహణషండత్వమును నిందించు కొనక భారతీమండనాయమాన మగు నాకవిత్వమును దూఱుచున్నారు. ఇట్టి రసహీనాగ్రేస రులను సంతోష పెట్టుటకు నేను గవిత్వము చెప్పినవాఁడనుగాను. నేను నాకవిత్వము నెంత కళాకౌశలవిశేషముతోఁ జెప్పితినో యంత కళాకౌశలసామర్థ్య మున్నవాఁడు ముందెప్పు డైన నెక్కడనైనఁ బుట్టవచ్చును. వాఁడే నాకవిత్వమును గ్రహించి యానందించుగాక. వానికొఱకే యిప్పు డీ కవిత్వమును జెప్పుచున్నాను. అట్టివాఁ డుద్భవింపఁగలఁ డనుని శ్చయ మేమిగల దందురేమో ధరామండల మత్యంత విశాలమైనది. కాలము పరిమితి శూన్యమైనది. ఎందులకుఁ బుట్టఁగూడదు'' ఇవి యేమి సాధారణ వాక్యములా? ఎంత యాత్మశక్తి విశ్వాసమున్న వాఁ డిట్లు పలుకవలెను. ఎట్టి పాండిత్య మదమత్తుఁ డిట్లు పలుకవలయును. జనులయం దెంతరోఁతగలవాఁ డిట్లు పలుకవలయును. ఆ మహాకవి యెంత బుద్ధిశాలి, యెంత వికతాపటిమ కలవాఁడు. యెంత ప్రాణము వినుగకపోయిన యెడల వింతతేలికగ మాటలాడును. ఎంత రసస్ఫూర్తి గలవాఁడు, యెంతబాధపడకుండిన నెంత యొడలు చిల్లులుపడకుండిన నింతపేలవముగఁ బలుకఁగలఁడు. జనులను సంతోషపెట్టఁ దలఁచి తా నేద్చువాఁ డొక్క కవియే. పుణ్యమునకు బోయి బూతులు తినువాఁ డొకకవియే. ప్రజాసేవకుఁ బోయి బడితె బాజా కధీనుఁ డగువాఁ డొకకవియే. భవభూతివంటివాని బ్రతుకే కడతేఱనప్పు డిప్పటివారి మాట చెప్పవలయునా? కాళిదానుఁడు మాత్రము జనులతిట్లగు రికి దాఁటిపోఁ గలిగెనా? ఆతని కవిత్వములోఁ బటుత్వము తక్కువయనియు నాతఁడు యమకకవిత్వమున నజ్ఞుఁడనియు నింకనేమో ప్రజలు నోటికి వచ్చినట్లెల్ల దూషింపలేదా? కాళిదాసుడు గంభీరుడు. భవభూతి బేలగుండె కలవాఁడు. కాళిదానుఁడు గడునుకవి. ఈతవి నెందఱు తిట్టినను దన శాకుంతల నాందిలో ''శ్లో. ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే

ప్రయోగవిజ్ఞానం, బలవదపి శిక్షితానా మాత్మన్యప్రత్యయం చేతః'' అని వ్రాసినాఁడు. ఇది యెంతలౌకికపు వ్రాతయో చూచితిరా? తన్నుఁ దూఱనాడుచున్న వారిని విద్వాంసులని శ్లాఘించుచున్నాఁడు. వారి శిరఃకంపనమే తనకుఁ గావలసిన దనుచున్నాఁడు. అది లేనియెడల దన గ్రంథమసాధు వనుచున్నాఁడు. ఆహా! ఇవి యెంతగడుసుమాటలు! తిట్టువారి నోటికింత కంటె గట్టిమంత్రమేమున్నది? తిట్లు స్తోత్రమువలననే యడఁగును గాని తిట్లవలనఁ బోవునా? ఈమాత్రపు బ్రకృతిరహస్యమును గ్రహింపలేక భవభూతి తెగిపడి తిట్ట నారంభించినాఁడు. ఉత్తమకవుల ప్రాశస్త్యమును సమకాలికులే కాదు. కొంచెము తరువాతి వారు గూడ గ్రహింపలేరు. షేక్స్పియరు యొక్క మహాప్రజ్ఞనాకాలములో గ్రహించినవా రేరి? బ్యాక వంటివాని కనులకే యీమహాకవి కళాకౌశలము కనఁబడలేదే! అతని తరువా తివా రగు జాన్‌సన్ మొదలగువా రీకవికి లేనిదోషములను గల్పించి తూలనాడిరి. జాన్‌సన్ కంటెకి, నాంగ్లేయసారస్వతతిమింగల మనిపేరొందిన వానికంటెకి పోపు అనువాఁ డెక్కువ కవిగాఁ గనఁబడినప్పుడిక జెప్పవలసి దేమున్నది?

పాపము. భవభూతి యిట్లే ప్రజలతిట్లవలన బాధపడినాఁడు. ఏమి చేయవచ్చును? కవితా ప్రారబ్ధమున్న ప్రతినిర్భాగ్యున కీబాధ తప్పదు. కొందఱు కవులు విని విననట్లుందురు. కొందఱు కవుపు వినకుండ నెన్ని ప్రయత్నములైన జేసికొందురు. కొందఱు విని ముసిముసినవ్వులు నవ్వి యూరకుందురు. కాని లోకబాధ పడనివాఁ డొక్కఁడును లేఁడు. ప్రజలను దిరుగఁబడి నోటికసిదీఱ తిట్టుట కవకాశమునకై కొందఱు వేచియుందురు. అట్టి యవకాశము రాకపోయినను గల్పించుకొందురు. భవభూతి ఉత్తర రామచరిత్ర నాందీప్రస్తావనలో విమర్శకులఁ దిట్టుట కట్లవకాశమును బుద్ధిపూర్వకముగఁ గల్పించుకొనినాఁడు. ఎట్లో వినుడు. నటసూత్రధార సంభాషణములలోనిభాగ మిప్పుడు మీకు విన్పింతును వినుఁడు. బ్రహ్మశ్రీ జయింతి రామయ్యపంతులుగారి యాంధ్రీకరణ మనుసరింతము.

సూత్ర:– మన కిదియంతము నేల? నిజకులమర్యాదానుసారముగ రాజద్వారమునే సేవింతము రమ్మె.

నటు:– అట్లయిన, రాజుగారియొద్దఁ బఠించుటకై నిర్దుష్టమైన స్తోత్ర మొకటి రచింపుము.

అంతటితో రవంత యాగుదుము. రాజద్వారమును సేవించుట నిజకులమర్యాదానుసార మైనప్పుడు నిజకులమర్యాదానుసారముగ నటుఁడు రాజుగారియొద్ద మామూలుగాఁ బఠించుచున్న స్తోత్రములను బఠింపవలయునే గాని యారాత్రి నటునకు ప్రత్యేకముగ నిర్దుష్టమైన స్తోత్ర మెందులకు? ఒకవేళ ప్రతిదినమును నూతనస్తోత్రమును జరుపవలయు నన్న నిర్బంధము నటునకున్నదా? ఉండదు. కాని యున్నదే యనుకొనుఁడు. ఉన్నప్పు డందులకైనటుఁడు మహారాజకవిని గోరవలయును కాని నాటక పాఠములను చెప్పుసూత్రధారుని వేఁడనేల? సూత్రధారుఁడు మాత్రము కవి కాఁగూడదా? ఎక్కడను వినలేదు. సరే. కవి యని యంగీకరింతము. అందుపైన సూత్రధారుఁ డేమనియెనో విందురా.

సూత్ర:– శ్లో. సర్వథా వ్యవహర్తవ్యం కుతో హ్యవచనీయతా యథావాచాం తథా
స్త్రీణాం సాధుత్వే దుర్జనోజనాః

దీనియర్థ మేమనఁగా, జనులు నిందింతు రను భీతిని వదలిపెట్టి నిర్దుష్టముగాఁ గవిత్వము చెప్పవలసినది. నిందలేదన్నమాట యెన్నడును లేదు. కవులవాక్కుల యెడలఁ గాంతలయెడల జనులు తప్పునే తడవుచుందురు. నటుఁడు నిర్దుష్టమగు స్తోత్రమును కోరినప్పుడు సూత్రధారుఁడిదియంతయుఁ జెప్పనేల? నటుని మాటకు సూత్రధారుని మాట సందర్భమైన ప్రత్యుత్తరముగాఁ గనఁబడుచున్నదా? ఒకవేళ నటుఁడు "సూత్రధారా! నేను స్తోత్రము రచియించినయెడలఁ దప్పులు వచ్చునేమో నీవే నిర్దుష్టముగాఁ జెప్పవలసిన" దని కోరినయెడల సూత్రధారునిపై ప్రత్యుత్తరము కొంత సందర్భముగా నుండునేమో భావికథాసూచనకు నంతకంటె ముఖ్యమైనది విమర్శకులను దిట్టుట కీ యవకాశమును బుద్ధిపూర్వకముగఁ గవి కలిగించుకొనినాఁడని నాకుఁ దోఁచుచున్నది.

సోదరులారా! పై శుక్రవారమున నుత్తరరామచరిత చిత్రపటము అను విషయమును విమర్శింతును. అపండితుడవు. ననామకుఁడ వగు నీవు భవభూతిని విమర్శింతువా? తప్పుకాదా? ఊరకుండుమని నన్ను దిట్టుదురా? కవులగ్రంథ సంచయమునకు, కాఫీహోట లునకు, నాకు భేద మగపడలేదు. హోటలునకుఁ బోయి పాకపుగారెలు తినునప్పుడు పాకములోఁ దగినంత బెల్లము వేయలేదని యనుటకు నాకధికారము లేదా? నీవు మంచివంటగాఁడవైనట్లే తెగనీల్గుచున్నావే యని పై వారు కాని, యధికారిగాని నన్నుఁ దిట్టుట ధర్మమా? కవిత్వమేమి, చిత్రలేఖనమేమి, యభిరుచి ప్రధానమైన కళలు. నాయభి రుచి కనుకూలమైనదానిని నేను బాగుగ నున్నదందును. లేనిదానిని బాగుగ లేదందును. అది నా జిహ్వలోని గుణము కావచ్చును. దోషము కావచ్చును. ఆమాత్రమునకుఁ గవులకు నాపైఁ గోప మెందులకు? ప్రజలకు నాపైఁ గోపమెందులకు? నేను బాగుగా లేదన్నది బాగుగానుండఁగూడదా? నేను బాగుగానున్నదన్నది యోగుగా నుండఁగూడదా? కవులు గ్రంథములను దేశమున నెప్పుడు విడిచిపెట్టినారో యప్పుడే ప్రజలు వానిని విమర్శింప నధికారముగల వారైనారు. కళలకైనను గేవల మభిరుచియే ప్రధానమా? మంచిచెడ్డలను బరిశీలించు ప్రకృతిసూత్రము లేవియు నక్కఱలేదా? యని యధిక్షేపింతురా? ప్రకృతిసూత్ర ములను బట్టి వ్రాసినవా రెందఱు? అట్లు పరిశీలించినవా రెందఱు? నీ రుచి ననుసరించి నీవు వ్రాసినావు. నారుచి ననుసరించి నేను విమర్శించినాను. బొమ్మలో నాయుఁడు గారి మొగము సరిగా లేదని నే నంటిని. ఉన్నదని నీ వనుచున్నావు. తగవు పరిష్కారమున కేప్రకృతి సూత్రములు కావలయునో చెప్పఁగలవా? కావున నాచింతవలదు.

"ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః."

# 21. ఉత్తరరామచరితము-పటము

భవభూతి గురించి తమ సభలో ప్రసంగించిన శాస్త్రిగారు ఆ కవి వ్రాసిన ఉత్తర రామచరిత నాటకం గురించిన మరొక విమర్శను చదువుతానంటే, జంఘాలశాస్త్రి మళ్ళీ అవకాశమిచ్చాడు.

ఈ నాటకంలో 'చిత్రపటదర్శనాంకం' అని ఒక అంకం వుంది. ఉత్తరరామచరితను చెప్పడానికి ముందు స్థాలీపులాక న్యాయంగా పూర్వరామ చరిత్ర చెప్పడానికి ఉద్దేశించినదీ కల్పన.

తమ చరిత్రమే చిత్రపటాన వ్రాయించి తామే చూపించుకుని, జనులు సంతోషించడమో, ఏడవడమో, జరిగింది ఈ నాటకంలో మాత్రమే.

ఉత్తరకాండం వాల్మీకిదేనని కొందరు, కాదని కొందరు వాదించడం వున్నా, భవభూతి మాత్రం అది రామాయణంలోని భాగమేనని నమ్మినట్లు తోస్తోంది.

వాల్మీకి, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు మాత్రమే సీతారామలక్ష్మణుల హృదయ ప్రకృతుల్ని ఎరిగినవాడు. భవభూతి, ఈ చిత్రపట దర్శనాంకంలో ప్రకృతి విజ్ఞానాన్ని సంపూర్ణంగా, జాగ్రత్తగా పాటించలేదని పండితుడి విమర్శ. కొన్ని కొన్ని సందర్భాలలో సరిగా కనిపెట్టినా, ఏ ఏ సన్నివేశాల్లో 'చిత్రపట దర్శనం' అనేది విచారాన్ని హెచ్చిస్తుందో, తగ్గిస్తుందో, భవభూతి పొరపడ్డాడని, ఈ విమర్శకుడు భావించాడు. ఈ అంకంలో అంశాన్ని ఒక క్రమంలో ఈయన విమర్శించినా – 'దే హి నో ద్విసాంగతాః' అనే శ్లోకంలో ఆయన చూపిన కవిత్వ శక్తిని ప్రశంసించాడు. ఈ కవికి రసపుష్టి కలిగించడం మీద ఎక్కువ అభిమానమనీ, ఆయన ఆవేశ శీలుడనే ''కిమపి కిమపి'' అనే ఒక్క శ్లోకమే ఆయన మహాకవి అనడానికి చాలుననీ తీర్మానించాడు.

**జం**ఘాలశాస్త్రి యిట్లు పలికెను:-

భవభూతి యుత్తరరామచరితమునుఁ గూర్చి కొలఁదినముల క్రింద నుపన్యసించిన యాతఁడు తిరుగ నొక విమర్శనము చదువును. శ్రద్ధతో వినవేఁడుచున్నాను. శాస్త్రులుగా రిట్లు చదివిరి:-

ఉత్తరరామచరితములోని చిత్రము సారస్వతప్రపంచమందుఁ జిత్రమై యున్నది. నాటకములలో నంతర్నాటకములున్నవి. ఇంద్రజాల ప్రదర్శనము లున్నవి. కాని తమచరితమే చిత్రపటమున వ్రాయించి తామే చూచుకొని జనులు సంతోషించుటయో, ఏడ్చుటయో జరుగట మాత్ర మీనాటకమందు మాత్రమే యున్నది. ఉత్తరరామచరిత ముత్తరకాండలోని గాథతో సంబంధించినది. ఈకాండ వాల్మీకిరామాణమునఁ జేరలేదనియుఁ బ్రక్షిప్తమనియుఁ గొంతప్రతీతి యున్నది. కాని యుత్తరకాండకూడ వాల్మీకికృతమే యనియు నుత్తరకాండ కూడ రామాయణములో నొక్కభాగమేయనియు భవభూతి యభిప్రాయమైనట్లుత్తరరామ చరితమువలననే తెలియుచున్నది. అందుచే నుత్తరకాండలోని గాథను ప్రత్యేకముగ నాటకమును వ్రాయఁదలంచిన భవభూతి, కథైక్యము కొఱకు పూర్వకాండలలోని కథ నతిసంగ్రహముగాఁ బలికింపవలసివచ్చినది. కౌశికుఁడు రామునకు జృంభకాస్త్రము లిచ్చుట, శివధనుర్భంగము, సీతావివాహము, పరశురామ గర్వభంగము, మంథరావృత్తాంతము, వనవాసము, విరాధాదివధ, మాల్యవత్పర్వతనివాసము, వాయుపుత్రసందర్శనము, సుగ్రీవసఖ్యము మొదలుగా గల రామకథ లంకలో జరిగిన యార్యాహుతాశనశుద్ధివఱకుఁ బటములో లిఖింపఁబడెను. తరువాతఁ బట్టాభిషేకమునకు వచ్చిన బంధువులు వెళ్లఁగనే యుత్తరరామచరిత్ర ప్రథమాంకకథ యారంభమైనది. ఇట్లే క్రొత్తగాథను బ్రాంతగాథతో నాతఁ డదికినాఁడు. గ్రంథైక్యసిద్ధియే భవభూతి యభిసంధియైనను బట మందుకొఱకు నిర్మింపఁబడినదని యనగూడదు. కావునఁ దండ్రి మిథిలాపురమునకు వెడలుటవలన బెంగగొన్న జానకీదేవి వేడుకకై యది చిత్రింపఁబడిదనది రామలక్ష్మణులచే ననిపించినాఁడు.

లక్ష్మ:– (ప్రవేశించి) ఆర్యులకు జమయగుఁగాక. మనము చెప్పినప్రకార మర్జునుఁడు మీ చరితము నీ పటమునందుఁ జిత్రించి తెచ్చి నాడు. చూడఁదగును.

రామ:– వత్సా! వ్యాకులచిత్తమైయున్న దేనికి వినోదము కల్పించుమార్గము నీ వెఱుఁగుదువు.

భవభూతి యిట్లు చిత్రపట కారణమును సర్దుబాటుగఁ జెప్పినాఁడు. కాని యా పటపరీక్షలో నేమిజరిగినదో యించుక జెప్పుదును.

లక్ష్మణుడు పటమును జూపుచున్నాఁడు.

లక్ష్మ:– ఆర్యా! ఇది చూడఁదగిన పట్టు. ఇతఁడు భగవంతుఁడగు భార్గవుఁడు.

సీత:– (సంభ్రమముతో) నాకు వడఁకు పుట్టుచున్నది.

కల్యాణమైన పిదప జానకీరాము లయోధ్యకు సబంధుపరివారులై యేగుచుండ దారిలో నడ్డుకొనిన పరశురాముని వృత్తాంతమాతని విగ్రహదర్శనము జ్ఞప్తికి రాగసీతకు వడఁకుపుట్టినదని యనుకొనవలయును. అంతేనా? అంతకంటెఁ గారణమేమైన నుండునా? ఉండదనుట విస్సందేహము. చిత్రకారుఁ డొక్క పరశురాముని మాత్రమే చిత్రించి యూరకుండఁడు కదా? రాముఁ డతని చేతిలో నున్న ధనస్సుతో పాటతనితేజముఁగూడ లాగుకొనిన సన్నివేశ మక్కడనే చిత్రింపబడియుండక తప్పదుకదా? శివధనుర్భంగమే కాక పరశురామ గర్వభంగముఁ గూడ నొనర్చిన జగదేకవీరుఁడైన భర్త తన ప్రక్కనే యుండ నట్టివిగ్రహ

మును జూచి యుత్సాహపడునా? అప్పుడే యనఁగ 24 సంవత్సరముల క్రింద సంతరించిపోయిన భార్గవునిబొమ్మఁ జూచి భయపడునా? అపాయమేదో దాటిపోయినది. ఆ ప్రయత్నము చేసినవాఁడు శాశ్వతముగా శక్తివిహీనుడై పోయినాఁడు. అపకారమునుండి రక్షించిన జగద్రక్షకుఁడు తనప్రక్కనే యున్నాఁడు. ఇఁక భయమెందులకు?

అదేమి మాట? స్త్రీలు సహజముగ భీరువులు. సహజముగా భయమునకు హేతుకల్పనశక్తితాత్కాలికముగ నశించును. అందుచేత భయమిచ్చుట సహజమే యని యందురా? సహజమో కాదో తరువాత విమర్శింతము. ఇప్పటి వఱకు సహజమనియే మాటవఱున కొప్పుకొందము. మాసపూర్తి యగుటచేఁ గొఁలదిదినములలో సుఖప్రసవము కావలసిన సీతామహాదేవి కా సమయమున భయమను చిత్తావస్థ కలుగనీయవచ్చునా? పటదర్శనము సీతాదేవివేడుకకయి కదా చేయఁబడుచున్నది. భయము కలిగించుట వేడుకా? భయమువలన నరములపట్టు లూడిపోవునని యందఱెఱింగినదే కాదా? అట్టి దురవస్థ పూర్ణగర్భవతికిఁ గలుగనీయఁ దగునా? అది కలిగినతరువాత నయినను బటములో నావలి చిత్రములను జూపించుట లక్ష్మణుఁడు మానినాడా? లక్ష్మణుఁడు చిన్నవాఁడు కావున నాతనికిఁ దెలియక పోవచ్చును. గాని పట మింక మానుమని రాముఁడైనను లక్ష్మణుని మందలింపలేదే! ఇది విరుద్ధముగఁ గనఁబడుట లేదా? ఇప్పటి కంత విరుద్ధముగా లేదనుకొందము. కాని రాముఁడింకమీద లక్ష్మణున కట్లాజ్ఞాపించి పటము పాఱవేయించునేమో చూతము.

లక్ష్మణుఁ డింకఁ బటమును బఠించుచున్నాడు.

లక్ష్మ:— ఇది శూర్పణఖావృత్తాంతము.

సీత:— హా ఆర్యపుత్రా! ఇంతవఱకే నీ దర్శనము.

రాము:— వియోగత్రస్తురాలా! ఇది చిత్రపటము సుమీ.

సీతాదేవి భయాకులచిత్తయై యుండెను. ఇప్పుడు కూడ బటమాపవలసిన దని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పక ''వియోగమును వచ్చునని జడిసెదవేల? ఇది చిత్రపటము సుమా'' యని సీతాదేవికి ధైర్యము సెప్పినాఁడు. బొమ్మను జూచి భయముగాని దుఃఖముగాని పడనక్కఱ లేదు. లేదని రాముని యభిప్రాయమైనట్లు స్పష్టము. కాని ఈ పంక్తికిఁ బైపంక్తియందే యనఁగా నొక తప్పుపాటు కంటెఁ దక్కువకాలములోనే రాముఁ డిట్లు పలికెను.

రాము:— అక్కటా! జన్మస్థానవృత్తాంత మిప్పుడు జరుగుచున్నట్లే పొడకట్టుచున్నది నాకు.

లక్ష్మ:—

చ. అలహరిణంబు రూపమున నట్లు మిషం బచరించి క్రూరులై
కులిశము ప్రక్కలౌ పగిదిఁ గొండలు సైతము నేడ్చునట్లు మి
మ్మలమఱచేసినట్టి కుటిలానురవృత్తము నెల్ల బాపికోఁ
గలిగితి మైన నద్ది పొడగట్టినచో నెద ప్రక్కలయ్యెడున్.

ఈ దుఃఖకరసన్నివేశము చూడ గుండెలు పగిలిపోవుచున్న వని లోన లక్ష్మణుఁ డగ్ని పర్వతమువలెఁదపించుచున్నాఁడు. కాని జానకీదేవి యేమిచేయుచున్నది.

సీత:– (సబాష్పయై) తనలోను) అక్కటా! దినకరకులనందనుఁడు కూడ నాకారణ మున నట్లు క్లేశపడెను గదా!

భర్త తన కొఱకు వెనుక నేడ్చినాఁడని యామె యిప్పుడు లోన నెంతైన నేడ్చుచు న్నది. బాష్పములు కన్నులవెంట ప్రవహించుచున్నవి. కాని పెదవులు విప్పకుండ లోలోననే యామె యేడ్చుచున్నది. ఈ యేడ్పు మఱింత యపాయకరము కాదా! తొమ్మిది నెలలు నిండిన చూలాలిట్టి మహాదుఃఖము నడచిపెట్టుటకై చేసిన యస్వభావప్రయత్నము వలన నేమిపుట్టిమునుఁగునో యని భర్తగాని మఱిందిగాని యాలోచించినారా? లేదు కాని రాముఁ డేమిచేయుచున్నాఁడో! ఏమిచేయుచున్నాఁడో లక్ష్మణుడే చెప్పుచున్నాఁడు విందుము.

లక్ష్మ:– (రాముని బరికించి సాభిప్రాయముగ) ఆర్యా! ఇదియేమిటి?

ఆ. సరముపెరుగ రాలు వరమౌక్తికములు నా
దొరలు నశ్రు లివ్వె ధరణిమీఁదఁ
గదలుచున్న నాసికాపుటాధరములు
బిగియఁ బట్టి నట్టి వగపుఁ దెలుపు.

''వియోగగ్రస్తులారా! ఇది చిత్రము సుమా'' యని సీతాదేవికి ధైర్యము బోధించిన రామచంద్రమూర్తి యుత్తరక్షణముననే కన్నీరు భూమిమీఁదఁ బడి నిల్చి గుర్తులై యుండు నంత విరివిగ విస్తారముగ నేడ్చినాఁడు. ఎటువచ్చినను ధీరోదాత్తుఁడు గావునఁ బెదవులు బిగఁబట్టినాఁడు. పోనీ యాబిగఁబట్టుటమాత్ర మెంతవఱకు నిల్చినదో చూతము. ఉత్తరపం క్తియే చదువుచున్నాను వినుఁడు.

రాము:– వత్సా!

తే. ప్రియను బాసిన దుఃఖంబు పెద్దయైన
శత్రు సాధించువాంఛచే సైచినాఁడ
మరల దుఃఖాగ్ని యధికమై మండుచుండి
మెండు బాధించు నెదలోని పుండువోలె.

ఇట్లు రాముఁడు పండ్లపట్టు విడిచి బారుమనెను. జనస్థానవృత్తాంతమును బటమునఁ జూచినప్పుడే ''దినకరకులనందనుఁడు నాకారణమున నెంతయేడ్చినాడో'' యని జానకీదేవి యేడ్చియుండఁగఁ నిలువున నెగిరి పోవలసినదే కాదా? అప్పుడు సీత యేమన్నది.

సీ:– అతిమాత్ర భయావేగముచేత నే నిప్పు డార్యపుత్రునిఁ బాసినట్లు తోఁచ-ుచున్నది.

అక్కటక్కటా! చూచితిరా! దుఃఖము భయము నతిమాత్రము లైనవి సహించుకొనఁ దరమా? ఎదుటనున్న భర్త యామెకన్నుల కగపడుటలేదు. తనకు రామునితో విరహము కలిగినదని భ్రమమునఁ బడియున్నది. దృఢశరీరులు దృఢమనస్కులే సహింపలేరు కదా?

అందుపై స్త్రీ–అందుపై రాజకాంత–అందుపై మహాసుకుమారి–అందుపైఁ బూర్ణగర్భవతి. భగవత్కటాక్షమున నామెచూలు నిలిచెను గాని నిలువఁదగినదా? అట్లు తటస్థించునెడల సీత బ్రతుకునా? రామలక్ష్మణులు కూడ నామెగతియే పొందకుందురా?

రాముఁడప్పు డేడ్చిన యేడుపెందులకో ''జానకీదేవి విరహమెంత దుస్సహమైనను శత్రుని సాధింతమను తీవ్రవాంఛచేత దానిని వెనుక నడఁచుకొంటిని. ఇప్పు డడఁచుకొనుట యేలాగు? అని యేడ్చెను. ఈ కారణముచేతమాత్ర మింతగా నేడ్వఁ దగదని నామనవి ''పూర్వమున నాకుఁ కలిగిన దుఃఖ మొకకారణముచేఁ గలిగినది. దుఃఖమున కేదో కారణమున్నది కదా యని వెనుక దానిని సహించుకొంటిని. ఇప్పుడేడ్చుటకు దగిన కారణము లేకుండనే కలిగినయేడుపు నెట్లు సహించుకొనగలనని యేడ్చుచున్నా'' నని యొకఁడు మనతోఁ జెప్పిన నెట్లుండునో రాముఁడనిన మాటకూడ నట్లే యున్నదని యనవల సివచ్చినందుకలకు విచారించుచున్నాను. ''ఏడ్చుటకుఁ గారణము లేనిదే. యేడుపేలకలుగ వలయు'' నని మన మాతని నడిగినట్లే ''శ్రీరామచంద్రమూర్తీ! పూర్వము మహాశత్రు వుండుటచేతనే సీతావిరహము కలిగినది. ఆ శత్రువును జంపు వాంఛచేతనే విరహమును సైచికొంటిమి. నిజమేనా? ఇప్పుడో శత్రువునే కాక సర్వశత్రువులను జంపితివే. శత్రువే లేనప్పుడు విరహమని యేడ్చుట యెందుల''కని యడుగవలసినది కాదా? పోనిండు. ఈగొడవ యేల?

ఇంతపుట్టి మునిఁగినను బట మావలఁ బాఱవేయుమని రాముఁడనలేదే, ఏమో.

గర్భవతుల వేడుకలకై జరిగించుట కెన్ని వినోదము లున్నవి. వీణాగాన మొనరించవ చ్చునే. ప్రహసనము లాడింపవచ్చునే. భక్తిబోధకములగు గ్రంథములు వినిపించపవచ్చునే. భయము కలుగునని యింద్రజాలము లాడింపవచ్చునే. పగటిభాగవతుల కాలక్షేపములు జరిగింపవచ్చునే. లక్షలకొలఁది గ్రామములుండఁగా వెనుకలేనిదియు, ముందెవ్వఁడు ననుక రింపనిదియు నగు చిత్రపటమును రచియింపించి గర్భవతి యెదుటఁ బెట్టి బొమ్మలవివరము చెప్పుదురా? సంతోషముకొఱకు చేసినయీపని సీతారామలక్ష్మణుల మహాదుఃఖమునకుఁ గారణమైనదే. పటమిప్పుడైనా విసర్జింపఁ దగదా?

వాల్మీకి యొకఁడు, వశిష్ఠుఁ డొకఁడు, విశ్వామిత్రుఁడొకడు వీరు ముగ్గురు మాత్రమే సీతారామలక్ష్మణుల హృదయప్రకృతుల నెఱింగినవారు. మిగిలిన రామకథాకర్తలందఱు తమతమ ప్రకృతులనే యామహావ్యక్తుల కారోపించి మాటలాడించినవారే. అందుచేత భవ భూతి మాట లాడించినట్ల సీతారామలక్ష్మణులు మాటలాడినారు. వారి కిందుతోనేమీయు సంబంధము లేదు. పటమర్జునుఁడు వ్రాసినాఁడు. ఆతఁడు శ్రీరామ కాలములనో నుండిన చిత్రలేఖకుఁడు కాఁబోలు. పటములో దోషమేమియు లేదు. ఇఁక భవభూతి ప్రకృతి జ్ఞానమున గుణమెచ్చుట నున్నదో లోపమెచ్చుట నున్నదో మనవి చేయుదును.

వ్యాకులచిత్తయై యున్న సీతాదేవి కుత్సాహమును గలుగఁ జేయుటకుఁ జిత్రపటము సమర్థమని గొప్పప్రకృతిజ్ఞానముచేత భవభూతి కనిపెట్టినాఁడు. అంతేకాక చిత్రపటము కొన్ని కొన్ని సన్నివేశములందు విచారము హెచ్చుచేయుచున్న సంగతిగూడ దనప్రకృతిజ్ఞాన ముచేతనే కనిపెట్టినాఁడు. కాని యే సన్నివేశములందు విచారమును దగ్గించునో వేనియందు

హెచ్చించునో గ్రహించుటయందుఁ గొంత పొరపాటు పడియుండెనని నాకుఁ దోఁచినది.

నాయనలారా! కొంచెము శ్రద్ధతో వినుఁడు. ఈ సందర్భము నందలి నామాటలు మీ మనస్సుల కెక్కవేమో యని యనఁగా నెక్కునంత స్పష్టముగ నేను జెప్పలేనేమో యని భయపడుచున్నాను.

మనమందఱము సుఖములు పడుచున్నాము. కష్టములు పడుచున్నాము. సుఖములు శాశ్వతములు కావు. కష్టములు శాశ్వతములు కావు. కష్టసుఖములు రెండునుగూడ మనమనస్సులందు స్థిరములైన సంస్కారములను గలుగఁజేయుచున్నవి. మనము స్వభావసిద్ధముగా వెనుకఁబడిన సుఖములను గష్టములను గూడ స్మరించెదము. మన మనః పటములంధుఁ గష్టసుఖములను భగవంతుడు చిత్రించినాఁడు. ఆపటము యొక్క యనుకరణమే భవభూతి పటము....సుఖసంస్మరణములు.

పశ్చాత్తాప సహితములు కాకున్నయెడల సుఖమునే యొసఁగును. కష్టసంస్మరణములు మాత్ర మొకప్పుడు సుఖము నిచ్చును, ఒకప్పుడు కష్టము నిచ్చును. అది యెప్పుడు? ఇది యెప్పుడు? మనమెన్ని కష్టములఁ బడిన నరియేకాని యొక్కప్రాణమైన పోకుండ నందఱము బాగుగానుండి కష్టములు దరించుట సిద్ధించినయెడల నీకష్టములస్మృతి యందు విచార మెంతమాత్రము కూడ గలుగదు. అంతేకాక యుత్సాహము కూడా గలుగును. కష్టము గడచిపోయిన కొలఁది కాలమునకైన మన మందఱము కలిసి యాకష్టములఁగూర్చి ముచ్చటించుకొనుట మిగుల నానందదాయకమగును. ఎక్కట కష్టములు పడితిమో యాస్థలము చూచునప్పుడు పూర్వకష్టములలో మనము కనఁబఱచిన ధైర్యము భక్తి సాహసము నుగ్గడించుకొని యుత్సాహ మందుదుము. వెనుకటి కష్టము లలో మనము బేలగుండెతో నేడ్చినను వానిని స్మరించుకొనునప్పుడు మాత్రము కష్టములు మన ప్రయోజకత్వముచేతనే కడతేఱిన వని రవంత వెల్లడించుటకై కొన్ని రజ్జులు కొట్టుటకూడ సామాన్యమనుజ స్వభావమైయున్నది. పూర్వానుభూతము లగు నెంతభయంకర దుఃఖకరసన్నివేశములు స్మరించుకొనినప్పుడైనను గానంతయదటు తొప్పపాటు కాలములోఁ దళుక్కుమని కొన్ని యత్యంతభీరు ప్రకృతులందుఁ గలుగునుగాని వెంటనే యాభయము దుఃఖము నడఁగిపోవును. అంతేగాని వడఁకుటవఱకుఁ గాని యేడ్చుటవఱకుఁగాని యెన్నడు రాదు. మన మందఱము బాగుగా నుండి కష్టములఁ దరించినప్పుడే స్మృతి కాలమున నీనిర్విచారస్థితి.

అందుచేత సీత భార్గవునిఁ జూచి వడఁకిన దని చెప్పుట స్వభావ దూరము. అట్లే పటదర్శనమున సీతాశోకము, రాముని దుఃఖము, లక్ష్మణుని మనః పరితాపము సహజములు కావని నామనవి.

కాని పటము దుఃఖమును గలుగఁజేయు సన్నివేశ మేదనఁగా: మనకత్యంత ప్రేమాస్పదులగువా రెవ్వరైనా మృతులైయుండ వారి విగ్రహదర్శనము మనకు సంతాపము కలిగించుము. ఇది కూడ కాలక్రమమునఁ దగ్గును. సీతాకళ్యాణమైనతరువాత నయోధ్యప్రవేశించు సందర్భమున లక్ష్మణుఁడు పటమునఁ బఠించుచున్నాఁడు.

లక్ష్మ:– ఇదిగో మన మయోధ్య ప్రశేశించితిమి.

రాము:– (కన్నీరు విడుచుచు) తలఁపునకు వచ్చినది. అక్కటా! తలఁపునకు వచ్చినది.

గీ. నాన్నగారు సజీవులై యున్నయప్పు
డమ్మ లిమ్ముగ సేమమ్ము నరయుచుండఁ
గ్రొత్తగా సాగివచ్చిన కూర్మి సతులఁ
గలసి మనమున్న యాదినములు చనెను నకట.

సంస్కృత శ్లోకము:-

జీవత్సు తాతపాదేషు, నూతనే దారసంగ్రహే
మాతృభిఃపాల్యమానానాం, తే హి నో దివసాగతాః.

భవభూతి ఈసన్నివేశమున నీ చిన్న శ్లోకముచే రాము నేడ్పించి యాతని పితృప్రేమను మిగులఁ జాకచక్యముతో లోకమున కింకొకసారి వెల్లడించి కృతార్థుఁడైనాఁడు. ఇంతేకాక కుటుంబాధికారియైన తండ్రి కుటుంబ సంరక్షణ చేయుచుండఁ గరుణాలవాలయైన తల్లి సమస్తోపచారములు చేయుచుఁ గన్నబిడ్డలను గన్నులలోఁ బెట్టుకొని పెంచుకొనుచుండఁ గ్రొత్తగాఁ గాపురమునకు వచ్చిన భార్యలతో నిర్విచారమగు నిత్యమహానందము నొందు చుండువారి సౌఖ్యాధిక్యమును, సర్వకాలములందలి, సర్వదేశములందలి, సర్వజాతులందలి సంసారముల కన్నింటికి సరిపోవునట్లు వర్ణించి దేవతలు తనపైఁ బుష్పవృష్టిఁ గురియుఁ దనంత కవితాప్రాగల్భ్య మీ కవి యనుష్టుపునం దగపరచినాఁడు. సెబాస్.

కాని మృతుఁడైన తండ్రిపటమును జూచిన విచారమైననుఁ గాలక్రమమునఁ దగ్గునని మనవిచేసియున్నాను. కొంతకాలమునకు మృతుల పటములు గూడ సంతోషదాయకము లగును. ఈ విగ్రహము మా తండ్రిగారిదని, యిది మా తల్లిగారిదని యితరులకుఁ బ్రత్యాసక్తిగా మనము చూపింతుము. అపసవ్యపుఁ జావులు మాత్ర మధికకాలము తీసికొనక తప్పదు.

పటసందర్భమున భవభూతి చేసెనని నాకుఁ దోఁచినలోపము లేవో కనఁబఱచినాను. అవి యసహజములని యాతఁ డెఱుఁగఁడా యని మనము కఠినముగ మనలఁ బ్రశ్నించుకొందము. 'ఎఱుఁగడని యెట్లు స్పష్టముగఁ జెప్పఁగలము.' ఎఱిఁగియుండియు నేల యట్లు వ్రాసినాఁడు.

నాటకమునకు భావికథాసూచనము మహాభూషణము. ఈకవికి భావికథాసూచన యందున్న వాంఛ యింత యంతకాదు. ప్రతిస్వల్పవిషయ మందులకే ఉపయోగించినట్లు ప్రయత్నించును. ఈ కవికి రసపుష్టి కలుగఁజేయుటయం దభిమాన మసాధారణము. ఈకవి యావేశ పూరితమైన హృదయము కలవాఁడనుట స్పష్టము. అట్టి యావేశసందర్భములందుఁ బ్రకృతిసూత్రములను గొంత యలక్ష్యము చేసినను జేయఁగల స్వతంత్రుఁడు నిరంకుశుఁడు.

ఉత్తరరామచరిత్రము ప్రదర్శింపఁబడఁగ రెండుసారులు చూచితిని. రెండుసారులు కూడ మొదటి యంకమేమో చూచువారికి విసుగు గలిగించినది. తరువాతి యంకము లఖండరసప్రవర్షణ సమర్థములై యున్నవి.

''కిమపి కిమపి మందం మందమాసత్తియోగా
దవిరళితకపోలం జల్పతోరక్రమేణ

అశిథలపరిరంభవ్యాపృతైకైకదోష్ణో
రవిదితగతయామా రాత్రి రేవ వ్యరంసీత్.''

అన్న శ్లోకము మాత్రమే నిల్చి మిగిల్చిన యాతని శ్లోకములన్నియు నేమాయచేనైన శాశ్వతముగ నంతరించిపోవుట సిద్ధించినను నీ కవిని శాశ్వతజీవునిఁ జేయుట కీశ్లోక మొక్కటియే చాలును. కరుణరసమందీతం డద్వితీయుఁడు. ఈతనిభావనాశక్తి యసాధారణము.

మల్లెపువ్వు దూరి-మధువంబుతోఁబాడి
గంధవాహుతోడఁ గలసి వీచి
యబ్ధిలోన మునిఁగి యౌర్వవహ్నిని డాఁగి
నీటిబుగ్గయగుచు నింగి బ్రాఁకి
తోఁక చుక్కతోడ ఢీకొని శ్రమఁజెంది
సాంధ్య రాగనదిని-స్నానమాడి
తనువునిండ నింద్ర-ధనురంగులు పూసి
కైరవాప్తసుధను-గ్రోలఁజెంది
గోళగానరుతికి-మేళవింపుగఁ బాడి
పాడి యాడియాడి-పాడి సోలి
భావనామహత్వ-పటిమను బ్రహ్మమై
పోవుకవికి గోటిమ్రొక్కు లిడుదు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# 22. మహాత్ముని తపఃపరిసమాప్తి

గాంధీగారు నిరశనవ్రతం పూని, పరిసమాప్తి చేశారని తెలిసిన తరవాత జంఘాలశాస్త్రి ఆ చర్యలో ప్రత్యేకత గురించి ప్రశంసిస్తూ ఉపన్యాసం చేశాడు.

వైష్ణవ సంప్రదాయం ప్రకారం దేవుడి కంటె భక్తుడే పూజ్యతరుడు. దేవభక్తుడు కావడం వల్ల పూజ్యుడైన మహాత్ముని ప్రశంస ఈరోజు జరుగుతోంది.

మూడడుగులున్నర వడుగు బలిచక్రవర్తి చూస్తుండగా, మూడడుగులని చెప్పి సృష్టినంతా ఆక్రమించినట్టే, రమారమి అయిదడుగులు పొడుగు కల మనిషి సర్వప్రపంచ మానవ హృదయాలను గాఢంగా ఆక్రమించుకున్నాడు. మహాత్ముడు ఈ ఒక్క జన్మానికే తరిస్తాడని చెప్పవచ్చు. ఆత్మపరిణామ క్రమంలో, అలనాటి విష్ణుభక్తులైన జయ విజయుల కంటె మహాత్ముడు అగ్రస్థానం ఆక్రమించుకోగలడు. మొదటి మహాత్ముల్ని మనం ఎరగము. ఇప్పటి మహాత్ముని కాలంలో జీవించడం వల్ల పుణ్యాత్ములం. ఆయన మనస్తత్వాన్ని చదివి, జన్మాన్ని సార్థకం చేసుకోండి. మనకీ, భగవంతుడికీ మధ్య మహాత్ముడు మజిలీగా వున్నాడు.

నాయనలారా! చదువులన్నీ కట్టిపెట్టండి. వాటివల్ల ఏం ప్రయోజనం లేదు. చదవదగిన పుస్తకం చదవండి. అది పర్ణకుటీరం లో వుంది. దైవప్రార్థన చేద్దాం అని జంఘాలశాస్త్రి అంటూండగా ఒక క్రైస్తవ మత గురువు లేని, గాంధీ గారి ఉపన్యాసం గురించి ప్రస్తావించి ఉపవాసం రహస్యంగానే తప్ప బహిరంగంగా చేయకూడదని జీసస్ చెప్పాడని చెప్పాడు. జంఘాలశాస్త్రి, జీసస్ దేశకాలాలకీ, మహాత్ముని దేశ కాలాలకీ తేడా వుందని చెప్పి, సభను తన ఒక్కడి ప్రార్థనతోనే ముగించవలసివచ్చింది.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:-

మహాత్ముఁడు మహోదారమగు తపస్సును నిర్విఘ్నముగఁ బరిసమాప్తి నొందించి ప్రపంచమున కానందము కలుగఁజేసినందుల కాలోకోత్తరపురుషునిఁ బ్రశంసించుచుఁ బరమేశ్వరుని ధ్యానించుటకంటె సార్థకమైనకృత్యము వేఱొండు లేదు. ఏదినమున హరికథా

కాలక్షేపమగునో యాదినము దినములన్నిటిలో నుత్తమమైనదని పెద్దలు నిర్వహించినారు. దేవునకు దేశభక్తునకు లేశమైన భేదము లేదు. వైష్ణవసంప్రదాయానుసారముగ దేవునికంటు దేవభక్తుండే పూజ్యతరుండు. దేవభక్తుం డగుటవలనం బూజ్యుం డగుమహాత్ముని ప్రశంస యాదినమున జరుగుచున్నది. కావున నీ దినము పవిత్రమైన దినము. ఈస్థలమునందు జరుగుచున్నది. కావున నిది పవిత్రమైన స్థలము.

అన్ని కాలములందు, నన్ని దేశములందు దేశభక్తులెందఱో యుండిరి. వారిలో ననేకులు సంసారముల రోసి, నివాసములం ద్యజించి యేగిరి. ఏగహ్వరమునందో యేచెట్టునీ డనో తపస్సుచేసికొని తాము తరించిన వారేకాని యితరులం దరింపంజేసినవారు కారు. అట్టివా రెంతయుత్కృష్ట జీవులయ్యును వారుకూడ నొకవిధమగు స్వార్థపరులేకాని కేవల స్వార్థరహితులు కారు. శ్లో. ''యస్మి జీవతి జీవంతి బహువ స్సతు జీవితి'' అని కవి గాన మొనర్చినాడు. ఎవని జీవమువలన ననేకులు జీవింతురో వాండే జీవించినవాండని యాతండు చెప్పినాండు. అదియే నిజము. కాని దానికి మఱికొంత చేర్పవలసియున్నది. ఎవండు తరించుటవలన ననేకులు తరింతురో వాండే తరించినవాండు కాండా?

అందుచే మహాత్ముండు దేవభక్తుండేగాక, దేశభక్తుండు ప్రజాభక్తుండు ప్రపంచభక్తుండు. ఆతండు తమ శత్రువేమో యని భ్రాంతిపడుచున్న వారికిం గూడ భక్తుండు. వార్ధకమున నుపక్రమించిన ఘోరతపస్సు వలని ప్రమాదము లేకుండ వెలిబడిన భక్తసార్వభౌమునిం గూర్చి ప్రశంసించుచుండంగా నిటనున్న గాలియే పవిత్రమగుచున్న దని చెప్పినప్పుడు మన లెక్కయేమి? ప్రపంచమున సాధారమణముగ నూటికిం దొంబదైదు గురు స్వార్థపరులు. మిగులువా రైదుగురు కూడ తరబడిగతరబడిగ స్వార్థరహితులే. కాని పరిపూర్ణస్వార్థరహి తులు కారు. సంపూర్ణస్వార్థసంహారకుండగువాండు లక్ష కొక్కం డుండునేమో? మహాత్ముం డట్టి సంపూర్ణ స్వార్థచ్ఛేదకుండు మాత్రమే కాక నంతకంటె నున్నతపదవి నధిష్ఠించి నాండు ఎట్లు? పరుల పాపపర్వతములను తలపై మైచుకొనలేదు? వారు పొందవలసిన పశ్చాత్తాపము లను తానే పొంది దహించిపోవుచున్నాండు. కాదా? వారిపాపప్రశాంతికి తానే ఘోరతప మొనర్చి శల్యావసిష్టుండు కాలేదా? వారి దోషము లన్నియుం దనవే యని త్రికరణశుద్ధిగా నమ్మిప్రాయోపవేశ మొనర్చి ప్రాణత్యాగ మొనర్చుటకు సిద్ధపడినాడు. కాండా? వస్తుత్వము చేత, తత్త్వముచేత తనకును బరులకును భేదము లేదు లేదని ప్రత్యక్షముగ నాచరణయందు జూపిన యద్భుతవ్యక్తి వెనుకటి కాలములో లేండు. వెనుకటి సృష్టిలో లేండని చెప్పుట యతిశయోక్తి కానేరదు. ఉక్తికెంత యతిశయతయున్నదో యంతకంటె విశేషము చర్యలోం జూపించిన యలౌకిక చరిత్రుని పాదపద్మముల కతిశయోక్తి దిగదుడుపు కాదా?

నాయనలారా! ఎవ్వరో గొణిగికొనుచున్నారు. ఏమందురు? ఏసుక్రీస్తు లేండా యని యనుచున్నారా? నాయనలారా! నేను విస్మృతి పడలేదు. ఏసుక్రీస్తు భగవంతుని కొడుకు. అందుచే భగవదంశమున జనించినవాండు. మేరీకన్యకుంబుట్టినప్పుడేయాతండు దేవాంశోద్భవుండని గ్రహింపదగినది కాదా? అట్టివాం డెట్టివాడైనా విశేషమేమి? ఆ విశేష మేదో మామహాత్మునిది. మనుజుండై పుట్టి, స్వయంకృషిచే, స్వప్రయోజనకతచే, సాధనక్ర మముచే నెంతవాం డగుటకు సృష్టితత్త్వ మంగీకరించునో యంతవాండైనాండు. ఆతండు మొదట నాంగ్లేయ భాషాపండితుండే/. ఆంగ్లేయవేష ధారియే. తరువాత స్వదేశీయ

వస్త్రధారి యైనాఁడు. పిదప స్వదేశస్వాతంత్ర్యరక్షకుఁ డైనాఁడు. పిమ్మట నింద్రియ నిగ్రహుఁడై నాఁడు. దానిపై శమదమాదిసంపన్నుఁడైనాడు. అందుమీఁద లోకాద్భుతచరితుం డైనాఁడు. దానిపై లోకపవిత్రుఁడైనాఁడు. ఆతఁడు స్వరూపమున పొడుకరి కాఁడు. తూని కలో నూటరెండుపౌనుల కంటె హెచ్చినవాఁడుకాఁడు. అట్టిదుర్బల శరీరుండు శ్రీరంగప్ర ధానగోపురముపై నింక నూట రెండంతరువులు వైచినయెడల నది య ట్లెదిగియెదిగి పసిడికుండలతో భగవంతుని పాదములను స్పృశించినట్లుండునో యాతఁ డందఱు చూచుచుండఁగనే, చూచుచుండఁగనే యిట్టె యింత యాధ్యాత్మికౌన్నత్య మొందినాఁడు. అత్యాశ్చర్యకరము మూఁడడుగులున్నర వడుగు బలిచక్రవర్తి చూచుచుండఁగనే మూఁడడుగు లాక్రమించుకొందునని చెప్పి, సృష్టినంతయు నాక్రమించుకొనినట్లే రమారమి యైదడుగుల పొడుగుగల మనుజుఁడు సర్వ ప్రపంచజనహృదయములను గాఢముగ నాక్ర మించుకొనినాఁడు. ప్రపంచచరిత్రములో నీవిచిత్రమే క్రొత్తగఁ జేర్పవలసియున్నది.

జయవిజయులు శాప మొందినప్పుడు మూఁడుజన్మములలో భగవద్ద్వేషముతో తరింతురా? యేడుజన్మములలో భగవద్భక్తి- ధరించతురా? యని యడుగఁబడగ మూఁడుజన్మములలోఁదరింతుమనిరి. మూఁడు జన్మములకంటెఁ దక్కువకాలములో నెవ్వరు తరింపలేరు. ఆంగ్లేయవిగ్రహముగా నారంభించిన యీవ్యక్తియొక్క యిప్పటి యాధ్యాత్మికోత్కర్షత చూడఁగా మహాత్ముఁడీ యొక్క జన్మమునకే తరించునని చెప్పఁదగి యున్నది. అట్లే జరుగునెడల నాత్మపరిణామక్రమమున జయవిజయుల కంటె నీత డగ్రస్థాన మాక్రమించుకొనఁగలఁడు.

అద్వైతమం దేకజీవవాదమని యొకటి యున్నది. ఇప్పుడు కనబడుచున్న శరీరములన్నిఁటిలోను జీవుఁడు లేఁడనియు, నేదో యొక్క శరీరమందు మాత్రమే జీవుఁడున్నాఁడనియు, నాతఁ డెప్పుడు తరించునో యప్పుడే మిగిలినవారందఱు తరింతుర నియు నీవాదమునకు ముఖ్యాభిప్రాయము. అట్టివాదము ననుసరించి సజీవుఁడగువాఁ డొక్క మహాత్ముఁడే యేమో! ఎవరు చెప్పఁగలరు? నేను గొంతకాలమునుండి మహాత్మునిగూర్చి వినుచున్నాను. ఆయన మాటలకుఁ జర్యలకు నాకుఁదెలిసిన యర్థమును గ్రహించుచు న్నాను. ఆయనమన స్సెట్లెట్లు పరిణామము నొందుచున్నదో నాకున్న జ్ఞానలేశమునుబట్టి గ్రహించుచున్నాను. నేను మహాదేవుని కొక్కటి మహాత్మునకు రెండు నమస్కారము లర్పించి మనవి చేయున దేమనఁగా; నాయనతత్త్వము నాకెంతమాత్రము బోధము కాలేదు. ఆయన సన్నిధానవర్తు లెందఱో యున్నారు . వారికేమైన దెలిసినదేమో యనఁగ వా రావిషయమున మనకంటె ఘనులు కారని వినుచున్నాను. వారు తెలియనివారని నేను స్పష్టముగాఁ జెప్పఁజాలను. కాని తెలిసినవారు కారని స్పష్టముగాఁ జెప్పఁగలను. వర్ణాశ్రమధర్మము, నస్పృశ్యత మొదలగు మహావిషయములఁగూర్చి అందుకుఁదగిన మాటలేవో నేర్చుకొని మన ముపన్యాసనాటకము లాడుచున్నామా లేదా? మనము చెప్పుచున్న మాటలయర్థము మన కగుచున్నదా? అట్టివో మహాత్మునితత్త్వ మెట్లెఱుఁగఁగలము?

ఈనడుమ నన్నుఁ జూచుట కొక నటోత్తముడు వచ్చినాఁడు. నడుమ నొకనాటక మాడితిమి. నాటకప్రదర్శనము బాగుగనే యున్నదనినారు. ఆ నాటకములో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు వారి భార్యలతో వత్తురు. తుట్టతుద కెవ్వరిభార్యయొద్దకు వారు వెళ్లుట

తోతటస్థించినప్పుడు బ్రహ్మగారు పార్వతికొంగు బట్టుకొన్నాఁడు. మహాదేవయ్యా గారు మహాలక్ష్మమ్మబుజముపైఁ జేయివైచినాఁ''డని చెప్పినాఁడు. మహాత్మునిఁ గూర్చి మనయందఱ యజ్ఞాన మానటకుల యజ్ఞానముకంటె తక్కువది కాదు. నిశ్చయముగా మహాత్ముని తత్వము దుర్గ్రహమైనది. అది తెలిసికొనినయాతఁడు ప్రపంచమును దెలిసిన యాతఁడే.

(Aesop) ఈసప్ అనునాతఁడు మిట్టమధ్యాహ్నమునందు చేతిలో లాందరును పట్టుకొని వీథులలోఁ దిరుగుచుండెను. ప్రభువువలెఁ బగటిదివిటీతో బయలుదేరితివేమని యెవ్వరో యడుగఁగా మనుష్యుఁ డెవ్వడైన, నిజమైన మనుష్యునకొఱ కంత కష్టపడి వెదుకఁదగినదే. అతని ప్రయత్నమెంతయైనఁ గొనియాడఁదగును. ఆతని శ్రమకు మన మెన్నియైన ధన్యవాదము లీయవలసినదే. కాని యాతఁడు వెదకుచున్న స్థలమున్నదే యదియంత తగినది కాదేమో యని మాత్రమే సందేహము. పశ్చిమదిశను వదలి తూర్పుగా వచ్చినయెడల నాతని ప్రయత్న మనేకపర్యాయములు గృతార్థమైయుండెడిది. అట్టి ఈసప్ మాత్రమే కాదు. ఈ సృష్టియంతయు సంతోషింపఁదగినది. నిజమైన మనుజుఁడు తిరుగ భారతభూమియం దుద్భవించినాఁడు. ఊరక సంతోషించి యూరకొనకుఁడు. ఆయనను బఠింపుఁడు. The proper study of mankind is man శ్రద్ధగాఁబఠింపుఁడు. వెనుకటి మహాత్ములను మన మెఱుఁగము. ఇప్పటి మహాత్ముని కాలమున జీవించియుండుటచే పుణ్యాత్ములము. ఆయన మనస్తత్త్వమును జదివి జన్మమును సార్థపఱచుకొనుఁడు. ఒక్కసారి మనము భగవంతుని యను భవమును సంపాదించుకొనలేము. అది మనకసాధ్యము. మనకు భగవంతునికి నడుమ మహాత్ముఁడు మజలీగ నిల్చియున్నాఁడు. ఆయనను మనము శ్రమపడి తెలిసికొందము. ఆయనతత్త్వము నెఱిఁగినవెనుక నీశ్వరతత్త్వమును గ్రహించుట విశేషకష్టము కాదు. ద్వైతమతస్థులందఱు ముఖ్య ప్రాణమూర్తిమాధ్యస్థ్యమునఁ దరింతుమని యనుకొనుచున్నారు. మహమ్మదీయు లందులకు మహమ్మదుగారిని నమ్మియున్నారు. క్రైస్తవమతస్థులందఱు జీసస్సును నమ్మియున్నారు. విశిష్టాద్వైతులు కూడ పురుషకారమును పూర్తిగ నమ్మినవారే. అటులే యిప్పుడు మహాత్ముఁ డామాధ్యస్థ్య కృత్యమును నిర్వహించుటకు భగవంతునిచే నాజ్ఞాపింపఁబడినట్లు తెలిసికొనవలసియున్నది.

''నాయనలారా! చదువులన్నియుఁ గట్టిపెట్టుఁడు. వానివలన నేమియు లాభము లేదు. చదువఁ దగినపుస్తక మున్నది. అదియే చదువుఁడు. అపుస్తకము పర్ణకుటియందు భద్రముగనున్నది. దానిలోని యక్షరములు నక్షత్రములవలె నేదేశమునుండి చూచినను కనఁబడును. నాయనలారా! అదే చదువుఁడు. దైవప్రార్థన మొనర్త మందఱములెండు'' అని నే నుపన్యసించుచుండఁగా నొక్క క్రైస్తవమతగురుఁడు లేచి యిట్లు పలికెను! ''నే నిప్పుడు లేచినది మీదైవప్రార్థనకొఱకు కాదు. గాంధిగారొనర్చిన యుపవాసమును గూర్చి నేను గొన్నిమాటలు చెప్పవలసియున్నది. ఏసుక్రీస్తువారు దేవునికొడుకు ఆయన చెప్పినమాటలు దేవుడు చెప్పినమాటలే. బైబిల్ మాకు వేదసత్యము. ఏసుక్రీస్తు ఉపవాసముచేసినాఁడని యనేకుల యభిప్రాయమైయున్నది. ఆయన యట్లెన్నఁడు జేయలేదు. నలువదిదినములు రేయుంబవళ్లు భోజనము లేకుండ మాత్రముండినాఁడు. ఎందుచేత ననఁగా పాపాత్ముల నెట్లు పరిశుద్ధులను చేయుదునా యను మహాచింతచే భోజనమొనర్చుట కాయనకుఁ దీరికయే లేకపోయినది. అంతేకాని పాపప్రాయశ్చిత్తముగాగాని భగవంతుని యనుగ్రహముకొ

ఆకుగాని యాయన యుపవాసము చేసియుండలేదు. తాను పవిత్రాత్ముఁడగుటచే నట్లు చేయవలసిన యగత్యమును లేదు. కాని యుపవాసాచార మెప్పు డారంభమైనదో తెలియఁదగ నంత ప్రాచీనమై యున్నది. దేవుని కుమారుని కాలములో మతవిషయములైన దొంగతనము విశేషముగా నుండెను. నిజమైన భగవద్భక్తులు మిక్కిలి యరుదుగా నుండెడివారు. ధనముకొ ఱకో, యశముకొఱకో, ప్రజాగౌరవము కొఱకో, మతసంబంధమైన ప్రార్థనలు, దానములు, నుపవాసములు మొదలైనవి చేయుచుండెడివారు. ప్రజలను మోసపుచ్చుటకే తస్కర భక్తు లిట్లు చేయుచున్న యుపవాసాది దాంభికాచారములను క్రీస్తుగారు మిగుల గర్హించుచుండెడి వారు. దైవకార్యములను తుచ్ఛమైన యైహికలాభముకొఱకై యుపయోగించుకొనుచుండెడి వారు. లెక్క లేకుండ నుండిరి. Phairisees అను పెద్ద తెగవారంద ఱట్టివారే. ఇంత ననేకములైన యిట్టితెగలుండెడివి. వారికందఱ కేసుక్రీస్తువారు బోధించినదేమనఁగా మీకును భగవంతునికి మాత్రమే సంబంధమున్న మతవిషయక కర్మములన్నియు గూడ నెవ్వరికిఁ దెలియకుండ రహస్యముగఁ జేసికొనుఁడు. అందులో నుపవాసము రహస్యముగనే కాని బహిరంగముగ జరుపకూడదని యాయన యనేకస్థలములందు శాసించినాఁడు.''

ఇట్లు చెప్పి యాక్రైస్తవుం డూరకుండెను. అప్పుడు నేను లేచి యిట్లంటిని. నాయనలారా! క్రైస్తవమతబోధ మనయందు దయగలిగి యేసుక్రీస్తువార కాలమందలి దేశస్థితి, యుపవాసమును గూర్చి జీసస్సుగారి యభిప్రాయమును వారికిఁ దెలిసినంతమట్టు నకు విస్పష్టముగాఁ జెప్పినందులకుఁ గృతజ్ఞులమై యున్నాము. ఈమతగురుఁడు పరమశాం తుఁడు. ధారాళహృదయము గలవాఁడు. వారిమతమందుఁ బరిపూర్ణ విశ్వాసమున్నవాఁడు. ఎంతసేపు చెప్పినను నిరాహారతపము రహస్యముగాఁ జేయవలయునను జీసస్సుగారి యభి ప్రాయమనియే చెప్పినాఁడు. కాని మనమహాత్ముని యుపవాసబహిరంగతనుగూర్చి యొక్క యెత్తిపొడుపు పలుకైనఁ బలుకలేదు. కాని యట్టిసూచన తప్పదు. అట్లనకున్నను ననినట్లే. దూడూ యని యెంతముద్దుగ ననినను వచ్చునది కుక్క యని గ్రహించుకొనలేమా? ఈమతగురుఁడు చెప్పినమాట లాలోచింది విమర్శింపదగినవి. దీనిని గూర్చి యిప్పుడు చెప్పఁబూనిన యెడల నొక గంటసే పగును. ఉపవాసమనగ నేమో, అది యెందులకు చేయవలయునో, పూర్వకాలమం దెవరెవరు చేసిరో, ఎట్టిఫలము లందిరో, ఏసుక్రీస్తుకాలమం దలి నాగరికత యెట్టిదో, సంఘస్థితి యెట్టిదో, ఉపవాసము రహస్యముగనే చేయవలసినదని యెందుల కాతఁడు జెప్పవలసియున్నది. ఇప్పుడు బోధించెనో యాయంశములన్నియు విపులముగ జెప్పవలసియున్నది. ఇప్పుడు కాదు గావున పైవారముల నెప్పుడో జెప్పెదను. మతగురుఁడు మాటలాడు చుండఁగనే యందఱు సభనుండి లేచిపోయినారు. దైవప్రార్థనఁ జేయుటకు నేనొక్కఁడనే యుంటిని.

బిళహరి- ఏక.

జయరామ-జయరామ-జయజానకీరామ
జయసర్వగుణధామ-జయసార్వభౌమా
జయశుభాకరనామ-జయవైరిభీమా. ''జయ''

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# 23. తాజ్ మహాలు

జంఘాలశాస్త్రి, తాజ్‌మహల్ గురించి చమాలుడు సభలో చెప్పిన దాన్ని వివరిస్తున్నాడు.

తాజ్‌మహల్ని ఒకడు పాలరాతి స్వప్నం అన్నాడు. ఉత్తమమైన లలితకళా సృష్టిని నిశ్శబ్దంగా, నిశ్చలంగా పరిశీలించినప్పుడు కేవలం అలౌకిక మైన ఆనందం కలుగుతుంది – తప్పదు.

తాజ్ నాటకానికి కథానాయిక అర్జమండ్ బానూబీగమ్ ముంతాజ్.

సౌందర్యం అనేది సమ్మేళనానికి సంబంధించిన 'సాముదాయిక ఫలం' తాంబూలం రక్తిమలాగ, పువ్వులదండ పరిమళం లాగ, స్వరాల సమ్మేళనం లాగ, మనస్సుల కలయిక లోంచి పుట్టే సామరస్యం లాగ, 'సౌందర్యం' అనేది కూడా ఎంచదగినది. ఈ కలయిక ఫలం, పటంలో కనబడదు.

• అసలీ తాజ్‌మహల్ అవతరించడానికి కారణం – బెంగాల్‌లో రాజు, రాణి వ్యవహార సందర్భంగా సంచారం చేస్తుండగా ముంతాజ్‌కి ఒక చెడ్డ కల వచ్చింది. షాజహాన్ ఓదార్చాడు. కాని, ఆమె ఒక కోరిక కోరింది. నాకు కట్టే గోరీ లాంటిది ప్రపంచంలో ఎక్కడా వుండకూడదు. తీర్థయాత్ర లాగ జనం వచ్చి చూసేలాగ వుండాలని –

ఆమె ప్రసవించి, మరణించిన తరవాత ఏడాదికి, ఏడాదికి, ఈ 'మహాలు' నిర్మాణం కొన్నేళ్లకి పూర్తయి ఆమె శరీరం, ఈ ప్రదేశంలో నిక్షేపించడం జరిగింది.

ఇలా, తాజ్‌మహల్ గురించి చాలా విశేషాలు ఉపన్యాసంలో చెప్పాడు. *1632*లో నిర్మించబడిన ఈ మహాలు 'పటా'న్ని సృష్టించిన వ్యక్తి 'ఉస్తాదు ఈసా' అనే పారశీకుడు.

బోయర్ యుద్ధ మహావీరుడు లార్డ్ రాబర్ట్స్–''హిందూదేశయాత్ర తాజ్ దర్శనం వల్ల సార్థకమౌతోంది''ని వ్రాశాడట.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:–

నేను సభలోనికిఁ బోవునరికి జమాలుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

చెవులారా వినఁదగినది. జూడఁదగినది. నోరారఁ గొనియాడదగినది. మనసార నానందింపఁదగినది. పాలరాతి పద్యప్రబంధము. అది లోకమున ఖ్యాతినొందినది. అంత కల్పనా వైదుష్యము కల్గినది. అంత యభిరుచి ప్రకటమైనది, అంత సంస్థాన సమంజసమైనది, యంతయలంకారభూయిష్ఠమైనది, యంతభావోద్యోతకమైనది, యంత శాశ్వతమైనది మఱి యొకటి లేదని యఖిలనాగరకప్రపంచ మంగీకరించి యున్నది. దానిని జను లెన్ని యెన్ని ముద్దుమాటలఁ గొనియాడవలయునో యట్లుచేసియే యున్నారు. దీనిని బాలరాతిస్వప్న మని యొకఁడు స్తుతించినాఁడు. అల్లికల జిగిబిగల యూహల నేతచేతస్వప్నపటము నిర్మింపఁబడినట్లే చంద్రకిరణములకంటె నున్నితములై పాలరాతి దీఁగలతోడి పూవుల కాయల మహాసుకుమారమైన సన్నివేశమున నీ ''తాజ్'' నిర్మింపబడినదని యట్లు స్తుతించిన వాని యభిప్రాయ మై యుండునేమో! పండు వెన్నెలలో దీనిన గొంచెము దూరముననుండి చూచినప్పుడు దీని సౌందర్యము పరాశక్తివలె నవాఙ్మనసగోచరమై యుండును. పున్నమచం దమామ తెల్లనికాంతి యాభవనమును గ్రమ్మగ వెనుక జెరగిలఁబడుట కనువుగా నున్న యనేక నక్షత్రప్రభాజిగిజిగాయమాన మగునాకసముతో, వివిధరత్నసంకలితమగు నీభవన మట్టె యడఁగి మడఁగి లీనమైపోయి భూలోకమునుండి స్వర్గలోకమున కిదియే దారినుమా యని చూపించు నట్లుండును. న్యాయ మాలోచింపఁగా నుత్తమమయిన లలిత కళాకార్యము నిశ్శబ్దముగా, నిశ్చలముగా బరిశీలించినప్పుడు కేవలమౌకికమగు నాత్మానందము కలుగక తప్పదు.

'తాజ్' నాటకమునకు కథానాయిక ''అర్జుమంద్ బానూబీగమ్ ముంతాజ్'' యను మహోమ్మదీయమానినీమణి. ఈమె షాజహాను భార్య. ఈమెదని చెప్పఁబడిన రూపమును జూచితిని. పటమలో నన్నియు బాగుగనే యుండును. ప్రత్యక్షముగఁ జూచినప్పుడే సౌందర్య నిర్ధారణ కెక్కువ యవకాశము కలుగును. కుక్కగొడుగు ఛాయాపటము మహాసౌందర్య ముగా నుండును. అవయవములకూర్పులో నిర్దుష్టత, గమనికయే సౌందర్యమునకుఁ బ్రధానములైనవి. కావు. సౌందర్యమునునది సమ్మేళనము యొక్క సాముదాయక ఫలము. ఒక స్త్రీకిఁ గన్ను సొగగా, విశాలముగా, బాగుగనే యుండును. ముక్కు ప్రత్యేకముగాఁ బరీక్షించిన యెడల నూటిగాఁ దగుమాత్రమైన యెత్తుగాఁ జివర రవంత మొనగలవంపు కలిగి సుందరముగనే యుండును. గడ్డముమట్టునకుఁ బ్రత్యేకముగా నిదానించినయెడల నదియు యన్నియుఁ గలిపి చూచిన యెడల నది యేమి కర్మమోగాని తీర్థమునకుఁ దీర్థము, ప్రసాదమునకుఁ బ్రసాదముగను నుండును. కళకట్టనిదే కంటిసొగతనముతో ముక్కు నూటితనము కలసి గడ్డపు గుండ్రతనముతో మేళవించిగప్పుమని, యనిర్వచనీయమైన కాంతి పుట్టినప్పుడదు కదా సౌందర్యము! తాంబూలరక్తి యెట్టిదో, ప్రసవమాలాపరిమళ మెట్టిదో, స్వరసంఘాతమాధుర్య మెట్టిదో, మనస్సుల కలయికవలన సామరస్య మెట్టదో సౌందర్య మట్టిది. ఈకలయిక ఫలము పటములోఁ గనఁబడదు. కన్నుల నింద్రజాలమున నైచి మనస్సున కూపిరి సలుపకుండ తలపులిమి స్వాధీనముచేసికొను కాంతా శరీరవర్ణసౌభా గ్యము పటములో రానేరదు.

ఆ.వె. సొగసులన్ని మించి సొగసులకోటీర
మైనతళుకు, తళుకు లోనితళుకు
మొలకకులుకు లొలుకు కలకల కలదందు
నాడుదాని మొగమె యాడు మొగము.

మొత్తముమీఁద 'ముంతాజ్' సౌందర్యవతి యని చెప్పకతప్పదు. ఆమెయెడల భర్త కత్యంతానురాగ మని యెంత చెప్పినను సరిపోదు. తా నెక్కడకుఁ బోయినను, భార్య నొక్కదినమైన వదలకుండఁ గూడఁ దీసి కొనిపోవువాఁడు. వంగదేశమునందుఁ గాఁబోలు వారు వ్యవహార సందర్భమున సంచారము చేయుచుండగా నొక్కరాత్రి యామె నిద్ర నుండి లేచి గడగడ వడకుచు నేడువనారంభించెను. ప్రక్కనున్న భర్త యదరిపడి లేచి యేమి యేమని గ్రుచ్చిగ్రుచ్చి కౌఁగలించుకొనుచు గ్రుచ్చి గ్రుచ్చి యడిగెను. అప్పుడామె పూర్ణగర్భవతియై యుండెను. నాకొక్క దుస్వప్నము కలిగినది. నే నింక జీవింపనని యామె విలపించెను. భర్త యామె నోదార్చుట కెన్ని పాటులైనఁ బడెను. ఇట్లొక్కగంట జరిగిన పిమ్మట నామె రవంత తెప్పిరిలి భర్తతో నిట్లు పలికెను. ''నాశరీరనిక్షేపమునకై నీవు కట్టబోవు 'గోరీ' యంత విలువకలది, అంత చక్కనిది ప్రపంచమున మఱియొక్కటి యుండఁగోడదు. తీర్థయాత్ర సేవించునట్లు నా గోరీని జూచుటకై ప్రపంచమున మారుమూలల నున్నవారైన వచ్చునట్లుండవలయును. ఏమి? ఏమందువు'' ''ఆమాట యిప్పుడెందుల'' కని భర్త యామెను మందలించెను. నీవట్లు చేసెదనని వాగ్దానమిచ్చినఁ గాని నా యాత్మకు శాంతి యుండదని యామె పట్టుదలతోఁ బ్రత్యుత్తర మీయఁగా నట్లేయని భర్త మాటనిచ్చెను.

అటుతరువాతఁ ద్వరలోనే యామె ప్రసవించి, మరణించెను. ఆమె కళేబరము నొకభద్రమైన గృహమందుఁ గాపాడి, తుదకుఁ గొన్ని సంవత్సరములయిన పిమ్మట నీ భవనమును బూర్తిచేయించి దాని నామె భర్త నిక్షేప మొనర్చెను.

దీనికి చాల రాతిపలక లెక్కడనుండి వచ్చినవో, యెంతకాలము దీనిపని చేసినారో, యెంతసొమ్ము వ్యయమయ్యెనో యను నంశములు విచారణీయములు కావు. ప్రతిమనుజునకుఁ దాను శాశ్వతముగా నుండవలయునన్న వాంఛసహజము. తనతత్త్వము తానెఱిగిన మనుజునకుఁ దాను శాశ్వతుఁడనియే తెలియును. శాశ్వతుఁడను కావలయునని కోరుకొన నక్కఱలేదు. కాని మనుజసామాన్యుల కట్టి పరమార్థజ్ఞానముండదు. మనపేరు భూమిపై నెంతకాలముండునో అంతకాలము మనకు స్వర్గలోకసుఖ ముండునని మాత్రమే వారు నమ్మెదురు. ఈనమ్మకము హిందువులలో నెట్లున్నదో మహమ్మదీయులలోఁగూడ నట్లేయున్నదనుకొందును. అందుచేత తమపేరు మీఁదుగా నుండఁదగిన స్థిరమైనపనులను జనులు తఱచుగఁ జేయుచుందురు.

ఈమహమ్మదీయవనిత సహజమైన యీవాంఛచేతనే యింత కోరిక కోరెను. భార్యానురాగముచేతనే భర్త యిందుల కంగీకరించి నాఁడు. భార్యానురాగమేమి? శత్రువులయందలి క్రోధమేమి? సంసారచర్యలలో నుపయోగపడుచున్న అన్ని రసములు గూడ మహోపకారకృత్యములను జేయించినవి. చేయించుచున్నవి. ఆడుదానియందలి యనురాగము తాజ్ యంత లోకోత్తరమైన కృత్యమునకుఁ గారణమైనది. శత్రువులపైని క్రోధము చీనాయంతటి మహాదేశమునకుఁ జుట్టుగోడను కట్టించినది. ఇటులెన్ని చెప్పవలెను? క్రోధాదులను సంహరింపవలసినదని మనపెద్దలు శాశించిరి. వారిమాట కాదనగలవా రెవరు? అయినను ప్రపంచము వానిచేతనే సుఖవంతమగుచున్న దని జెప్పవలసి వచ్చుచున్నది.

కాని ప్రాపంచికసుఖమే పరమార్థము కాక పోవుటచే నట్లు పెద్దలు నిర్వచించిరని యనుకొనవలసియున్నది.

సౌఖ్యమును రోసి, సంసారమును త్యజించి, ప్రాపంచిక సుఖమును వదలుకొని యే కొండగుహలనో, యేనిర్ఝరతీరముననో తపమొనర్చి తానొక్కఁడుమాత్రమే తరించి యద్వ యానందము నొందుట కంటె జనుడు మనుజులలోఁ దిరుగుచు వారిని గష్టములనుండి యుద్ధరించుచు వారి సుఖసాధనము లభివృద్ధిపఱచుచు స్వార్థపరిత్యాగియై వారిని సేవించుచు తనువు కృతార్థము జేసికొని తరించుటయే విశేషము కాదా? తానొక్కఁడు తరించుటయే పరమార్థమగునెడల గురుధిక్కారపాపమున కొడిగట్టి గోపురమెక్కి తిరుమంత్రార్థమును త్రిదండి శిఖామణి ప్రజల కేల యుపదేశించి యుండును. ప్రేమమతమును బుద్ధుఁ డేల ప్రపంచమున వెదజల్లియుండును. ఇతరులను దరింపఁజేయుచు తాను దరించువాడు భగవంతుని ప్రతినిధి యనకతప్పదు. ప్రజాపాపనివారణమునకై ప్రాణము లర్పించిన పవిత్రాత్ముఁడు భగవంతునికొడుకు కాక మరెవ్వఁడు.

నాయనలారా! ప్రధానవిషయమునువదలినైచి మారుదారిని బోవుచున్నాను. ఈ దినమున దేహమునకు మనస్సునకుఁగూడ నస్వస్థతగా నున్నది. నాయనలారా! ఒక్క మనవి. నేను చెప్పఁబోవునది శ్రద్ధగా వినుడు.

ఇదిగో ఈ యెఱ్ఱరాల ముఖాద్వారపుమేడక్రింద నిలువఁబడి ''తాజ్‌మహలు'' వంకజూతము. తెల్లనిగుమ్మటమువలె శారదాభ్రసంచయమువలె నగపడుచున్న యారజత గిరి శకలమే దర్శనీయమైన ''తాజ్‌మహలు''. ఇక్కడ నుండియే యొక్క వింతసంగతి కనిపెట్టెదను. తాజ్‌మహలు మనకిక్కడనుండి రెండు ఫర్లాంగుల దూరములో నున్నది. దాని నిక్కడనుంచి చూచు మనకది యసలు భవనముకంటెఁ జిన్నదిగాఁ గనఁ బడక తప్పదు కదా! ఎంతచిన్నదిగాఁ గనఁబడుచున్నదనఁగాఁ దాని చిన్న పరిమాణముతో నది మనయొ ద్దకు వచ్చునెడల నది యా మేడలోనికి సులభముగాఁ బ్రవేశింపదగినట్లున్నది. అత్యంతము సున్నితమగు దూరదృష్టిసంబంధమైన పరిమాణజ్ఞానముతోడ నీ సింహద్వారము సృష్టింప బడినది.

మనమింక ముందునకుఁ బోయెదము. దారిలో నీప్రక్కనా ప్రక్కఁ జక్కనితోట యున్నది. ఎదుటి మహాదర్శనము ముం దీతోటవంక జూచువాఁడెవ్వడు. ఇంకొక్క యద్భుత సన్నివేశమిక్కడ కనబడుచున్నది. మనము తాజ్‌మహలు వద్దకు వెళ్లుచుండగా నది మనవద్దకు వచ్చుచున్నట్లగుపడుచున్నది. ఇది మాయయో, కనుకట్టో తెలియదు. ఆభవన సంబంధమైన సౌందర్యశక్తి మన మింత దూరమున నుండగనే మన మన స్సానందవశ మగునట్లు క్రమ్మివేయుటచేత మనము కదలకుండనుంటిమనియు, నాభవనమే మనయొ ద్దకు వచ్చుచున్నదనియు భ్రాంతి కలుగుచున్నదేమో. అత్యంతసౌందర్యవంతమైన వస్తువును జూచునప్పుడు భ్రమయేమి, నిశ్చేష్టతయేమి, యస్వాధీన మనస్కతయేమి, గలుగఁదగని వికారమేదైనా నుండునా? పార్థసారధిస్వామి దర్శనమునకు బోవు యాత్రికుడు ప్రాకారము వెలుపల నింకనుండగనే పరమేశ్వరుని పవిత్రాతాశక్తి యాతని యొద్దకుపోయి పాపసంకులమైన యతని మనస్సునకు బరిశుద్ధినిచ్చి మఱిలోనికి దీసికొనిపోవును.

ఇప్పుడు తాజ్ భవనపు మెట్లెక్కుచున్నాము. ఈమెట్లమీద మన శరీరము మాత్రమే యడుగడుగునకుఁ బైకి లేచుచున్నదా? కాదు. మనస్సు కూడ నట్లే లేచుచున్నది. తాజ్ కెదుట నిలువఁబడి నాము. ఎదుటివసారాకున్న పాలరాతితడకలమీది పనివానితనము ముందు చూడగూడదా? ఊహుఁ లోనికి బోయినదాక నొక్కటే తొందర. రెండు పాలరాతి గోరీలు రవంతయెత్తుయిన పాలరాతి తిన్నెపై నున్నవి. ఇవి నిజమైన గోరీలు కావు. వీనికి దిగువ క్రింది యంతస్థులో భూమిలో నిజమైన గోరీలు కావు. ఈగోరీలే భార్యభర్తలిరువురవి. డాబామీద గోరీలు జవాబుగోరీలు. వీనికిఁగూడ నాల్గువైపులను నాల్గు పాలరాతితడకలున్నవి. పైని పెద్దగుమ్మీయున్నది. ఎక్కడ చూచిన పాలరాతి తలతల. రత్నముల మిలమిల. పచ్చరాలు, నెత్తురాలు, నీలపురాలు, నాకుపచ్చరాలు, పాలరాతి పూఁదీఁగల చిత్రవిచిత్రపుఁ బనులపై వరుసలుగాను, నడ్డుదిడ్డముగాను, తోరణములుగాను, పడుగుపేకలుగాను, అయి మూలవాటముగానుఁ జెక్కబడియున్నవి. నాయనలారా! చూచి యాసౌందర్య మనుభవింప దగినదే కాని చెప్పదగినది కాదు.

ఇది 1932 లో నిర్మింపబడినది. వీనిని మనస్సులో గల్పించుకొని పటము సృష్టించిన యాతఁడు ''ఉస్తాదు-ఈసా'' యను పారశీకుఁడు Austen De Bordeany అను ఫ్రెంచియాతఁడు దీనినిఁ గల్పించెనని చెప్పుదురు. కాని యది సత్యము కాదు.

కాని నాల్గువైపులను నాల్గు పాలరాతిస్తంభము లున్నవేల? సముద్రతీరమందలి దీపగృహముమాదిరిగా నున్నవి. అవి యెట్లున్న సరే వాని యాకృతిలో మనకుఁ దగవులేదు. కాని యవి యక్కడ నేల యున్నవి. ఈ ప్రశ్నమున కుత్తరము చెప్పువారెవ్వరు? తాజ్ భవనమునకు నాల్గువైపుల నాల్గుగుమ్మీ లేలయుండవలయును. అందుకై-ఈ స్తంభములు గూడ నున్నవని మీకు న న్నదిక్షేపింతురా? నాల్గు క్రిందనున్నవి. కనుక గదికొక్కటి చొప్పున నాల్గుగుమ్మీలు కట్టవలసివచ్చినది. అవి భవనములోని భాగములే కావా? తాజ్ పాడుకాకుండ నొక్క గుమ్మీయైన తీయఁగలమా? వెలుపలనున్న ఈ స్తంభములట్లా? వానితో భవనముతో నేమి సంబంధమున్నది? అవి తీసిపారవైచిననైన తాజ్ సౌందర్యము లేశమైనా జంకునా?

ఉన్న ప్రయయోజనము లేదయ్యెను. లేకున్న నష్టములేదయ్యెను. అటులయిన మండనేల? మీరిండ్లు కట్టుకొనుచున్నారు కదా! ఇల్లు పూర్తియైన పిదప నింటికి రవంతదూరముగ నాల్గువైపుల నాలుగు స్తంభములను ప్రాతి యూరకుండుటకు మీమనస్సెప్పుడైనఁ బోయినదా? అట్లెవఁడైనఁ జేసియుండినయెడల పెద్దలెవరైనా నధిక్షేపింపరా? కాకులు గ్రద్దలు పాడుచేయునేమో, పిడుగులవలని యుపద్రవ మేమికలుగునో యని తాజ్పై నొక పెద్ద గుమ్మీకట్టుటకు నాల్గువైపులా నాల్గు స్తంభములు కట్టఁబడినవా? అట్లేయగునెడల ప్రధానభవనముతో నీస్తంభములకు సంబంధమున్నది. అప్పుడు స్తంభముల కర్థమున్నది. కాని యందు కొఱకే యని చెప్పగలిగినవాఁ డెవ్వడు. పిడుగుతో పైగుమ్మీ పగులు నప్పుడు లోని దాగునా? గదాఘాతమును తలపైఁ జుట్టుకొన్న సేలు వాఁపఁగలదా?

కవులు దీనిని ప్రబంధమనలేదా? గాయకులు దీనిని గీతమనలేదా? చిత్రవిలేఖరులు దీనిని జిత్రపట మనలేదా? శిల్పకులు దీనిని కళానిలయమనలేదా? కవితా, గానము, చిత్రలేఖనము, శిల్పము నను నాల్గుకళలు గూడ దీనిని సేవించుచున్నవని యా స్తంభముల

కర్థము మనము చెప్పఁగూడదా? దీనిని జిత్రపట మన్న వారెవరో నాకుఁ దెలియదు. శిల్పకళావైచిత్ర్యమునకు ఫలమైన యీ భవనమును శిల్పకళ కూడ సేవించుచున్నదనుట తప్పుకాదా? అందుచేత నీ స్తంభము లెందుకున్నవో చెప్పలేము. ఈసాగారు మొదట వ్రాసినపటమందు నివియుండెనో లేదో! ఉండునని నిశ్చయముగాఁ జెప్పలేము. ఉండినయెడల వానికేదో పరమార్థ ముండితీరవలయును. తెలియ రాని విషయమును గూర్చి యీ ప్రయత్నమెందులకు?

**Lord Roberts** అనునాతడు **Boer** యుద్ధమున వీరాగ్రేసరుడని మీరు వినియున్నారు. అతఁడు నలువదియొక్క సంవత్సరములు హిందూ దేశమం దుండెను. ఆతఁడు తన గ్రంథమున నిట్లు వ్రాసినాడు. ''కవిత్వమువలనఁగాని, చిత్రలేఖనమువలనఁగాని, యెంత భావనాధార్ఢ్య మున్నవానికైనా నీ విచిత్రకల్పన యొక్క స్వచ్ఛత యెట్టిదో, సర్వజన సంతోషప్రధాన ప్రతిభ యెట్టిదో, రవ్వంతయైన తెలియజేయుటకు సాధ్యము కాదు. హిందూదేశయాత్ర తాజ్ దర్శనమువలన సార్థకమగు చున్నదని తాజ్‌ను గూర్చి వ్రాసినాడు

పండు వెన్నెలలో నీభవన మత్యంత శోభాయుక్తముగ నుండునని పెద్దలవలన విని రాత్రికూడ నటకుఁ బోయి కూర్చుంటిని. రవ్వంత సేపటి కింటికి వచ్చి నిద్రపోయితిని. ఒక చిత్రమయిన కల వచ్చినది. దాని వైచిత్ర్య మింతింతనరాదు. దానిని పైవార మెప్పుడైనా జెప్పెదను.

''ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః''

# 24. అత్యద్భుత స్వప్నము

తాజ్‌మహల్ చూసిననాటి రాత్రి వచ్చిన కలను జంఘాలశాస్త్రి చెపుతున్నాడు.

షాజహాన్, ముమ్‌తాజ్ కలిసి అంతఃపురంలో వుండగా ఒక బంగారు చువ్వలాంటి ఒక స్త్రీ మేలి ముసుగు వేసుకుని అక్కడికి వచ్చింది. ముమ్‌తాజ్ ఆమె ఎవరని, షాజహాన్‌ను ఎక్కదీసింది. ఆమెను తాను వివాహమాడినట్లు, చక్రవర్తి నెమ్మదిగా వెల్లడించాడు. ముమ్‌తాజ్ వెంటనే కోపాన్ని వెనక్కినెట్టి ఆమెను 'చెల్లెలి'గా మన్నించింది. ఆ స్త్రీ పేరు కిన్నెత్.

చక్రవర్తి ఆస్త్రీ, ఆస్త్రీ అంతఃపురానికి వెళ్ళాక, ముమ్‌తాజ్ తన అసూయ వెళ్లగక్కింది. కిన్నెత్‌ను అంతం చెయ్యడానికి పెద్దకుట్ర పన్నింది. ఈ కుట్రలో రోషనార కూడా ప్రముఖపాత్ర వహించింది.

కిన్నెత్, చక్రవర్తి కలిసి వక్కపై దిండు మీద ఒక లేఖ చక్రవర్తి కంటపడింది. ఆ లేఖను చక్రవర్తి చదివిన క్షణంలో కిన్నెత్ లోపలకు వెళ్లింది.

ఆ లేఖ సారాంశం ఏమంటే, కిన్నెత్ కులట అని– ఆ అంతఃపురంలో వున్న యాకుతీ స్త్రీ కాదని పురుషుడని కిన్నెత్ ప్రియుడని –

చక్రవర్తికి దారుణంగా కోపం వచ్చి కిన్నెత్‌ను చంపివేద్దామనుకు న్నాడు గాని, నిగ్రహించుకుని, కిన్నెత్‌నే నిజం చెప్పమని అడిగాడు. ఆమె తన శీలం నిప్పువంటిదని చెప్పింది. యాకుతీ చెప్పిన సాక్ష్యం వల్ల, తన కుటుంబం వాళ్లు కిన్నత్‌కు ఎంత వ్యతిరేకంగా వున్నారో తెలిసింది. చక్రవర్తి, కిన్నెత్ శీలవతేనని నమ్మిన అనంతరం, ఆమె అక్కడి కక్కడే అల్లాను తలుచుకుని తల పగలుకొట్టుకొని చనిపోయింది. షాజహాన్ మనస్సు కలిగిపో యింది.

**జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:–**

తాజ్‌మహలు చూచినరాత్రి నాకుఁ గలిగిన స్వప్నమును జెప్పెదనని క్రిందటిసారి చెప్పితిని. ఇప్పుడ దానిని గూర్చి చెప్పెదను. స్వప్నమిట్లుండెను.

షాజహాన్ చక్రవర్తి మమ్‌తాజ్‌ను బతిమాలు కొనుచున్నాఁడు. మూఁటికంటె నెక్కువ పనికిరాదని యామె యనుచున్నది. ఆసెలవును బొంది ముద్దు పెట్టుకొనుట కాతఁడుపక్రమించినాఁడు, ఏక్ దో. ఏక్‌దో. ఔర్ ఏక్. ఔర్ దో. ఫిర్ ఏక్. ఫిర్ దో దోయనుచు మూడన్న అంకె నోటి వెంటఁ బలుకకుండ మూఁడువందలముద్దులు టపాకచ్చేరిలో ముద్రల వలె నామెమూతిపై పెడిపెడి ముద్రించినాడు. అన్ని ముద్దులు పెట్టుకొనుట కాచక్రవర్తి కెంతప్రేమయో. ఇన్ని మూతినొక్కు లనుభవించుట కాయమ్మ కెంతయోపికయో యని తెల్లబోయితిని. మూడుకంటె నెక్కువ పనికిరాదన్నప్పుడే యింతకుంభవృష్టి కురిపించిన యయ్యవారు నీయిష్టము వచ్చినన్ని పెట్టుకొనవచ్చునని చెప్పి, ''సర్వదుంబాల'' చీటి నిచ్చినయెడల పుష్కలావర్తకములు తెగి పడి జలప్రళయము చేయునట్లు ముద్దుపెట్టుకొనుచు గాఁబోలు నని నసుకొంటిమి.

ఇంతలో బంగారు శలాకవంటి యొక చక్కని కాంత యెచ్చటి నుండియో గాని యచ్చటకు మేలిముసుఁగుతో వచ్చెను. ''నీవెవతెవు? ఇట కేలవచ్చితివి'' అని ముమ్‌తాజ్ ఆమెను గద్దించెను. ''ప్రియురాలా! ఆమెను బెదరగొట్టకుము నిన్నుఁ జూచుటకే గడగడలాడుచున్నది. నీవు న న్నేలినట్లే యామెనుగూడ నేలికొనుము. నీకు సర్వతా విధేయురాలు'' అని చక్రవర్తి మమ్‌తాజ్‌తో క్రొత్తయువతిని గూర్చి చెప్పెను. ''ప్రాణనాయకా! నీవు చెప్పిన మాటలలో నొక యక్షరమైన నాకుఁ దెలియలేదు. ఆమె యెవతె? ఇక్కడ కెందులకు వచ్చినది? నా యంతః పురములోనికి నాసెలవులేకుండ వచ్చుట కామెకేమి యధికారమున్న'' దని ముంతాజ్ తీవ్రపడెను. వారి కిట్లు సంభాషణ జరిగెను.

షా:– ప్రాణప్రియా! నీదర్శన మామెకు లభింపఁజేసి నిన్నామెపై సర్వాధికారిణిగ జేయుటకు నేనే యామె నిక్కడకు రమ్మంటిని.

ముంతాజ్:– ఏమీ! నేను లేనప్పుడు నీ వీపడుచుకుర్రదానితో నేల మాటలాడితివి? మీకు మాటలు జరుగుటా! అది నీకు నచ్చుటా! నీవు దానిపై నిష్టపడుటా! దానిని నాయంతఃపురములోనికి రమ్మని నీవు రహస్యపుమాట చెప్పుటా! అది య ట్లిచ్చటికి వచ్చుటా! నాయెదుటచే నీవు దానిచర్యను సమర్థించుటా! అని నాకుఁ గూడ నీకైనయట్లే యిష్టపదార్థ మగుటకు నీవు నన్ను బతిమాలుటా! నా కనుభ్రామి యింతచర్య జరిగించితివా? దానిని నా యంతఃపురములోని కేల రమ్మంటివి? ఈయంతఃపురమునుండి నన్ను వెడలఁ గొట్టి యామె నిచ్చట సింగారింపఁ దలచితివా? నేను లేచిపోవుదును.

(ముంతాజ్ లేచి పోఁబోవును.)

షా:– (ఆమెకాళ్లపైఁబడి) నన్ను క్షమింపుము. నావలనఁ దప్పు గలిగినది. మించిపోయినదాని కేమిచేయఁగలము? నే నామె నాకస్మికముగఁ బైయూరఁ గాంచి ''నాయొద్దకు వచ్చునెడలఁ బదివేల అషరఫీ లిచ్చెద''నని వార్త నంపితిని. ''ఊరివారిసొత్తైన తొత్తనుకొంటివా? పదివేల అషరఫీ లిచ్చిననైన నేను నీ మొగమువంకఁ జూతునా? నాకు వాల్గషరఫీల యలంకారములైన నీయకుండ నన్ను వివాహము చేసికొనునెడల నా కంగీకారము'' అని యామె తిరుగ వార్త నంపెను.

ముంతాజ్:– ఆ! ఆ! అంతవఱకు వచ్చినది? వివాహము చేసికొంటివా! చేసికొంటివా!

షాజ:– క్షమింపుము. క్షమింపుము. చేసికొంటిని.

ముంతాజ్:– ఐనది కదా. నీ వుంచుకొన్నదానిని నాయొద్దకు దెచ్చితివేమో యని నే నంత తీవరించితిని. ఇకనేమి! నీయెడల నామెకును నాకుఁ గూడ, సమానమైన హక్కేకదా? ప్రాణనాథా! లెమ్ము! మనశాస్త్ర మంగీకరించినపనిని చేసితిని. కాని నీవు తప్పుచేయలేదే? చెల్లెలా? ఇటు రమ్ము. (కౌఁగిలించుకొనును.) మన మొక్కతల్లిబిడ్డల వలెఁ గాలక్షేపము చేయుదము. నీ యిష్టమువచ్చినప్పుడు నీ విక్కడకు రావచ్చును. నాకు వీలగునెడల నేను నీ యంతఃపురమునకు వత్తును. ప్రాణనాథా! నీవు నీ క్రొత్తపెండ్లికూఁతును గౌఁగిలించియుండఁగాఁ జూచియుండలేదు. కావున నా చెల్లెలిని నాయెదుటఁ గౌఁగలించు కొనుము.

షా:– అక్క చెల్లెండ్ర నిద్దరి నొక్కసారి కౌఁగలించుకొనుటకు, రెండు బాహువులుండ వేరువేరుగఁ గౌఁగలించుకొనుట తప్పుకాదా? (ఇద్దరను గౌఁగలించును.)

ఇంతలో లోనిగదిలోనుండి యొక రవంత కీచుగొంతుకధ్వని యయ్యెను.

ముంతాజ్:– రోషనార్ నన్ను బిలుచుచున్నది. నేను లోనికిఁ బోవుదును. చెల్లెలికిఁ బ్రశస్తమైన అంతఃపుర మీయక తప్పదు. నోటివెంట మాటయైన నెఱుఁగని ముద్దరాలు. ఆమెను జూడ నాకు జాలియగుచున్నది. మీవంటి ముసలితొక్కు దొరుకుట యామె దురదృష్టము. కాని పడుచుప్రాయపు పసలచే బెనఁగకుండ గసిమసపుబంగారు బొమ్మ ప్రక్కలోని కమరుట నీ మహాదృష్టమే కదా? ఆడుదానికర్మ మెట్లయిన సరే మగవాఁడు సుఖపడినఁ జాలును కదా. (షాజహాను లెంపపైఁ బరిహాసముగఁ గొట్టును. లోనికిఁ బోవుదును.)

షాజ:– మే మిక్కడ నెందులకు? మేముగూడఁ బోయెదము. (షాజహాను, క్రొత్త పెండ్లికూఁతురు పోవుదురు.)

ముంతా:– ఇద్దరు గూడఁ బోవుదురా? నే నీముండను దెల్లవాఱకుండఁ బరాభవించి చంపింపనా? అంతేకాని వీరిని గాఁపురముచేయ నిచ్చెదనా? ఈ పెండ్లిసంగతి నాకు పదిహేనురోజుల క్రిందటనే తెలిసినది. రోషనార్ యీసరికి తగిన మాయపన్నియే యుండును. రోషనార్! (అని పిలుచును) (రోషనార్ ప్రవేశించి) మీకు జరిగిన సంభాషణ వింటిని. ఈమె నీరాత్రి చంపించుట కేర్పాటుచేయించితిని. నీవు విచారము వదలుము. రమ్ము లోనికిఁ బోవుదము. సంగతులన్నియు వివరముగాఁ జెప్పెదను.

ముంతాజ్:– కాని నాపేరు మాత్రము పైకి రాఁగూడదు సుమా.

రోష:– రానేరదు. వచ్చినను మరేమియుఁ దొందరలేదు. లోనికి రమ్ము. (ఇద్దరు పోవుదురు.)

అంతలో నాస్థలమంతయు గిరగిరఁ దిరిగిన ట్లయ్యెను. నాకుఁ గన్నులు స్వప్నము లోనే చీకటులు పడినవి. అంతలో షాజహాను తన నూతనభార్యచెఱఁగుఁ బట్టుకొని లాగుచున్నాఁడు. ఈమెపేరు కిన్నెత్.

కిన్నెత్:– అబ్బే! అబ్బే! ఇప్పుడుగాదు. పాదుషాసర్కార్ క్షమింపవలెను. నాక్రొత్త

దాసి యక్కడనే యున్నది. అదిచూడదా? అదిపైకిఁ బోయి యేవియో తెలివితక్కువమాట లాడకుండునా?

షాజ:– దాని నావలికిఁ బొమ్మని చెప్పుము.
కిన్నె:– యాకుతీ! ఇటురా! (యాకుతి వచ్చును.)
యాకు:– పర్వర్దిగార్ (పాదుషాకు నమస్కరించును.)
షాజ:– నీ వీగదివెలుపల నేను బిలుచువఱకు కుండుము. (యాకుతి పోవును.)

కిన్నె:– నే నొక్కసారి లోనికిఁ బోయి పన్నీరుతెచ్చి మీపై జల్లెదను. (కిన్నెతు పోవును.)

షాజ:– ఈయుత్తర మెవరిదో అది యిచ్చటికి వచ్చుటకుఁ గారణమేమి? (తలగడపై నున్న యుత్తరముందీసి) దిక్కుమాలినరాజకార్యతంత్రము భార్యయొద్ద దిన్నగఁ బండుకొననైన నీయదుగదా? ఏమి? (జరూరని దీనిపైన వ్రాయఁబడియున్నదే. (సీలు విప్పి చూచును.) మంచముమీఁదఁ గూలఁబడి) అల్లా! అల్లా! అల్లాహో అక్బర్! అల్లాహో అక్బర్! ఈగుడిసెవ్రేటిముండ నాపరువు తీసివేసినదే. నన్ను మాయచేసినదే. మా మొగలాయివంశమునకుఁ బ్రేఁగులుదీసి కుక్కలకుఁ బెట్టించెదను. నాయెడల నింతవిశ్వాసఘాతుకురాలై ప్రవర్తించిన యీ తుచ్ఛురాలి ప్రేఁగులను విశ్వాసవంతములైన నాకుక్కలు స్పృశించునా? నా కైజారును వ్యభిచారదోషమున మలిమసమైన యీముండరక్తమున నపవిత్రము గావించెదనా? నేను దానిని జంపను. దీనిని సంతలోఁ బెట్టించి ఒక్కొక్క యవయవ మొక్కొక్కదినమునఁ గోయించి చిత్రవధఁ జేయించెదను. నే నిప్పుడేమియుఁ దెలియనటులే నటింతును. అది చేసినదోషమునుగూర్చి విమర్శింతును. చంపించుట యెంతసేపు? ఏనిముసమున నైనను తలారి చేయఁగలఁడు. ఆమోసకత్తెయైనముండ యిటకు వచ్చుచున్నది. నేను జూడనట్లు నటింతును.

పన్నీటిబుడ్డితో వచ్చి కిన్నెత్ షాజహానును వెనుకప్రక్కనుండి కౌఁగిలించును.

షాజ:– (వెగటుపడి వెంటనే క్రమ్మకొని) ప్యారీ? బైరీయే? (ఆమె కూరుచుండును) చూడు. వయసు ముదిరినవాని యుబలాటము. తాటాకు మంటవంటిది. రవంత యాలస్యమగునెడల నావాంఛ యంతటితో నశించును. ఇపుడు నీతో రవంత మాటలాడవలసియున్నది. సరిగఁ బ్రత్యుత్తర మిచ్చెదవా? జడిసి యసత్యమాడుదువా?

కిన్నె:– నా నోటివెంట యింతవఱకు సత్యమేకాని యసత్యమెన్నఁడు రాలేదు. నే నొకరిని జూచి భయపడుటకు నావలన నేమైన దోషమున్నదా? భగవంతునియెడలఁ గూడ, నేను బుద్ధిపూర్వకముగఁ దప్పుఁజేసి యుండలేదు. నీ వెంతమాత్రము సందేహింపక, నీకుఁ దోఁచినదేదో యడుగుము.

షాజ:– తలాడపైనున్న యీయుత్తర మెవరు తెచ్చిరి?

కిన్నె:– నాక్రొత్తదాసి. అది కోటలోనికి వచ్చుచుండఁగా, పహిలీ దర్వాజాయొద్ద నెందరో జనులు మూఁగియున్నారఁట. వారిలో నొక్కఁడు దానిచేతి కీలేఖ నిచ్చి, పాదుషా సర్కారువారి క్రొత్త జనానాలో దాఖలుచేయుమని చెప్పెనఁట. అట్లుతెచ్చి నాచేతి కివ్వఁబోవఁగా నాభర్తతలాడపై నుంపుమని చెప్పితిని. అది అట్లు చేసినది. నేను మీతో యా

లేఖనుగూర్చి చెప్పఁదలఁచితినిగాని మఱచిపోయితిని. క్షమింపవలెను.

షాజ:– దీనిలోనిసంగతులు నీ కేమైనఁ దెలియునా?

కిన్నెత్:– సర్కార్! నాకెట్లు తెలియును?

షా:– ఈ యుత్తరములోని సంగతులు నే నెఱుఁగుదును. నా కనుభవములో నున్నవని నీచే ననిపించినయెడల–

కిన్నె:– అదేమి సర్కార్! నీయుత్తరములోనున్న గూర్చి యేమియుండును? పైవారెవ్వరైన నన్నుఁగూర్చి మీపేర నేమైన వ్రాసినారని మీఅభిప్రాయమా?

షా:– ఔను.

కిన్నె:– నే నెఱిఁగిన సంగుతులన్నియు నిర్భయముగాఁ జెప్పెదను.

షా:– నీవు నన్ను వివాహము చేసికొనకపూర్వము ని న్నెవఁడైనా వలచెనా?

కిన్నె:– ఆ! ఆతనివల పసాధారణమైనదని నేను దృఢముగాఁ బలికెదను. నేను వానిని స్పష్టముగ నిరాకరించితిని. చచ్చెదనని నాకు వార్త నంపినాఁగు. నీ యిష్టమని తెలియఁ బఱచితిని.

షా:– అంతవలపు గల పడుచువానిని నిరాకరించి నీవు నన్నేల చేసికొంటివి?

కిన్నె:– అతనియందు నాకు వలపు లేదుగావునఁ జేసికొనలేదు. నీయం దున్నది గాన నిన్ను జేసికొంటిని.

షా:– ఆతఁ డిప్పు డెక్కడ నున్నాఁడు?

కిన్నె:– నేను మిమ్ముఁ జేసికొన్నపిమ్మట వెర్రివెర్రి యాసలన్నియు నడుగంటుటచే నెక్కడకుఁ బోయెనో, నే నెట్లు చెప్పఁగలను?

షా:– అసత్య మాడుచున్నావు.

కిన్నె:– అయ్యో! వాఁడెక్కడ నున్నాఁడో నా కెట్లు తెలియును?

షా:– ఎక్కడ నున్నాఁడో తెలియదా? నన్ను జెప్పుమందువా? ఎక్కడ నున్నాఁడా, నీయంతఃపురములో నున్నాఁడు, నీ ప్రక్కలో నున్నాఁడు, నీకౌఁగిట నున్నాఁడు.

కిన్నె:– అట్లున్న యాతఁడు నామగఁడైన చక్రవర్తియే కాఁడా?

షాజ:– నీ మగఁడు కాఁడు, నీ ఱంకుమగఁడు. (ఆమె గుండెపైఁ జఱచుచున్నాఁడు.)

కిన్నె:– పాదూషాసర్కార్! ఆగర్భశ్రీమంతుఁడవే, మహాసుకుమారమూర్తివే, అంత దెబ్బ కొట్టఁగ, నీచేయి కందిపోదా? వ్రేళ్లు నొప్పులు పెట్టవా? నీవు కేవలము పొరపాటుపడు చున్నావు. నే నాదోషమెరుఁగను. ఎరుఁగను. అల్లాహో అక్బర్! నేను దోషసహిత నగు నెడలఁ నన్నుఁ గొట్టుటకుఁ గఱ్ఱలేదా? కఱ్ఱతోఁ బనియేమున్నది? కత్తితో నఱకరాదా? కాని తప్పు నిదానింపుము. తొందరపడకుము. నా కాకస్మికముగఁ గలిగిన స్థితినిబట్టి యనేకులు నాకు వైరు లుందురు.

షా:– నేను సత్యమునే పరిశీలించుచున్నాను. నీ ఱంకుమగని నీయెదుట కిప్పుడు బిలిపింతునా?

కిన్నె:- ఓ! అభ్యంతరమేమి? అట్లు ముఖాముఖిని బెట్టి నిర్ణయింపుము.

షా:- యాకుతీ యని పిలువుము.

కిన్నె:- యాకుతీ! (యాకుతీ వచ్చును.)

షా:- చూడు. అటుచూడు. కన్నులు పెట్టుకొని చూడు. వాఁడు నీఱంకుమగడు కాఁడా? నీవు వచ్చినమరునాఁడే నీ ఱంకుమగని నిచ్చటికిఁ దెచ్చి నాయెదుటనే మీవృత్తిని సాగింపఁ దలఁచిచినారా? నీ దగ్గఱ నుబలాటముతోఁ బండుకొనుట కీగాడిదకొడుకునకు నేను జీతము బత్తెము నలంకారము లెదురీయవలసినదా? నీయిల్లు వల్లకాఁకాడుగాను. నామర్యాద నింతయైనఁ జూడ నక్కఱలేదా? వీఁపుమీఁద గట్టిగఁ గొట్టగఁ బడిపోవును) యాకుతీ! నీవు మగవాఁడ వగునా? కాదా? నిన్నెవరు లోనికిఁ బంపినారు? ఈతంత్రమం తయు నీవలన జరిగినది అంతయు సరిగాఁ జెప్పనియెడల నిన్ను జంపుదును. బజానాక్రింద ముందొక తమాంచా తీసికొనుము. అని కొట్టును.

యాకు:- నే నాఁడుదానను గాను. మగవాఁడనే.

నేను నీభార్యను గాటముగా వలచితిని. ఒక్కసంవత్సరమునుండి యామెను గాఢముగాఁ బ్రార్థించుచున్నాను. గొంగళిపురుగును జూచిన కంటె, నెక్కువ యసహ్యముగ నన్ను జూచినది. నే నామె యాస నిది వఱకే వదలుకొంటిని. నేను మరియొక గ్రామము పోయి యక్కడ నాకుఁ దగినదానిని, నన్ను వలచినదానిని బెండ్లి చేసికొనవలె నని నిశ్చయించుకొని పోవుచుండఁగా, మంతాజ్ గారి యిద్దరుదాసులు నా యొద్దకు వచ్చి నిన్ను జక్రవర్తినిగారు బిలుచుచున్నారనఁగా నేను ప్రాణముల నరచేతఁ బెట్టుకొని దాసులవెంటఁ బోయితిని. నాతో వారు చెప్పిన దేమనఁగా, చక్రవర్తిగారి క్రొత్త పెండ్లికూతును నీవత్యంతము వలచితివని మేము వినియున్నాము. ఆమె నిన్ను మోసగించి చక్రవర్తిని జేసికొన్నది. నీకు రెండువేల అషరఫీ లిచ్చెదను. ఇదిగో తీసికొనుము నీ వీ యాఁడు వేసముతోడనే యామెయొద్ద దాసిగా నుండవలయును. నీ కెంత యదృష్టము పట్టునో యెవరు చెప్పఁగ లరు? ఇట్టిమాట లామంతాజ్ గారు పట్టుదలగఁ బలికినను, నే నిష్టపడక యింటికిఁ బోదలఁచితిని. కాని నన్ను వారు నిరోధించి యిక్కడనే బలాత్కారముగ దాసిగా నుంచిరి. మహాప్రభూ! నే నేమి చేయఁగలను? చక్రవర్తీ! ఇప్పుడు నన్ను బొమ్మనిన నేను సంతోషముగఁ బోవుదును. నాదోషమేమియు లేదు.

షా:- నీకును, గ్రొత్తపెండ్లిగూఁతునకు నిదివఱకు సంబంధము లేదా?

యా:- లేదు. లేదు.

షా:- ని న్నిట్లు బలాత్కరించి క్రొత్తరాణియొద్ద వా రుంచి నారని నీ వీమెతోఁ జెప్పితివా? లేదా?

యా:- చెప్పినయెడల నెగచి తెగనఱకించు నని భయపడితిని. నాస్వరూపము నిప్పుడు బాగుగా నిదానించి క్రొత్తరాణియే మీతో జెప్పినది గాఁబోలును.

షా:- ఆమె చెప్పలేదు. ఈయుత్తరము చెప్పినది. దీనిని నీ కిచ్చినవా రెవరు?

యా:– తల్లి సెలవుపైని రోషనార్ నాకిచ్చినది. తా నిచ్చినట్లు చెప్పవలదన్నది.

షా:– ఎవరిచ్చినారని చెప్పవలసినదని నీ వడుగలేదా?

యా:– అడిగితిని. వీథిలోని ప్రజమహజరిచ్చుకొనినారని చెప్పుమన్నది. అట్లే నేను కిన్నెత్తుతోఁ జెప్పితిని.

షా:– నీదోషము లేకుండ నీవు చేసికొన్నావు. నీ వుంచుకొన్న ముండదోషము గనపడకుండ సమర్థించినావు. నాముసలితనమునకు నీ పడుచుదనముఁ దోడుపఱచి దానిని సుఖపెట్టుటకే నీవు వచ్చితివి. నీతలఁ బగులఁగొట్టెదను. (చేతికర్రతోఁ దలపైఁ గొట్టఁగ వాఁడు క్రిందఁ బడిపోవును).

షా:– ఈసంగతి సత్యమో, యసత్యమో? ఎవఁడు చెప్పఁగలఁడు. అసత్యమైనప్పుడే తరుగని చెరుగని యప్రతిష్ఠ యైనప్పుడు, సత్యమే యైనచో నిఁకఁ జెప్పఁదగిన దేమున్నది. దీనిని జంపించుతంత్రమున మమ్‌తాజ్‌తో నాకూఁతులు, వారిదాసులు, వీరిదాసులు, మిగిలిన జనానావారు, వారికొజ్జాలు, వీరి కొజ్జాలంద రేకీభవించి నా కెదురు తిరిగినారు. ఇంత కుటుంబవైరమును సహింపఁగలనా? కడుపునఁబుట్టినబిడ్డ లుండఁగాఁ, దిరుగ నిక్కాఁకు సిద్ధపడినవానిని ముక్కముక్కలక్రిందఁ గోసినను పాపమున్నదా? నాదోషముచేతనే యింతపని జరిగినది. కిన్నెత్ వలనఁ దప్పున్నదని నాకు నమ్మకములేదు. తప్పులేనిదానిని నెట్లు చంపఁగలను? తప్పు లేనిదానిని అంతఃపురమందే యుంచుకొనుటకు నాభార్యలు సహింపకుండ నున్నారు. నాబిడ్డలే సహింపకుండనున్నారు. నాప్రజలు కూడ నా కెదురు దిరిగినారని భయ పెట్టుటకే లేఖను గోటవెలుపలి జనులెవ్వరో యిచ్చిన మహజరని మాయచేసినారు. ఇదియంతయు మమ్‌తాజ్ మహిమయే కాని మరియొకటి కాదేమో. ఇట్టి మహేంద్రజాల మధ్యమున నేను క్రొత్తరాణిని బెట్టుకొని నిర్వహింపఁగలనా? కావున దీని నెక్కఁడకైనఁ బొమ్మని చెప్పుదును. అక్కఁడ దీనిసంరక్షణకుఁ దగు నేర్పాటును జేయింతును.

కిన్నెత్:– (మూర్ఛనుండి కొంచెము తెప్పిరిలి) పాదుషా సర్కార్! నే నేదోస మెరుఁగను. అగ్నివలె పరిశుద్ధనై యున్నాను. మంచుగడ్డవలె స్వచ్ఛనై యున్నాను. నన్ను రక్షింపుము.

షా:– కిన్నెత్! లేవఁగలవా? లేనియెడల నేను రవంత యూఁత నిచ్చెదను. లెమ్ము.

కిన్నె:– (లేచి) సర్కార్! మీరు నాకొరకుఁ జింతపాలు గావలదు. నామాటలు ఖొరానుమాటలవలె నమ్మవలెను. నేను దోషమేమియు నెరుఁగను.

షా:– నీ వట్టిదానివే యగుదువు. కాని నీ మీఁద నింత యల్లరియైన పిమ్మట నిన్ను నే నెట్లు నిర్వహింపవచ్చును?

కిన్నె:– ఆడుదానిపై ప్రజలకుఁ దప్పుమాటఁ జెప్పుకొనుటయే నైజము. బుద్ధిమంతు లైన న్యాయాధిపతులు సత్యమును బరిశీలించి నిందలేదని స్పష్టపరుపవలెను గాని ప్రజలకు జడియుదురా? నన్ను మీరు న్యాయసభలోఁబెట్టి బహిరంగముగ విచారించి, నాకు న్యాయము దయచేయుఁడు.

షా:– మరియొకరి తప్పయినయెడల నట్లు చేయఁదగినదే. కాని పాదుషానైనా నాయింటిలోని అంకుగాదా? నేను ఫిర్యాదినా? నా దాసులు సాక్షులా? ఇది చాలతప్పు గాదా? అదిగాక యీతంత్రమున నాకుఁ గావలసినవారందరు చిక్కుకొనియున్నారు. నాప్రతిష్ఠ, నాప్రాణము, నామానము పోఁదగినతంత్రము సిద్ధించినది.

కిన్నె:– ఇది తంత్రమేకాని, సత్యముకాదని మీరొప్పుకొందురా?

షా:– ఒప్పుకొంటిని.

కిన్నె:– ఒప్పుకొంటివా? సంతోషమే. అటులైన న న్నేమి చేయుమంటివి.

షా:– నీయిష్టము వచ్చినచోటికి నీవు బొమ్ము.

కిన్నె:– పాదుషా! నేను నిర్దోషినైన నీ భార్యనని నీవు పలికితివి. నా కంతియే చాలును. నేను నీసెలవు ప్రకారము నాయిష్టము వచ్చినచోటికిఁ బోవుదును. నాకు సెలవా? అల్లాహో అగ్బర్! అల్లాహో అగ్బర్! అల్లాహో అగ్బర్! (పాదుషాకు సాష్టాంగపడి) బిస్‌మిల్లా! బిస్‌మిల్లా! (యని తల బల్లుమని నేలఁ గొట్టుకొనినది.)

షా:– ఆ! ఆ! ఎంత ప్రమాదము. యాకుతీ! ఆమెతలకు దెబ్బ తగిలినది. ఎట్లు రక్తము ప్రవహించుచున్నదో, మంచముమీఁద నిమ్మళముగఁ బరుండఁబెట్టెదము. రవంత సాయము చేయుదువా?

యా:– పాదుషా సర్కార్! ఆమె పార్సా (మహాపతివ్రత) ఆమెను నే నంటుదునా?

షా:– అటులైనఁ బరుగెత్తుకొనిపోయి దాసులను హుజూర్ తబీమ్‌ను (వైద్యుఁడు) బిలుచుకొని రా?

(యాకుతి బోవును.)

షా:– అల్లా! అల్లా! ఎంతపని జరిగినది. ముసలితనమున వీర్యవృద్ధికొరకు హల్వాలను మ్రింగి నల్లమందు మొదలగు విషపదార్థముల నెక్కించి, ఉద్రేకమును బుట్టించు కథలను విని, ప్రదర్శనములను గాంచి, కనఁబడి కాంతావాంఛను తీర్చుకొనుటకై యీపడుచు బంగారుబొమ్మ బ్రదుకు భ్రష్టమొనర్చితిని. అయ్యయ్యో! ప్యారీ! వెళ్లిపోయితివా! (మొగమున గుడ్డవైచుకొని హా! యని యఱచుచు నావలికిఁ బోయెను.)

ఆతని హాహాకారముతో మేల్కాంచితిని, ఇక్కడికి స్వప్నము సరి.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 25. గానకళ

జంఘాలశాస్త్రి ఏమీ తోచకుండా వుంటే, ఒకనాడు పిచ్చివాణ్ణి చూడబోయాడు. అలా తనకు అనిపించడం కూడా ఒక మానవ సహజగుణం అంటాడు. ప్రకృతిగతికి భిన్నమైనది మనల్ని ఆకర్షిస్తుందంటాడు.

ఈ పిచ్చివాణ్ణి రాజమండ్రిలో జంఘాలశాస్త్రి కలుసుకున్నాడు. పేరు కొంపెల్ల రామభట్టుగారు. ఆయన్ని యోగి అని చెపుతారట జనం.

జంఘాలుడు ఆయనతో మాటలాడి, ఆయన వెర్రి ధోరణిని నెమ్మదిగా మరలించుకొని వచ్చి-ఉపన్యాస ధోరణిలో పెట్టాడు.

ఆ పిచ్చి మనిషి మాట్లాడడం సాగించాడు. మన సిద్ధాంత ప్రకారం ఉన్న దొక్కటే రసం. అది శృంగారం. అదే అవస్థా భేదం వల్ల కరుణగా, భక్తిగా మారింది. సృష్టిలో వేదాలతోపాటే కాదు, అంతకుముందే పుట్టిన కళ గానం. ఇదే లలితకళలన్నింటిలో ఉత్తమం. మొదటి రసం భక్తి. మొదటి కళ గానం. భక్తిపూర్ణమైన దేవతాగానంలో గానం. భక్తిపూర్ణమైన దేవతాగానంలో అక్షరాలక్కరలేదు. ఋక్కులకంటె, అక్షరాలేవీ లేని 'కూత' ముందు పుట్టింది. కోయిలపాటలో, రాగాలాపనలో, అక్షరాలు లేవే! గానకళ అత్యంత స్వతంత్రకళ. మనవాళ్లు అక్షరాల సాయమిచ్చి సార్థకమూ, విశాలమూ చేశారు. తొలిసారస్వత మంతా గానమే. గానకళే ప్రథమ గణ్యం. దానికి రవ్వంత తోడుగా మాత్రమే కవిత్వం ఉండదగినది. ఒక్క గానానికే ప్రత్యేక 'కళాత్వం' గాని, కవిత్వానికి కాదు. చిత్రలేఖనం కృత్రిమం. గానకళ ప్రత్యేకంగా పరమాత్మతో సంబంధించిన కళ.

ఇలా మాట్లాడి మాట్లాడి పిచ్చివాడు హఠాత్తుగా పరవశంలోపడి నందకుమారా! నవనీతచోరా! అంటూ, కృష్ణకీర్తనం చేసి పడిపోయాడు—అని జంఘాలశాస్త్రి ముగించాడు.

**జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:–**

నాయనలారా! ఏమియుఁ దోపకపోవుటచేత వినోదముకొఱకుఁ బిచ్చివానిఁ జూడఁ బోయితిని. చూచితిరా! మనుజప్రకృతి యెట్లున్నదో! స్వభావసిద్ధముగ నున్నవానిని జూడ

మనకు వేడుకగా నుండదు. స్వభావములోనో, స్వరూపములోనో, యెక్కడనో రవంత వ్యత్యాసము కాసంత తెటుకు నున్న గాని మన కక్కడకు మనస్సు పోదు. ప్రకృతిగతి భిన్నమైన దేదియైనసరే మనల నాకర్షింపక తప్పదు.

గీ. చిన్నబొట్టున్న వాని వీక్షింప రెవరు
పెద్దబొట్టున్నవాని భావింత్రు జనులు
పిలువఁగనె పల్క వానిని బెద్ద సేయ

రెంతకైనఁ బల్కనివాని నెంత్రు జనులు
తనువు గప్పినవానికి ఘనత లేదు
గోచిపాతయు దినమొల గొప్ప యంద్రు

నెత్తివెంద్రుక లున్న నోరెత్త రెవరు
నేలవెంద్రుక లున్న గణింత్రు జనులు
ఇంటఁ గూర్చున్న వాని యోజింప రెవ్వ
రడవి మిడికెడువాని నాహా యటంద్రు

కాళ్లు తలక్రింద నుండుట ఘనత కాదు
కాళ్లు తలపైన నుండుట గౌరవంబు
చావపైఁబ్రక్క ఘనతకు సంజ్ఞకాదు

శంకుపర్యంక మతిగౌరవాంక మగును
నిండుకడుపును జనుల గణింపకుంద్రు
మండుకడుపును భావింత్రు మహిత మనుచు.

ఇట్లు మనవాడుకలలో, మన యలవాటులలో, వేషభాషలలో బుద్ధిపూర్వకముగ మనము జేసికొన్న స్వల్పములైన మార్పులే జనులను మనవంక కాకర్షించుచుండ శక్తిస్వరూపిణియగు ప్రకృతినుండి బయలువెడలిన యనేకాంధశక్తులయొక్క తొందరపాటులవలనఁ, దికమకలవలన, దేడాలవలన, గందరగోళములవలన, గంగవెఱ్ఱులవలన బ్రాణులలోఁ గలిగిన యస్వభావసన్నివేశములు జనుల నెంతగాటముగ నాకర్షించునో చెప్పవలయునా? ఆడోరివానిఁ జూచుటకు మనకెంత యుత్సాహముగ నుండును? కొజ్జావానిఁ జూచుకుతూహల మింతింతయా? మగచెంపల మానినికున్న యాకర్షణశక్తి దొరజామి ప్రాయఁపుదొయ్యలికి లేదే! కవలదూడలను బెట్టినయావునే యందరు చూడవత్తురుకదా! మనుష్యులలో వేరే చెప్పనేల? చేతులులేక నోటితో నీరు కదకువానికి జనుల వలననే జీవనము జరిగిపోవుచున్నది. గంగిరెద్దునకు మూఁపురముదిగువనున్న మూరెడుతోలే గంగి రెద్దువాని కడవరాల మిద్దెకుఁ గారణమైనది. మరుగుజ్జువారి వక్రత్వమే వారి వడ్డీవ్యాపారమునకుఁ బెట్టుబడియైనది. రెండుతలలరాకాసిపిండమే తండ్రిని లక్షాధికారిఁ జేసినది.

ఇవియన్నియు బాహ్యవికృతులు. వీని యాకర్షణమే యింతగా నున్నప్పుడు అంతరవికృతులమాట వేరే చెప్పవలయునా? పుట్టుక తోడనే కొన్ని మనస్సులు స్వభావవిరుద్ధముగ నుండును. అనేక కారణములచేతఁ దరువాతఁ గొన్ని స్వభావ విరుద్ధములుగ నగును. వీనిలో భేదము లనేకము లున్నవి. వీనిచింత యిప్పుడు మన కక్కఅలేదు.

మతిలేనివానితోఁ గూడనున్న మనుజసంఘము మహారాజునకు లేదు. ఆతఁడొక్క యాస్థానమునకే యధికారి. ఈతఁడు సర్వప్రపంచమునకుఁ బ్రభువు. ఆతనికిఁ గొలఁదియైన రాఁబడి యే కాని, యీతనిధనమునకు హద్దు లేదు. ఆతని కనేక కారణములవలన విచారము. ఈతని కెప్పుడో కాని విచారము కలిగినను జిత్తజల్లుగ వచ్చి వెంటనే పోవును. ఉత్తరక్షణము ననే భావప్రపంచమునఁ దిరుగాడుచు నాడుచుఁ బాడుచు నెగురుచుఁ బరుగెత్తుచు నాతఁ డుండును.

నే నొకసారి రాజమహేంద్రవరమున కొంపెల్ల రామభట్లు గారిని జూచితిని. ఆయన యోగి యని చెప్పిరి. నా కాసంగతి తెలియదు. కాని యున్నత్తుఁడు. ఆతఁడాజాను బాహుఁడు. స్థూలకాయుఁడు. రోమశుఁడు. కౌపీనమాత్రధారి. నిత్యమందహాస వికసితవదనుఁడు. ఆతనిమందహాసముననున్న సౌందర్యమును నే నెక్కడను జూచియుండ లేదు. అది యేమో కాని యప్రాపంచిక తేజస్సుతోఁ బ్రకాశించె నని నా నమ్మకము. చిరునవ్వు నవ్వునప్పుడు ధ్వనియన్నమాట లేదు. పెదవులు కదలకుండ బిగించుకొనియుండెడివాఁడు కాఁడు. పై పెదవియు నడుగు పెదవియు నరయంగుళము వెడల్పుగ వేరుచేసి వింతగ, విలక్షణముగ, నప్రయత్నముగ, నాశ్చర్యకరముగ పువ్వు వికసించునట్లు మొగమంతయు వికసింపఁ జేసెడివాఁడు. ఇట్లు మొగమునుండి బయలుదేరిన యలౌకికకాంతి గుండ్రముగ మొగముచుట్టు వ్యాపించి చంద్రునిచుట్టు పరివేష్టమువలె నుండెనని చెప్పిన నతిశయోక్తికాదు. చిన్నచిన్న గులకరాలు, బొమ్మరాలు గ్రహించుచు విసర్జించుచుఁ దనలోఁదా నేదో మాటలా డుకొనుచు నా నందమయుఁడై యుండెడివాఁడు. ఏచక్రవర్తి కీయానందము సుఖము నున్నవి! సుఖమొందుటకు మతి పోఁగొట్టుకొనుటకంటె మార్గాంతరము గోచరించుటలే దని నాలో నేమో తెలివితక్కువగ భావించుకొనుచుఁ బిచ్చివానియొద్ద కేగితిని.

పిచ్చివాఁడు నన్ను జూచుటతోడనే నమస్తే యని కేకవైచెను. నీవు వచ్చెదవని యనుకొనుచునే యున్నాను. ద్రౌపదీవస్త్రాపహరణము ప్రక్కనందులో రాత్రి యాడినారు. డాక్టరుగారు నన్నుగూడ నాటకములోనికిఁ దీసికొని వెళ్లినారు. ధృతరాష్ట్రసభ జరుగుచు న్నది. పాండవులోడిపోయి ఖిన్నులై కూరుచుండినారు. దుర్యోధనుఁడు మీసాలు వడివేసి నకిలించుచున్నాఁడు. దుశ్శాసనుఁడు ద్రౌపదిచీర లాలుచుచున్నాఁడు. ఎంతమట్టునకు లాగవలయునో దుశ్శాసనునికిఁ దెలియదు. ఎంతమట్టుకు లాగించుకొనవలయునో ద్రౌపదికిఁ దెలియదు. ఇద్దరుకూడ చెడద్రాగి యున్నారు. వద్దు వద్దని తెరచాటునుండి కేకలు వినఁడుచునే యున్నవి. తుట్టతుదకు రైకతో నెత్తిపై నవరపుబుట్టతో నడుమునకు గావంచతో సృష్టికంతకు నొక్కటే దిష్టిపిడతగ ద్రౌపది మిగిలినది. దుర్యోధనాదుల తోడు లేకుండనే జాత్యంధుడైన ధృతరాష్ట్రుఁడుగూడ రెప్పపాటులోఁ దెఱచాటునకుఁ బరుగెత్తినాఁడు. తెర వేయఁబోవఁగ బడలేదు. అప్పుడు ద్రౌపది లోనికిఁబోయినయెడల నధికారి కొట్టునని భయముచేత గాఁబోలు బెద్దమనుష్యులు గూరుచుండిన గోతిలో నురికి బ్రచ్ఛన్నత కొఱకో, పురుషులు కొట్టుదురను భయముచేతనో, స్త్రీలకుఁ బ్రత్యేకించిన స్థలములో దాగినాఁడు. స్త్రీలు పాక కాలిపోయినంతకేకలు వేసి యటునిటు పారిపోవ యత్నించిరి. కొందఱు పురుషులు స్త్రీలస్థలములోనికి వచ్చి ద్రౌపదిని జావఁగొట్టి గెంటివైచిరి.'' ఇట్లు పలికి యాతఁడు. లోనికిఁ బోవుటకు సిద్ధపడినాఁడు. అది చూచి నే నాతని కడ్డుదగిలి ''అయ్యా

యుపన్యాసమీయరా'' యని తొందరపెట్టితి. ''నీకుఁ బిచ్చి యానుపత్రివదలి వెళ్లుటకుఁ బైవారి యనుమతి వచ్చినదా యని యడుగ'' నింకఁ గొన్నాళ్లిక్కడనే యుండుమన్నారు. పైవాఁడెవఁడు? క్రిందివాఁడెవఁడు? అందఱును దొంగముండకొడుకులే. ప్రపంచమునకంతకు మతిలేదని నేను గనిపెట్టి వెల్లడించుటయేమి? నాకు మతిలేదని వీరు నన్నిక్కడ బంధించుట యేమి? శ్రీకృష్ణభగవానుఁ డేమనినాఁడు.

యా నిశాసర్వభూతానాం తస్యాం జాగర్తి సంయామీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః

నేను వెల్గులోనున్నాను. ప్రపంచమంతయుఁ జీకటిలో నున్నది. నావెలుఁగు వారికిఁ జీకటి. వారివెలుగు నాకుఁ జీకటి. కాని నాకు బాధ, వారికి సుఖము.

గీ. వీరవరుకంఠ మునం దరవారికోఁత
భీరుగళమున విజయమందారమాల
శేముషీమంతు పెట్టెలోఁ జెదలుపుట్ట
వాలుతలవానిమొలను బత్రాలకట్ట.

విద్యావంతుల కెప్పుడు విద్యావిహీనులచేత, జ్ఞానవంతుల కెప్పుడజ్ఞులచేత, సర్జ్ఞుల కెప్పు డసర్జ్ఞులచేత బాధతప్పదు. ప్రపంచ చరిత్రములో మొదటిపంక్తిలోనున్న యీపాఠమే యిప్పటికి తుదిపంక్తిలో నున్నది. Socrates కేమయినది. విద్యాదూరులనోటికి విందు, పాత్ర విజ్ఞుల నోటికి విషపాత్ర, పాపాత్ముల కడుగడుగునకు మెత్తనిమడుఁగు. పవిత్రాత్మునకు సంధిసంధికి కొరతమేకు. గజం మిథ్య పలాయనం మిథ్య యని పారిపోయినను నేనుఁగు కాలిక్రిందఁ ద్రొక్కింపక మానుదురా?

అయ్యొ అయ్యొ నీవు చెప్పుచున్నది నాకేమియు బాగుగా లేదు. మనస్సునకేమియుఁ దోపకపోవుటచేత వినోదమునకై నీయొద్దకు వచ్చితిని. ఏదైనసరే యుపన్యాసమొకటి యిమ్మని యాతనిఁ దొందరపెట్టితిని. నా ధోరణికి నీవడ్డు రాకుండ నుందువా? అది ముందు చెప్పుమని యాతడు నన్నడిగెను. సాధ్యమయినంతవఱ కడ్డు యని నే నంటిని.

సరే విను. హరిఃఓమ్ ప్రపంచమం దున్నది యేకత్వమే గాని ద్వివిధత్వము కాదు. ఏదియున్నను నొక్కటియే యున్నదికాని యిన్ని లేవు. రెండునునది మనము తరువాత కల్పించుకొన్నదికాని స్వయముగా లేదు. నాషడ్డకుడు నాయంతవాడు సుమా Economical depression (ధనలోపము) దేశమునకుఁ గలిగిన తరువాతనే సానివీథిలో Commission agency (పొసగుడు వ్యాపారము) పెట్టి సానిదాని యింటిలోనే నే రాత్రియైన సరసుడు లేఁడన్న యప్రతిష్ఠమాట లేకుండఁ జేసినాఁడు. సానివాండ్రను దేల్చినాడు. తాను దేలినాఁడు. వహావ్వా అట్లుభయతారకముగ.

తప్పుదారినిఁ బోవుచున్నావని నే నతని మందలింపగ నేను జెప్పను పోపో యని యాతఁడు కేకవైచెను. ఈమాత్రము కూడ నుండదేమోయని భయపడి సరే నీయిష్టమువచ్చినట్ల కానిమ్మని బతిమాలితిని. నన్నడ్డకుము, జాగ్రత్తగనే మాటలాడుదును. ఏదోయొక ప్రణాళిక చేసి కొంటిని. ఆదారిని నన్నుఁ బోనిమ్ము సరే యెంతవఱకుఁ జెప్పితిని అని

యాతఁడు నన్నడిగెను. సానివీథిని నరసుడు లేడన్న మాట లేకుండజేసి సరే సరే ఇఁక జెప్పనక్కఱలేదు. ఈ నడుమను దురకపేటలో మంగలి వానిమేడలో జరిగిన యఖిలాంధ్రక ళావతి పరిషత్తులో మాషడ్డకుఁ డధ్యక్షుఁడై యేమని యుపన్యసించె ననఁగా:—

ప్రపంచమున నున్న దొక్కటే రసము. అది శృంగారరసము. భవభూతి యది కరుణరస మనుగాక! ధూ!

''భవభూతి సాహితీప్రజ్ఞాప్రభాయుక్తుండామాటమాయొద్దననఁగరాదు''

అందుచేత స్వయంప్రకాశులైన మన పరిషత్తులో సారస్వతపండితునకుఁ దావులేదు. ఆతని నావలి కీడ్చివేయవలసినదే. మన సిద్ధాంత ప్రకారమున్న దొక్క శృంగారరసమే. ఆరసమే పరిస్థితి విభేదములఁ బట్టి వీరరసమగుచున్నది. అన్నియు యథావిధిగా జరుగుచు న్నంతసేపు శృంగార రసము నిష్ప్రమాదముగఁ బ్రవహించుచుండును. మన ముంచుకొన్న సానివారి చక్కని చుక్కయొద్ద నెవఁడైన పైనరసుఁడు మనకంటఁబడినాఁ డనఁగ శృంగారరస మునకుఁ దొట్రుపాటు. పరిణామావస్థ కలిగినదా లేదా? మనము గొడుగుకామతోను వాడు పై జారుతోను దారసిల్లినప్పు డరగంట క్రిందటి శృంగారరసమే వీరరసమైనదా లేదా? అంతేకాని ఇంతలో స్వర్గమునుండి వీరరసము దిగినదా? తప్పు. మనము వాడు కొంతసేపు గుంజులాడిన పిదప వాడు మన క్రిందఁ బడఁద్రొక్కఁగ మన మలో యని యేడ్చితిమా లేదా? నిముసముక్రిందట వీరరసముగా మారిన శృంగార రసమే యిప్పుడు కరుణరసముగా మారినదా లేదా? మఱికొంతసేపైన తరువాత సానివారి మణిపూస మనయొద్దకు దీంద్రించు చువచ్చి నాయింటి కెవ్వడైన పెద్దమనుష్యుడు బందుమర్యాదచే వచ్చినప్పుడు నీవింతయల్లరి చేయుదువా? పో యని మనపైఁ గోపపడఁగ దాని దయకొఱకు ''అకించనో నన్యగతిశ్శరణ్య స్త్వత్పాదమూలం శరణం ప్రపద్యే'' యని బట్టమెడఁజుట్టుకొని మనము దానికాళులపై బడినప్పుడు వెనుకటి శృంగార రసమే యిప్పుడు దివ్యమైన భక్తిరసముగా మారలేదా? అందుచేనున్న దొక్క శృంగారరసమే శాస్త్రీజీ! ఈ గొడవ యంతయు నే నెందులకుఁ జెప్పితినో జ్ఞప్తియున్నదా? నే నెట్లుపన్యాస మారంభించితినో చెప్పఁ గలవా?'' యని యాతడు న న్నడిగినాఁడు.

ప్రపంచములో నేకత్వమే కాని ద్వివిధత్వము లేదని యుపపాదించి నావు. దానిని స్థిరపఱచుకొనుటకు మీషడ్డకుని శృంగారరసైక్య ప్రవచనమును చేసినావు. అని నే నతనికి జ్ఞప్తిచేసితిని.

సరి సరి. ఇఁక దారిలోఁ బడినాను. తొందరలేదు. మాషడ్డకుని శృంగారరసవిషయకో పన్యాసమున కలరి యాతనిని మా బంధువులలో బ్రహ్మ రథము పట్టినారు. నేను నట్టి యైక్యమునే మఱియొక సన్నివేశమున స్థాపింప దలచినాను.

నీకు నీతండ్రికి వస్తుతత్త్వమున నేమైన భేదమున్నదా? లేదు. లేనప్పుడు నీతండ్రికి నీవు మ్రొక్కవలసినదని జనులేల యనుచున్నారు? నీకుఁ గారకుఁడగుటచేతనే కాదా? అట్టిచో నీవంటి మనుష్యులను నితర జీవములను, ననంతగోళములను సృష్టించిన భగవంతు నెడల నీవు చేతులు జోడించి మ్రొక్కి భక్తిగనుపఱుపవలసినదేనా? అట్లుచేయుచున్నావా? సోదర సోదరీమణులఁ ద్యజించుచున్నామే. గురువులను ధిక్కరించు చున్నామే. తల్లిదండ్రు

లను తిట్టుచున్నామే. ఇన్ని దుర్గుణములు మనకుండ దైవభక్తి కలుగునా? ఏమియును లేదు. ఇక మనబ్రతుకు లెందులకు? కడుపునిండించుకొనుటకు, కైపుకలుగునట్లు త్రాగుటకు, కఱవునకుఁ జచ్చి నంతమంది నిర్భాగ్యులను గనుటకు, అంతేనా?

మన పూర్వులే కాదా సృష్టి చిత్ర్యమునకు వింతపడి సృష్టిక్రమమును బరిశీలించి సృష్టినంతయు నిండిన యద్వితీయశక్తికి భక్తివినమ్రులై వేదబుక్కులతో దేవతాగాన మొనర్చి నారు. అందుచే మొదటసృష్టవ లోకనమునఁ గలిగిన రసమేది? భక్తి. ప్రపంచమున మొట్టమొదట వేదములతో బాటేకాదు. వేదములకంటెఁ గొంతముందుగాఁ బుట్టినకళ యేది? గానము. ఈ కళయే లలితకళ లన్నిటిలో నుత్తమమైనది. కవిత్వమే? ప్రపంచమున మొట్టమొదటఁ బుట్టినకళ యని పాశ్చాత్యులేకాదు. పౌర్వాత్యులే కాదు. ప్రపంచజనుల యందఱ యభిప్రాయముయి యున్నది. అది కేవలము తప్పు. సర్వప్రపంచముగూడ నాపైఁ దిరుగఁబడి నను దోకచుక్క చేత బుచ్చుకొని తోపతోప క్రిందఁగొట్టనియెడల —మూతిమీసముకదపా పచ్చిరొయ్యలు గోంగూరలో వేసినప్పటి మజా—

ఉండు. ఉండు నిదానించుకో తోకచుక్కమాట, గోంగూరమాట యిప్పుడెందు లకు? శాంతింపు మని యాతనిని శాంతిపఱచితిమి. ఈతని పిచ్చిలో వెనుకటికి నిప్పటి కెంత వ్యత్యాసమున్నదో నా కాశ్చర్యముగ నున్నది. నిముసనిముసమునకుఁ బెడమార్గము పట్టి తిరుగఁ ద్వరలో దారికి రాలేనివాఁ డింతమట్టునకు తాజుపడుట గొప్ప సంగతి కాదా? అని లోన ననుకొంటిని.

ఒక్కనిముసమైన పిమ్మట నెంతవఱకు జెప్పితి నని యాతడు నన్నడిగెను. మొదటి రసము భక్తియని, మొదటికళ గానమని చెప్పితివి. తరువాతఁ జెప్పుమని వేడితిని.

సరే. సరే. ఆశ్చర్యకరమైన సన్నివేశము మనము తిలకించునప్పుడు దానిపై మనకు భక్తి గలిగినప్పుడునిప్రయత్నముగ నబుద్ధిపూర్వకముగ ''ఓ'' యని ధ్వనికలుగునట్లు మనము నోరు తెఱతుము. వేదములకు ముందు ఓంకార ముద్భూతమైనదని మనపూర్వులు జెప్పిన దదియే కాని వారి ఓం, లో నక్షరములున్నవి. నా, ఓమ్, ఇట్టినాదమే కాని యక్షర సహిత మెంతమాత్రము కాదు. నాదమును విని సంతసింపక యందులో నక్షరములున్నవని దానిన ముక్కలక్రిందఁ గొట్టనేల? ఉదయపర్వతముపైఁ గెంపులసింహాసనముపైఁ గెందామ రల కిరీటముతోఁ దలచూపుచున్న భానుబింబమును గాంచి మహానందభరితమై భక్తిపారవశ్య సహితమై భరతపక్షి గానముచేయుచున్నది గాదా! ఆగానములో నేయక్ష రములున్నవో పరిశీలనయేల? ఏయక్షరములు లేవు. స్వరంసంఘాతము తప్ప యది మఱేదియునుగాదు. షడ్జమస్వరము ముందుబుట్టిన తరువాత దానికి 'స' అనుగుర్తు వచ్చినదా? కాక అది పుట్టినప్పుడే 'స' యను గుర్తు దానియందున్నదా? పిల్లవానికి వట్టిధ్వని ముందువచ్చినదా? కాక మాట ముందువచ్చినదా? భక్తిపూర్ణమైన దేవతాగానమం దక్షరము లక్కరలేదు. నీలాల నిగనిగలీనుచున్న నీరదమును గాంచి మహానందముగఁ గప్పకూసినకూఁతకు, వరుణదేవతా కములగు బుక్కులకు, నంతఃకరణపరిశుద్ధియందు భేద మున్నదని యెవ్వడైనా జెప్పగ లడా? కప్పకూఁతలో నక్షరములు లేవు. వేద బుక్కనం దక్షరము లున్నవి. బుక్కుల కంటె కూఁతయే ముందుబుట్టినదని నేననుచున్నాను. పండ్లుండఁ దలంచుకొనినయెడల నీవు కాదనగలవా? అదికాక యక్షరసాహాయ్యము లేని గానము ప్రపంచమున నెంతలేదు?

సంవత్సరమునకు నాల్గుమాసములు పాడిన కోయిలపాట నిరక్షరము కాదా? అదిగాక రాగాలాపన నిరక్షరము కాదా? రాగమువలన కలిగినయానందమున కీర్తనవలనఁ గలుగునా? గాయకులలోఁ బదుగుఱ నేయొక్కఁడో గాత్రజ్ఞుఁడున్నాఁడు. కాని మిగిలినవారందఱు యంత్రజ్ఞులే కాదా? గానకళ యత్యంతస్వతంత్రమైన కళ. దానికి మనవా రక్షరములు సాయమిచ్చి సార్థముగ, విశాలముగ జేసినారు. మొదటఁబుట్టిన సారస్వతమంతయు గానమే. అప్పటివఱకింకఁ యూరుపేరు లేదు. మృదువులైన యక్షరములు, నభిప్రాయములు. గానధ్వనులలోఁ జేరుచున్నవి కాని వానికిఁ గవిత్వమని పేరులేదు. ఏదైన రవంతపేరున్నను నది గానమునకు సహాయకళగా నున్నదిగాని స్వతంత్రకళగా లేనేలేదు.

గానమున్నంతసేపు, భక్తియున్నంతసేపు కవితాకళకుస్వాతంత్ర్యమేర్పడదని వారి తరువాతవార లెంచి గానమనుండి దానిని తప్పించి, భక్తిని దీసిపారవైచి పరమాత్మభక్తికి వ్యతిరేకమైన ప్రాపంచకభభక్ష్యాదులను రసములుగా నేర్పఱచుకొని యైహికవిషయములందు మాత్రమే కవిత్వమును జెప్పి దానికి గళాస్వాతంత్ర్యమిచ్చుట కెన్నిపాటులైనఁ బడినారు. అంతటినుండి వేదగానము వదలి దానికి కవిత్వముబయలుదేరినది. రామాయణమును వ్రాసి వాల్మీకి దానిని రామునియెదుటఁ బాడించెనఁట. వాల్మీకి యెంతగడుసువాఁడో గానకళ మొదటికళ యని, కవిత్వము దానికి సహాయకళయని యంగీకరించుటకు వాల్మీకి యెంత మాత్రము నిష్టపడక గానమకంటె గవిత్వమే ముందని వెల్లడిజేయుట కిట్లు కవిత్వము చెప్పి పాడించినానని చెప్పినాఁడు. తెలిసినదా? కవిత్వము చెప్పి గానముచేయించుట కల్ల. పాడి పాడించెననుట పరమార్థము.

తరువాత నన్నిరసములందు నన్ని రసహీనవిషయములందుఁగూడఁ గవిత్వము విచ్చలవిడిగ బయలుదేరినది. కవిత్వముననే నిఘంటువులు, వైద్యశాస్త్రము, జ్యోతిషశాస్త్రము, పాకశాస్త్రము, సాముద్రికశాస్త్రము, నశ్వాది నమస్తశాస్త్రములుఁగూడఁ జెలరేగి బయలుదేరినవి. చిట్టచివరకు చరిత్రలు కథలు కూడ కవిత్వముననే బయలుదేరినవి. పంచాంగం మాత్రము పద్యములతో బయలుదేరలేదు. ఇట్టి దుస్థితిని బరిశీలించి భవబంధమోక్షణసాధనమగు గానమునకుఁ దిరుగఁ బ్రాధాన్య మిచ్చి పూర్వపవిత్రస్థితిని నిలువఁబెట్టఁ దలఁచి త్యాగరాజు, క్షేత్రయ్య, భక్తిరసమున భవతారకగాన మొనర్చిరి. అందువలన దుస్థితి రవంత యడ్డినదేగాని యాగలేదు. గానమునకుఁ బతనము భ్రష్టమార్గమునఁ గవిత్వమునకు బుష్టి వృద్ధియగుచునే యుండెను. ''చేతులెత్తి మ్రొక్కుచుంటిరా నాతండ్రి'' యను భక్తికీర్తనకుఁ బాఠాంతరముగ ''చెఱఁగు మాసియున్నదా నరా నాసామి'' యని యవకతవక శృంగారరసకీర్తన బయలుదేరిన గానమునకు మొదట సహాయకళగానున్న కవిత్వ మిట్లను చితమార్గముల నస్వభావముగ విజృంభించి యిప్పుడు గానముల కంటె బలవత్తరముగ గానబడుచున్నది. కాని ఈబలము కృత్రిమము. గానకళయే ప్రథమమయినది. దానికి రవంతతోడుగనే కవిత్వముండఁదగినది. గానము వట్టిధ్వని కదా? అక్షరసాహాయ్యము లేనిదే అది యెట్లు శాశ్వతముగా నిల్చునవి నన్నధిక్షేపింతురా? ఛూ! కళయగునా కాదా యనునదే పరిశీలనాంశము. కాని స్థిరమా యస్థిరమా యనునది కాదే. సృష్టిలో స్థిరమైన దొకటియు న్నదా? ఒకగానమునకే ప్రత్యేకకళాత్వము కాని కవిత్వమునకు గాదు, కవిత్వమే కళకానప్పుడింకఁ జిత్రలేఖనమా? అది మఱింత కృత్రిమమైనది. కళ గానకళ యొక్కటియే. ప్రత్యేకముగాఁ బరమాత్మతో నంబంధించిన కళ.

ఇప్పుడన్నియుఁ గళలే. పంట యొకకళ. కల్లుగీత యొకకళ. దొంగ తన మొకకళ. క్షౌర మొకకళ. తుదకు "Murder is a fine art" (జీవహత్య యొక్క లలితకళ) వఱకు వచ్చినది.

కవీ! నీకొక్క శబ్దమయిన నీయను. కవిత్వముఁ జెప్పగలవా? ఏమనుచున్నావు? గట్టిగఁ జెప్పుము? నావలనఁ గాదనుచున్నావా? అటులైన దూరముగఁ గూరుచుండుము. గాయకుడా! నీ కొక్క యక్షరమున నీయను. పాడఁగలవా? ఏమనుచున్నావు? అద్దేఅద్దే. అవలీలగఁ బాడఁగల ననుచున్నావా? సరే పాడుదువుగాని ఒక్క నిముసముండుము అదేమి? అదేమి?

సీ. మెఱుఁగుఁగుండలముల మిసమిసల్ గండభా
గములపై నట్టిట్టు గంతులిడగ
రంగారఁగట్టిన బంగారుపుట్టంబు
చిఱుబొజ్జనుండి కొంచెముగ జారఁ
బవనపూరణమున జవుజవ్వమని లేత
చెక్కులు బూరెలై పూరటిల్లఁ
నిగనిగల్ గలగుజ్జు సిగనున్న శిఖిపింఛ
మొయ్యారమునఁ దలయూఁపుచుండ

నుత్తమోత్తమజన్మమై యొప్పుమురళి
నధరమునఁబూనిజల్లల్లు మనఁగజగతి
గానమును జేయు నీలాల కాంతిరాశి
గొల్లభామలబంగారు కొంగుమూట!

ఆహాహా! ఏమిగానము తీఁగలు పుష్పించుచున్నవి. రాలు ద్రవించుచున్నవి. ముక్కులు తెఱచుకొని పక్షులు విని పరవశము లగుచున్నవి. పశువులు మోరలెత్తి గానామృత మును ద్రావి సోలుచున్నవి. కదలిన యెడల నేమగునోయని గాలి స్తంభించియున్నది. లక్షలకొలది యింద్రధనుస్సులనుండి సుధావర్షము దేవతల పుష్పవృష్టితో గురియుచున్నది. నాయనా! నందకుమారా! నవనీతచోరా! యని కేకలు పెట్టి పెద్దపెట్టున నేడ్చుచు నా పిచ్చివాఁడు క్రిందపడినాఁడు.......

ఓహో! నాయనలారా! పిచ్చివాడు మనల నెట్టి పవిత్రసన్నివేశమున విడిచి తాను విస్మితుడైనాడు. ఆహాహా! ఏమియేడుపేడ్చినాఁడు? ఇట్టియవసరమున నేడ్వలేనివాఁ డీశ్వర ద్రోహి. శారదాగానము కంటెఁ దుంబురునారదాది వైణికులగానము కంటె బిచ్చివానియేడ్పు నాతండ్రీ! నీ కెక్కువగాఁ బ్రీతికరముగా నుండును గదా! వెఱ్ఱిబాగులవాని భక్తిరోదన మొక్కటి, తల్లిచావుపిల్ల క్షుద్రోదన మొక్కటి, పదునాల్గు భువనములను బునాదులతో గూడ నల్లలాడింప సమర్థములైనవి. కృష్ణా! ఆపదుద్ధారకా! రక్షింపుము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# 26. పిచ్చివాని మరణశాసనము

ఈమధ్య పిచ్చివాడికి జబ్బు చేసిందని తెలిసి జంఘాలశాస్త్రి, చూడడానికి ఆస్పత్రికి వెళ్లాడు. పిచ్చివాడు, జంఘాలుణ్ణి చూడగానే సంతోషించి తాను మరణ శాసనం వ్రాశాననీ, అతన్ని సాక్షి సంతకం చెయ్యమనీ, నీ రాక కోసమే ఎదురు చూస్తున్నాననీ చెప్పి, లోపలకి వెళ్ళి కొన్ని కాగితాల దొత్తి తెచ్చి చూపించాడు. అతను వ్రాసిందేమిటో చదవ కుండా తాను సాక్షి సంతకం పెడతాననీ ఎలా అనుకున్నావనీ, చదవమనీ, జంఘాలుడు, పిచ్చివాణ్ణి కోరాడు. దానిమీద, పిచ్చివాడు విసుక్కొని జమీం దార్లంతా సంతకాలు పెట్టవలసిన కాగితాలన్నీ చదివే పెడుతున్నారా? అని గద్దించి నేను చదివేది ఇందులోదే చదువుతున్నానని నమ్మరేమిటని అడి గాడు. ఎప్పుడో ఒకప్పుడు నమ్మక తప్పదు గనుక, చదవకముందే నమ్మమనీ అడిగాడు. తనకి శనిదశ వచ్చింది కనుక మరణ శాసనం రాశానని చెప్పాడు. 'హరిః ఓమ్' అని కాకుండా 'ఖర్మఃఓమ్' అని మరణ శాసనం చదవడానికి ఉపక్రమించి గాడిదకి, కవికీ, విష్ణువుకి వున్న సంబంధం పురస్కరించుకుని తను 'ఖర్మః ఓమ్' అని చదువుతానన్నాడు. తనింక పదిహేనేళ్లు మించి బతకడని తెలిసీ, మరణ శాసనం రాశానన్నాడు. గురువు, శిష్యుడు, అశాశ్వతం అని తెలిసినా, జ్ఞానం శాశ్వతం గనక ఇలా 'శాసనం' రాశానని చెప్పాడు. ఈ శాసనంలో మూడు అంశాలు మూలాధారాలుగా వున్నాయి. ఒకటి ఎవరైనా నిన్ను పిచ్చివాడంటే, అన్నవాడికే పిచ్చి అని నమ్ము. రెండు సాధ్యమైనంతగా నీ భటులతో పోరాడు. నువ్వు మహారాజా వనినమ్ము. మూడు! అలౌకికానందం నీ జన్మధనం – ఇవి మూడు సూత్రాలు – ఇవి చెప్పి పోతన్నగారి పద్యం స్మరించుకుంటూండగా – డాక్టరొస్తున్నట్టు తెలియడం వల్లా, శాస్త్రి అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు.

**జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:–**

ఈనడుమఁ బిచ్చివానికి జబ్బుచేసిన దని తెలియుటవలన నాతనిఁ జూడఁబోయితిని. నన్నుఁ జూచుటతోడనే చేటయంత మొగము చేసికొని వచ్చితివఁటయ్యా యని యాతఁడు కేకనైచి "వచ్చినప్పుడు రాకుండినవాడువలెగాక రానప్పుడు వచ్చియుండినవాడు వచ్చు టయే సిద్ధించినయెడల నా వచ్చుటను వచ్చుటతో గుణించినంత వచ్చుట వచ్చునో కాదా

అదియే Factorial Zero కాదా'' యని యాతఁ డనెను. ''ఇప్పుడు నే నెందుల'' కని యాతని నడుగ నే నీనడుమను మరణశాసనమును వ్రాసితినిలే. దానిలో నీవు సాక్షివ్రాలుచే యుదు వని నీరాక కొఱకు నిరీక్షించుచున్నారని చెప్పి తుఱ్ఱునఁ లోపలికిఁబోయి నాల్గు కాగితములబొత్తి నొకదానిని దెచ్చెను. అదియటునిటు రెండుసారులు తిరుగవైచి దీని కొనను సంతకమును జేయుమని నన్ను గోరెను. విననిదే సంతక మెట్లు చేయుదును? చదువుమని హెచ్చరించితిని. సంతకముచేయుటకుఁ జదువెందులకోయి ఫూల్. ఒక్క రిద్దఱు తక్కఁజ మీందార్లు పాలక ప్రధానుడు చదివియే సంతకము చేయుచున్నాఁడా? దినమునకుఁ బదివేలో పదునాల్గువేలో సంతకము చేయవలసిన రష్యాచక్రవర్తిమాట యేమి? నమ్మకముమీంద ప్రపంచము దొరలిపోవుచున్నది. సరే నీయిష్టానుసారము చదివెద ననుకో. నే నిందులోనిదే చదువుచున్నానని నీవు నమ్మవలసినదే కాదా? ఎప్పుడో యొకప్పుడు నీవు నన్ను నమ్మక తప్పనే తప్పదు. అట్టియెడల చదువకముందే నమ్మరాదా?

''అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి
నాయం లోకోస్తి న పరో నసుఖం సంశయాత్మనః''

అదిగాక నీకు విధేయుండనై వినిపించి నీ సంతకము గొనుటకు నేను నీసేవకుడ ననుకొంటివా? పో! ఆవలికిఁ బో! నాప్రధానగ్రంథము నీసంతకాని కుపోద్ఘాతముగఁ బఠింతునా. ఈ గ్రంథమును బంగాళాఖాతములోఁ బాఱవైచెదనుగాని, నే నట్టి నీచమైన పనిచేయుదునా?

శ్లో. అనాఘ్రాతం పుష్పం కిసలయమనూనం కరరుహై, రనావిద్ధం రత్నం! ఆహా! చూచితివా అది పట్టు. కాళిదాసుడు మంచి గడుసువాడు. ఏనుఁగమెలికవైచి పట్టినాఁడు. వహ్వా! శిరఃకంపనము రోమహర్షణమైన పట్టు.

గీ. తగిన కాలమందుఁ దగిన స్థలంబునఁ
దగిన రీతిఁ దగిన తరుణితగుల
వేలుకుండలాల విద్వాంసుడైనను
గక్కుఱితిని బడక కదలిపోఁడు.

అంత గట్టివాఁడైన కాళిదాసుగూడ తన అభిజ్ఞానశాకుంతలములోఁ బెసరపప్పువలె జారినాఁడు. ఆతమాట మఱియొకప్పుడు చెప్పెదను. ఉత్తర రామచరిత్రలో సాక్షి కనఁబఱచిన యనౌచిత్యముకంటె నెక్కువ యనౌచిత్యము నటఁ గనఁబఱుతును.

ఎందుకయ్యా! ఈ మతిమాలిన గొడవ. మరణశాసనపుసంగతులు చెప్పుమని నేను తొందరపెట్టితిని. మరణశాసనముకై నాకులేని తొందర నీ కెందులకోయి Dunce! పండితుఁ డెవ్వఁడు బ్రతికియుండుట నీకిష్టము లేదా? ''శ్లో. అతిక్రమ్య గ్రహాన్ సర్వాన్ నిహంతా పాపకృచ్ఛనిః'' అన్నట్లు శనిదశ వచ్చుటచేత మరణశాసనము వ్రాసితిని. కాని యిందుఁ గొంత కలతకొట్టుచున్నది కాని లేకపోలేదు. ''శరీరే ఝర్ఝరీ భూతే వ్యాధిగ్రస్తే కళేబరే'' యనియే కాదా మనపూర్వుల యభిప్రాయము. కావున నిట్లు యశాశ్వతత్వము శరీరమునకుఁ బుట్టినప్పటి నుండియు నున్నదన్న మాటయే గాదా? అందుచేత బొడ్డుకోత, మరణ శాసనపువ్రాంత యొక్కసారి జరుగవలసియుండఁగ వ్యాధివచ్చినవఱకు మనవారేల

యుపేక్షించుచున్నారు? రోగముతోనే కాని చావఁ గూడదా? భార్యకు విపరీతమైన జబ్బు. భర్తయే రేయంబవ ళ్లామె కుపచారము చేయుచుండెను. నిద్రాహారములు లేక మొద్దువంటి భర్త చచ్చినాఁడు. చావునకు సిద్ధమైన యిల్లాలు భర్తసాపిండపుగా రెలతొ సంపూర్ణమైన సాపాటు. కొడుకునకు వెఱ్ఱికుక్క కఱచినది. తండ్రి టూరున జచ్చినాఁడు. ఆత్మావైపుత్రనామాసి యున్నది నిదర్శనమైకదా. నామాల సుద్దపట్టు మూత్రబంధమునకు మిగుల దురాకట్టు. వడహాలసంప్రదాయము పురుషులలోఁ బదఖండనము, స్త్రీలలో శిరోముండనము. మండన మిశ్రుని భార్యతో వాదించుటకు శంకరాచార్యులకుఁ బరకాయప్రవేశము కావలసివచ్చినది. కాని ఏది? మన మక్కడ నుండినయెడలఁ దమాషా కనఁబఱచియుందుము. ఆఁడుదనఁగా మనకు నల్లేరుమీఁద బండిగాదఁటోయి! ఓ గిరగిరగిరగిర గంపసిడి యాడినట్లాడనఁటోయి.

ఏడ్చినట్లే యున్నది. ఈదిక్కుమాలిన గొడవయంతయు నెందులకు? మరణశాసనము 'చదువుదువా' పోవుదునా యని కఠినముగా నడిగితిని.

అటులైన విను ఖరః ఓం ఖరఃఓం

అదేమి అదేమి ఖరఃఓం అనెదవేమి. అని నేను మొత్తుకొంటిని.

ఉండవోయి తొందరపడకు. ''శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే'' యను విష్ణు బోధకమైన యీశ్లోకమును గాడిదెపరముగా నన్వయించిన వారెవ్వరో యెఱుఁగుదువా? మాగురువుగారు. గాడిదా! నీవును గవివిగావుగదా యన్నవాఁడు కవియేనా? అందుచేతఁ గవికి గాడిదకు నవినాభావసంబంధమున్నదని తేలుచున్నది. గాడిదె కానైపున విష్ణువుతో సంబంధమున్నది. ఈవైపునఁ గవితో సంబంధమున్నది. అందుచేత సృష్టికి మూలతత్త్వము గాడిదయే యని నిశ్చయింపక తప్పనట్లగపడుచున్నది. కావున హరిః ఓం అని ప్రారంభించేయకుండఁ బరమార్థజ్ఞానము గల నేను ''ఖరః ఓం'' షని ప్రారంభించితిని? బుద్ధుని కింత ఖ్యాతి యేల కలిగెను? అతని కాలమందున్న వేదాచారములను ఖండించుటచేత. అట్లే చిరకాల ప్రారంభపద్ధతిని ఖండించి క్రొత్త త్రోవ సహేతుకముగాఁ ద్రొక్కినందులకుఁ గూడ నట్లే యందువా లేదా? వితంతువివాహమున కున్న వైభవము, జనాకర్షణము పూర్వాచారవివాహమునకు లేదు. బావనకోమటులు, మాలమాదిగ, చచ్చుట జంగాలు కలసిచేసిన విందులో నున్న తేజస్సు పరిపాటిగ జరుగుచున్న యన్న సంతర్పణలో లేదు. ఎందుచేత పద్ధతికి విరోధమగుటచేత, పద్ధతి నియోగమనఁగా నెఱుఁగుదువా? గోపరాజు రాముఁడు ప్రధానిగారు ''చాలులే అంతటితోఁ గట్టిపెట్టుము. నీ వీనదుమ నింత బుద్ధిహీనముగ మాటలాడలేదు. ఇంత క్రమశూన్యముగ మాటలాడుచుంటి వేల? ఇంతలో నిట్లు చెడుటకుఁ గారణమేమి?'' అని నే నంటిని.

కారణ మెందులకోయి fool! కార్యమునకుఁ గారణ మెంతమాత్రమక్కఱలేదు తెలిసినదా? ప్రపంచసిద్ధికంటె నెక్కువ కార్యము లేదు గదా! దీనికిఁ గారణమున్నదా? లేదు అంతవఱ కక్కఱలేదు. కుండయున్నది. దీనికిఁ గారణమున్నా? లేదు. మట్టియే కారణమందువా? మట్టికి కుండకు భేద మేమున్నది? ''అదియేమి కుమ్మరివాఁడు ప్రధానకారణము కాదా యని'' యడిగితిని. ఓరి fool కుమ్మరివాడు మాత్రము మట్టి కాదఁటోయి! Dust thou art to dust returnest'' అన్నమాట నెమరనకుఁ దెచ్చుకో. అందుచేతఁ గారణము

మట్టియే. కార్యము మట్టియే. కార్యకారణ భేదమింక నెక్కడిది? ఇదే అద్వైతమునకుం బ్రాతిపదిక. ఉన్నదొక్కటి. కార్య మదియే కారణము నదియే. ''కాశీతలవాసినీ గంగా'' అదేప్రశ్నము నదేయుత్తరము కాదా? ఈ సందర్భమున మాకవిత్వము చిత్తగించినావా? ''ఏ యక్షరము మొదలింగ్లీషుభాషకు'' అదే ప్రశ్న అదే యుత్తరము కాదా?

''నాకీ దిక్కుమాలిన సోదె యెందులకు? నేను బోయెదను'' అని వసారాలోనికి వచ్చుసరికి నన్ను బావాబావా యని యెవ్వరో పిలిచినారు. అదరిపడి ప్రక్కనుజూడగ నాగదిలో నొకపిచ్చిది యున్నది, నీవు మాబావతో నేమిమాటలాడుచున్నావని గట్టిగ నన్ను గద్దించెను. అంతలోఁ బిచ్చివాఁడు నెత్తినోరుకొట్టుకొని నన్ను లోనికి రమ్మని సంజ్ఞచేసెను. ఇది యేమో యని పోయితిని. అప్పుడు నన్నాతఁడు ''గట్టిగ మాటలాడకు నన్ను బావా యని పిలిచినదే మృత్యుదేవత. ఇది నన్నును దినము నాహ్వానించుచున్నది. ఇంక దేహము చాలింపక తప్పదని నిశ్చయ పఱుచుకొని యీమరణశాసనము వ్రాసితిని. నేను జదివెదను ఆగుము'' అని యాతఁడు నన్ను బతిమాలెను. సరే చదువుమని నే నంటిని.

ఈశరీర మికఁ బదునైదుసంవత్సరములకంటె నెక్కువకాలము నిల్చునది కాదని నిశ్చయించి నాలోకానుభవమంతయుఁ బ్రజకు బోధింపవలెనని దీనిని వ్రాసినాను. నే నశాశ్వతుఁడను. ప్రజలు కూడ నశాశ్వతులే. గురుం డశాశ్వతుఁడు. శిష్యుఁ డశాశ్వతుఁడైన ప్పుడే ప్రయత్నమెందులకని యధిక్షేపము కలదు. బోధింపదలచిన జ్ఞానము శాశ్వతము కావున నే నట్లు చేయవలసి వచ్చినది.

1. మొదటినూత్రము:– ఎవ్వడైన నీకుఁ బిచ్చి యని యన్న యెడల నట్లు నిన్నన్న వానికేపిచ్చియని నిశ్చయింపుము. నిన్ను వెఱ్ఱివైద్యశాలయందుంచుటకు వారు యత్నింపఁగ బోవుచుంటినని యెంచవలయును. వారెవ్వరైన నిన్ను జూడవచ్చినయెడల వారి తెలివితక్కు వమాటలు, బుద్ధిహీన చేష్టలు చూచి వినోదించి వారుపొందుచున్న దుర్గతి నీకు లేకుండా నిన్ను భగవంతుడు రక్షించినాఁడని యెంచుము. నీకున్న ప్రపంచజ్ఞానము నప్పుడప్పు డుపన్యాసములమూలమున వారికి వెల్లడింపుము. నీవిట్లు జ్ఞానబోధము చేయుచుండినగాని ప్రపంచోద్ధరణము దుర్ఘటము.

2. రెండవనూత్రము:– నీవు మహాసంపన్నుఁడవు. మహారాజువు. నీ కోటలోని సేవకులందఱు నీ కుపచారములు చేయుటకు నియమింపఁబడినవారే. నీ గదినూడ్చుటకు వచ్చిన సేవకుఁడు. నిన్ను మోసపుచ్చి యేదియో పట్టుకొని పోవునని యెంచుము. సౌఖశాయనికుఁడైన, యారోగ్యమును గనుఁగొనుట నుదయముననే వచ్చిన వైద్యసేవ కుడు నీయందలి యనూయచే ని న్నున్మత్తుని జేయుటకు వచ్చిననాఁడని నమ్ముము, వాఁడిచ్చిన మందును దీసికొనకుము. గొంతుకలోఁ బోసినను దానిని దాచి వాడటునిటుచూచునప్పుడు గుడ్డతో మూతు తుడుచుకొన్నట్లు నటించు యాగుడ్డలోఁ జప్పుడు కాకుండ నుమి యుము. నీకాహారము దెచ్చిన భృత్యుడు సమయమును జూచి నీకు విషము పెట్టి నీరము దెచ్చిన భృత్యుఁడు సమయమును జూచి నీకు విషము పెట్టి నీ సంపదను హరించుటకు వచ్చినట్లు నిశ్చయింపుము. సందిగ్ధవస్తువని నీకుఁ దోఁచిన దానిని వానినోటఁ బెట్టుము. లేకున్నయెడల నాహారమును విసర్జింపుము. ఎవ్వడైన నిన్ను నీభవనపుటావరణములో గాలికై భటుఁడు వినయపూర్వకముగఁ ద్రిప్పినయెడలఁ జమత్కారమునఁ గనుమొఱఁగి

పైకిఁ బొమ్ము—నీకొఱ కెంతయాందోళన మందుదురో నీవు లేకుంటచే నీ భవన మెంత గగ్గోలై పోవునో నీవు వినోదముగఁ దెలిసికోవచ్చును. ఒకవేళ సేవకులు నిన్ను గొరడాతీసి కొని కొట్టుట సిద్ధించునెడల ప్రజలు ప్రభువును నిరాకరించి తామే పరిపాలించుకొన ప్రయత్నించుట ప్రస్తుతకాలానుగుణమైన పరిస్థితి యని భావించి సాధ్యమైనంతవఱకు నీభటులతోఁ బోరాడుము. మనుజుని కాటునకు మందులేకపోవుటచే నీవు వారిని కఱచుట కంటె నుపాయం లేదు. ఇక వా రెప్పుడు నీజోలికి రారు. కాంతాప్రశంసలో గరవెంత సుఖదాయకమో కలహప్రయత్నములో నది యంతదుఃఖదాయకము. ఇదిగో రవంతసేపు చదువుమాని పూర్వసంగతి చెప్పుదును.

వలదు వలదని నేను మందలించినను నాతడు మానక యిట్లు చెప్పెను. దంతక్షత నఖక్షతసంప్రదాయము మన శాస్త్రములోనిది. నేనొకనాడు చిన్నతనములో బైసరనవు బసందేదో పరిశీలింతమని పడుచు దాసియింటికి బోయితిని. అచ్చట గుమ్మములో వేంచేసియున్న వేశ్యా మాతను జూచి సాష్టాంగ మాచరించి –

పదము.

చేతిలోనిగట్టు యూతోయి నా దేవి
నడుముచుట్టు గోనెపాత
మాతలందఱలోను మాతోయినారాణి
అడ్డునడకను గారుపీత.

అని ధ్యానించినది. ఆమె ప్రసన్నురాలై సరసానికి వచ్చితివా తండ్రీ! ఏదీ చేతిలో నొకకాను పడవేయవోయి యని సెలవిచ్చినది. అది నాయొద్ద లేదంటిని. పోనీలే. అందఱు నీయఁగలుగువారే యుందురా'' అని ''ప్రక్క చీకటికొట్టులో మంచముమీద నామనుమరాలు పండుకొన్నది. అది సరిక్రొత్త కుఱ్ఱది. మొన్నను సూర్యగ్రహణము నందు మంచి బింకమైనపట్టులో నది వెళ్లఁబడినది. అది భయమున నటునిటు పాఱిపోకుండ గట్టిగఁ గౌఁగలించుకొని సుఖపడు బాబా'' యని నన్ను ప్రేమమున హెచ్చరించెను. అంత గదిలోనికిఁ బోయి గట్టిగా గౌగలించుకొంటిని. బొయ్యిమని యఱచి నులకమంచముమీఁది కుక్క నాగొంతుక పట్టుకొనెను. ఏడ్చుచు గిజగిజ కొట్టుకొనుచుండగా చీచీయని యఱ చుచు, వేశ్యమాత లోనికి వచ్చి కుక్కను గొట్టదలచి కాబోలు నావీపుపై గఱ్ఱపుచ్చుకొని కొట్టెను, పెద్దగోలయయ్యెను. చుట్టుపట్టులవారు లేచివచ్చి కుక్కను విడపించి నేను దొంగనని నన్ను బట్టుకొని కొట్టిరి. వేశ్యమాతపాతచీరగుడ్డ ఆరణాలు విలువగలదానిని హరించుటకు వచ్చినానని నాపై నేరము మోపిరి. మైత్రిలోను కరువుమంచిదే, వైరములోను కరువుమంచిదే యని చెప్పితినే అది యిది, ఎట్లయిననేమి, అప్పటినుండి యాడు దనఁగా గడగడ. భూశయనము.

సరే గొప్ప ప్రయోజకుడవే. కాని యిక సోదె కట్టిపెట్టి మరణ శాసనమును జదువుమని నే నంటిని. ఇదివఱ కెన్నిసూత్రములు చెప్పితినని యాతఁ డడుగఁగా రెండు చెప్పితిని.

3. సరేమూడవ సూత్రము—నీతత్త్వమేదో యెఱుఁగక నిన్నులోకులు గేలిసేయు దురు. నీతత్త్వ మేదో నీకుగూడ బాగుగాఁ దెలియదు. కావున నేను జెప్పెదను.

నీవులోకులవలెఁ బామరుఁడవు కావు. గుడుగుడుగుంచము లాడుచు లొడితెడగు బాహ్యప్ర కృతిలో మిడుకువాఁడవు కావు. నీవు జగత్పూజ్యుఁడవు లోకాతీతుఁడవు. ఐహికపుదేవులాట నీకేమియులేదు. ఏదిపోయినను నీ యానందము నీ జన్మ ధనమైయున్నది. పంచభూతములు స్వస్వరూపములతో నీకుఁ బ్రత్యక్షములగుదురు గదా! ముక్కోటిదేవతలు కింకరులవలె నీ చుట్టుచుట్టుతిరుగుచుందురు గదా! అప్సరస్స్త్రీల యాటపాటలతో మైమఱచి యుందు వుగదా!

కాలేన పంచత్వమితేషు కృత్స్నశో
లోకేషు పాలేషు చ సర్వజంతుషు
తమస్తదాసీద్గహనం గభీరం
అన్తస్యపారేభి విరాజతే విభుః''
అని వ్యాసుఁ డన్నట్లు,

క. లోకంబులు లోకేశులు
లోకస్థులు దెగినపిదప నలోకంబగు పెం
జీఁకటికవ్వల నతతము
నేకాకృతి వెల్గునతని నే సేవింతున్.

అని పోతరాజుగారు జెప్పినట్లు ''ఏకాకృతి వెల్గునతని'' నీవెప్పుడు సేవింతువు. నీ కింక మోక్షమున కడ్డేమి? కవికందని, భక్తునికందని, జ్ఞానికందని యాపదవిని నీవు సులభముగా.............

ఎవఁడురా అక్కడ డాక్టరుగారు వచ్చుచున్నారు. పో! ఆవలికిబో అని పెద్దకేక లోనుండి వినఁ బడినది. వెంటనే పిచ్చివానిని విడిచిపోయితిని.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

# 27. సుఖము, దుఃఖము

ఈ ప్రపంచంలో సుఖదుఃఖాల తీరు ఎటువంటివో విచారణ చేయడంకోసం వివరంగా చేసిన ప్రసంగం ఇది.

ప్రపంచంలో వేదాంతులంటూ ఎంతమంది వుంటారు? ఒక్క చేతి మీద లెక్కపెట్టినా అయిదువేళ్లూ పూర్తికావు. మిగిలిన వాళ్లంతా మొండితనంతో బతకవలసిందేనా?

హరిశ్చంద్రుడు, రామచంద్రుడు, పడినకష్టాలకు లెక్కవుందా?— అయితే పట్టాభిషిక్తులయ్యారుకదా! అంటే, వారుపడిన మనోవేదన ముందు ఈసుఖం ఏపాటిది? బతికినన్నాళ్లూ పధ్నాలుగు బతుకులకు సరిపోయే ఏడుపుఏడిచి ప్రాణంపోయేవేళకి భగవత్‌కటాక్షం కలిగి బాగుపడ్డామని చెప్పిన మహాపురుషులంతా పెరిగిన వెలుగుమాత్రం ఏమంత దొడ్డది?

సుఖపడాలంటే, మొండివాడైనా కావాలి. వేదాంతి అయినాకావాలి. ప్రపంచంలో సుఖం సంపాదించే ధనం, సంసారం, వస్తుసామగ్రి లేకపోతే ఎంతకష్టమో మరీ ఎక్కువుంటే కూడా కష్టమే. సదానందయోగి చెప్పిన ఒకతత్త్వాన్ని బట్టి చూస్తే ప్రకృతిస్థితి, మధ్యమార్గంలో నడుస్తున్నంతసేపే మనిషికి సుఖం. బాహ్యప్రకృతికంటె ఆశ్చర్యకరమైన ఆంతరప్రకృతిలో సైతం-కష్టసుఖాలకు సంబంధించినంత వరకూ-బాహ్యప్రకృతి సూత్రాలేవర్తిస్తాయి. సుఖం, బాధ అనేవి ప్రకృతిస్థితులుగాని, స్వతంత్ర తత్త్వాలుకావు. ఒక ప్రకృతి సన్నివేశానికి ఈచివరకష్టం. ఆచివరకష్టం. నడుమ సుఖం. ఈ తత్త్వాన్ని వివరించడానికి ఒకపేద బ్రాహ్మడికథ చెప్పాడు. హఠాత్తుగా 'లాటరీ'లో డబ్బురావడంతోపాటు, పెరిగిన దుఃఖతత్త్వం ఇందులోసారం.

**జం**ఘాలశాస్త్రి యిట్లు పలికెను:—

అంతకుఁబూర్వ మేమిచెప్పెనో కాని నేను వెళ్లిన పిమ్మట నిట్లు చెప్పెను.

జాలిగుండెవాఁడు జను లేమియందురొ<br>
యనుచు భీతిఁజెందు నట్టివాఁడు<br>
బిడియమునకు గొంకి వెనుకాఁడువాఁడును<br>
ధరణిలోన నెపుడు దక్కలేరు

పరుగులిడుచుండఁ గ్రిందనుబడియుఁ గెరలి
మొండిత్రోపుగ ముందుకుఁ బోవువాఁడు
తన్నొకఁడు గొట్టఁ బదుగురఁ దాను మంచి
చెట్టఁగాంచ కెవ్వరినైనఁ గొట్టువాఁడు
నేడ్చుచునె పెండ్లివిం దారగించువాఁడు
స్వార్థమే పరమార్థమై యలరువాఁడు
బ్రదుకఁదగినట్టివాఁ డీప్రపంచమందు
సౌఖ్యవజ్జీవు లిద్దఱే జగతియందు
మొండియొకఁడు వేదాంతియొకండుసుమ్మ
నడిమివారల బ్రదుకు వినాశకరము
గడియగడియకు మృతికంటె ఘనతరంబు.

కవి చెప్పినయీమాటలు బాగున్నవా? సుఖాపేక్షకు లందఱు Rowides కమ్మని యుపదేశించినఁడే. ప్రపంచమున వేదాంతు లెంత ఉందురు? ఒక్కచేతివ్రేళ్లయిన నన్నియు వంగవే! మిగిలినవారందఱు మొండితన మవలంబింపవలసినదేనా? ఏమో! ప్రపంచతత్త్వమ దియే యేమో, యెవరు చెప్పఁగలరు? సరియైన ప్రవర్తనకు న్యాయమైన ఫలమెవ్వరికైనఁ గలిగినదా? కలుగుచున్నదా? బిస్మిల్లా యని కత్తిబుచ్చుకొని లేవలేనిబక్కపాదూషాకు నల్గురు భార్యలు, పణ్యకాంత కొసరునా? నీతిసత్యసంరక్షణకై శపథముచేసికొన్న యేకప త్నీవ్రతుఁడైన ప్రభుశిఖామణికిఁ బదుచుఁదనములో భార్యవియోగమా! ఏమియిది!

సీ. సత్యసంధులు కష్టచయముల మున్గుటో
దొంగ లుప్పొంగుచుఁ ద్రుళ్ళిపడుటొ
తలగొఱిగించు కోదాతకు లేకుంటొ
కృపణుఁడు లక్ష్మిసమృద్ధిఁ గనుటొ
విద్వాంసు లుదరముల్ వెన్నంటి యేడ్చుటో
మూఢులపొట్టలు పొఁక లగుటొ

గీ. త్వత్పదారాధకులు ముష్టిదాసరయ్య
లగుటొ! నాస్తికుల్ వారల మొగములందు
నుమియుటయొ! యేమి యిది! కన్నులున్నవె! మతి
యున్నదే! యుంటివే! చేయుచున్న దిదియె!

న్యాయవర్తనమునకు న్యాయఫలము గలుగపోవు నిట్టి మార్మెలి, యిట్టి వెలితి, యిట్టి తొరట సృష్టిలోనే యున్నదేమో. సత్యపాలకుఁడౌ హరిశ్చంద్రుఁడు భ్రష్టరాజ్యుఁ డగుటా, శ్మశానవాసి యగుటా, భార్యావిక్రయసాహసి యగుటా, మృతపుత్రుఁ డగుటా. ఆహా! ఏమి ప్రపంచధర్మము! పితృవాక్యపరిపాలకుఁడగు రామచంద్రుఁడు నారచీరధారియగుటా, కందమూలాశి యగుటా, భ్రష్టరాష్ట్రుఁడగుటా హరిహరీ! అపహృతదారుఁ డగుటా, ఛీ! ఇంతకంటె నేమి వ్యత్యస్తఫలముండును? చిట్టచివఱకు వారు మహాసౌఖ్యాన్వితులు కాలేదా? పట్టాభిషిక్తులై భగవత్తుల్యులై ప్రభాభాసురులై వెలిఁగిపోలేదా? యనియందురా? వారు సంవత్సరములకొలఁది పడరానిపాటులు పడి చివఱకు వెలిఁగిన వెలుఁ గిదియేనా?

నాతోఁ జిన్నతనమున నొకబాలుఁడు చదువుకొనెను. మాకుగ్రుడ్డి గోపాలశాస్త్రి యన్న యాతఁడు గురువు. ఆయన కొక్కగది, ఒక్కభార్య, ఒక్కకొడుకు, ఒక్కచొక్కా, ఒక్కకన్ను. నెలతప్పుడయనఁగా నేమి యని మా గరువు నా సహపాఠిని బ్రశ్నించెను. నెలతప్పుట యనఁగా క్షౌరమని యాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. మాగురువుగారు కోపావిష్టుఁడై యాతని కొక్క లెంపకాయ సంకల్పించి చేయియెత్తెను. గురువుగారొంటికన్ను వారగుటచేత నామిత్రునికిఁ దగులవలసినదెబ్బ నాకుఁ దగిలెను. పంతులుగారూ! నన్ను గొట్టనారేమయ్యా! యని నే నేడ్వఁగ, నిట్టి బుద్ధిహీనునితోఁగూడఁ జదువుకొను దోషము నీది కావునఁ గొట్టితి నని గ్రుడ్డితనమును సమర్థించుకొనెను. ఇట్టి బుద్ధిహీనునికిఁ బాఠముఁ జెప్పిన మీఘాట యేమని నే నంటిని. తరువాత నామిత్రుని బుజ్జగించి నెలతప్పుట యనఁగా క్షౌరమని యేలచెప్పితి వని నేను, గురువుగారుగూడ నడుగ, మా మామ్మ నెల కొక్కమాఱు క్షౌరము చేయించుకొనుటచే నే నట్లు చెప్పితినని యాతఁడు నిఘంటుకారునివలె శబ్దమునకు వ్యుత్పత్త్యర్థముచెప్పెను. తరువాత నామిత్రుఁడు బి.ఎల్. పరీక్షలోఁ గృతార్థుఁడై జిల్లాకోర్టులో వకీలుగాఁ జేరినాఁడు. శ్రీరామరక్ష, శ్రీరామరక్ష, పైన బోణీలేదు. పట్టాసొమ్ము కట్టువేళ పాత్రసమానుతాకట్టు. మరియొకవృత్తిచేసికొనవయ్యా యని నే నెన్నివిధములఁ జెప్పినను నీ కెందులకు, చూడవోయి నేనొక్కవెల్గు వెల్గక తప్పనోయియని నన్ను నిరాకరించుచు వచ్చినాఁడు. చిట్టచివరకు మూఁడు పుట్లకట్టతో అబ్బానల్లిగడ్డమీఁద ''ఆఖరు'' వెల్గువెలిఁగినాడు. బ్రతికియున్నన్నాళ్లు పదునాల్గు బ్రతుకులకు సరిపోయినయేడుపు లేడ్చి ప్రాణావసాన సమయమునకు భగవత్కాటాక్షము గలిగి బాగుపడితిమని చెప్పిన సత్పురుషులందఱు వెలిఁగినవెలుఁగుకూడ రవంతకంటె నెక్కువది కాదు.

ఇంతకుఁ జెప్పునదేమనఁగా సుఖపడుటకు మొండివాఁడైనఁ గావలయును, వేదాంతియైనఁ గావలయును. అటులైన, నీతి తీసివేసి యావలఁబెట్టుము. ఇఁక న్యాయమంతయు గోదావరిలోఁ గలుపుము. సిగ్గుమాలినతనమా! రా! అన్యాయమా! రా! అసత్యమా! రా! స్వార్థమా! రా! మొండితనమా! రా! పాపమా! రా! నా సౌఖ్యమునకే మిమ్మాహ్వానించుచున్నాను.

ఏమిది? ఇట్లు జరుగఁదగినదేనా? దారుణముగ నున్నదికాదా? ఇది పరమార్థమని నమ్మకుఁడు. ఇట్టి తుచ్ఛప్రవర్తనమునకు రాజశాసనమే యంగీకరింపదు గదా. భగవచ్ఛాసన మెట్లంగీకరించును?

అది యిప్పటి కాలాగున నుండనిండు. సోదరులారా! మీరీతత్త్వమును వింటిరా.

పాట

వినరా సదానందయోగీ! నీవు వినవేర్తువని విన్నవింతు బైరాగీ॥ వినరా॥
ధనము లేకున్న దుఃఖమురా-చాలధనము కల్గినదాని దాఁపదుఃఖమురా॥ వినరా॥
ఆలు లేకున్న దుఃఖమురా-చాల నాంద్రు గల్గినవారి నడప దుఃఖమురా॥ వినరా॥
బిడ్డ లేకున్న దుఃఖమురా-చాల బిడ్డలు గల్గిన పెంచ దుఃఖమురా॥ వినరా॥

ఈజ్ఞాని పాడినతత్త్వ మెట్లున్నదో వింటిరా? ప్రపంచసుఖసాధనములగు ధనసంతానాదిక వస్తుసామగ్రి బొత్తిగ లేకపోవుట యెట్టికష్టమో యని విశేషముగ నుండుట యట్టికష్టమే.

మధ్యస్థితిలో నున్నవారిబ్రతుకు సుఖవంతమని చెప్పవచ్చునని దీనివలనఁ దేలుచున్నది కాదా? మొదట కవి చెప్పినదానికిని నేవేదాంతి చెప్పినదానికిని నెంత యేతము పెట్టుగా నున్నదో చూచితిరా! ఈరెండుబోధనములకు తేజస్తిమిర న్యాయ మున్న ట్లగపడుటలేదా? వీనిలో నేది సత్యమో రవంత పరిశీలింతమా? సదానందయోగి పాడిన తత్త్వమును గూర్చి యిప్పుడు చెప్పుదును.

వర్షములు లేకపోయినయెడల పంటలు లేవు. అతివర్షములైనఁదిరుగ పంటలు లేవు. జీర్ణశక్తి తగ్గిపోయినయెడల మనుజునకుఁ గష్టము. అతి జీర్ణశక్తి గలుగుటకూడ నట్టికష్టమే. అనఁగ మందాగ్ని యెట్టికష్టమో అత్యగ్ని యట్టికష్టమే. రక్తపుపోటు మనుజునకుఁ గొంతసహ జముగ నుండవలయును. అది మిక్కిలి తగ్గిన శరీరము నిలువదు. మిక్కిలి హెచ్చినను శరీరము నిలువదు. జనునితనువుగాక 98.4 బదులు 98 ఉండినను జావే; 107 ఉండినను జావే. గాలి హెచ్చనుగూడదు, తగ్గనుకూడదు. రక్తములో నీరు హెచ్చనుగూడదు. తగ్గనుగూడదు. ప్రకృతిస్థితి మధ్యమార్గమున నడచుచున్నంతసేపే మనుజునకు సుఖము.

ఇదివఱకు మనము బాహ్యప్రకృతినే పరిశీలించినాము. బాహ్యప్రకృతికంటె బహువిచి త్రమైన యత్యద్భుతమైన యవర్ణ్యమైన యాంతరప్రకృతి మనుజునకు లేదా? ఇంతవఱకు మనము విచారించినది శరీరసుఖమేకాదా? మనస్సుఖము మాత్రము సుఖముకాదా? అందువ లన మనస్తత్త్వముగూడఁ బరిశీలింపవలసియున్నది. ఈతత్త్వమునుగూర్చి జంఘాలశాస్త్రి తనయుపన్యాసములలో మిగుల విపులముగఁజెప్పినాఁడు. నేనుచెప్పుట హాస్యాస్పదముగ నుండును. కాని బాహ్యప్రకృతి కెట్టిసూత్రములున్నవో ఆంతరప్రకృతికిగూడ నవియే సూత్రములు. బొత్తిగ లేకపోవుట, అత్యంత మెక్కువయగుట, బాహ్యప్రకృతిలో గష్టములై నట్లే యాంతరప్రకృతిలోగూడ నవియే కష్టములు. బాహ్యప్రకృతిలో మధ్యావస్థ యెట్టిసు ఖమో, ఆంతరప్రకృతిలో గూడ నదియే సుఖము. ప్రేమతత్త్వ మేమనస్సున లేదో యామ నస్సు పశుమనస్సుకంటె నధమ మైనది. అత్యంతకష్టనిష్ఠురమైనది. అమిత మగు ప్రేమ (ఐహికము) యెవనికుండునో వాఁడు పామరుఁడై బానిసయై తుచ్ఛుఁడై సంతత దుఃఖమప రంపరచేతఁ జచ్చుట యంతకంటె మేలన్నట్లుండును. ఒకనియందు లేశము నమ్మకములేనివాఁడు పొందుబాధ యాకాశమువోలె హద్దులేనిది. అత్యంతము నమ్మకము గల్గినవాఁ డందఱికాళులధూళి తలయందుంచుకొనుచు నష్టకష్టములఁ బడచు నేడ్చునయే డుపు అనంతమైయుండును. విద్య బొత్తిగలేనివాఁడు, తినున దన్నమని చెప్పవచ్చునా? అమితమైన విద్య గలవాఁడుగూడ దినునది గడ్డియే. ఎందువలన? చదువుకొననియప్పుడు మనస్సులో నున్న జ్ఞానము మిక్కిలి చదువుకొనిన తరువాత ముక్కలై కాలి బూడిదయై యెగిరిపోయినది. బ్రహ్మరంధ్రము మొదలు పాదాంగుష్ఠమువఱకు నిప్పుడున్న వన్నియు సందేహములే. అన్నియు నన్యోన్యవ్యత్యస్తములైనవే. ఏఏదియు మనస్సునకొంత మాత్రము పట్టనిదే. బొత్తిగా సత్యములేనివాని నూరివారు రాతివిసరులతో కఱ్ఱదెబ్బలతో వెఱ్ఱికుక్కను గొట్టినట్లు గొట్టుదురు. అత్యంత సత్యనియమమున్నవాఁ డాముష్మికసుఖమును దరువాత బొందుఁగాక! ఇచ్చట మాత్రము బంధువిరోధియై, ప్రజాశత్రువై పడవలసినబాధ లన్నియుఁ బడును. ఉభయమధ్యావస్థయందే మనుజజాతికి సర్వప్రపంచమునకు సౌఖ్యమున్నది. అందు చేత సుఖము, బాధ యనునవి ప్రకృతిస్థితులుగాని స్వతంత్రతత్త్వములు గావు. ఒక్క

ప్రకృతినన్ని భోవేముపంకఁబోయి కష్టమైనది. అమితత్వముపంకఁ బోయి కష్టమైనది. అందుచేత సుఖము, బాధ యనునవి వస్తుతత్త్వమున నొక్కటే యని స్పష్టపడుటలేదా? బుద్ధభగవానుఁ డేమి సెలవిచ్చినాఁడు?

గీ. ఉభయదిశలఁ గష్ట ముండు సౌఖ్యమునకు
నదియె నడుమఁ జేరి యగును సుఖము
బాధ సుఖము నొకటి వస్తుతత్త్వమునను
గతినిబట్టి భేదకలన కలిగె.

ఉభయమధ్య సుఖావస్థనే The golden mean అని పాశ్చాత్త్యులభినందించినారు. ప్రకృతి సత్యము సృష్టిసంబధమైన Economy తో సంబంధించి యుండవచ్చును. తక్కువవ స్తుసామగ్రితో నెక్కువజన మెక్కువసౌఖ్య మొందుటకంటె కావలసినదేమి?

నాయనలారా! నే నిదివఱకుఁ జెప్పినయంశములను మీమనస్సులకుఁ బట్టఁజేయఁగల యొకచిన్నకథను జెప్పెదను. కథయనుటచే అది యసత్యమని యెంచకుఁడు. అది సత్యగాథయే.

ఒకమూర నొక బీదకుటుంబము. దానిలో భార్య, భర్త, ఇద్దఱు కొడుకులు, నిద్దఱుకూఁతులు. భార్యాభర్తలు నడికాలమున నున్నవారె కాని వృద్ధులు కారు. వారి పెద్దకొడుకునకు 18 సం॥ ములు వయస్సుండును కాని తరువాతిపుత్రునకు 16, మొదటికూఁతునకు 14, రెండవ కూఁతురునకుఁ బండ్రెండుండును. మగపిల్ల లిద్దఱకు మెడలలో జందెములున్నవి. కాని యవి పొరుగూర వేయఁబడిన దొంగజందెములు. 14 సంవత్సరములపిల్ల వివాహము కాకుండ రజస్వల యగుటచే వారికుటుంబ మొక్కసంవత్సర మునుండి బహిష్కరింపఁబడియున్నది. ఎవ్వరును వారి యింటికి రారు. వా రెవ్వరింటికిని బోరు. తిండిలేక మలమలమాడిపోవు చుండిరి. బహిష్కృతునకు ముష్టిమాత్రము పెట్టువారె వ్వరు? పైయూరికిఁ బోవుదమనన నడచిపోవుటకు శక్తిలేదు. బండియెక్కుటకు పైసలేదు. దినమున నొక్కపూఁట తిన్ననునార్గుఱకు భోజ్యము కావలయును గదా! అరసోలెడు నూక లింటియొద్దలేవు కదా! ఎట్లు కుటుంబము జీవింపవలసినది? దంపతులు శ్రీరామనామస్మ రణ చేసికొనుచు గూరుచుండుటతక్క నంతకంటె నేమి చేయలేరు. మగపిల్ల లిద్దఱు పైయూళ్లకుఁబోయి కూలినాలి చేసికొనివచ్చి తల్లిదండ్రులను బోషింపరాదా? వారిల్లు కదలునారుకారు. పౌరుషవంతులు. ఇఁక బ్రదుకు టెట్లు? మగపిల్లలకుఁ జదువులేదు వారు పరమమూర్ఖులు. అందుచేత వారితల్లిదండ్రులొక్కపని జేసిరి. రాత్రి యెనిమిదిగంటలకుఁ దండ్రి పదునాలుగేండ్లకూఁతును, దల్లి పండ్రెండేడ్ల కూఁతును దీసికొని చెఱి యొక కుండచేతబుచ్చుకొని ముసుఁగులువైచికొని రూపములుదాచివైచికొని సందెబిచ్చ మెత్తు కొని రాత్రి పదిగంటల కింటికి వచ్చి యాయన్నమును కొడుకులకుఁ బెట్టి తాముఁ దినుచుండెడివారు. ఈసంగతి యెవ్వరికిని దెలియదు. ఇట్లు జరుగుచుండ నొకరాత్రి వేఱువేఱుకుండలలోనున్న యన్నము నొక్కచోట నుంచుచుండఁగాఁ దనకుండలో నొక బంగారుగాజాపిల్లల తల్లికిఁ గనఁబడెను పాపము! ఏసంసారిణియో తనకుండలో నన్నమువేసి నప్పు డాగాజు జాఱిపడెనని యామె యూహించుకొనెను.కాని యెవరిదని యెవరి కీయఁగ లరు? ఎందఱు సంసారిణు లామెకుండలో నన్నమువైచిరో ఎవరి గాజో కాని నాయొద్ద

నున్నదని వెల్లడిచేయునెడలఁ దనసందెబిచ్చపుగొడవ వెల్లడికాక తప్పదే! అందువలన మఱునాఁడు కూడుదొరకదే! ఏమి చేయుటకును దోఁపక యొక్క భర్తతోమాత్ర మీసంగతి చెప్పెను. ఇది భగవత్కటాక్షచిహ్న మని యాతఁ డనుకొని ''నిన్ననే నీతల్లి యిటకు వచ్చినది కదా! ఆమెచేతి కీ గా జిచ్చి తనయూరుపోయి దానిని విక్రయించి యాసొమ్మిక్కడకుఁ దెమ్మని చెప్పు''మని భార్యతోఁ బలుక నామె యిట్లు చేసెను. ఆసొమ్ము రాఁగనే యాతని కేమిబుద్ధిపుట్టెనో గాని దానిని లాటరీలో వేసెను. అయిదాఱుమాసములు కాకుండనే యాతనికి మొదటి బహుమామ 15 లక్షలరూపాయలు వచ్చెను. కాని పైపన్నని, అదనఁపుఁబన్నని, జాస్తిపన్నని, లాటరీపన్నని యింకేమో యని యింకేమో యని రూపాయ కొక్కయర్ధరూపాయి మట్టుకు ప్రభుత్వమువారు లాగివేసిరి. శేషించిన దింటికిరాఁగనే యాగృహస్థునికి గుండెలు గరిసలఁబడఁగఁ దలదిరుగఁ బడిపోయెను. పడిపోయిన తండ్రి యొద్దకుఁ గొడుకులురాలేదు. వారితల్లియు రాలేదు. ఈసొమ్ము జాగ్రత్తపెట్టుటకు మార్గము లాలోచించుచుండిరి. నాన్న చచ్చిపోయినాఁడమ్మా యని 12 సం॥రముల వయస్సుగల కూఁతురేడ్వ మఱేమియుఁ దొందరలేదని కొడుకులనిరి. భార్యయునట్లే యనెను. అతఁడు మాటలాడలేనిస్థితిలో నున్నాఁడే కానిస్మృతిగలియున్నవాఁ డగుటచేత నీమాట లాతనికి వినఁబడెను. కొంతసేపటికిఁ దనయంత తానులేచెను. అనుభవింపవలసిన నెత్తిప్రాఁత యింక నుండఁగ నప్పుడే చచ్చునా? పదునైదులక్షలకు నెనిమిదిలక్షలే యుండె నేమి యని తండ్రియడుగఁగఁ బన్నులక్రింద మినహాయింపఁబడిన దని వారు చెప్పిరి. అందులకై యాతఁ డూరెగిరిపోవునట్లు గుండెలు కొట్టుకొని యేడ్చెను. ''పోనీ! నాన్నా మనకు వచ్చినవే యెనిమిదిలక్ష లనుకొనరాదా'' యని చిన్నపిల్ల తండ్రిని మందలింపఁగా, నాతఁడు మొగము దిగనైచుకొని లోలోన నగ్నిపర్వతమువలెఁ గుమిలిపోవుచుండెను.

ఈబ్రాహ్మణుని కింతధనము రాఁగానే యాజిల్లావా రంద ఱీతనిదర్శనము చేసి యభినందనములు ప్రకటించిరి. ఇతనికుటుంబము నితనినిఁ బెద్దమోటారులోఁ గూరుచుండఁబెట్టి పుష్పవర్షము గురియుచు నూరివెంట నూరేఁగించి మహాజనసభలోనికిఁ దెచ్చి ప్రత్యక్షముగఁ బూజించిరి. కవులు పద్యములు చదివిరి. గాయకులు భార్యాభర్తలపై మంగళపుటారతులు బాడిరి.

అతనిపిల్లలను జేసికొందుమనియు, మగపిల్లలకుఁ బిల్లల నిచ్చెదమనియు లక్షాధికారు లయొద్దనుం బడేబడే వార్తలు వచ్చుచుండెను. కులభ్రష్టత యేమైనదో బహిష్కార మేమైనదో పైనముందన్నియుఁ బటాపంచలైపోయినవి. ధనమా! నీవెంత మహిమగలదానవు. అంద ఱును దాసులుగఁ జేసికొంటివే! నీకు, భగవంతునకు భేద మెక్కడనున్నదో చెప్పెదవా? భగవంతునిఁ గూడ నొకప్పుడు తిట్టిన ప్రజ నీపాదుధూళి శిరమున నిరంతరము ధరియిం చునే! భగవంతుని మాటయే మఱచిపోయి కోటీశ్వరుఁడు నిన్నే కొల్చుచున్నాఁడే! అహా! నీ మహిమకుహద్దున్నదా? బుద్ధిహీనుని బృహస్పతిగఁ జేయుచున్నావే. నంగినంగిమాటల శుంఠను మహావక్తగఁ జేయుచున్నావే. చెవులపిల్లిని సింహముగఁజేయు ప్రజ్ఞ నీది కాక మఱెవ్వరిది? పాపమందు బుణ్యమును, విషమందు మాధుర్యమును, దొంగతనమందు దొరతనమును, మిథ్యయందు సత్యమును, నవ్యాపనవ్యధోరణిని గనఁబఱచుచు మహేంద్ర జాలము నాడించు ప్రజ్ఞ నీది కాక మఱెవ్వరిది. ధనమా! పరబ్రహ్మముకూడ నీవేనా'' నమస్తే.

తనకున్న ధనముచేతనే ప్రజ లిట్లు తన్ను గౌరవించుచున్నారనియు, తన్నిదివఱ కనేకవిధముల బాధలు పెట్టిన జనసంఘము నీతిజాతి మాలినదనియు, నీ బ్రాహ్మణుఁడు గ్రహింపలేదా! కష్టవిద్యాశాలలో గడిఁతేఱినయాతఁ డామాత్రమైన గ్రహింపలేదా? తాను జావునకు సిద్ధమైనప్పుడు తనభార్యకుఁ గొడుకులకు దయ లేకపోయిన దని ప్రత్యక్షముగ నెఱిఁగినవాఁడు సభాధ్యక్షుల కర్పూరమాలలకుఁ, గవుల చంపకమాలలకుఁ గట్టువడునా?

ధనవిషయమై మనుజుని కున్న పసి యింత యంతయునా? అందులో దానిని గూర్చి న్యాయవాదికున్న పసి చెప్పఁదరమా? ముగ్గురు న్యాయవాదులు వారిలో వారు సంప్రతించు కొని ధనసందర్భములం దీకుటుంబమున కింకఁ గలుగఁదగిన కలహములను నివారణచేసి వారిని బాగుచేయుటకై వచ్చితి మని వీరి యింటికి వచ్చిరి. కిట్టినివా రింకొకరీతిగా ననుకొనిరి. అది గణింపఁదగినది కాదు. ఒక్క న్యాయవాదియే యనేకస్థానములను దిబ్బలు చేసియుండ ముగ్గురు న్యాయవాదు లీబ్రాహ్మణుని సొత్తునేమి చేయలేకుందురు? ఒక న్యాయవాది తండ్రినీ జీలదీసినాఁడు—ఒకఁ డొకసోదరునిపక్ష మైనాఁడు—మఱియొకఁడు మఱియొకసోదరున జేబులో నిముడ్చుకొన్నాఁడు. మీకుఁ గల్గిన యాస్తిన్యాయవాదుల యాస్తివలె కేవలము స్వార్జితమనియు, నది పంపకమునకు రారాదనియుఁ జల్లనిమాట బ్రాహ్మణునితో న్యాయవాది చెప్పఁగ నాతం డదివఱకే కొడుకలపైఁ గోపమున్నవాఁడు కావునఁ జేటంత మొగము చేసికొని నాయనా! నాపంతము గెలిపింపుమని న్యాయవాదిని బతిమాలెను. ''అద్దే! అవలీలగ గెలిపింతును. ఒక్క చిల్లిగవ్వ కొడుకులకీయవలదు. ఏమి చేయఁగలరో చూతము. మీరాపట్టుమీఁదనే నిలువఁబడుఁడు. నాతమాషా చూపింతు''నని న్యాయవాది మీసములు దువ్వుచుఁజెప్పెను. మిగిలిన యిద్దఱు న్యాయవాదులు సోదరులతో నేమి మాట్లాడిరో తెలియదు. కాని వారు తండ్రియొద్దకు వచ్చి మనకున్న సొత్తును బంచుకొందమని తండ్రికి బోధించిరి. ఆతఁడు కఠినముగ నిరాకరించెను. ఈసంగతి యెఱుఁగక ''నీవు నీ కొడుకులు పంచుకొన్నయెడల నడుమ నేను నాకూఁతులు చెడిపోవలసి నదా? వారి శుభకార్యములకు నా బ్రతుకు తెరువునకుఁ గావలసినంతసొమ్ము ముందుగా వేఱుచేసి మిగిలియున్నదే పంచుకొనవలయును.'' అని భార్య భర్తతోఁ జెప్పెను. ''నీకూఁతుల కేమి యిచ్చినను వారు తమ భర్తలకుఁ గలుపుదురు. నీకేమి యిచ్చినను నీవు పుట్టినింటివారికిఁ జేర్తువు. కొడుకుల కేమి యిచ్చినను వా రీకానులగోతములన్నియుఁ గోడండ్రనెత్తికెత్తెదరు. ఇదియంతయు నాకష్టార్జితమే. నే నొకరి కీయను. పొ''మ్మని భర్త బదులుచెప్పెను. ఈ సంగతియేమియుఁ దెలియక లాటరీసొమ్మంతయుఁ దానుఁ దనకూఁతులు హరింపఁ బ్రయత్నించుచున్నా రని తల్లిపైఁగొడుకులు చెలరేఁగి కొట్టుటకు సిద్ధమైరి. ఇంతలోఁ గర్మముచాలక యత్తగారు వచ్చినది. తనకు విసము పెట్టుటకుఁ బుట్టినింటనుండి భార్య తనతల్లిని బిలిపించిన దని బ్రాహ్మణుఁడు నిశ్చయపఱచుకొనెను. ఆమె కీసంగతియేమియుఁ దెలియక చనవుచే నల్లునియొద్దకుఁ బోయి, ''నాయనా! నీభాగ్యమునకు మూలాధారమును నేను. నేనాసొమ్ముతీసికొనివచ్చి నీచేత లాటరీవేయించుటచేత మనపుణ్యా మాయని యింతమాహాలక్ష్మి మనయిల్లు చేరినది. అందుచేత నీవు నాకెంత యిచ్చినను ఋణము తీర్చుకొనలేవు'' అని పరిహాసముగఁబలికెను. అత్త నల్లుఁడుమాదిగ మంచముక్రిందఁ గొట్టఁగ భార్య యడ్డుకొనెను. భార్యను మెడఁబట్టిగెంటఁగ నామె గోడమీఁ నబడి మూర్ఛపడియెను. అత్తగారు పెద్దగోలచేయఁగఁ బెద్దకొడుకువచ్చి ముసలిదానిగొంతు

గట్టిగ నొక్కఁగ నామె క్రిందఁబడి చచ్చెను. తండ్రికి మతిపోయి యున్నదని వంక కల్పించుకొని తండ్రినిఁ గ్రిందఁబడద్రోచి గొంతుకపై ద్రొక్కి తలగడక్రిందనున్న నోట్లకట్టను దీసికొనుచుండెను. ఇంతలో నాడుపిల్లల యేడుపువిని దొడ్డిలోనున్న రెండవకొడుకు వచ్చి నాకులేకుండ నీవే యంతసొమ్మును దీసికొందువాయని చేతిలోఁ జెంబుదీసికొని యన్నగారి నెత్తిపైఁ గొట్టఁగ నాతఁడు చచ్చెను. అంతలోఁ గ్రిందనున్న తండ్రి లేచి నాసొమ్ము నీవు పట్టుకొనిపోవుదువా యని రెండవ కొడుకుగొంతు గట్టిగాఁ బట్టుకొనెను. తనప్రాణము రక్షించుకొనుటకుఁదిరుగ నాకొడుకు తండ్రిగొంత పిసికెను. ఇద్దఱక్కడనే చచ్చిపడిరి. తల్లి యిదివఱకే చచ్చెను. ఆఁడుపిల్లలిద్దఱు మాత్రము నిల్చిరి. చేతగవ్వలేనప్పుడున్న కష్టమీకుటుంబ మనుభవించినది. లక్షలున్నప్పటికి కష్టము ననుభవించినది. సుఖసాధనములు లేకున్నను గష్టమే, మిగుల హెచ్చైనను గష్టమే.

అమిత మనుచు నభావంబు ననుచు రెండు
కష్టదశ లెప్డు సుఖము ప్రక్కలనె యుండు
నడుమను సుఖార్థి యూఁగక నడవవలయుఁ
దాటిబద్దపై నేటిని దాఁటినట్లు.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

# 28. మహాపతివ్రత

హిమాలయ ప్రాంతాలనుంచి ఒక మహాయోగిని వస్తే–జంఘాలశాస్త్రి తమసాక్షి సంఘసభలో ప్రసంగింపజేశాడు.

ఆమె ఒక మహాపతివ్రత గురించి చెప్పడం సాగించింది.

పువ్వుల్లో గులాబిలాగ, రాళ్లలో వజ్రంలాగ, లోహాల్లో బంగారంలాగ, మగవారిలో శూరుడిలాగ, స్త్రీలలో 'పతివ్రత' పరిగణించబడింది. ఆడది పరమేశ్వరుడి ప్రతినిధి.

ఇలా చెప్పిన ఆమహాయోగిని తాను దూరశ్రవణశక్తి గలదాననని, ఒకరాత్రి హిమవత్పర్వత కాంచనగంగా శిఖరమునకూర్చుని వుండగా ఇద్దరు విద్యాధరస్త్రీలు చెప్పుకొన్నమాటలు విన్నాననీ, వారి సంభాషణలో విషయాలే ఆధారంగా తాను చెపుతున్నాననీ,–వివరించింది.

ఆ మహాపతివ్రత కృష్ణా గోదావరీ మండలాల మధ్యప్రదేశంలో చాలా సంపన్నకుటుంబంలో, 'పుట్టుసిరి' లాగ పుట్టింది. ఆమె పుట్టుక, పెరకువ కూడా, ఇంట్లో వారికీ బయటువారికీ కూడా మహాలక్ష్మిసమానంగా అనిపించాయి. చిన్నతనంనుంచీ అసాధారణమైన మంచిలక్షణాలను ప్రదర్శించింది.

క్రమక్రమంగా ఇంటిదగ్గరే విద్యాభ్యాసం చేసింది. ఆంగ్లవిద్యకూడా కొంత ఇంటిదగ్గరే నేర్చింది. చదవను, వ్రాయను, తొందరగా నేర్చింది.

ఆమెరూప, శీల, సంపదలకు అనుకూలమైన మరొక సంపన్న కుటుంబంలో కోడలుగా మెట్టింది. ఆయింటి తనమంచితనం, దానశీలం, నిగర్వత, విద్య, వినయం పెంపొందించుకుంటూ భర్తృ ప్రేమలో పునీతురాలై, ఇరవైయేడేళ్లు కాపురంచేసింది. పాతకాలపు పతివ్రతల్ని మనంచూసి వుండక పోవచ్చుగాని–ఈమె ఈకాలంలో సర్వసాధరణంగా 'గృహిణి' ఎలాప్రవర్తించాలో తనప్రవర్తనతో నిరూపించింది. పద్దెనిమిది అధ్యాయాలలో భగవంతుడు బోధించిన అనాసక్తియోగాన్ని ఆచరణలో చూపింది. ఆమె పవిత్రాగ్ని స్పర్శతో దేహంచాలించిందని, విద్యాధరస్త్రీలు మాట్లాడుకోగా విన్నానని మహాయోగిని ప్రశంసాపూర్వకంగా చెప్పింది.

**జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:–**

హిమాలయప్రాంతమునుండి వచ్చిన యొకమహాయోగిని నేఁడీసభలో నుపన్యసించును. సావధానచిత్తులరై వినఁగోరెదను.

మహాయోగిని యుపన్యాసము

పుష్పములలో గులాబి యెట్లో, ఱాలలో వజ్ర మెట్లో, లోహములందు కాంచన మెట్లో, మగవారిలో శూరుఁ డెట్లో, యాఁడువారిలోఁ బతివ్రత యట్లు.

గీ. ''ధరణి నుండు ద్వితీయమౌదైవ మదియె'' యని యొకకవి చెప్పినాఁడు. ఆఁడుజన్మ మెత్తితరింపవలయును. అందులోఁ బతివ్రతయై తరింపవలయును. మఱియొక మార్గము లేదు. బ్రహ్మజ్ఞానసంపత్తిచేఁ బదునాల్గుజన్మములకైనను మగవాఁడు మోక్షము నొందకపోవచ్చును కాని, నిష్ఫలాపేక్షమైనపతిభక్తిచే నాఁడది యొకజన్మములో ముక్తినొందఁ గలదు: పరమేశ్వరుఁడు కేవలప్రేమమయుఁడే కాక ప్రేమస్వరూపుఁడు కూడను. అందుచే ప్రేమతత్త్వమే సంసారతారక మైనది.

గీ. దంపతులప్రేమవంటి దీధరణి లేదు
వారికేమ్ము విభవ మెప్పటికి నైన
వట్టిబ్రహ్మచారికి మోక్షపదవి నున్న
జ్ఞానియగువాని కద్ది సంశయము సుమ్ము.
ప్రేమలతఁ గోయు మని మనపెద్ద లనిరి
నాకు క్షమియింపు మామాట నచ్చలేదు
జన్మరాహిత్య పరమశాశ్వతసుమంబు
భవ్యతమరాగ లతికోద్భవంబు కాదె?

అందుచేత నాఁడువారిలో నొక్కగృహిణికి తప్ప బ్రహ్మచారిణులకు, యోగినులకు, సన్న్యాసినులకుఁ గూడ ముక్తిలభించు నని ధైర్యముగఁ జెప్ప వీలులేదు. ప్రేమాదిరసములు పుట్టుకతోడనే మనహృదయములం దున్నవి. మనము మనుజులకంటె నధమజంతువులుగా నున్నప్పటినుండియు నారసములు మనహృదయములం దున్నవి. ప్రియాగమనమున గుళుకు గుళుకు మనుగవ్వప్రేమాతిథ్య మెట్టిదో, సతీమణియింటి కేతెంచిన భర్తపాదసేవ సరిగా నట్టిది. వానికి రెంటికిని తత్త్వమున భేద మేమియు లేదు. జ్ఞానము మనుజునకు సహజము కాకపోవచ్చునేమో కాని ప్రేమామత్రము సహజ మని యొప్పుకొనక తప్పదు. అట్టి ప్రేమరస మెండఁజేసికొనఁ బ్రయత్నించి జ్ఞానముచేఁ దరింపఁబూనుట యతికష్టము. అసహజము. అవసానమున దృశ్యాదృశ్యము కూడను. ప్రేమరస మెప్పటికినిగూడ నెండునది కాదు. ప్రేమ తొలఁగదు. జ్ఞానము కలుగదు. అట్టి సంధ్యవస్థలో మనుజుఁడు చిక్కుకొని యుభయభ్రష్టత నొందుట తగదు. అట్టిప్రేమాదిరసములు సత్కార్యములందు, సత్పాత్రములందు, సముచితముగ, సద్వినియోగము చేసికొనుట చేతనే జన్మసాఫల్యము కలుగును.

అది గాక స్త్రీతత్త్వసమ్మేళనములో జ్ఞానముపాలుకంటె, భక్తిపాలు హెచ్చు. ఎందుచేత ననఁగా పరమేశ్వరునిచేతిలోనప్రత్యక్షముగ నున్నసృష్టితంత్ర మంతయుఁ బ్రత్యక్షముగ స్త్రీచే నిర్వహింపఁబడుచున్నది. ఆఁడుది పరమేశ్వరుని ప్రతినిధిని యైయున్నది. ప్రేమను

ధలచేఁగాని కనుటయుఁ బెంచుటయు నెన్నఁడు సిద్ధింపదు. అందులకు జ్ఞానమక్కఱలేదు. ప్రపంచపుటునికికిఁ బ్రేమయే మూలాధారము.

భగవంతుఁ డున్నాఁ డని, లేఁ డని, యున్నాఁ డనుమాటయే కాని యాతనికి సృష్టితో సంబంధము లేదని, లేనట్లే యున్నాఁ డని, యెన్నితలతిక్కకొసవెఱ్ఱి నన్నిపాతపుదారులైన మగవాఁడు బుద్ధిలేక త్రొక్కినాఁడు కాని మగువ యాచింత కెన్నఁడైన లోనైనదా? ఆసంశయఁ మెన్నఁడైనఁ బొందినదా? ప్రేమస్వరూపుఁ డైనపరమేశ్వరుని యందు నిర్నిద్రవిశ్వాసము, నిశ్చలభక్తి తప్ప ఆమెహృదయమున నింక ముఖ్యమైన దేమైన నున్నదా? ప్రేమామృతపూర్ణ మైన యామెహృదయమందు మఱి యొక్కటి యుండుటకుఁ దా వెక్కడిది?

ఒకమహాపతివ్రత వృత్తాంతమును చెప్పుదును. దూరయానశక్తి కలదానను. కావున నే నొక్కరాత్రి హిమవత్పర్వతకాంచన గంగాశిఖరమునఁ గూరుచుండియుండఁగా నిద్దఱు విద్యాధరస్త్రీలు చెప్పుకొన్న మాటల వింటిని. అందువలన నేను చెప్పఁబోవు మహాపతివ్ర తను గూర్చిన యంశము లనేకములు వారి సంభాషణవలనఁ దెలిసికొంటిని. అవి తరువాత చెప్పుదును. ముం దాయుత్తమకాంత యైహికకథావృత్తమునఁ గర్ణములు పవిత్రములు చేసికొందము.

కృష్ణాగోదావరీమండల మధ్యగతప్రదేశమున నొక సంపన్నుని కుటుంబమున నామె కొన్ని సంవత్సరములక్రింద ప్రాచీగర్భమునఁ గాంతి రాశివలె నుదయించెను. ఆమె పుట్టినస్థల మేదియైన మీ కెందులకు? జన్మస్థలమునకు, జన్మకాలమునకుఁ బ్రాముఖ్య మీయఁదగదు. మంచి స్థలమునఁ బుట్టినజీవుఁడు. మంచివాఁ డని యనఁదగునా? చెడ్డస్థలమునఁ బుట్టి నవాఁడు. చెడ్డవాఁ డనఁదగునా? జాతకుని స్వరూపస్వభావాదులు జన్మస్థలకాలములఁబట్టి లేశము నుండవు. మాలపల్లెయం దరుంధతి పుట్టలేదా? బ్రహ్మవంశమున బుట్టినశూర్పణఖ మాట యేమి? దేశ కాలపాత్రాదులు జీవప్రకృతులపైఁ గొంతమార్పు తప్పకుండఁ గలుగఁ జేయునని కొందఱు చెప్పుదురు. కాని యది సాధారణప్రకృతుల వర్తించుమాట కాదు. అసామాన్యప్రకృతులన్నియు దేశకాలపాత్ర బద్ధములైనవి కానే కావు. సృష్టిసూత్రమున కవి లొంగునవి కానేకావు. వానిని మినహాయింపులక్రిందనే మనము చూచి గౌరవింపఁదగును. మనగౌరవము నని యపేక్షించునవి కానే కావు. అట్టి యసాధారణశరీర తేజస్సుతో, నంతకంటె నూఱురెట్లు హెచ్చయిన బుద్ధితేజస్సుతో, నంతకంటె నూఱురెట్లు హెచ్చ యిన యోగ్యతాతేజస్సుతో, నంతకంటె నూఱురెట్లు హెచ్చయిన భక్తితేజస్సుతో, నంత కంటె నూఱురెట్లు హెచ్చయిన యాత్మతేజస్సుతో నా తేజస్వినీమణి వేణువులో నాణి ముత్తెము పుట్టినట్లు, పంకమున భగవత్పూజార్హమైనపద్మము పుటినట్లు నాఁగటిచాలున సీతామహాదేవి పుట్టినట్లు, సముద్రమున జగమంతయు శాసించు మహాలక్ష్మి పుట్టిన ట్లాసంప న్నునికుటుంబమున నీప్రభారాశి ప్రభవించెను. ఆకుటుంబమున కెంతో కాంతి వచ్చినది. ఆరాష్ట్రమున కెంతో కాంతి వచ్చినది. భారతదేశమున కంతకుఁ గూడఁ గాంతిఁ దేఁగల కమలాస్వరూపిణియై వెలసెను. ఆమె మహాలక్ష్మి యవతార మని పుణ్యాత్ములైన తల్లిదం డ్రులెఱిఁగి యామెకు మహాలక్ష్మి యని నామముంచిరి. ఈబిడ్డ పుట్టినప్పటినుండియుఁ గన్నవారి కైశ్వర్యము వృద్ధి కాఁజొచ్చెను. తెల్లవాఱి లేచి మొదట నీపిల్లమొగము చూడకుండ దైవప్రార్థనమైనఁ దల్లిదండ్రులు చేసి యెఱుఁగరు. ఈమె మొగము చూచిన నేమిలాభము

కలుగునో యని యితరులుగూడ భావించి చూచుచుండెడివారు. ఈమె నెత్తుకొన్న నేమి విశేషమో, యామెకు పాలిచ్చిన నేమివిశేషమో, తల దువ్విన నేమివిశేషమో యని యా యూరిప్రభుకాంతలు, బ్రాహ్మణకాంతలు తలంచుచు, సమస్తోపచారము లీపిల్లకుఁ జేయు చుండిరి. ఎవ్వరికైన జబ్బుగా నున్నయెడల నీమెను వా రింటికిఁ దీసికొనిపోవుచుండుదురు. ఈమెయున్న చోట సుఖము, నారోగ్యము, నైశ్వర్యము, సంపత్తి యుండక తప్ప దని యందఱనమ్మకమైయుండెను.

కాని యీమె బాల్యముననే కొన్నియద్భుతగుణములు వెల్లడించుచుండెను. పిల్లలు సాధారణముగాఁ బప్పని, పండ్లని, భక్ష్యములని వలపులాడిపోవుదురు కదా, యీమె యెదుట నెన్నిమధురపదార్థము లుంచినను వారి నేవియు ముట్టక వ్యాసపీఠమున నున్న భగవద్గీతను చేతఁ బుచ్చుకొని యక్కడఁ గూరుచుండెడిది. బొమ్మలని, గడియారములని, తోపుడుబం డ్లని ఎన్నివింతవస్తువు లెదుట నుంచినను వాని నేవియు స్పృశింపక వీణయొద్దకుఁ బ్రాఁకి తీఁగలను గదల్చి కలకలలాడుచుండెడిది. ముత్యాలసరము లని, పచ్చలహారము లని, బంగారుకంఠమాలలని—ఎన్నియెన్ని వస్తువు లామెయెదుట నుంచినను వానినిఁ దప్పించు కొని తల్లిగారి దేవతార్చనలోని జపమాల పట్టుకొని ప్రాఁగి వచ్చుచుండెడిది. ఈగుణమువలన నీమె పరుల కానందము, సుఖము, సంపద కలుగఁజేయువారే కాని స్వలాభము నపేక్షించి యేపనియైనను జేయువారు కారని యప్పుడే యంద ఱనుకొనిరి. భక్తురాలగునని కొందఱు, సన్యాసిని యగు నని కొందఱు, ఎవరికిఁ దోఁచినట్లు వా రను కొనుచుండిరి. జనకమహారాజు చక్రవర్తియు, సన్యాసియు నేక కాలమందే యైనట్లీమె చక్రవర్తినియు, సన్న్యాసియుఁగూడ నేకకాల మందే కాఁగూడదా? యని కొంద ఱనిరి. ఇంత యసామాన్యప్రకృతు లల్పాయుర్వ్య క్తులే యనియు, ఋణశేషముఁ దీర్చుకొనుటకు వచ్చి తుడిచిపెట్టఁదగినంత తుడిచిపెట్టి, తుఱ్ఱున నెగిరిపోవు ననియు మఱికొంద ఱనిరి. ఎవరినాలుక కడ్డేమున్నది? అన్ని స్వాతం త్ర్యము లంతరించినను రాజకీయవిషయే తరతంత్రములందు మన కింక నాలాపస్వాతం త్ర్యము మిగిలియున్నది కాదా?

ఇంటియొద్దనే యామెకు విద్యాభ్యాస మైనది. అతిశీఘ్రముగ వ్రాయను, చదువను నేర్చుకొనెను. ఆంగ్లేయభాషయుఁగూడఁ గొంత నింటియొద్దనే నేర్చుకొనెను. అట్టే యట్టే వయస్సు హెచ్చుచున్న కొలఁది మొగములో లక్ష్మీకళ హెచ్చుచున్నది. శరీరము పుష్టియైన కొలఁదిఁ గంటిలోని శాసనతేజము తీక్ష్ణమగుచున్నది. చిత్తమునకు వికాసము కలిగినకొలఁది నావరించిన పవిత్రత హెచ్చగుచున్నది.

ఒక మహాసంపన్నకుటుంబములోని బాలుఁ డామెస్వరూప స్వభావాదులను విని వరించి, వివాహము చేసికొనెను. ఆమె పుట్టినింటి వారికంటె నత్తింటివారికి హెచ్చుసంపన్న తయు, రాబడియు నుండెను. మహాదృష్టవంతురా లని జనవాక్యము విజృంభించెను. అది వట్టి తెలివితక్కువమాట. ఈమెవలన నామహాసంపన్నుడే మహాదృష్టవంతుఁ డైనాఁ డను మాట బుద్ధికలిగిన మాట. ఆయన కప్పటికున్న కష్టము విచారము లీమెవలనఁగాని శాంతింప వని భగవంతుఁ డెఱిఁగి యీమెను వారియింట సంరక్షకదేవతగ నుంచినాఁడు. పూజకొలఁది పురుషుఁ డన్నసామెత యిచ్చట వర్తింపదు. ఆతఁడు చేసికొన్న పూజకొలఁదియే యీపాలంతి లభించిన దని యనుకొనుట సరిగా నుండును. ఇక నామహారాజున కేమిలోపము.

ఆడినది యాట, పాడినది పాట, పలికినది పలుకు, చేసినది చేఁత, ముట్టినది ముత్యము, పట్టినది బంగారము–ఇట్లు లిరువదియేడుసంవత్సరము లఖండవిజయముతో జరిగినది. ఆమె సంసార మెట్లు జరుపుకొనెనో ప్రతికాంతయేకాక, ప్రతి పురుషుఁడు గూడ తెలిసికొనవ లసినదే. మనుష్యలోకమునకంతకు నాదర్శప్రాయమైన యీామెవర్తనముఁ దెలిసికొనుటవలన దోషశమన మగును. పూర్వమహాపతివ్రతల కథలందువలె నీ మెచరితమునందు దావానలభక్ష ణములు, సూర్యగ్రహనిరోధనములు, మృతసంజీవనశక్తులు మొదలగు నమానుషప్రజ్ఞలు లేవు. ఆకాలపరిస్థితులఁబట్టి యాసన్నివేశములు సిద్ధించినవి. ఈకాలమున నవి యేమియుఁ గలుగవు. ఇప్పుడు సర్వసాధారణముగా సర్వసంసారములందు జరుగు సన్నివేశములలోఁ బతివ్రతయైన గృహిణి యెట్లు ప్రవర్తింపవలయునో యాపాఠమును దేశమునకు శాశ్వతముగా నేర్పిన యామహాపతివ్రత కనేకనమస్కారము లర్పించి మఱి చెప్పెదను.

సతికిఁ బ్రథమగణ్యమైనగుణము పత్యనురాగము. ఇదియే పునాదిగ సంసారభవన మంతయు నిర్మింపఁబడుచున్నది. ఇది యెంత బింకముగా నుండునో భవన మంతనిలుకడ కలదై యుండును. దీనితత్త్వమెట్టిదో రవంత పరిశీలింతము. భర్త పలికినపలుకులఁబట్టి, యిచ్చిన యీవినిబట్టి, చేసిన చేష్టనుబట్టి, చూపిన గౌరవమునుబట్టి భార్యయనురాగ మూసరవెల్లితలవలెఁ గ్రిందికి మీఁదకి నూఁగులాడుచుండును. అట్టి హెచ్చుతగ్గులు పత్యను రాగమున నెప్పుడు భార్యకుఁ గలిగినవో యది యనురాగము కాదని భావింపవలసియున్నది. భార్యకుఁ బతిని జూచిన మొదటిదినమున నెట్టియనురాగ ముండునో యట్టియనురాగమే విష్ణు దూతను జూచువఱ కుండవలయును. ఇట్టి యనురాగము కేవలము నిశ్చలమైనది. దీనికి హెచ్చుతగ్గులుండుట కవకాశము లేనేలేదు. తనకొఱకుఁ దా నెప్పుడు భర్తను బ్రేమించునో యప్పు డాయనురాగ మను రాగము కాదు. భర్తకొఱకే భర్తను బ్రేమించు పడఁతిమాత్రమే పత్యనురాగము కలది. పతివ్రత యని కొనియాడఁదగినది. అనఁగా నైహిక వాంఛాశూన్యమైన యనురాగము పత్యనురాగము. దేశమందున్న స్త్రీలందఱుఁ గూడ నిట్టియనురాగము నాకు నాభర్తపై నున్నదా యనా ప్రశ్నించుకొనఁగ యథార్థ మేదియో తెలియును. నే నెఱిఁగినంతవఱ కొక్కయీయిల్లాలిపత్యనురాగమే యట్లు నిశ్చలమైనది. సూర్యకాంతికి హెచ్చుతగ్గు లున్నవి; చంద్రతేజమునకు వృద్ధిక్షయము లున్నవి; సముద్ర మునకుఁ బోటుపాటు లున్నవి. కాని, యీామె యనురాగమునకు హెచ్చుతగ్గులు లేవు. మొదటితత్త్వ మైనయాకాశ మెట్లు మార్పు లేనిదో యీామె యనురాగ మట్టిది. నీ కెట్లు తెలియు నంధురా–నే నద్భుతశక్తులను సంపాదించినదానను గాన మీరు విశ్వసింపవల యును. పదునెనిమిదధ్యాయములలో భగవంతుఁడు బోధించినయానసక్తియోగ మీమె సర్వ సౌఖ్యసంపూర్ణమైన సంసారమునఁ బ్రత్యక్షముగ నాచరణ మందుఁ జూపించిరి. స్త్రీ కిదియే మోక్షమునకు మొదటిమె ట్టని గ్రహింపవలసినది.

ఇఁక మఱియొక సుగుణమును గూర్చి చెప్పెదను. పతివ్రతలు సాధారణముగా గర్వభూయిష్ఠలై యుందురు. కాని బీదలపాలిటి కల్పవల్లియైన యీామహాలక్ష్మికి గర్వ మనునది గంధగంధలేశమైన లేదు. ''గీ. వినయకారుణ్యబుద్ధి వివేకలక్ష, ణాదిగుణముల కాటపట్టయినవాని'' అని ప్రహ్లాదునిఁగూర్చి పోతరాజుగారు చెప్పినారు. సర్వశుభ గుణము లలో వినయ ముత్తమమైనది. అట్టిగుణ మీమెకుఁ గలదు. ఎంతబీదపిల్లలైన సరే, యెంత

దరిద్రకాంత లైన నరే, యెంతరోఁతగలుగు స్వరూప స్వభావాదులు గలవారైన నరే యెంతయో దయతో లాలించి, బుజ్జగించి, యాదరించి, ప్రేమించి, బహూకరించి తిరిగి రమ్మని పంపివేయునుదారస్వభావ మామెయందుఁ దక్క నే నెక్కడఁ జూడలేదు. ఈ కాంతాశిరోమణి తనకుఁ బరులకుఁ దత్త్వమున నెంతమాత్రము భేదము లేదని త్రికరణశుద్ధిగ నమ్మినయిల్లాలు. అట్టి పరమార్థదృష్టిచే నామెకుఁ గలిగిన యావినయ మామెను బరమపూజ్యు రాలిగఁ జేసెను.

గీ. ఇతఁడు నాశత్రుఁ డితని శిక్షింతు ననుచు
నతని నడఁచి త్రొక్కెడునాతఁ డధమతముఁడు
అందఱకు నేను దాసుఁడ ననుచు శిరము
నవనతము చేయునాతఁడే యధికతముఁడు.

అని బుద్ధుఁడు చెప్పిన నీతి నాచరణమునఁ జూపినజ్ఞానవతి.

ఇఁకఁ గారుణ్యమును గూర్చి చెప్పెదను. దాదాపుఁగా నిరువది యేడు సంవత్సరముల నుండి యెన్ని వందలకుటుంబములకు గుప్తదానము చేసి పోషించెనో యెవరు చెప్పఁగలరు? చదువులకుఁ గొందఱకు, భోజనములకుఁ గొందఱకుఁ పుస్తకములకుఁ గొందఱకు, బట్టలకుఁ గొందఱకు, పత్త్రికానిర్వహణమునకుఁ గొందఱకుఁ, గవితాప్రోత్సాహమునకై కొందఱకు, నిత్యభుక్తికై కొందఱకు, నలంకారములకై కొందఱకు, బుద్ధిలేక పాడైనవారి కింతటినుండి బుద్ధి కలుగుటకై కొందఱకు, పరీక్షాబహుమానములకై కొందఱకు—తెలిపిలేని యీవి, తెంపులేని యీవి, మెప్పుకోరని యీవి, త్రికరణశుద్ధియైన యీవి, ప్రచ్ఛన్నమైన యీవి, కృతజ్ఞతాలేశ మైన నపేక్షింపయీవి, పరమాత్మ ప్రీతి కరమైన యీవి మనుష్యస్వరూప దేవతాకాంతయైన యీమెహస్తముననున్నది. ఎవరిమట్టునకు వారు నామీఁత నున్నదయ యీమహాలక్ష్మికి మఱి యెవ్వరిమీఁతను లేదని నిశ్చయముగా నమ్మి యీమెను బ్రేమించు చుండిరి. ఇట్టిభ్రమను గలిగించు ననురాగవైచిత్ర్యము శ్రీరామచంద్రమూర్తిహృదయమున నుండెను.

విద్య, జ్ఞాపకశక్తి మొదలగువానిఁగూర్చి చెప్పెదను. ఈమెకు మూఁడుభాషలలో నసాధారణపాండిత్య ముండెను. ఆంధ్రసంస్కృత భాషాగ్రంథముల లెక్కయేమి? మహాగ్రంథాలయములం దున్నయన్ని యాంగ్లగ్రంథము లీమె చదివినారు. చదివిన దంతయు జ్ఞప్తిలో నున్నది. ఈమెబుద్ధి యేకసంతగ్రాహిత్వము కలది. వీరికుటుంబము పశ్చిమఖండప్రయాణము చేసినప్పు డీమె యాంగ్లేయ భాషాధోరణి, యాంగ్లేయ భాషాజ్ఞానమును గాంచి యచ్చటి గొప్పగొప్ప విద్యావతులాశ్చర్య మంది యీమెను గౌరవించిరి. ఆంధ్రభాషలో నమృతప్రాయమై, ధారాశుద్ధి యైనకవిత్వ మీమె చెప్పఁగలిగియుండెను. ఈమె కవితా చాకచక్య మెట్టిదో విమర్శనప్రాగల్భ్య మట్టిది. కథాసంవిధానము నందుఁగాని పూర్వోత్తరసందర్భమునందుఁగాని, వాగ్వ్యవహారము లందుఁగాని యవలీలగ దోషము కనిపెట్టి దిద్దఁగలమహానైపుణ్య మీమెకున్నది. ఈమె స్త్రీలసభలలో నెన్నిసారులో యుపన్యాసము లిచ్చి యుండెను. శారదాదేవివలె నుపన్యసింపగల విశారదరత యీమెకుఁ గలదు. ఇదికాక వీణావాదనమందు నేర్పరి. తనకుఁగల్గిన యిద్దఱు మగపిల్లలను, నల్గురాఁడుపిల్లలను మూఁడు భాషలందుఁదనవలెఁ బాండిత్యము గలవారిగను, వీణావాదనమందు శక్తిగలవారిగను జేసి

నారు. పిల్లలందరు దైవభక్తి గలవారు. మాతృపితృభక్తిగలవారు. ప్రజాహిత తత్పరులు. వినయవంతులు, వివేకులు, సత్ప్రవర్తనులు, ఇట్టియుత్తమ సంతాను మామె కాంచెను. ఆ కాంతాలలామ చేసికొన్న పూర్వమహా పుణ్యముచేత నిట్టిసత్సంతాన మామెకుఁ గలిగినదని చెప్పఁదగదు. పిల్లలు చేసికొన్న పూర్వజన్మసుకృతముననే వీ రామెగర్భమునఁ బడుట సిద్ధించెనని చెప్పఁదగినది.

ఎన్నినెలలు ప్రయాణమైనను సరే యన్నినెలలలోను, నన్ని పట్టణములలోను, నెప్పటి కేవస్తువు కావలయునో యని ముందుగఁ దెలిసికొని వాని నెచ్చటెచ్చట భద్రపఱుపవ లయునో భద్రపఱచి, యవసరానుసారముగ నుపయోగించి యొక్కవస్తువైనఁ బోకుండ నన్నియు నింటికిఁ దీసికొనిరావలసినదే. ప్రయాణపుఁబెట్టెల నామెయే సర్దవలయు నని చెప్పుదురు. ఎంతదూరదృష్టియో, యెంతవివేకమో, యెంతయవసరజ్ఞానమో, యెంతమేధా శక్తియో, యెంతభద్రప్రవర్తనమో చెప్పుటకు నాకు శక్తి చాలదు. కోటలో, బొమ్మలమేడలో, నెడమవైపున, రెండవగదిలో కుడిగోడమీది గుండ్రనిగూటిలో నున్న యావస్తువును భద్రపఱుపవలసిన దని జ్ఞాపకార్థముగా నిక్కడిదాసులకు రెండువేలమైళ్లదూరముననుండి వ్రాయుట నెక్కడనైన వినియుండిరా? నేను వినలేదు. లక్షలకొలది రాఁబడి గల మహాసంసా రపు భారమును భర్తకు లేశమైనఁ దగులకుండ నంతయుఁ దాను వహించి యవలీలగ నిర్వహించి పరమసుఖముగఁ బ్రవర్తించి వ్యవహారపుఁగాగితములు చూచుకొనుట, చదువుకొ నుట, సుఖముగ మిత్రులతో సంభాషించుట మాత్రమే భర్తకు వదలినైచి యాయనను నిర్విచారస్థితి నుంచిన యా యిల్లాలి ఘనతకు, నుదారతకుఁ బ్రేమకు హద్దున్నదా! ఆహా! పరాతత్పరుఁడా! ఎట్టియాత్మను సృష్టించితివోయి!

ఆమెయొద్ద నున్నసందడి కెన్నఁడైనఁ దెఱపియున్నదా! సంగీతములవారు, సాహిత్య ములవారు, పురాణములవారు, కవిత్వములవారు, నుపన్యాసములవారు, మంగళపుటారతు లవారు, హాస్యసంభాషణలవారు, నగరులోఁ దనచుట్టునుండి గౌరవింపఁబడుచుండ, పహరామీఁద బట్టలు తెచ్చినవారు, బంగారువస్తువులు చేసి తెచ్చినవారు, చేఁపలవారు, నడవిపందులవారు, పండ్లగంపలవారు, బట్టలుకుట్టువారు లోపలికిఁ బంపిన దాసులు లోనుండి వార్తలు వస్తువులు మోచికొనిపోవుచు వచ్చుచుండ, నోహోహో! కన్నులవైకుంఠము కదా! చూచి తీరవలసినదే–ప్రతిదినము పెండ్లియింటవలె నుండెడిదే. నిత్యకల్యాణమును పచ్చతోరణము కనఁబఱచినదే! దైవవశమునఁ బిల్లల కెప్పుడైన జబ్బు చేసినను భర్తకుఁ దెలిసినయెడల నాయన బెంగ పెట్టుకొను నని యెంచి సాధ్యమైనంతవఱకు రహస్యముగ నుంచెడివారు. తనసౌఖ్యముకొఱకు తా నొక్కపనియైనఁ జేసియుండ లే దని కంఠోక్తిగాఁ బలుకఁగలను. self అను తత్త్వమును బూర్తిగాఁ దుడిచి పాఱవైచినవ్యక్తి నెప్పుడైన వింటిరా! ఇప్పుడు విని పవిత్రత నొందుఁడు.

ఆమెకు మృతి యనఁగ భయము లేశమైన లేదు సరికదా మహానందము కూడను. భర్తప్రోత్సాహముచేతను దొరసానుల తొందరవలనను operation చేయించుకొనవలసివచ్చి నప్పుడు బల్లమీఁదఁ బండుకొని, తన్నుఁ గోయఁ దెచ్చినకత్తులవాడిని బరీక్షించి, యిది యెందులకది యెందుల కని యన్నిటి యుపయోగమును దెలిసికొని నవ్వుచు మత్తుమందు తీసికొన్న మానినీశిరోమణికి మరణభయ మున్నదా?–ఏదైన నవ్వుకున్న యెడల దోష

మున్నయెడల దేవసన్నిధానమునకుఁ బోవుటకు జంకుకాని, చంటిపిల్లవంటి నిష్కల్మషహృదయ యగునామెకు జంకేమి?

ఈమెకంఠరవము మర్దళధ్వనితో సమమైనది. అదియే యీమెకు మహాదృష్టలక్షణము. ఈమెమామగారిగొంతు మఱియొక విధముగా నుండెడిది. అది మందరధ్వనిలో మహాగంభీరమైనది. మాటలాడుచుండఁగా నాయనధ్వని యెంతయో లావుగ నిండుగ నున్నట్లగపడుచుండెడిది. అది యాయనకదృష్టలక్షణము. అట్టికంఠధ్వని యిప్పటి యుత్తరాదిమఠస్వాములవారి కున్నది కాని యీయిల్లాలిగొంతువంటిది నేను వినియుండలేదు.

తనకు రాఁబోవుమృతి నాలుమాసములకుఁ బూర్వమే యీమె కనిపెట్టెను. ఎప్పుడది వచ్చునో జాముజాము గడియగడియా లెక్కపెట్టుకొనుచుఁ బారశాలను వదలి బాలిక యింటికిఁ బోవునట్లు మహోత్సాహమున నుండెను. ఆమె కన్యగ్రామములో మృతి సిద్ధించెను. స్వగ్రామమునుండి వెడలఁ బోవునప్పుడామె మామగారి నిల్వువిగ్రహమునకు మోకాళ్ల నమస్కరించి యిట్లు మనవిచేసెను. "మీవంశమును కొల్చునవకాశము నా కిఁక లేదు, మీపూర్వులవలన మీవలన వంశమునకుఁ గలిగినగౌరవమును నేను జెడఁగొట్టలే దనుటకు నాయంత రాత్మ సాక్షి-మీ నిశ్శరీరాత్మ సాక్షి. పరమాత్మ సాక్షి. నాకు సెలవు. నమస్కారము." అటుపిమ్మటఁ గొన్ని విష్ణుపటముల యొద్దకుఁ బోయి వానికి నమస్కరించి యిట్లు పలికెను. "నాకుఁ బరమేశ్వరునియందు దృష్టి నిలుకడగా నుండుటకు మీరు కొంత సాయము చేసినారు. ఇఁక నేను బరమాత్మయొద్దకే పోవుచున్నాను. నాకు సెలవిందు." తరువాతఁ దోఁట లోనికిఁ బోయి తాను పెంచినపూలచెట్లనన్నింటిని జూచి, స్పృశించి పుష్పములఁ ద్రుంపకుండ నాఘ్రాణించి "మిమ్మింకఁ జూడను. మీకు నాకు ఋణము తీఱినది" యని పలికి, జయపరమేశ్వరా! యని యుత్సాహమునఁ బోయి తనకుటుంబముతో రైలెక్కెను.

ఆమె యిప్పుడు వైకుంఠమున లక్ష్మిసన్నిధానమున నున్నది. అట్టి యత్యుత్తమురాలింతకాలము జీవించియుంటయే దుర్లభము. ఆంధ్రదేశమున నామెకొఱ కిప్పటి కేడ్చుచున్నారు. ఆమెకుఁ బునర్జన్మము లేదు. శాశ్వతమహానందము నామె రమాసన్నిధి ననుభవించుచున్నది. కొందఱుస్త్రీ లామెను దేవతార్చనలో మహాలక్ష్మితో పాటు పూజచేసి కొనుచున్నారు.

విద్యాధరస్త్రీ లేమో మాటలాడుకొనుచున్నా రని చెప్పితిని కాదా! ఒకతె రెండవదానితో నిట్లనెను. "ఒక మహారాజు ధర్మపత్నియఁట. అత్యుత్తమురాలఁట. మంచివయస్సులోఁ బవిత్రాగ్ని స్పర్శమువలన దేహము చాలించినదఁట. ఆమెమహాలక్ష్మిసన్నిధానమున సావిత్రితో పాటు గౌరవింపఁబడుచున్నది. హంసయాన మెక్కి యామె యుత్తర ద్వారమునొద్దకు రాగానే యప్సరస్త్రీలామెకు మంగళపుటారతులిచ్చిరి. కల్పవృక్షము జల్లునఁ బూవు లామెపై గురిసెను. అమ్మా! అమ్మా! యని కామధేను వానందమున నఱచెను. అరుంధతీదేవి యామెతలపైఁ గరముంచి యేదియో చదివెను. తనలోఁ గలుపుకొనునట్లామెను మహాలక్ష్మి కౌఁగిలించుకొనెను. నీ కప్పుడు చూచుభాగ్యము లేక పోయెను. ఆమె పూర్వజన్మమున నొక్క మహాతపశ్శాలి యఁట. మోక్షమునకై తపస్సుచేయఁగా విష్ణుమూర్తి ప్రత్యక్షమై యిఁక రెండుజన్మము లెత్తినఁ గాని వీలులేదని పలికెను. తపస్సునకుఁ దిరుగ

నాతఁడు కూరుచుండెను. తిరుగ విష్ణువు ప్రత్యక్ష మయ్యెను. ఒక్క జన్మముకంటె వే నెత్తను. నా కప్పటికైన మోక్ష మిమ్మని యాతఁడు ప్రార్థింపఁగా సరే యాఁడుజన్మ మెత్తు మని విష్ణుఁ డానతిచ్చెను. ఆసాధువే యీయిల్లాలై పుట్టెనఁట. పూర్వము సాధువున కలవాటున్న సూర్యోపాసన యీామె స్త్రీజన్మమునఁ జేసికొనెనఁట. దేవతార్చన సంబంధ మగు నగ్నిజ్వాలచేఁ జీర యంటుకొన నొడలు కాలిపోయెనఁట. అట్టిపవిత్రాగ్నిచేఁ గాలినది జన్మపరంపర కాని శరీరము కాదఁట. ఇఁక నేమేమో యరుంధతిగా రుపన్యసించినారు. ఆమాటలు నాకుఁ దెలియలేదు. ఈమె మహాలక్ష్మి సన్నిధానమున శాశ్వతముగా నుండునఁట.'' ఇవే నేను విన్న మాటలు. కాంతలారా! మీరు చేయఁ గూడనిపని యొక్కటి యున్నది. అది యేదనఁగా, ఆమె యీప్రపంచమును వదలిపోయిన దని యెన్నఁడు కంట నీరు పెట్టవలదు. మీరు చేయవలసినపను లున్నవి. అవియేవో చెప్పెదను.

ఆమెపేరు తలఁచుకొని కీర్తింపుఁడు. ఆమె స్వరూపమును దలఁచు కొని పూజింపుఁడు. ఆమెయోగ్యతను దలఁచుకొని యనుకరింపుఁడు. ఆమెప్రేమను దలఁచుకొని భగవత్ప్రేమ యట్టిదే యనుకొనుఁడు. ఆమె స్వార్థహీనతను దలఁచుకొని మహోత్తమజీవులతత్త్వ మదియే యనుకొనుఁడు. అఖండములైన సర్వసౌఖ్యములం దామె యంటిముట్టనట్లుండిన చర్యను దలఁచుకొని మోక్షమున కిదియే ప్రథమలక్షణ మనుకొనుఁడు. అట్టి దేవతాతేజస్సు లోకసంగ్రహార్థమై యవతరించి యొక్క సారి రప్పుమని వెంటనే శాంతించిన దనుకొనుఁడు. ఆమెకు జయజయ ధ్వానములిందు—జయ మహాలక్ష్మికి జయ—జయ చిన్నమ్మతల్లికి జయ జయ, ఆండాల్మహాదేవికి జయా—జయా—జయా, మహాపతివ్రతతామతల్లికి జయ (సభలో నొకరు) యోగినమ్మా! మమ్మేడువవలదని చెప్పి మీరే యేడ్చుచున్నారేమి? అమ్మా! నిజమే. ఈమె యుత్తమగుణము లొక్కసారి మనము స్మరించుకొనుటచేతనే మనకింత దుఃఖము కలుగుచుండఁగా దాదాపుగా ముప్పదిసంవత్సరము లామెతో సర్వసౌఖ్యము లనుభవించిన యీమహాప్రభుఁడు నామెతో నేకప్రాణుఁ డైన మహాప్రభుఁడు యేకపత్నీవ్రతుఁ డైన మహాప్రభువు తరుగని దుఃఖములో మునిఁగియున్నాఁ డనుట యాశ్చర్యమేమి? కాంతలారా! నిత్యమామెను స్మరియించుకొనుచు సంసారములఁ జూచుకొనుచు సుఖముండుఁడు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# 29. సభావ్యాపారములు

ఈరోజు ఉపన్యాసమేమీ లేదు. కాలాచార్యులు, వాణీదాసు, జంఘాలశాస్త్రి పిచ్చాపాటీ మాట్లాడుకొంటున్నారు.

సాహిత్య ప్రయత్నం, కృషి అనేవి ముందరి నుంచీ దరిద్రమైనవే. కాఫీ హోటలు, సినిమాలు ఈ [illegible] డబ్బు సంపాదించే వ్యాపారాలుగా కనిపిస్తున్నాయని జంఘాలశాస్త్రి అని–కాలాచార్యుల అభిప్రాయం అడిగాడు. దానికి అతడు తర్కధోరణిలో, చావుబతుకుల గురించి చెప్ప విచారించవలసిన అవసరం లేదన్నాడు. వాణీదాసు, కాలాచార్యులు తర్క ధోరణిని ఖండించి, రవంత సేవ పొడుము దొరక్కపోతే నీ బాధ ఆదేవుడికి తెలుస్తుంది అన్నాడు. దాంతో, కాలాచార్యులు, తాను పొడుము మానేశానని చెప్పాడు. వీరు ఇలా మాట్లాడుకుంటుండగా, పోస్టులో సాక్షి పేర ఒక ఉత్తరం వచ్చింది. వ్రాసినవాడు 'అనామకుడు'. అందులో విషయం ఏమంటే, హరిజన సేవ చేసిన మహానుభావులు వార్తలలోకి ఎక్కినవారు ఎక్కగా, ఎక్కకుండా అజ్ఞాతంగా వుండిపోయిన వారు అనేకులు వున్నారనీ, వారి వివరాలు సేకరించి ప్రచురించవలసిన అవసరం ఎంతైనా వుందని – ఇందుకు తార్కాణంగా, వేదాధ్యయన పరుడైన ఒక బ్రాహ్మణుడి గురించీ, అతని భార్య గురించీ, వారి నిరతాన్నదాన దీక్ష గురించీ వ్రాశాడు. ఈ అన్నదాన విషయంలో కులభేదాలు ఏమీ లేవని వివరించాడు.

ఒకరోజు రాత్రి ఏటికవతలనుంచి, అన్నం కోసం ఒక హరిజనుడి కేకవిని–మాంచి వరద బిగిమీద వున్న యేటికి అడ్డం పడి ఆ మనిషికి విస్తరి వేసి అన్నం పెట్టిన వైనం తెలియచేశాడు. అన్నదానం చెయ్యడం తప్ప ఏ కీర్తీ ఆశించని ఆ బ్రాహ్మణుడి పేరు అజ్జాడ అన్నయ వైనులు గారని, ఆ అనామకుదు వ్రాశాడు.

**జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:–**

ఈదినమున నుపన్యాస మేదియు లేదు. సభావ్యాపారముల కేర్పాటయినదిన మిది. ధనము లేకపోవుటచేత నన్ని వ్యాపారములు నశించినట్లే మావ్యాపారముకూడ నశించినది. సారస్వత వ్యాపారము సృష్ట్యారంభమునుండియు దరిద్ర వ్యాపారమే. అందులో నిపుడు

మఱింత పుట్టేమనుక వచ్చినది. ఇది యెందులకు వచ్చినదో యెవ్వఁ డెఱుఁగఁడు. ఎంతకాల ముండునో యెవ్వఁ డెఱుఁగఁడు. ఏమిప్రతిక్రియ చేయవలయునో యెవ్వఁ డెఱుఁగఁడు. ఇప్పటికిఁగూడ కాఫీహోట లొకటి, సినీమా యొకటి, యీరెండువ్యాపారములు మాత్రమే ధనాకర్షణ సమర్థములై యున్నవి. కాలాచారీ! నీ యభిప్రాయమేమి?

కాలా:– చచ్చిపోవుదు మనియేనా బెంగ? చావకుండ మున్నంత వఱకు బ్రదికియే యుందుముకదా! బ్రతికియుండఁగా జావువిచారమేల? చచ్చిన తరువాత విచార మసలే యక్కఱలేదు గదా! ఇఁగ బెంగఁగొన వలసిన యవస్థయేదో నా కగపడుట లేదు.

వాణీ:– అంతేకాని మధ్యావస్థ లేదా?

కాలా:– మధ్యావస్థ యనఁగాఁ జావునకుఁ బూర్వావస్థయేనా? కొన్నిదినము లారోగ్యము పూర్తిగాఁజెడి రోగముచేఁ దీసికొను నవస్థయేనా?

వాణీ:– ఔను.

కాలా:– మధ్యావస్థకు సూత్రము మధ్యావస్థ యనునది రెండు భాగములుగా నున్నది. జ్ఞానవంతమైన యవస్థ, జ్ఞానములేని యవస్థ, అనఁగా నొడలు తెలియని యవస్థ, ఒడలు తెలిసిన యవస్థ. ఒడలు తెలిసిన యవస్థలో బ్రదికియున్నా మన్నసంగతి యెఱిఁగియే యుందుము గనుక బ్రతికియుండఁగా విచార మక్కఱలేదన్న సూత్రము పనికే వచ్చును గదా! ఒడలుతెలియని యవస్థలో విచార ముండుట కవకాశమే లేదు గదా!

వాణీ:– ఏడ్చినట్లే యున్నది.

జంఘా:– వాణీదాసా! అతనికిఁదోఁచిన ట్లతఁడు చెప్పినాఁడు. అతని నట్లు నిందించుట తప్పు కాదా?

వాణీ:– మనలో మనము స్నేహముచే ననుకొన్న మాటలకు లెక్కయేమి?

కాలా:– మనలో మనమే యన్నమాట యక్కఱలేదయ్యా పైవారు నన్నుదిట్టినను నేను దిట్టువాఁడను నరే కదా! తిట్టినట్లు కూడ నే ననుకొనను.

వాణీ:– ఎందుచేత?

కాలా:– దీనికిఁ గూడ నదియే సూత్రము. ఒకఁడు నన్ను దిట్టుటకు నే నర్హుఁడను గానంతవఱకు పైవారు తిట్టినది నన్ను గానే కాదు కదా. నాకు బాధ యెందులకు? అర్హుడనే యగుదునా ఆతిట్లను వందనములతో నంగీకరింతును. ఏవిధముచేత బాధ కనఁబడదే.

వాణీ:– ఆచరణమున కక్కఱకు రాని శుష్కాలాపము లాడుచున్నావు. రవంతసేపు పొడుము దొరకకున్న యెడల నీబాధ దేవుఁడెఱుఁగును.

కాలా:– నీ వెఱుఁగవు కాఁబోలు. పొడుము మానివేసి 3 సంవత్సరము లైనది. చక్రవర్తిగారు డబ్బు లేకపోవుటచేత కాఫీలో పంచదార తగ్గించుకొనినప్పుడు నాముక్కు వారి నోటికంటె నెక్కువయాయని యొక్కసారి నస్యవిసర్జన మొనర్చినాను.

వాణీ:– నీపీడ, దేశపుపీడకూడ వదలినది.

అంతలోనే తపాజవాను సాక్షిపేర వచ్చిన యొక యుత్తరమును నాకిచ్చెను. నేను జూచుకొని నా మిత్రులకు వినిపించితిని. అదియిట్లుండెను.

సాక్షికి:– అనామకుఁ డనేక నమస్కారములు.

మాజిల్లాలో హరిజనులకు సేవఁజేసిన మహానుభావుఁ డొకఁడుండెడువాఁడు. ఆతఁడు చేసినసేవయంతయుఁ బ్రచ్ఛన్నముగ జరిగియుండుటచేత నాతనికి విశేషఖ్యాతి రాలేదు. కాని యాపుణ్యాత్మునిఁ గూర్చి యీ మండలములో మట్టున కెన్నియో చిత్రములై కథ లిప్పటికిఁ జెప్పుకొనుచున్నారు. ఇట్లు ప్రతిమండలమునకు నొక్కరిద్దఱు హరిజన సేవకు లుండిరి. హరిజనసేవాపవిత్రములైన యీదినములలోనే వారి ప్రచ్ఛన్న చరిత్రమును పైకిదీసి యవి ప్రజల కుపయోగించునట్లు చేయకపోయిన యెడల దోషము కాదా! కృతఘ్నత కాదా? ఆంధ్రులలోఁ బ్రముఖ లేమిచేయవలెననఁగా మండలమున కిద్దఱు బుద్ధిమంతులను నియమించి పూర్వమున నచ్చటచ్చట హరిజనసేవకు లెవ్వరో వయస్సు మీరిన స్త్రీపురుషు లను గనుఁగొని వారిచరిత్రము లన్నియుఁ బ్రోగుచేయింపవలసియున్నది. అవి పరిశీలించి ప్రకటింపవలసియున్నది. వారిలో నెందఱో పవిత్రులు నవతారపురుషు లున్నారు. నేను మాజిల్లాలో బాహాటముగ నందఱు చెప్పుకొనుచున్న కథ నొక్కదానిని మీకుఁ బంపించితిని. దీనిని మీరు సాక్షిలోఁ బ్రకటింపవలయును.

అనఁగ ననఁగ బ్రాహ్మణుఁడు. ఆతఁడు వేదాధ్యయనసంపన్నుఁడు, పవిత్రచరిత్రుఁడు. అతని భార్య యత్యుత్తమురాలు. భర్తను పరమదైవముగఁ గొల్చుచుండెను. వారికిఁ బిల్లలు లేరు. ఉన్న భూవసతి వలని రాఁబడిచేత వారు సర్వజాతుల కన్నప్రదానమొన ర్చుచు భుక్తశేషమును దాముదినుచు సుఖముగ నుండిరి. కాని నిరతాన్నప్రదానము చేత ఋణమెక్కువైనది. దానినిఁ దీర్చుటకై భూముల నమ్మివేసినాఁడు. ఇల్లుమాత్రము మిగిలి నది. ఇకను విరివిగ నన్నప్రదానముజేయుచున్నాఁడు. ఋణము నెమ్మదిగాఁ దిరుగఁ బెరుగుచున్నది. ఈతని యన్నప్రదానమున కా నేళ యీవేళయు లేదు. ఆజాతివాఁ డీజాతివాఁ డనుభేద మంతకంటె లేదు. ఎప్పు డెవఁడు వచ్చి యన్నమడిగిన నరే వానికిఁ బెట్టవలసినదే.

ఇట్లుండ, నొక్కనాఁటిరాత్రి నిదురించుట కింకఁ బ్రయత్నపడుచుండఁగా నేటియావలినుండి ''చైనులుగారూ! అన్నము! అన్నము'' అని కేక వినఁబడెను. ఆకేకతో నదిరిపడి ''ఆ'' యని యొక్క కేక వైచెను. ఇంతలో ''నేను చండాలుఁడ నని ఈచుట్టుపట్టుల గ్రామములవారు నాకన్నము పెట్టలేదు. మీరుపెట్టుదురని తెలిసి మీయొద్దకు రాఁబోవఁగ నేరడ్డము వచ్చినది'' అని మఱింతగట్టికేకక వినఁబడెను. వచ్చుచున్నా నని బ్రాహ్మణుఁడు గొంతెత్తి యఱచెను. రాత్రిభాగము కావున నడుమ నీరున్న కారణమున నేరు విశాలమైనద య్యును గేకలు సులభముగా వినవచ్చుచుండెను. ఏటికిఁ బూర్తిగా వఱద తగిలినది. నడుము బిట్టెక్కి నురగలతోఁ బ్రవహించుచున్నది. భయంకరముగ నున్నది. అది చీఁకటిరాత్రి. అంతలో బ్రాహ్మణుఁ డేటియొద్దకు వచ్చినాఁడు. మోకాలు దిగని యంగ వస్త్రము కట్టినాఁడు. దానిపై మఱియొక్క యంగవస్త్రము నడుమునకు బిగించినాఁడు. పెరుగున న్నము కలిపియుంచినకుండ నెత్తిపైనున్న చుట్ట కుదిటపైఁ బెట్టినాఁడు. కుండపైనున్న మూఁకుటిలో నావకాయ మొదలగువానిని బెట్టినాఁడు. దానిపై రెండడ్డాకువిస్తళ్లు

పెట్టినాఁడు. దానిపై నొక్క యంగవస్త్రము వైచి గడ్డము క్రిందికి గావంచయంచులు రానిచ్చి గట్టిగ ముడివైచినాఁడు. ''జయా! పరమేశ్వరా!'' యని యేటికడ్డుపడి ''నాయనా పంచమసోదరా! వచ్చుచున్నాను. ఒకపావుగంట శాంతింపుము'' అని చుట్టుపట్టులనున్న మెట్టలు ప్రతిధ్వనించున ట్లొక్క కే వైచినాఁడు.

ఆహా! ఆహాహా! ఈతఁడు మనుజుఁడా? దేవతయా? యని గాలి హాహా కార మొనర్చుచున్నది. ఎంత పరోపకారశీలతయో యని చెట్ల మీఁదిపిట్టలు తత్కీర్తిగానము చేయుచున్నట్లుండెను. ఏటిప్రవాహమొకప్రక్కకుఁ ద్రోచివైచుచున్నను బింకముగ నిల్చ్వటీఁత నీఁదుచు సాధ్యమగునంతవఱ కేటి కడ్డముగఁ బోవుచున్నాఁడు. అంతరిక్షము నుండి దేవతలు పుష్పవృష్టి గురియుచున్న యట్లు చినుకులు పరకపాటుగఁ బడుచున్నవి. ఇంతసాహసమేల చేయవలయు నని భార్యయైనఁ జెప్పలేదా? బతిమాలుకొనలేదా? కాళ్లపైఁ బడలేదా? ఏడ్వలేదా? ఏమో! ఎవఁడెఱుంగును! కాని యామె యింటియొద్ద నెంత యేడ్చుచున్నదో! ఆమె యింటియొద్దనున్నదా? ఏటియొద్ద దైవప్రార్థన మొనర్చుకొనుచుఁ గూరుచుండియున్నదే! పంచమసోదరుని క్షుద్బాధ శాంతింపఁజేసి భర్త తిరుగ వచ్చుట సిద్ధించునెడల నే నాతనితోడనే యింటికిఁ బోవుదును. రాఁడేని యేగంగతల్లి కడుపున నాభర్త యుండునో యక్కడనే నే నుందునని నిశ్చయపరచుకొని యటఁ గూరుచుండియున్నది. ఆహా! ఏమియిల్లాలు! దైవప్రార్థన యెట్లుచేసికొనుచున్నదో చెప్పనా? ''పరమేశ్వరా! నీవు నాభర్తను రక్షింపుము. నన్ను నాభర్తయే తరింపఁజేయును. కావున నన్నుఁగూర్చి ప్రార్థించి నీకు శ్రమమీయను. ఒకవేళ నాభర్త కీ రాత్రితో యాఁకలి శాంతించువఱకైన నా భర్తను సజీవునిగ నుంపుము. ఇంతకంటె నేను మఱేదియుఁ బ్రార్థింపను. నా భర్తతో నేనుందును గావున నాకు విచారము లేదు.''

ఆహాహా! ఇట్టిప్రార్థన మెచ్చుటనైన వింటిరా! ఆంధ్రసోదరులారా! ఈదంపతులలో నెవరు యోగ్యతరులో చెప్పఁగలరా? ఇట్టి వారిని గన్న మామండల మెంతకృతార్థమో చెప్పవలయునా?

ఆవలిగట్టుచేసి విస్తరిలో నన్నము వడ్డించి యొడిలో నాహరి జనుని బెట్టుకొని యెడమభుజమునకుదాపుకొని యన్నముతినుటకుకూడ హవాలా తప్పిన యాతనినోటిలో రవంత రవంత యన్నము పెట్టి మంచినీరిచ్చి శోషిల్లుచున్న ప్రాణములకు శక్తినిచ్చి బ్రదికించి, పుణ్యము కట్టుకొన్న యాబ్రాహ్మణోత్తముని పేరేదో చెప్పనా? అజ్జాడ అన్నయ చైనులుగారు. అజ్జాడ అన్నయ చైనులుగారు! హరిజనప్రపంచమా! ఆంధ్రదేశమా! ఒక్కసారి ధన్యవాద మిమ్ము! చాలదు. మఱియొక్క సారి! ఆంధ్రదేశమా! ఆతనిభార్యపేరు తెలియునా? ''పాపాత్మ్మఁ''డనైన నాకుఁ దెలియదు. ఎవ్వరైన నెఱిఁగియుండునెడల సాక్షిద్వారమునఁ దెలియఁబఱచి సంతసింపఁజేయుదురా? అజ్జాడ చైనులకు రెండు ధన్యవాదములే యిచ్చిరి. కాని యానారీశిరోమణి మూఁడుధన్యవాదముల కర్హురాలు. కానిండు. ఒకటి, రెండు, మూఁడు.

చిత్తగింపుఁడు,
అనామకుఁడు.

# 30. ఒక కథ

జంధ్యాలశాస్త్రి ఈరోజు ఉపన్యాసం ఏమీలేదని చెప్పి—ఒక కవి వ్రాసిపంపిన కథ చదివి వినిపించాడు.

ఆ కథ, నిరతాన్నదాత, అఖండ రామభక్తుడు కొర్నిపాటి సుబ్బరాజు గారిది. 1922 నాటికి నూరేళ్ల క్రితం జరిగిన కథ. ఆ సుబ్బరాజుగారు జొన్నల అన్నం, నక్కదోసకాయ ఊరగాయ, గోగుపచ్చడి, బర్రె పెరుగుతో నిరతాన్నదానం ముప్పై సంవత్సరాలు చేశాడు. ఇది చేస్తున్న కాలంలో అనేక ఆంధ్ర కావ్యాల్ని గుసవమంత గంటంతో తాటాకుల మీద వ్రాసి దాచిపెట్టేవాడు. అలాగే పోతన్నగారి భాగవతం కూడా వ్రాసుకుని తన అభిమాన గ్రంథంగా పెట్టుకున్నాడు. కవులందరి పోలికలను తన ఊహతో దర్శించినట్టు అందరికీ చెప్పేవాడు.

కాలక్రమాన ఆయన ఆర్థికంగా పూర్తిగా చితికిపోయాడు. ఈ సంగతి తెలిసి, ఊరిలో ఒక సంపన్నుడు ఆదుకోబోతే, వద్దని తిరస్కరించి—భాగవత ప్రతిని తలమీద కట్టుకొని—భార్యనీ, అయిదేళ్ల ఆడపిల్లనీ తీసుకుని —ఒంటిమిట్ట కోదండరాముణ్ణి నమ్ముకొని—ఊరు విడిచి వెళ్లిపోయాడు.

అది ముహమ్మదీయ రాజ్యం. ఒకనాడు నవాబుగారు వెళ్లేబండికి అడ్డు నిలిచి తన చేత కావ్యాల ప్రతులు వ్రాయించుకొని, తనకు జరుగుబాటు చేయించమని కోరాడు. అతని తీరు నచ్చకో ఏమో నవాబు భటుల చేత కొట్టించాడు. ఒక భటుడు, సుబ్బరాజుగారి జంధ్యం తెంపబోతే, రొంటి నున్న గంటంతో వాడి తలమీద కొట్టాడాయన. వాడు పడిపోయాడు. సుబ్బరాజు గారికి కారాగారం ప్రాప్తించింది. ఆయన కారాగారంలో వుండ గానే, ముందు కూతురు, తరువాత భార్య మరణించారు. ఆయన గంటంతో కొట్టిన మనిషి ఇరవై రోజుల తరవాత మరణించడంతో, నవాబుగారు సుబ్బరాజుగారికి మరణశిక్ష విధించారు. తలారి, ఆయన తల నరకలేకపో యాడు. సుబ్బరాజుగారు, తను తలమీద కట్టుకున్న భాగవత ప్రతిని విప్పి పక్కన పెట్టి, కోదండ రామప్రభో! అని గట్టిగా అరిచి, క్రిందపడి మరణిం చాడు. ఈ సన్నివేశానికి ఆ తరవాత నవాబుగారు, ఆయన ప్రజలు ఏడిచారు. నవాబు రామభక్తుడయ్యాడు.

సుబ్బరాజుగారి కథను, ఈదేశంలో రామభక్తి పారవశ్యానికి గుర్తుగా ఆ కవి వ్రాసి పెట్టాడు.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను:-

నాయనలారా! నేఁ డుపన్యాసము లేదు. ఎవరో యొక కవి సాక్షిసంఘములోఁ జదువుటకొఱకు కాకకథను వ్రాసిపంపెను. దానిని చదివెదను. సావధానముగ వినఁగోరుచు న్నాను.

నక్కదోసకాయ యూరుగాయ, గోఁగుకూర పచ్చడి, బఱ్ఱె పెరుఁగు అంతే. అంతకంటె నక్కడ నేమి దొరకును? అవే పంచభక్ష్య పరమాన్నములు. ఇట్లునుదినము వేళపాళయని లేక కొర్నిపాటి సుబ్బరాజుగా రన్నప్రదాన మాచరించుచుండిరి. అన్నము జొన్న యన్నము. విస్తరి బొద్దుమేడియాకు విస్తరి. ఉప్పు ఱాతియుప్పు. నీరు దిగుడుబావి నీరు. ఇప్పటి మాటయా? దాదాపుగా నూఱేండ్లక్రిందటిమాట, ముప్పది సంవత్సరము లి ట్లాబ్రాహ్మణుఁ డన్నప్రదాన మొనర్చినాఁడు. మహానుభావుఁడు. నిర్గర్వుఁడు. నల్వురు మోయఁదగిన చొప్పమోపును తానే పొలమునుండి తలపైఁ బెట్టుకొని తెచ్చి బఱ్ఱెలకు వేయును. వానిపాలు పాలికాపులచేఁ బితికింపక తానే పితుకును. ఇంట నందఱ కాతని భార్యయే వంట చేయును. వంటలక్కలు కాని, నీళ్లబ్రాహ్మణులు కాని వారి కెవ్వరును లేరు. ఉంచుకొనవలసిన యావశ్యకతయు వారికి లేదు. తమయింటిపని నౌకరిచేఁ జేయిం చుట వారు తప్పుగ భావించుచుండెడివారు. పచనాదికృత్యములను బైవారిచేఁ గూలిపెట్టి చేయించినయెడల నతిథిపూజాఫలము పరిపూర్ణముగఁ దమకు సిద్ధింపదేమో యని వారికి భయము. పాలుమాలికలేక, యొడలు దాఁచు కొనక భూతసంతుష్టి చేయుటయే పుణ్యకార్య మని నమ్మి వా రట్లు చేసిరి.

మగనికిఁ దనకుఁ దవ్వెడుబియ్యము కుతకుతలాడించుటకే యీ కాలపుఁ గుల కాంతల కోపికలేదు. దొడ్డిలో దాసి. వీధిగుమ్మములో సేవకుఁడు. ఇంటిలో వంటలక్క. ఇంతపై బలగమున్నఁగాని యాలు మగనికంటె నెక్కువలేవి యిద్దఱకాఁపుర మీ దినములలోఁ గడతేఱకుండ నున్నది. పంచపాళిలో నాఱువైచినబట్ట భటునిపాలు. పెరటిలోఁ బాఱవైచిన తప్పెల దాసిపాలు. పడమటింటిలోని పప్పు నేయి సామాను బాపనక్కపాలు. అమ్మగారు పడకటింటిలో నౌరంగజేబు నవలను జదువుచు నావులింతల పాలు. అయ్యగా రణాబిల్లపై సంతకములతో నప్పులపాలు. ఇంతేకదా యిప్పటి సంసారముల సౌభాగ్యము! అతిథిపూజ లేదు. సరేకదా పతివిస్తరిలోఁ బచ్చడి మెదుకులయినఁ జేసి పెట్టినదేది? వంటప్రొయ్యి యొద్దఁ గూరుచుండు నెడల మొగముమెరుగు కరఁగిపోవునప్పుడు మగనిమొగాన నింక మొద్దులేగాని మఱియేమున్నది! ప్రాసయతి మంజరీద్విపదలో నుండవచ్చునో లేదో తెలియును గాని, పప్పుడికిన తరువాత నుప్పువేయవలయునో-యుడుకకముందు వేయవలయునో తెలి యదు. ఉండలు జిల్లెడుకాయలు కాకుండ నత్తెసరు వేయగల యమ్మగా రన్నపూర్ణాదేవి గారు. వంటయింటిలోని ప్రాణాహుతులతోను, బజారులోని కారపుఁబూసతోను గాఁపురము లెట్లో జరుగుచున్నవి. జరుగకమానునా? కాలచక్రము నెవరడ్డగలరు? ఆయువుండఁగా నెవరేమి చేయఁగలరు? మగలబ్రతుకులే యిట్లు దిగనాఱునప్పుడు మఱఁదుల, బావల, యత్తల బ్రదుకు లడుగవలయునా?

కాని యాహా! ఏమిదుర్గమ్మ! దూపాటి సీమనుండి వచ్చినవాఁ డొకఁడు. నల్లమల నుండి వచ్చినవాఁ డొకఁడు. కోనసీమనుండ వచ్చినవాఁ డొకడు. పలనాటిసీమనుండి వచ్చినవాఁ డొకఁడు. ఇట్లెందఱో యతిథులై రాఁగా, వారి కందఱకు బహుపరిశుభ్రముగా వండి భర్తకుట్టి సిద్ధపఱచి యుంచిన యాకులలో వడ్డించి, వారు సంతుష్టిగ భుజించిన తరువాతఁ దాను భుజించును. ఇట్లొక్కదినమా? ఒక్కమాసమా? ఒక్క సంవత్సరమా? ఆఁడుదాని పరిపూర్ణ సహాయ్యము లేకుండ బ్రహ్మదేవుఁడైన నన్నప్రదాన మాచరింపలేఁడు. అన్నప్రదానపుణ్యమంతయు నంగనదే!

ఇఁక నీ యతిథులకు సాయంకాలమున మూఁడుగంట లగుటతోడనే –అనపుఁగాయదినములలో తంపటివైచిన యనుపగుగ్గిళ్లు, లేజొన్న కంకులదినములలో నూచబియ్యము. మొక్కజొన్న పొత్తుల కాలములో మొక్కజొన్నపొత్తులు. ఇట్లు ఏయే కాలములలో నేది వచ్చునో యది యల్పాహారముగా వారియెదుటఁ బెట్టి తాను చేగునప మంత గంటము చేతఁ బుచ్చుకొని, తాటియాకులపై భాగవతమో, హరివంశమో, మఱే దియో యా సుబ్బరాజుగారు వ్రాసికొనుచుండును. ఇట్లాతఁ డెన్ని గ్రంథములో వ్రాసినాఁడు. కవీశ్వరు లాతనికిఁ గన్నులఁ గట్టినట్లుందురు. తిక్కన సోమయాజి యాఱడుగుల పొడవగువాఁడని గ్రద్దముక్కుకల వాఁడని నడుముకట్టులోఁ జురకత్తి కలవాఁడని, కాలిన మొక్కజీడిపప్పు రంగువాఁడని యాతఁ డా యతిథులతోఁ జెప్పుచుండును. చేతిలోనున్న యనుపపప్పు ముందుఁ గథలోనున్న కాలిన మొక్క జీడిపప్పెక్కువ రుచింపకుండుటచేఁ గాఁబోలు వా రామాటలను గణింపకుండెడివారు. తిక్కన సోమయాజిగా రిట్లుండెనని మీకెట్లు తెలిసినదని యాయన నెవ్వరు నడుఁగలేదు. అడిగినయెడలఁ గారణ మాయనకు మాత్ర మేమి తెలియును? అట్లాయనకుఁ దోఁచుటయే కారణము, పింగళి సూరన్నగారికి ముందుదంతములలో నొకటి పొడుగని, యొకటి పొట్టియని చెప్పును. ఆయనకు అలాగునఁ గనఁబడుచుండఁగ నెవరు కాదనఁగలరు? ఒకనాఁడు తాను తనభార్యయుఁ బండుకొని యుండఁగాఁ దాను "దుర్గా! పోతరాజుగా రెట్లుందురని నీయభిప్రాయ"మని యామె నడిగెను. ఈప్రశ్నయామె కెందులకో బోధపడదు. "పొడుగుగాను, సన్నముగాను నుందు రని నే ననుకొందు" నని యామె బదులుచెప్పెను. భర్త యడిగిన నడుగును కాక! భార్య కీప్రత్యుత్తర మెందులకో యంతకంటె బోధపడదు. "అలాగునఁ గాదునుమీ, పొట్టిగా నుండును. తగుమాత్రమైన బొజ్జ కలిగి యుండును," అని భర్త బదులు చెప్పెను. ఔనని, కాదని, భార్యా భర్తలిట్లొక్కనిముసము సంభాషించుకొన్నమీదట భర్త–"నేనన్న మాటయే నిజమగునెడల–నదిగో–గోడబల్ల మీదఁ బెట్టిన మద్దెల యున్నదే అది గణగణ మ్రోఁగును" అనుసరి కేదైన యెలుక దానిని గదల్చెనో మఱేమైన జరిగెనో తెలియదు. కాని, మద్దెల గణగణ మ్రోఁగెను. అంత నాఁతడు మహానందమున లేచి మద్దెలను గ్రిందిగి దింపి దానికిఁ బూజ లొనర్చి, పోతరాజుగారి మద్దెల యని దానికిఁ బేరిడి, పోతరాజుగారి గజేంద్రమోక్షాది గాథలలోని పద్యములన్నియుఁ గీర్తనముగాఁ బాడుకొనుచు మద్దెల వాయించుకొనుచుం డెను. ఇది జరిగి యిరువదేండ్లు దాఁటినది. అల్పాహారకాలమునం దీకథ యతిథులకుఁ బ్రతిదినమును చెప్పును. అట్లు కొంతసేపు చెప్పి–

క. ''పలికెడిది భాగవతమట, పలికించెడివాఁడు రామభద్రుండట నేఁ
బలికిన భవహర మగునట, పలికెద వే ఱొండుగాథ పలుకఁగ నేలా?''

యను పద్యమును చదివి ''ఆహా! మహానుభావుఁడు! ఎంత మృదులముగా, నెంత లలితముగా, నెంత మనోహరముగాఁ జెప్పినాడో! మాతండ్రి–పోతరాజుగా రిప్పు డెక్కడ నుండునో యని కన్నులనీరు జలజల రాల్చుచుండును. ఊచబియ్యపుఁబదనుచేఁ జొంగలు గార్చుచున్న భుక్తిప్రియులకుఁ బోతరాజుగారి కవిత్వ మప్పుడు కావలయునా?

ఇట్లు కొంతకాల మత్యుచ్ఛ్రయముగా నానంసారమునకు దినములు జరిగినవి. కాలమెక్కరీతిగాఁ గడచునా? వర్షమునలు వెనుకఁ బట్టినవి. పంటలు తగ్గిపోయినవి. క్షామము తలనూపినది. అందువలన నతిథులు మఱింత వచ్చుచున్నారు. అందఱకు సంతుష్టిగాఁ బెట్టుచునే యున్నాఁడు. అప్పులు చేసినాఁడు. పాటిపెర ళ్లమ్మినాఁడు. ఇల్లమ్మినాఁడు. ఇంటిలోఁ బాత్రసామగ్రి నమ్మినాఁడు. కోటప్పకొండ మ్రొక్కుతో సంబంధించిన తన యెడమకాలి వెండికడియ మమ్మినాఁడు. అమ్మగా మిగిలిన రెండుగేఁదెలు కూడఁ జచ్చిపోయినవి. ఇంటిలో నేమియు లేదు. మట్టమధ్యాహ్నమగుసరి కిద్ద అతిథులు వచ్చినారు. ఇంటిలో నరసోలెడు గింజలు లేవు. అప్పుడు భార్యయొద్ద కాతఁడు పోయి యిప్పుడువచ్చిన యతిథులను బూజించు టెట్లు?–అని యడిగెను. పసుపురాచిన దారమును మెడను గట్టుకొని మంగళసూత్ర మిచ్చి ''ఇది యమ్మి వారికిఁ గావలయు సామగ్రిని తెండు. అమ్మాయి చల్దియన్నము తినినది. మన మీ దినమున భుజింపవలదు. వారికి సాయంకాలము కాకుండ భోజనము పెట్టి పిల్లను దీసికొని రాత్రి యెటకైనఁ బోవుద''మని భార్య పలికెను. మంగళ సూత్రమునకు రెండువరాలు కాఁబోలు వచ్చినది. కొంత వ్యయపఱచి యాయతిథులకు సంతుష్టిగా భోజనము పెట్టి శిష్టాన్నము కొంత సాయంకాలమునఁ గూఁతునకుఁ బెట్టి, తాము తినక వా రారాత్రి యెవ్వరి తోడను జెప్పకుండ వెడలిపోవఁ బ్రయత్నించిరి. కాని, యీ యూరకున్న యొకసంపన్నుఁ డీయంశమును గర్ణాకర్ణిగా విని యాయనయొద్ద కారాత్రి వచ్చి ''సుబ్బరాజుగారూ! మీకు దుర్దినములు వచ్చినవి. దరిద్రతకంటె దుస్థితిలేదు. మిమ్ము నేను గనిపట్టుదును. మీ రెక్కడికిని భోవల''దని చెప్పెను. ''ఓయబ్బ! దుష్టదినములు మాత్రము మమ్మేమి చేయఁగలవయ్యా! దరిద్రము పోతరాజుగారు పడలేదా? ఆయనకంటె మే మెక్కువవారమా? ధర్మబుద్ధిచే నొకరు నా కింత పెట్టగ నేను దినువాఁడను గాను. పోతరాజుగారిని రక్షించిన యొంటిమెట్ట కోదండరామమూర్తి మ మ్మేల రక్షింపకుండును? అడవులఁ బట్టి పోవుదుము. నాయనా! పోతరాజుగారు ''అడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు, రక్షితుండు మందిరమునఁ జచ్చు''నని చెప్పినారు. మ మ్మడ్డుపెట్టకుము. కాని నా దొక్క కోరికయున్నది. ఎవ్వరైన నతిథులు వచ్చునెడల బోతరాజుగారు సంతసింతురు అని చెప్పి యాతని నంపివైచి, ఇదివఱకుఁ దాను వ్రాసిన తాటాకు గ్రంథములన్నియు నటుకమీదఁ బదిలముగా దాఁచి, తాను వ్రాసిన పోతరాజుగారి భాగవతమును దేవతార్చనపుఁ బెట్టెతోఁగూడ నంగవస్త్రమునఁ జుట్టి తలపైఁ బెట్టుకొని, పోతరాజుగారి మద్దెల వీఁపునఁ గట్టుకొని, గంటము మొలలోఁ బెట్టుకొని, గూఁతు నెత్తుకొని, భార్యచేయి పట్టుకొని–

క. ''శ్రీకంఠచాఖండన, పాకారిప్రముఖవినుతభండన విలస
త్కాకుత్థ్సవంశ మండన, రాకేందు యశోవిశాల రామనృపాలా!''

– యని పఠించుకొనుచు వెడలిపోయెను.

II

అది మహమ్మదీయుల రాజ్యము. ఆయూరిపే రేదో తెలియదు. జోడుగుఱ్ఱాల బండిమీఁద నవాబుగారు బయలుదేఱి–'కాసు' తోఁట జూచి తిరుగ నింటికిఁ బోవుచు న్నారు. ఆదారిలో నొక బ్రాహ్మణుడు నిలువఁబడియున్నాఁడు. గుఱ్ఱపుబండి వచ్చుచు న్నది. ''ఓయబ్బా! ఆఁపవయ్యా బండి! ఒక్క ఛేపరుగా?'' యని బండివాని కాతఁడు కేక వైచెను. బండియాఁపక యాతఁడు తోలుకొనిపోవుచుండఁగా నా బ్రాహ్మణుఁడు గుఱ్ఱపుఁగళ్లెములు బట్టుకొని బండి నాఁపెను. గుఱ్ఱములు బెదరుచున్నవి. కాని వానినిగదలనీ కుండ నాతఁడు పట్టుకొనియున్నాఁడు. ముందుఁ గొంతదూరము పోయిన తురుపుసవా రులు వెనుకకుఁ దిరిగిరి. మఱికొందరు జనులు మూఁగిరి. నబాబుగారు బండి దిగినారు. ఆయన యొద్ద కాతఁడు వెళ్లి ''మాయబ్బ! నీవేనఁటయ్యా! ఈచుట్టుపట్ల పొలాల కంతకును రాజవు? సరేకాని, నా కేమైన భత్య మేర్పాటు చేసి తాటాకుగ్రంథములు వ్రాయింపరాదఁ టయ్యా! నాకు జరుగుబాటుగను నుండును. నీకు ఖ్యాతిగాను నుండును. సుఖముగాఁగూ రుచుండి వ్రాయుదును. నీ కచ్చేరిలోనికి నన్ను రానీయరని నిన్నుఁజూచుట కీడకు వచ్చినాను. ఎవరేమి చెప్పుకొందురో వినవచ్చును. బండి నిమ్మళముగాఁ దోలించుకొనరా దయ్యా'' యని నబాబుగారి ననియెను. బ్రదుకుఁదెరువు కొఱకుఁ బ్రభుని ప్రథమమున సందర్శించునప్పటి సంభాషణమిట్లున్నది. పాపము! భటత్వమెఱుఁగునా? ప్రభుత్వ మెఱుఁగునా? మన్ననయెఱుఁగునా? మార్దవమెఱుఁగునా? మర్యాదయెఱుఁగునా? మాటతీ రెఱుఁగునా? అయ్యో! వట్టిజానపదుఁడు. రూపమున మోట. వస్త్రమున మోట. పలుకున మోట. వట్టి నిష్కల్మషుఁడు. అమాయకుఁడు. మనసున నొకటి నోట నొకటి యున్నదా? శుద్ధ సత్యకాలపువాఁడు. ఋషి విగ్రహుఁడు. హరిహరీ! ఇప్పటి యింద్రజాల మహేంద్రజాల మహామహోపాధ్యాయులలోనివాఁడా? ఇప్పటివారిలోఁ గొందఱు సత్యసంధులకుఁ దక్కఁ దఱచుగా నెవ్వరినిఁ జూచినను నొసలు వెక్కిరింపు. నో రిగిలింపు. మొగమెదుట నమస్కార ములు. వెనుకఁ దిరస్కారములు. పలుకు తేనెపట్టు. పిడికిలి కోఁతిపట్టు. పెదవిని మందహా సము. హృదయమునఁ జంద్రహాసము. ఆతఁ డిట్టివారిలోవాఁడా? తన కుపకారపు మాట యేదో యెఱుఁగఁడు. ఎదుటివాని కపకారపు మాట యేదో యెఱుఁగఁడు. మనసులో నేది సత్యమని తోఁచునో యది పైకి రావలసినదే. ఆ వచ్చుటలో నొక సాపులేదు. నంతన లేదు. నీటు లేదు. మాట లేదు. వట్టి కఱ్ఱపడి కంకరరాతిపాకముతో రావలసినదే! ఆతఁ డనిన మాటలు విని నబాబుగారు కొంత నిశ్చేష్టితులై యూరకుండిరి. నబాబు గారివంటివా నిని సుబ్బరాజుగా రెట్లు చూడలేదో, సుబ్బరాజు గారి వంటి వానిని నబాబుగా రట్లు చూడలేదు. ''మాయబ్బ, అదేమి చూపయ్యా!

''కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం జెందరే?
వా రేరీ సిరి మూఁటఁ గట్టుకొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులున్ ప్రీతి న్యశస్కాములై
యీరే కోర్కుల వారలన్ మఱచిరే! యిక్కాలమున్ భార్గవా!''

యని పోతరాజుగారు సెలవిచ్చిరయ్యా! అడుగక యడుగక యెఱువదియేండ్ల కడిగినానయ్యా! నీపొలా లన్నియు నా కూరకే యిచ్చినను నా కక్కఱలేదు. ఏదో

కొలువు చేయించుకోవయ్యా! ఎందుల కింతయోజన! నీ విచ్చు భత్యము నా కేమియు నక్కఱలేదు. వింటివా? పూఁట కొక్కయతిథి కన్నముపెట్టి మిగిలిన గంజితో నా కూఁతును రక్షించుకొందును. నేను నా భార్యయుఁ బస్తుండెదము. కాదేని కాయయమో కసరో తినుచుందుము. మామాట కేమి?'' అని బ్రాహ్మణుఁడు పలికెను. ఇంకను నబాబుగారు నిప్పుగ్రుడ్లువైచుకొని చూచుచుడఁగా. ''నీతో నాకేమి పోవయ్యా! రా జన్న ప్పుడు పోతరాజుగారే రాజుగాని నీ వెక్కడి రాజువయ్యా'' యని యాతఁడు పోబోవుఁనరికి నబాబుగారు భటులకుఁ గనుసన్న చేసిరో యేమో కాని నల్వురుభటులు సుబ్బరాజుగారిని నున్నములోని కెముకలేకుండఁ గొట్టిరి. సుబ్బరాజు గారు రామరామ యనుచు నా దెబ్బలన్నియు నే మాత్రము తిరుగుబాటయిన లేకుండ కన్నయినఁ జిట్లించుకొనకుండ సహించెను. మఱి యొక భటుఁ డింతలో వచ్చి యాయన జన్నిదమును ద్రెంపఁబోవఁగ నాతని నెత్తిపై తన గంటము మొదటితోఁ గొట్టెను. వాఁడు గిలగిల లాడుచుఁ గ్రిందఁబడిపో యెను. అంత సుబ్బరాజుగారు కారాగృహమందుంపబడిరి. నబాబుగారు తమ మహలునకుఁ బోయిరి.

## III

స్ఫోటకపువ్యాధులచే, విషూచివ్యాధులచే నా మహమ్మదీయ గ్రామమంతయు నిండి యున్నది. జనులు కుప్పతిప్పలుగాఁ జచ్చుచున్నారు. బండ్లమీఁద వైచి శవములను దీసికొని పోవుచున్నారు. సుబ్బరాజు గారి కారాగృహమున కొక్క నలువది బారల దూరములో నొక కానుఁగు చెట్టున్నది. అది వీధి ప్రక్క నున్నది. దాని క్రిందనే దుర్గమ్మ యామెకూఁతుతో నివసించుచున్నది. తనకుఁ, దనభర్తకు నన్నము లేక పోయినను ఏజిరుగడమో కట్టెపెండ లమో తిని కాలక్షేపము చేయఁగలరు. కాని, అయిదేండ్లపిల్ల అట్లు బ్రదుకఁగలదా? ఆపిల్లను సంరక్షించుట కామె యెచ్చటనైన దాస్యమున కొప్పుకొని చేయవలయును గదా! ఎక్కడెక్కడఁ దిరిగినను సదుపాయమగు నౌకరి దొరకలేదు. తుదకొక్కయింట నెల కొక్క వరాజీతమున కొప్పుకొని యాయింటను స్ఫోటకపు వ్యాధిచే బాధపడుచున్న యొక కాంత కుదయమునుండి సాయంకాలమువఱకు కుపచారము చేయుట కంగీకరించెను. మానవేతనములోఁ దీర్చుకొనవనుపద్ధతి మీద నొక్క మాడ ముందుగాఁ దీసికొని పిల్లదానికిఁ గావలయు సామగ్రి కొని కుండతోఁ దెల్లవారకముందే రవంత వండి, కూతునకుఁ బెట్టి, దానిని దండ్రిగారాగృహముగుమ్మము వెలుపల విడిచి, తాను సేవకుఁ బోవుచుండును. ఇట్లు పదునైదు దినములు గడవకుండ నామెపిల్లకు జ్వరము వచ్చెను. పుచ్చుకొన్న మాడ కింకను రెండు దినములసేవ బాకియున్నది. ఋణము తీర్చుకొన కుండరాదనియు, నుచితముగ నెవ్వరిసొమ్మును దీసికొనఁగూడదనియు నాజ్వరము తోడనే పిల్లను గారాగృహాంగణమున విడిచి సేవకుఁ బోయి యాబాకి తీర్చుకొని, యంతట నుండి సేవకు రాఁజాల నని చెప్పెను. పిల్లకు స్ఫోటకము వచ్చినది. రెండీతాకు లడ్డుకట్టుకొని యాచెట్టుక్రిందనే వాని చాటునఁ బిల్లను బెట్టుకొని కంటికిమంటి కొక్కధారగా నేడ్చుచుండును. తండ్రి కారాగృహమందు భీష్మస్తవరాజమును జదువుకొనుచుండును. ఇట్లుండఁగాఁ బైటచాటున గుడ్డలలోఁ బిల్లను బెట్టుకొని యొక్కనాఁ డుదయమున దుర్గమ్మ కారాగృహమునొద్దకు వచ్చి పిల్లను తండ్రికి జూపి యేడ్చెను. ఉదయ మయిదుగంటలకే యాపిల్ల మరణించెను. మృతినొందిన తనకూఁ

తను, రోదనము చేయుచున్న భార్యను గాంచి, కన్నులనుండి జాఱిన యిందుపగింజలం తటి రెండు బాష్పముల నట్టె త్రోచినైచి–''ఓయబ్బ! ప్రపంచ మిట్టిదని యెవ రెఱుఁగరు? తొందరపడకు. ఒంటిమెట్ట కోదండరాముఁ డిచ్చినాడు. ఆయనయే తీసికొన్నాఁడు. ఓయబ్బ! తనసొమ్ము తాను తీసికొనఁడేమి? పోతరాజుగారి మాటయందు నాకున్నట్లే నీకుఁ బ్రమాణబుద్ధి యున్నది కావునఁ జెప్పెదను.

''మచ్చిక వీరికెల్ల బహుమాత్రము చోద్యము! దేహి పుట్టుచుం
జచ్చుచునుండఁ జూచెదరు చావకమానెడువారిభంగి నీ
వచ్చినవారి కేడ్చెదరు చావున కొల్లక దాఁగవచ్చునే?
యెచ్చటఁ బుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణకోటికిన్.''

అందువలన నిప్పుడు మనయమ్మ వైకుంఠమునన్నది. నే నెఱుఁగుదును. నాకు రాత్రియే తెలిసినది'' అనెను. ఇంతలో స్ఫోటకపుశవము నచటికిఁ దీసికొని రాఁగూడదు పోపో యని భటు లామెను బెదరించిరి. ఆమె యేడ్చుచు ''నాయనలారా! పోవుదును. క్షమింపుఁ''డని భర్తవంక తిరిగి ''ఎవ్వరికైన నొకటంక మిచ్చినఁగాని యీపిల్లకుఁ దరువాతిక ర్మము జరుగదు. నావద్దనేమియు లేదు. నేనే తీసికొనిపోయి నా చేతులతోనే యీపని చేయవలయునా? యని గోలున నేడ్చుచుఁ దటాలునఁ బోయెను. ఆమె యేడ్పువాని భర్తగుండెలేకావు బ్రహ్మాండగోళమంతయు గడగడవడఁకిన ట్లయ్యెను. నిజమైన యాపద వచ్చినప్పుడు– అందులో మహాపతివ్రత కాపదలవచ్చినప్పుడు–ఆ యాపద కన్నకడుపుతోఁ జేరినప్పుడు–పునాదులతోఁ బెల్లగిల్లునట్లు–ప్రకృతి కంపించుననఁగా నాశ్చర్యమేమి? అంత సుబ్బరాజుగారు–

''లావొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్దప్పెను మూర్ఛవచ్చె తనువ్ డస్సెన్ శ్రమంబయ్యెడి
నీవేతప్ప నితః పరం బెఱుఁగ మన్నింపందగుం దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!''

యను పద్యమును జదువుకొని కొంత శాంతిపడి రామనామస్మరణ మొనర్చుకొను చుండెను.

## IV

సుబ్బరాజుగారి గంటపు దెబ్బతిని భటుఁ డిఱువదిదినములు బాధపడి మరణించెను. ఖూనీ నేరము చేసినందులకు సుబ్బరాజుగారిని నబాబుగా రింక శిక్షింపవలసియున్నది. విచారణ కొక్కదినమున నాయనను నబాబుగారి కచ్చేరికిఁ దీసికొనిపోవుట కేర్పాటయినది. వకీళ్లు కావలయునా? దస్తావేజులు కావలయునా? సాక్ష్యము కావలయునా? నబాబుగాని యెదుటనే కాదా నేరము జరిగినది? భీష్మైకాదశీదినమున విచారణ జరుగనైయున్నది. ఆ యుదయముననే దేకుకొనుచు నాతని భార్య కారాగృహము నొద్దకు వచ్చి భర్తను గాంచి ''నా కీయుదయమున నుండి వాంతులు భేదు లగుచున్నవి. నా తమ నీ సాయంకాలమువఱకు నిల్చునని తోఁచదు. నడువలేక యిట్లు దేకుకొనుచు వచ్చితిని. సర్వధాయనుగ్రహా ముంపవలయును.'' అని లోయేటఁబడిన గొంతుతోఁ బలికెను. భార్యనుగాంచి భర్త

కొయ్యవాటెను. ఒక్క నిముసమునకుఁ బ్రజ్ఞఁగాంచి చూచుసరికిఁ దనపాదముల నాయనశలాకనుండి యావలకు లాఁగి వానిని గన్నులందుఁ జేర్చుకొని–శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః–యని భార్య యనుచున్నది. భర్తకుఁ గంటివెంట నీటిచుక్క లేదు. భార్య నంతకంటె లేదు. అతిశుష్కమైన వస్తువున కయిన రసమున్నది. అతినీచమైన కార్యమునకై రసమున్నది. అగ్నిజాలలకైన రసమున్నది. కాని యతిదుఃఖమున రసము లేదు. ''మీపాదసన్నిధిని నాకు మరణింపవలయునని యున్నది. కాని యీవ్యాధి గల నన్నిక్కడఁ గొంతసేపైన నుండనీయరు. భటులు పొమ్మనకుండనే స్వామీ వెడలిపోదును. నమస్కారము'' అని యామె దేకుకొనుచుఁబోయెను. ఆమె యేమనుకొనుచుఁ బోయెనో యేమనుకొనుచుఁ గొట్టులో నుండెనో వారికే తెలియఁదగినది. అంత–

క. కలఁడందురు దీనులయెడఁ
గలఁడందురు పరమయోగి గణములపాలన్
గలఁడందు రన్నిదిశలను
గలఁడుకలం డనెడివాఁడు కలఁడో లేఁడో

యని చదువుకొనుచు నిట్లు గలిగిన సందేహమును వెంటనే పరిహరించుకొని–

క. నీపాదకమలసేవయు, నీపాదార్చకులతోడి నెమ్మి నితాంత
శ్రీపాదకమలసేవయుఁ దానమందార నాకు దయసేయఁగదే.

యని ధ్యానించుకొనుచుండెను. ఇంతలో విచారణకొఱ కాయనను గచ్చేరికిఁ దీసికొనిపోవుభటులు వచ్చిరి. వా రాయనను తీసికొని పోవుచుండఁగ ''ఆకానుఁగు చెట్టుక్రింద నన్నొక్కసారి నిలుపవయ్యా! నా భార్యను చూచి వత్తు''నని వారిలో నొక్కని నాతఁడు కోరెను. వా రంగీకరింపక చెట్టుప్రక్కనుండియే యాతనిఁ దీసికొనిపోవుచుండ, దుర్గా! దుర్గా! దుర్గా! యని సింహగర్జనమునఁ బిలిచెను. పలుకలేదు. ఆమె మరణించెనని నిశ్చయపఱచుకొని కోదండరామప్రభూ! యని యొక్క కేకవైచి ''ఓ కానుగుచెట్టా! నాదుర్గను, నా బిడ్డను, నేను బోషించుకొనదగిన నా భార్య కళేబరము ప్రక్కనుండియే దానిని జూడకుండ నేను బోవుచున్నాను. నీవట్టిదానవుకావు. నీవింక నామెయొద్దనే కనిపెట్టుకొని యున్నావు. నీవే నాకంటె ధన్యతకలదానవు. నీ కుత్తరజన్మమున మహోత్కృష్టమగు జన్మము సిద్ధించును గాక!'' యని నడుచుచునే చెట్టును దీవించి కచ్చేరికిఁ బోయెను. కచ్చేరిలో విచారణ యేమున్నది. ''నీవు మాభటుని గంటముతోఁ గొట్టి చంపితివి  నీకు మరణశిక్ష యేల విధింపఁగూడదో చెప్పుకొందువా'' యని నబాబుగా రాయన నడిగిరి. ''ఓయబ్బ! గంటపు దెబ్బకే చచ్చిపోయినాఁడయ్యా! గట్టిగాఁ గొట్టనే లేదయ్యా! మాయబ్బ! ఎన్ని గ్రంథములు వ్రాసిన గంటమయ్యా! ముందుజన్మమున వాఁడు మంచికవియై పుట్టును. ఈఁడను మంచి మేలు పొందుటకే యాడకుఁ బోయినాఁడని నమ్మవయ్యా! మఱి న న్నేదో చెప్పుమంటి వెందుకు? న న్నడుగు టెందుకు? నీయిష్టము వచ్చినట్లు చేసికోవయ్యా. అడిగి యడిగి నీ వేమాత్రము చేయఁగలవయ్యా? పోపో'' యని కచ్చేరీ నుండి పోవుటకుఁ బ్రయత్నింప భటు లాయనను బట్టుకొనిరి. ఇంతగర్వి, ఇంత పొగరుఁబోతు, నింతదుర్మార్గుఁడు లేఁడని యచ్చటివారంద అనుకొనిరి. ప్రజల యభిప్రాయములు సౌష్ఠవము సౌభాగ్యము నిది. ఈ యంశమునందే కాదు. అన్ని యంశములందుఁగూడనిట్టిదే. ఆతనితల నఱుకవలయుననిన

బాబుగారు భటుల కాజ్ఞాపించెను. "ఓయబ్బ! ఇంతేనా? ఈమాత్రానికి న న్నీడకుఁ బిలిపించు టెందుకయ్యా" యని యాబ్రాహ్మణుఁడు పలికెను. భటు లాతనిని వధ్యస్థాన మునకుఁ గొనిపోయిరి. తలారి కత్తి చేతఁ బట్టుకొని యాతనిమొగము గాంచి గడగడ వడఁగి వే నీవనిని జేయఁజాలనని కత్తి నావలఁ బాఱవైచెను. ఏల నఱుకలేవని నబాబుగా రాతని నడుగ "ఆతనిరూపము నా కేమో భయంకరముగా నున్నది. నాచేతు లాడకున్న" వని యాతఁడు నబాబు గారి పాదములపైఁబడెను. "నీవాతనిని నఱుకకుందువేడల నిన్ను ముందు నఱికింతు" నని నబాబుగా రాతని బెదరించిరి. అంత నాతఁడేమిచేయఁగలఁడు? గడగడ వడఁకుచు సుబ్బరాజుగారి కంఠమున బిస్మిల్లాయని కత్తి విసరెను. కంఠము తెగలేదు. మరియొక్కసారి చౌరవ తెచ్చుకొని వైచెను. తెగలేదు. "ఓయబ్బ! నీవలనఁగాదయ్యా! భాగవతము తలమీఁదనుండఁగాఁ దలతెగుననియే యనుకొంటివిఁటయ్యా! నీబొంద వడ! ఎక్కడనో యడవిమృగమువలె నున్నావు. విను. నీ వేమియుఁ గష్టపడకు. వెనుకకు విఱిచికట్టిన నాచేతులు విప్పవయ్యా? భాగవతము తలమీఁదినుండి దింపుదును. తరువాత సుళువుగా సుఖముగా నఱుకుదువుగాని ఎందుకింత యోజన" అని సుబ్బరాజుగారు పలికిరి. చేతులు విప్పుమని నబాబుగారు భటునకు సంజ్ఞచేసిరి. అంత సుబ్బరాజుగారు, కొన్నిపాటి ప్రయాణమునుండి యానిమసమువఱకుఁ దలమీఁదనే కట్టుకొనియుంచిన భాగవతమును టసి, కన్నులద్దుకొని దూరముగనుంచి దానికిఁ బ్రదక్షిణ మొనర్చి సాష్టాంగ మాచరించి లేచి కోదండరామప్రభో! యని బ్రహ్మాండకటాహ మదఱున టొక్క కేక వైచి చాపచుట్టగఁ గ్రిందఁబడి ప్రాణములు విడిచెను. కత్తితో భటుఁడింక నఱుకుట యెందుకు? ఆతఁ డెట్లు మరణించెనో? యని యందఱకాశ్చర్యముగా నున్నది. పరీక్షించి చూడగ నాతనినోటినుండి రక్తమొలికినది. పిడుగుపడినట్లు కోదండరామప్రభూ యని యాతఁడు వైచిన కేకతో గొంతులోని రక్తనాళము తెగి యారక్తపుఁజుక్కలు వాయుద్వారమునఁ బోవుటచే నూఁపిరి యాడక నిముసములో మరణ మీతనికి సిద్ధించినదని యటనున్న వైద్యుఁడు శాస్త్రీయసమా ధానమును (Scientific Explanation) చెప్పి, తనపాండిత్య మందఱకుఁ దెలిసినదో లేదోయని యటునిటు చూచెను. పరమాత్ముని యాజ్ఞ యయినది కావున బ్రాణములు దేహమును వదలిపోయిన వని చెప్పఁగ నందఱకును దెలిసినమాట.

సుబ్బరాజుగారు మరణించిరనుమాట చెవినిఁబడఁగనే కన్నుల కేదైనఁ గనఁబడునో, కడపులో నేమైన గుబులు పుట్టెనో కాని గడగడ వడఁకి నబాబుగా రేడ్చిరి. వారికంటె ముందుగానే కాఁబోలు వారిభటు లేడ్చిరి. అచ్చటిప్రజ లందఱికంటె ముందుగాఁ గాఁబోలు నేడ్చిరి. అంద ఱేడ్చుచున్నారు. ఎందుల కేడ్చుచున్నారో యెవ్వరు నెఱుఁగరు? ఏది? ఆ సమయమున నెవ్వరికైన మతులున్నవా? చైతన్యము లున్నవా? గొలుమన్న రోదనము తప్ప నంతకంటె నేమియులేదు. అంతయుఁ దీఱిన తరువాత నేడ్చిన లాభమేమి? సుబ్బరాజుగారి కథ విన్నవారికే కన్నులు చెమ్మగిల్లవలసి యుండఁగ నాయనకథను జూచిన వారికిఁ గడుపు చెఱువయ్యె ననఁగ నాశ్చర్యమేమి? నబాబుగారేమో రామభక్తుఁడైనాడఁట! అగుఁగాక. రామభక్తులెందఱో లేరు. వారిలో నాతఁ డొకఁడు. సదా కోటి జంగాలలో నొక బోడిలింగము. లెక్కయేమి? ఆర్యావర్తదేశమున నారామచంద్రమూర్తి మహాత్మ్య మెఱుఁగని నరుఁడెవ్వఁడు? నరునివఱ కెందులకు? కోఁతినడుగు, కొండముచ్చునడుగు, కాకినడుగు, గ్రద్దనడుగు అందఱకుఁ గూడ నెందులకు? చెట్టునడుగు, పుట్టనడుగు, ఱాతినడుగు,

అప్పుడుడుగు దేశమంతటను రామనామము శతకోటిజిహ్వలతో మాఱుమ్రోఁగుచున్నది. రాముఁడు లేనిచోటేది? రామునిగూర్చి యొకానొకఁ డిట్లు పలికినాఁడు.

సీ. వీధి పురాణంపు వేదికపై నీవు,
పారాయణపుఁ బీఁటపైని నీవు,
దృశ్యప్రబంధంపుఁ దెరలసందున నీవు,
మృతివార్త శ్రుతిఁ బడ్డ యెడను నీవు,
గొల్లసుద్దుల ఊకు డొల్లలలందున నీవు,
యక్షగానపుఁ జిందులందు నీవు,
చండాలుబుజముపై మొండితంబుర నీవు,
తోలుబొమ్మలసంత గోల నీవు,

పడుకగదుల గోడల నీవు, భక్తహృదయ
రసనలను నీవు, యాయావరతను నీవు,
సృష్టినీమయయో? నీవు సృష్టిమయమొ?
యెట్లయిననేమి? రామ! రక్షింపుమయ్య!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## 31. దొరకిన యుపన్యాసము

ఒకసారి పానుగంటివారు తణుకు నుంచి పిఠాపురం వెడుతూ, నిడదవోలులో రైలులో ఎక్కారు. రైలు కదిలిన కొంతసేపటికి, బెర్తును ఉత్తరీయంతో దులిపి, నడుం వాలుద్దామనుకుంటూండగా ఒక కాగితాల బొత్తి కనిపించింది. అది ఒక మహిళ వ్రాసిన ప్రసంగ పాఠం. ఆ మహిళ, ఆ ప్రసంగాన్ని ప్రకటించడమే ఉత్తమమని ఎంచి, దానికొక ప్రతిని రాసి – భారతి పత్రికాధిపతికి పంపాడు. సు.స. అనే పొడి అక్షరాలో వున్న ఆ ప్రసంగ పాఠం సారాంశం ఇది:–

పురుషుడు మొట్టమొదటి నుంచి స్త్రీ అభివృద్ధికి ఆటంకాలు కల్పిస్తూనే వున్నాడు. కొద్దికాలం క్రితం వరకూ కూడా మగవాడు ఆడదానిని వీధి గుమ్మం వరకు కూడా రానివ్వలేదు. నారీ సంఘం అంతా ఈ అనారీ సంఘాన్ని ఎందుకు అణగద్రొక్కకూడదు? ఆడది మగవాణ్ణి అనుకరిస్తోం దని మగవాడి వుద్దేశం. నిజానికి స్త్రీ పురుషుణ్ణి అనుకరించడమంత రోత మరొకటి లేదు. ఆ మాటకొస్తే పురుషుడే నాటకాలలో స్త్రీవేషం వేసి అనుకరిస్తూ స్త్రీ జాతినే అవమానిస్తున్నాడు. ఎంత ప్రయత్నించినా స్త్రీ సహజమైన హావభావాలను పురుషుడు అనుకరించలేడు. చేసే, ఆంగికమైన అనుకరణ అతనిలో 'స్త్రీత్వ' సౌకుమార్యాన్ని తీసుకురాకపోగా, ఉన్న పురుషత్వ లక్షణాలను దూరం చేస్తోంది. ఎందరినో ఆక్షేపించే జంఘాలశాస్త్రి మగవాడు ఆడవేషం వెయ్యడాన్ని ఎందుకాక్షేపించాడు. కేవలం, తను మగవాడు గనుకనే, మగతత్త్వం, ఆడతత్త్వం మౌలికంగా భిన్నమైనవి. పురుషుడు స్త్రీని అనుకరించడం మానాలి. ఆంధ్రదేశంలో వున్న నాటక సంఘాధిపతులకి ఒక ఆజ్ఞాపత్రం పంపాలి. ఏమనంటే మగవాళ్లు ఆడవేషం వెయ్యరాదు. స్త్రీలకే పాత్రలిచ్చి పోషించాలి అని. అందుకు ఒప్పని, స్త్రీ వేషాలు వేసే భర్తల్ని వారి భార్యలు త్యజించడానికి సంశయించకూడదు. దీనిని ప్రచురణకు పంపుతూనే, దాని జాబు వ్రాస్తామని పానుగంటివారు భారతీ పాఠకులకు ఒక లేఖ కూడా జత చేశాడు.

శ్రీ భారతీ పత్రికాధిపతీ! నమస్కారములు.

ఈనడుమ నా సొంతపనిమీఁద నేను దణుకు వెళ్లి యచ్చట నొక్కదిన ముండి తిరుగఁ

బీతికాపురమును జేరుటకై నిడుదవోలునొద్ద రైలుబండిలో నెక్కఁబోవుచుండఁగ, గొందఱు స్త్రీలు పురుషు లొకగదినుండి దిగఁబోవుచుండిరి. వారు వారిసామగ్రితో దిగినపిమ్మట నేను గదిలోనికిఁ బోయి కూరుచుంటిని. రైలు నడవనారంభించెను. కొంతసేపు కునికిపాటులు పడిపడి పండుకొనుటకై యెంచి లేచి బల్లపైనున్న మెత్తనుత్తరీయముతో దులుపుచుండఁ గ్రిందిమెత్తకును, వెనుకనున్న మరియొక మెత్తకును నడుమనున్న యవకాశమున నొక కాగితములబొత్తి నాకంటుఁ బడినది. దానిని గ్రహించి చూచితిని. అదియొక కాంతారత్నము వ్రాసిన వ్రాఁతవలె నాకుఁ దోఁచినది. ఈ కాగితములు పోవుటచే నాకాంత యెంత పరితపించుచుండునో యని కొంతసేపు విచారించితిని. ఆ వనితామతల్లి ప్రకటింపనెంచిన యభిప్రాయములను బ్రకటించుటయే మంచిదని నే నూహించుకొని యాకాగితములకుఁ బ్రతివ్రాసి దానిని మీయొద్దకుఁ బంపితిని. మీరు ప్రకటించినయెడల దానిని వ్రాసిన నారీమణి సంతోషించునని నావిశ్వాసము. ఈ క్రిందిదియే దాని ప్రతి.

చిత్తగింపవలయును.
పానుగంటి లక్ష్మీనరసింహారావు.

ప్రారంభోపన్యాసము

''సోదరీమణులారా! మీ యందఱితో నొక ముఖ్యాంశమును ముచ్చటింప నెంచి మి మ్మిట కాహ్వానించితిని. ఆయంశము మీతో నెంతకాలమునుండియో చెప్పఁదలఁచితిని మీ మనస్సులకు స్ఫురింపని యంశము నామనస్సున కేల తట్టెనో యని నాకే సందేహముగా నుండుటచే మానివైచితిని. ఇప్పు డన్నిసందేహములను మించిన యాతురత నన్నుఁ బ్రేరేప, నా యభిప్రాయమును మీకు వెల్లడించి హృద్భారమును బాపుకొన నిశ్చయించుకొంటిని.''

''కాంతలస్థితిగతులు కొంతకాలమునుండి యభివృద్ధి దశలో నేయున్నవి. ఇట్టి మనయభివృద్ధికి మనమే కారణముకాని మగవాఁడు కాఁడని లోకమెఱిఁగియే యున్నది. మగవానివలన మేలు జరుగునని మన మెన్నఁడనుకొనియుండలేదు. ఆతఁడు మనసందర్భమునఁ గేవల నిరుపయోగుఁ డనియే నిశ్చయపఱిచితిమి. ఆతఁడు నిరుపయోగుఁ డైన నంతమాత్రమున మనము విచారింపవలసిన పని లేదు. సమర్థతాశూన్యత క్షంతవ్యము కాని యాతఁడు మనయభివృద్ధికి మొట్టమొదటినుండియుఁ బ్రతిబంధకారుఁడై పరమశత్రుఁడై ప్రత్యక్షమారకుఁడై ప్రవర్తించుటచేతనే మన మాతనిని నిందింపవలసివచ్చినది. ఆతనిపాపమున నాతఁడే పోవునని మన మూరకుండక మన బానిసతనమునకుఁ బరితపించి, మన విద్యాశూన్యతకు విచారించి, మనవ్యక్తిరాహిత్యమునకు వ్యసనపడి యాతని లక్ష్యపెట్టక, యవసరానుసారముగ నాతని కెదురుతిరిగి, స్వయంకృషిని నమ్మియాత్మ విశ్వాసమును గల్గి, మన పురోభివృద్ధికి మన పాటులేవో పడుట చేతనేకదా ప్రాయ్యియొద్దఁ గట్టెల పొగనడుమఁ గూలఁబడవలసిన మన ముపన్యాసపీఠములపైఁ గరతాళముల నడుమ నిలువఁబడుచున్నాము! పేడనీళ్లతో నట్టిండ్లలికిన మనము నవరసములతో నాటకములను సృష్టించుచున్నాము! పిల్లల తొట్టెలయొద్ద జోలపాటలు పాడిన మనము న్యాయసభలందు ధర్మవాదము లొనర్చుచున్నాము! లొడితెడు సంసారములో గుడుగుడుగుంచము లాడవలసిన మనము లోకోపకారమునకై భారతదేశమం దంతటఁ బర్యటన మొనర్చుచున్నాము!

మగవాఁ డనువాఁ డొఁడుదానిని వీధిగుమ్మమువద్దకుఁ గొంఁదది కాలము క్రిందటివ లకు రానిచ్చినాఁడా? చీఁపురుకట్ట వదలి Briefbagను బట్టనిచ్చినాఁడా? తనసేవ మఱచి దేశసేవమాట నెన్నఁడైనఁ దలఁప నిచ్చినాఁడా? ఎంతసేపు తాను, తనవిద్య, తనసుఖము, తనకీర్తి, తన వృద్ధియే కాని సృష్టిలోఁ దనసాటిదైన యాఁడు దున్నదనియైన మనసునఁ బెట్టినాఁడా? ఇతర దేశ స్త్రీల యభివృద్ధి వినియైనను రవంత దయ, కాసంత దాక్షిణ్యము, నినుమంత సమభావము మనయెడలఁ గనఁబఱచి నాఁడా? తరతరములనుండి యుగయుగ ములనుండి కార్కొని ఘనీభవించిన యజ్ఞానాంధకారమునుండి స్వప్రయత్నముచేత నతిశీ ఘ్రకాలములో జ్ఞానతేజః ప్రపంచమున కుబ్బెత్తుగ నుబికిన జాతి సర్వప్రపంచ చరిత్రమం దొక్క యార్యనారీజాతి తక్క మఱియొకటి యున్నదా? బ్రాహ్మణులేమో తమ్మ జ్ఞానమునఁ బడఁద్రోచిరని యబ్రాహ్మణులు వారి కెదురు తిరిగిరి. కాని నారీసంఘ మంతయు నీ యనారీసంఘము నేల యెదుర్కొని త్రొక్కివేయఁగూడదో నాకు బోధ పడుటలేదు. మగవాఁ డంత స్వార్థలోలుఁడు, నన్యాయాపరుఁడు, నధర్మ శీలుఁడు నహంకారదూషితుఁడు ప్రపంచమున లేఁడని మనచరిత్రవలన స్పష్టపడినదా? పాపము పండిపండి బ్రద్దలు కాకమా నునా? చౌటిపడియలని తా ననుకొనినవే కాదా యిప్పుడు నుక్షేత్రఖండిక లైనవి? రాక్షసిబొ గ్గుదిబ్బలని తా ననుకొనినవే కాదా యిప్పుడు రత్నాలగను లైనవి! ఎండి, మెలికలు పడి, పిట్టతలలు వైచి కంపతొడుగైన తీఁగలే కాదా యిప్పుడు ప్రసవఫలబంధుర పరిమళప్రాంచిత ములైనవి! వంటయింటి పదుకటింటి బానిసలే కదా యిప్పుడు భారతదేశ సౌభాగ్య దేవతలై ప్రకాశించుచున్నారు! చిరకాలనాగరికత, చిరకాలవిద్య, చిరకాలాభ్యాసము, చిరకాలాహంభా వము కలిగిన మనవాఁ డిప్పుడు మనకు వెనుకఁబడినాఁడా లేదా? భారతదేశ సమస్తకార్యభార వహనక్రియాకలనయందు ముందుబుజము మనదా యాతనిదా? మనము పాడినపాటను బట్టి తనయడు గిప్పుడు సర్దుకొనుచున్నాఁడు. మార్గదర్శకవ్యాపారమున మగువ నిల్చి మగవానిని వెంటఁద్రిప్పుకొనుచున్నప్పుడేకదా నాగరకత శిరోనక్షత్రమంటిన ట్లెంచవలసి యున్నది!

ఇట్టిస్థితిలో మన ముందుటచేత భగవంతు నెంతయైనఁ బ్రార్థింపవలసియున్నది. మనము మనల నెంతయైన నభినందించుకొనవలసియున్నది. మగవాని నెంతయైన నిందింపవ లసియున్నది. కాని యింతసంతోషమందుఁ గూడ నొకటి రెండు విచారహేతువులున్నవి కాని లేకపోలేదు. ఒక దానిని గూర్చియే యిప్పుడు చెప్పెదను. నేను జెప్పఁబోవు నంశము మీ రెఱుఁగనిది కాదు. మీరేల యింతకాల ముపేక్షచేసి యూరకుంటిరోయని నాకాశ్చర్య ముగా నున్నది. ఈయంశము కూడ మగవాని దుష్టవ్యాపారముతో సంబంధించినదే. ఈదోష మేదో వెల్లడించి దీనిని దిద్దుబాటు చేయుటకుఁ బ్రథమావకాశము భగవంతుడు నాకుఁ గటాక్షించి నాఁడు కదా యని నేను సహేతుకమైన గర్వమొందుటలోఁ దప్పులేదని యనుకొందును.

సోదరీమణులారా! మనము కంటికి జోడుపెట్టుకున్నప్పుడు కొంఁదది కాలము క్రిందటఁ దానెంత వెక్కిరించినాడో మీకు జ్ఞప్తి లేదా? అక్షిరోగమునకేకాక యాన్యసౌభాగ్య మునకుఁగూడ నర్థములను దాను ధరించునప్పుడు వానిని మన మేల ధరింపఁగూడదో? అది తన యనుకరణమఁట. మనము కంటితోఁ జూచుటకూడఁ దన యనుకరణమే

యగును గావున మనము కన్నులు మూసికొనవలసి దని యభిప్రాయము కాబోలు! అరుంధతినాఁడో ఆదిశక్తినాఁడో కల్పింపఁబడిన యంద మాకారములేని యాప్రాంతయొడ్డాణమే మనము ధరింపవలయును గాని నడుమునకుఁ బటకా పెట్టుకొనఁగూడదఁదట! ఈయధిక్షేపణములో హేతువున్నదా? నీతి యున్నదా? మనుష్యధర్మమైన యున్నదా? షరాయి తొడిగికొని చర్మపాదరక్షలు మనము ధరించినపుడు తా నెంత వెకవెకలాడెనో మీ రెఱుఁగనిదా? అంత వెకవెక లెందులకు? అదేమి హానియా, అపకీర్తియా? తన్ను మన మెంతమాత్ర మనుకరింపగూడదఁట! ఆ ప్రధానరోగమునకు బాహ్యలక్షణములే యీతలయూఁపులు, నీవెకవెకలు, నీ నకిలింపులు, నీ కటకటలు, ఎన్ని నవ్వులు నవ్వినసరే యెన్ని యేడ్పు లేడ్చినసరే మనము మానఁదలఁచుకొన్నప్పుడే కదా యాతఁడు విధిలేని వైరాగ్యమును వహించి యూరకుండినాఁడు. మనము సైకి లెక్కఁగూడదని సంఘమర్యాద, వ్యాకరణమునఁ గ్రియాపరిచ్ఛేదమునఁ బ్రథమసూత్రము వ్రాయుటకు దా నెవఁడు? ఇది మన వారి పంచమహాపాతకములలో నొక్కటా? ఏసుక్రీస్తువారి పది యాజ్ఞలలో నొక్కటా? ఇది కాక మన డబ్బిలోనిది ముక్కుపొడి, తనడబ్బిలోనిది శ్రీపాదరేణువువా? ముక్కు భగవంతుఁడు తనకే ఇచ్చినాఁడా? ఇంతతెగనీలు గెందైన న్నునదా? మనజేబులోనివి సిగరెట్లా? తన జేబులోనివి తులసికట్టలా? ఇంతకు నో సోదరీమణులారా! కారణము చెప్పియే యుంటిని. ఆఁడుది మగవాని ననుకరించుటకంటె మగవానికి రోత వేఱొక్కటి లేదు. మన కుచితమైనదియు, నుపయోగకరమైనదియు, నర్హమైనదియు, నవసరమైనదియు మనము చేయుచున్నాము కాని తన్ననుకరించు నుద్దేశ మెంతమాత్రము మనకు లేదని తా నేల యెఱుఁగడు? తా నెవరి ననుకరించి యిన్ని వేషములు తెచ్చుకొనినాఁడు? ఆమాత్రపు టూహ తనకేల యుండఁగూడదు? అతనికి మొదటినుండియు మనయెడల నదూహయే యున్న యెడల మనకిన్ని పాటులెందులకు? తనకిన్ని తిట్లెందులకు? మనము తన్నెంత మాత్ర మనుకరింపఁగూడదు. కాని తాను మనలఁ బూర్తిగా ననుకరింపవచ్చును గాఁబోలు! అది తప్పులేదు కాఁబోలు! అందులకు మన మాతని నేమియు ననఁగూడదు కాఁబోలు! నాటకములలో స్త్రీపాత్రములను ధరించి తాను మనల నేల యనుకరించుచున్నాఁడో చెవిపట్టుకొని జొకాయించి నిలువబెట్టి యేల యడుగరాదు? ముంగురులు వింతయైన సొగసుగా నుండునని మన మీ చెంప నా చెంప నొక్క యంగుళముమాత్రపు వెడల్పున వెంట్రుకలు కత్తిరించుకొన్నప్పుడు తానెంత యల్లరి పెట్టినాఁడో! తలవెంట్రుకలు పూర్తిగా తీయించుకొనినట్లుగా నింటిపెంకు లెగిరిపోవున ట్లెంతహంగామా చేసినాఁడో! అట్టియాతఁ డిప్పుడు మీసములు పూర్తిగా గొరిగించుకొని సవరములు నెత్తికిఁ గట్టుకొని నాటకరంగమునఁ బోఁతుపేరఁటాలై నిలువఁబడినప్పుడు ''నీకిది యెవఁడు చెప్పినాఁడు రా'' యని మన మాతని మూతిపై నేల యొడ్చికొట్టరాదు? కోటులాగున నుండునెడలఁ గ్రమ్మదలకుఁ గ్రమ్మదల, సొగసునకు సొగసుగా నుండునని రైకకు బొత్తాము లంటించి చేతులు రవంత పొడుగుచేసి ధరించి సహజమైన సిగ్గుతో నూత్నమైన శోభతో మనము ప్రకాశించుచుండఁ దన కన్నులలోఁ జీలలు కొట్టుకొనినాఁడే! అట్టివాఁ డిప్పుడు మనరైక తొడిగికొని దానిలో మఱేవో తగులఁబెట్టుకొని సిగ్గులేక, యుభయభ్రష్టత్వపుఁ బాడురూపములతో రంగమున మగముత్తైదువై నిలువఁబడి మనలఁ బరాభవించుచున్నప్పు డాతని నేమి చేసిననైనఁ బాపమున్నదా? కట్టువడి యొడలిపై నడ్డుకట్టుకోకతో, నడ్డుచీలల ముంజే

తుల కదికింపుగాజులతోఁ గండలపై జేరుబొందులవంటి నరములుబికిన మొఱకు కంఠమున గాజుపూసలతోఁ, జుట్టపాగచేఁ బొక్కి మాడి చచ్చిన పెదవులపై లత్తుకతో, గూటితీయుటచేఁ గాయలుగాచి గీఁతలుపడిన దౌడలపై బూడిదెతో, వేంకటేశ్వర పాదములపైఁ దుమ్మకాయ గొలుసులతో, నాడుదాని తలకంటె సహజముగఁ బెద్దదైన తలపై నవరముల జవునుకూర్పుచే భయంకరముగ నగపడు రాకాసితలతో, రంగముమీద సంకర స్వరూపమున నవతరించిన యీ జగన్మోహినీ దేవతను జూడగ నార్యావర్తదేశమంతయు నొక్కపెట్టున నేడువవలసియున్నట్లున్నదే! తా నాఁడుదానిని బూర్తిగ ననుకరించినట్లు లోలోపల నుత్సాహమున నుబికి యుబికిపోవుచున్నాఁడు. కాఁబోలు! తానా? ఆఁడుదాని ననుకరించుటా? తనతరమా? సహజలావణ్యముగల యాఁడుదానిని గనులకు నూటిగ నొక్కజేనెడు చూచి టంగున (Tangeal) కు మఱలిన చూపుగల యాఁడుదానిని–నెగడు దిగుడుగఁ దరంగ ఫక్కిగఁ జూడఁగల యాఁడుదాని–నెగడు దిగుడుగఁ దరంగ ఫక్కిగఁ జూడఁగల యాడుఁదానినినింద్రధనుస్సు వలె లోకమునకంత నొక్కసారి మంగళపుటారతి నీయఁగల యాఁడు దానిని పాము మెలికల జిగజిగలతో మెఱవు గప్పున మెఱసి చప్పున మాయమైనట్లు చూడఁగల యాఁడుదానిని దానా? అనుకరించుటా? మతి యుండియే యీపని చేయుచున్నాఁడా? పెదవులపై లక్ష చందమామల పండు వెన్నెలల కలకలతోఁ గానఁబడవలసిన మందహాసమును బెదవులపై మాటుపఱచి దానిని గంటికొనలో నొక (Geometrical point) లోఁ గేంద్రీకరణ మొనర్చుట కొక్కనిజమైన యాఁడుదియే తగును కాని యీకొజ్జాస్వరూపమే–అందులకుఁ దగునే! చచ్చియాఁడుదియై పుట్టినప్పటిమాట కాని యిప్పటిమాటయా?

సోదరీమణులారా! ఇంత యసాధ్యకార్య మాతనివలనఁ గాదు, పోనిండు! ఆది నిలువఁబడినట్లయినఁ దాను నిలులవబడలేనప్పుడు తన మొగము, తనమోర, యిఁక, ననుకరణ మెందులకు? చనవు, ప్రేమ, రవంతమోతాదుమించిన వాల్లభ్యము గనఁబఱుపవలసిన భర్త యెదుట నాఁడుది యెట్లు నిలువఁబడునో, కానంత మాత్రమే గౌరవము గానఁబఱుపవలసిన పెద్దబావగారి యెదుట నెట్లు నిలువఁబడునో, యధికభయ గౌరవములు గనఁబఱుపవలసిన మామగారి యెదుట నెట్లు నిలువఁబడునో, యీ భేదములలో నొక్క భేదమైనఁ దాను గనఁబఱుపఁగలఁడా? నా భర్త యీ నడుమ నాటకము లోనికి వెళ్లెదని చెప్పుటచే బొమ్మంటివి. "నీ భర్త కీరాత్రి నాటకములలో వేసమున్న" దని మాయింటిపొరుగమ్మలక్కలలో నొక్కతె నాచెవి నూదెను. నా భర్త వెడలిపోయిన కొంత సేపటికి నేను నాటకశాలకుఁ బోయితిని. అభిజ్ఞానశాకుంతలమున నాభర్త ప్రియంవదవేసము కాఁబోలు వేసినాఁడు. కణ్వమున్యాశ్రమములోని మొక్కలకు నీళ్లుపోయుటకై శకుంతలతోఁగూడఁ జేతిలో నొకయిత్తడి చెంబును బుచ్చుకొని నా భర్త రంగమునకు వేంచేసినాఁడు. నేనప్పుడు కొంతసేపు డిల్లపడి కొయ్యనైపోయితిని. నాకప్పుడు మనస్సునఁ గోపమే కలిగెనో, రోఁతయే పుట్టెనో, నవ్వే కలిగెనో యేడుపే వచ్చెనో నే నేమియుఁ జెప్పఁజాలను. ఒక్కనిమున మట్లున్నపిమ్మట నాభర్త నిట్టిస్థితిలోఁజూచుటకంటెఁ జచ్చిపోవుటయే మంచిదని ప్రపంచ వాంఛా నిస్పృహతను జెందితిని. అంతలో నున్నపుగుల్లపొంగువలె రోస మెక్కడ నుండియో గుబగుబలాడుచు నుబికి నన్నుఁ గంపితురాలిఁగఁ జేసెను. రంగస్థలమునకుఁబోయి యాతని యెదుటఁబడి నెత్తిపైనున్న నవరపుబుట్ట లాగి "నీకువచ్చిన యేం డ్లెవనికి వచ్చినవి? నీ కీ దిక్కుమాలిన సంకరపు వాలక మేల?" యని యాబుట్టతో నెత్తిపై నాల్గు వాయింపవలయు

వని బుద్ధి పుట్టినది. కాని యారోసమును గష్టపడి శాంతిపఱచుకొని, పండ్లు గొఱుకుకొనుచు లోలోపల నెన్ని తిట్లయినం దిట్టుకొనుచుం గూరుచుంటిని. రంగమున నాభర్త యెట్లు నిలువంబడెనో చెప్పనా? అయ్యయ్యో! ఇంక నా భర్తయేమి? నాసవతియో నాయాఁడుబిడ్డయో యైన యాపురుష సువాసినీ స్వరూపము నిలువంబడినఠీవి యెట్లున్నదో చెప్పనా? ఎడమ చేయి నడుము మీఁదికి జారిపోయినది. కుడిచేత నిత్తడిచెంబు పట్టుకొని ప్రక్కనుండి పాఠము చెప్పువానివంకఁ జూచుచున్నాఁడు. అప్పుడు నా కాతఁ డెట్లుండినట్లుతోఁచెనో చెప్పనా? లెట్రీనులో నెవఁడో యుండుట చేత గుమ్మమువంకఁ జూచుచు నాతురతతోఁ గనిపెట్టుకొన్న వాఁడువలె నాకుఁ గానఁబడినాఁడు. ఛీ! ఛీ! నడుముమీఁదఁ జేయివైచుకొన్న యెడల నాఁడుదాని ననుకరించినట్లే! బుగ్గమీఁద వ్రేలు పెట్టుకున్న యెడల నాఁడుదాని ననుకరించినట్లే! పైఁట మాటిమాటికి సవరించుకొన్నయెడల నాఁడుదాని ననుకరించినట్లే. వెఱ్ఱి వెఱ్ఱి ప్రక్కచూపులు చూచి ముసిముసి నవ్వులు నవ్వి ముడుచుకొనిపోయినట్లయిన నాఁడుదియైపోయినట్లే! ఇంతయే యాతని యనుకరణము. కాంతల బాహ్యలక్షణములనే యనుకరింపలేని మగవాఁ డిఁక నంతరంగలక్షణముల ననుకరింపగలఁడా? కల్ల. నాటకర్తలే యాఁడువారిని జిత్రింపనెంచి మగతనముచెడిన మగవారిని సృష్టించుచున్నారే. అట్టిచో నాటకకర్తల మాటల ననుసరించి మిడుకవలసిన నటకులా యాఁడువారి ననుకరించుట? అసాధ్యము.

కాని, దమయంతి దమయంతియే యైపోయె ననియుఁ జంద్రమతి చంద్రమతిని గూడ దాఁటినదనియుఁ బండితుల ప్రచురములకు లోపము లేదు. పాత్రధారుల బంగారుపతకములకు లోపములేదు. మగవారు మగవారిని స్తుతింపకమానుదురా? ఏదీ! జంఘాలశాస్త్రి యెందఱనో యధిక్షేపించినాఁడు కదా! కాంతల నధిక్షేపించుటలో నేమి, వారిచే దిట్లు తినుటలో నేమి గట్టివాఁడేకదా! నిష్పక్షపాతముగ విమర్శింతు నని యనేక పర్యాయములు చెప్పిన యాతఁడు సైతము—మగవాఁ డాఁడు వేసము వేసి జాతికంత కప్రతిష్ఠ తెచ్చుచున్నాఁడన్న యంశమును విమర్శించినాఁడా? ఆతఁడు మగవాఁడు. అ ట్లేలచేయును?

పక్షపాతస్వభావముచే బుద్ధిపూర్వకముగ నాతఁడు విడిచిపెట్టిన యీయంశమును నేను విమర్శింపనెంచితిని. మగవాఁడు మగువ ననుకరింప లేఁడని నా సిద్ధాంతము. అనుకరింపఁగలవాఁడైనను ననుకరింపలేని వాఁడైనను ననుకరించుటకుఁ బ్రయత్నించువారెల్ల జాతికి ద్రోహులని చెప్పకతప్పదు. అందులోఁ గొలఁదిగా ననుకరించువానికంటె బాగుగా ననుకరించువాఁడే జాతికిఁ బరమద్రోహి. మగతత్త్వము నాఁడుతత్త్వము నొక్కమందడినే యంటియున్నవైనను దానికి దీనికి నత్యంత భేదమున్నది. ఒకటి కఠినము, రెండవది మార్దవము. ఒకటి హేతుబద్ధము, రెండవది రసప్లుతము. ఒకటి సంచలనము, రెండవది స్థిరము. ఒకటి బలీయము, రెండవది దుర్బలము. ఒకటి మలీమసము, రెండవది పరిశుద్ధము. ఇంకను మఱి యెంతయోభేద మారెంటి కున్నది. ఈ రెండుతత్త్వములు నింత భిన్నములుగ సృష్టిలో నుండుటచేతనే స్త్రీపురుషుల కన్యోన్యాకర్షణము నన్యోన్యానురాగములున్నవి. విజాతీయ విద్యుచ్ఛక్తి యుక్తములగు వస్తువుల కన్యోన్యాకర్షణము కాని సజాతీయ శక్తియుక్తములగు వానికిఁ బరిపూర్ణమైన ప్రాతికూల్యమేకదా! కావునఁ బురుషుఁడు పొలఁతి ననుక రించునెడల నన్యోన్యానురాగము లిఁక ననుస్వారములు; సంసారములును చట్టుబండలు; బ్రతుకులు వ్యర్థములు.

ఇదికాక, కప్పకూఁత నిత్యము కూయువానికిఁ గప్పకున్న గొంతు వంటి గొంతు రాకున్నను బురుషునికుండవలసిన తన గొంతులో మాత్రము కానంతమార్పు కలుగకతప్పదు. ఆఁడుదానివలెఁ జూడఁదలఁచి చూడఁ దలఁచి పట్టుదలతోఁ బ్రయత్నించిన మగవానికాఁడుదానిమూ పలవడకున్నను మగచూపులో మార్పుకల్గుట సిద్ధాంతము. ఆఁడుదాని కంఠరవము ననుకరింపఁదలఁచి విశాలమైన గంభీరమైన తన గొంతును సన్నపఱచుకొని కుదించుకొనిన మగవానికి సహజలలిత మధురమృదులమగు స్త్రీకంఠము రాకున్నను మగగొంతు చెడుట నిశ్చయము. అట్టి సిగ్గుపడిన యాఁడుదానిబుగ్గ యెఱుపులు, కంటివ్రాలుటలు, తలయోరలు, మొగపుఁ దళుకులు, నొడలి ముదుపులు సంతతము ననుకరింపఁదలఁచి ప్రయత్నించిన మగవానికి లలనాజనసహజలజ్జాసౌభాగ్యలీలాకలాపము పట్టుపడదు. కాని మగయొడలిపొంకములు ధ్వస్తములగుట తప్పదు.

మనసే సర్వసృష్టికిఁ గారణమని పెద్దలనిన మాటలో సత్యము లేకపోలేదు. చూడవలయును జూడవలయున నని మనస్సు వాంఛించుట చేతనే కదా శరీరమునకుఁ గన్నులు కలిగినవి! తినవలయును తినవలయునని సంతతవాంఛ కలుగుటచేతనే కదా శరీరమునకు నోరు వచ్చినది! ప్రాతిపదికమగు జంతువున కివి యేమియు లేవుకదా! తరువాత మనస్సులోని సంచలనములవలననే కదా దేహమున కవయవవైవిధ్యము కలిగినది. మనఃప్రవృత్తులు శరీరమందలి మార్పుల కెట్లు కారణములో, సంతతాభ్యాసమున దేహమునందు కలిగించు కొన్నిమార్పులు మనస్సులో మార్పుల నెందులకుఁ గలుగఁజేయఁగూడదు? నుదుటఁ బూసికొన్న విభూతిరేఖ శివదర్శనమునకై బుద్ధిపుట్టించుచున్నది. ఒడలిపై ధరించిన మల్లెదండ భోగమువీధికై మనస్సును లాగుచున్నది. యోగశాస్త్రానుసారము దేహమున కిన్ని ముద్రలు, నాసనలు, కఠినములగు గరిడీపద్ధతులు నేల కలిగినవి? మనశ్చాంచల్యనివృత్తికే కదా! ఐహికతుచ్ఛ వాంఛాలంపటతను వీడి వైరాగ్య జ్ఞానసంపత్తిని మనస్సు గ్రహించుటకే కదా! దేహపరిణామభేదములు చిత్తవృత్తులలో మార్పులు కలుగఁజేయకుండు నెడలఁ బాతంజల యోగశాస్త్రమంతయుఁ బారిశుద్ధ్యసంఘమువారి బండితుక్కువలెఁ బరశురామప్రీతి కర్హమేకాదా? దేహములోని మార్పులు మనస్సులో మార్పులు కలుగఁజేయక యెట్లుండగలవు? తా నాఁడు దానని యనుకొని యనుకొని, పరపాత్రచే నాఁడుదివలె సంబోధింపఁ జేసికొని, యాఁడుదానిపోడుములు తెచ్చిపెట్టుకొని, యాఁడుదానివలెఁ జూచి, మాటలాడి, తక్కి, తారి, యుగిలించి, త్రిప్పుకొని యేడ్చిన మగవానిదేహములో సంతతాభ్యాసమువలనఁ గలిగిన మార్పు లాతని మనస్సులోఁ దదనుగుణములగు మార్పులను గలుగఁ జేయకతప్పదు. అందుచేత నాఁడుదాని మనస్తత్త్వ మాతనికి రాదుకాని మగవాని మనస్తత్త్వము మట్టిలోఁ గలసిన దనుట నిశ్చయము.

నాయనుభవములోనున్న యొకచిన్నయంశమును జెప్పెదను. నేనొకరోజున వీధిగుమ్మములో నిలువఁబడితిని. ఆవీధి నప్పు డొక్క స్త్రీపాత్రధారి బజారులోఁ గొనినకూరలంగవస్త్రమున మూటఁగట్టు కొని యామూటఁ జేతితోఁ బట్టుకొని, యొడలిపైఁ జొక్కాలేకుండఁ గట్టుకొన్న బట్టతోమాత్రమే యింటికిఁ బోవుచుండెను. ఆతని నేనెఱుఁగుదును. ఆతఁడు జన్మమున నాఁడారివాఁడు కాని పది సంవత్సరములనుండి స్త్రీపాత్రముల ధరించుచున్నాఁడు. ఇంతలో నాతని కెదురుగ నొక పెద్దమనుష్యుడు వచ్చుచుం

డెను అతఁడొకనాటకసంఘమున కధికారి. ఆతనిఁ జూచుటతోడనే యీమందభాగ్యుఁ డక్కటె సిగ్గుపడి, యక్కటెముడుచుకొని, మూటగట్టిగా మిగిలిన యంగవస్త్రపుఁ గొసను రవంత పైఁటగ వేసికొనఁబోయి యది చాలకపోవుటచేఁ తహతహపడి రెండుచేతులను గత్తెరమాదిరిగ ఱొమ్ముపై వైచుకొని తలవంచుకొని నిలువఁబడినాఁడు. ఆహా! అతఁ డెంతలో మగరూపమును మన్నుచేసి కొవనినాడో యని నా కెంతయైన జాలికలిగినది.

ఎంతకాల మలవఱచుకొన్నను స్త్రీపాత్రధారి కాఁడుదానిబహిరంత స్తత్త్వములు రావు కాని మగతత్త్వము భగ్నమగుట నిస్సందేహము. అందుచే నిప్పు డాతఁ డెట్టివాఁడు? మగతనము చెడినవాఁడు. ఆఁడుది కానివాఁడు. ఆతఁడు పూర్తిగా నాఁడుదియే యైనయెడల నేమో మనతోపాటు తానుగూడ నుండియేయుండును. ఇంటిలోవంటకుఁ బెంటకు మనకుఁ జేదోడుగ నుండియేయుండును. అటుకాక యిటుకాక యిప్పుడాతఁడు నడుమ నూగులాడుటచేత గిజగిజ లాడుచున్నాము. ఆతఁ డాఁడుది కాని హేతువుచేఁ జేపట్టనా? మగతనము మాసిపోవుటచే వదలిపెట్టనా? అడుగంటిన యనురాగము లడుగంటనేయంటినవి. పోనీ! ఏలాగుననో సృష్టితంత్రము జరుగుటకై యేయెడమొగము పెడమొగముగనో సంసారములో శేషభాగ మీడ్చివేయుదమని సిద్ధపడిన యెడల మాకింకఁ బుట్టఁదలఁచినపిల్లలమాట యేమి? మగవాఁడు కాకుండ నాఁడుది కాకుండ నడుమనున్న సంకరస్వరూపములను గనివారి నేడ్పించి మే మేడ్చుటకంటెఁ బదుగకది కొక్కనమస్కార మర్పించి వంటయింటిలోఁ బ్రత్తిబుట్టముందో, సీతానగరములో నుపన్యాసపీఠమందో తనువు వెడలఁబుచ్చుకొనుట సర్వశ్రేయము కాదా? ఇప్పటి పరిస్థితులలో భారతదేశ మెట్టి కొడుకులను గనవలయునో యెవ రెఱుఁగరు? ఇనుపకండలవారిని, దేశభక్తులైనవారిని, విద్యాశాలులైనవారిని మన మిప్పుడు కనవలసియున్నది కాని లంగా కట్టుకొని నాట్యమాడు మగరంభను, గోవులపంచెకట్టుకొను పోతువితంతువును మన మిప్పుడు కనవచ్చునా? ఇప్పుడున్న స్త్రీపాత్రధారులు చాలరా? అదిగాక జన్మముచే నాఁడారిపెద్దమ్మ లెందఱున్నారో? వీరుచాలక, యిఁక నిట్టి యర్ధపురుషసృష్టికి మనము పూనుకొనుటఁ బుద్ధిహీనత కదా? దేహద్రోహము కాదా?

''నీ వాఁడువేసము వేసితిని కావున నీతో నేను గాఁపుర మొనర్ప'' నని స్పష్టముగ నేను నాభర్తతో–అదేఅర్ధభర్తతో–ఆఁడుమగనితోఁ జెప్పితిని–''నేనిప్పుడే వైచితినా? ఆఱుమాసములనుండి వేయుచున్నా'' నని యాతఁడు వెకవెకలాడెను. సోదరీమణులారా! చూచితిరా! ఆతని దుర్నయము! ఆతని దురాగతము! తాను జెడనే చెడినాఁడు; జాతిని సంకరపఱచుటకుఁగూడ సంకల్పించుకొనినాఁడు. ఇది నీకు నీతిగాదని మనము మందలింపఁబోగ మనలను బరాభవించుచున్నాఁడు. ఇంతకంటె నాఁడుదానికి విచారణకారణ మేమియుండగలదు? ఇది మనము సహించి, నోరుమూసికొవని పడియుండవలసిన దేనా? నే నట్టినీచత కంగీకరింపను. విద్యావతులు, మానవతులు, దేశభక్తియుక్తలైన నా సోదరీమణులందఱు నాయభిప్రాయముతో నేకీభవింతురని నమ్మియున్నాను. ముందు జరిగింప వలసిన పని యొకటి యున్నది. ఆంధ్రదేశమున నున్న నాటకసంఘాధికారుల కందఱకు మన మొక్కయాజ్ఞాపత్ర మంపవలసియున్నది. దానిలోని యంశము లి ట్లుండవలయును.

''మీరు మాభర్తలచే మీ నాటకములలో నాఁడువేసములను వేయించుచున్నారు.

మగవాని కనర్హమైన స్త్రీపాత్ర ధారణమువలన వారు చెడిపోవుచున్నారు. వారట్లుపాడై జాతినిగూడ భ్రష్టపఱచుటకు సంకల్పించుకొనియున్నారు. వ్యక్తివినాశకమైన, జాతివినాశక మైన యీ కృత్యమును మీరు ప్రోత్సహింపఁదగదు. కావున మా భర్తలను మీసంఘములనుండి బహిష్కరింపవలయును. ఇంతటినుండి పురుషులచే స్త్రీవేషములను వేయింపమని మీరు శాసన మొసఁగుకొనవలయును. నాట్యకళాభివృద్ధి మా కిష్టమే. స్త్రీలకే స్త్రీపాత్రము లిప్పించి మీ రాకళను బరిపోషించి, పరిపూర్ణకీర్తి నొందవలయును, నాగరికతగల యన్నిదే శము లందుఁగూడ నదియే పద్ధతి. మీరు దానికి విరుద్ధముగ నడువఁదగదు. సహేతుకమైన మా యాజ్ఞాపత్రమును మీరు సన్మానింపవలయును.''

ఇట్లు వ్రాసి స్త్రీలందఱుచే సంతకములు చేయించి వారికిఁ బంపవలయును. అటుపిమ్మటఁగూడ మనభర్తలు చీర రైక సొగసు చిత్తగించుట మానకపోవునెడల నింక నంతే–వారికి వారే, మనకు మనమే వారితో మనము పూర్తిగ విడిపోవలసినదే. రాజకీయ ప్రపంచమున Non-Co-operation యెట్లు పుట్టినదో శృంగార ప్రపంచమున నిప్పుడు Non-Co-operation అట్లు పుట్టవలసియున్నది. మనకు జాతిపరిశుద్ధి ప్రధానము కాని సంసారవృద్ధి కాదు. దేశసేవ ప్రధానము కాని భర్తసేవ కాదు. భారతదేశసేవ ముందుఁ బతిసేవ యెంత? మనకుఁ బతులు శాశ్వతులు కారు. వారికిష్టత తప్పినను బోవుదురు. మన కిష్టత తప్పినను బోవుదురు. కాక మృత్యువున కధీనులైపోవచ్చును కాని భారతదేశము శాశ్వతము! ఆమె యిప్పుడు పుత్రపుత్రి కాసేవ నపేక్షించుచున్నది. పూర్వసౌభాగ్యము, నాగరకత, విజ్ఞానము, సంపత్తు, స్వాతంత్ర్యము, గౌరవము నశించుటచే దీనమై, శోభారహితమై, దాస్యశృంఖలానిబద్ధమై పరితపించుచున్నది. శీతజ్వర మారికాది మహావ్యాధులచేతను, గూటికి గుడ్డకుకూడఁ గఱవైన దారిద్ర్యములచేతను, రక్తపాతములకుఁ గారణము లగు చున్న వర్ణవైషమ్య ములచేతను జాతియంత యథాయథ లగుటవలన, నాకంటికొలికినీరు బంగాళాఖాతముగ నా కంటికొలికినీరు పశ్చిమసముద్రముగ మహాసంక్షోభ మొందు భారతదే శమును సేవించి పూజించి మనతనువులు కృతార్థము లగునట్లు చేసికొనవలయును–సు.స.

''భారతీపత్రికాధిపతీ! ఈకాంత వ్రాసిన సాహసపువ్రాతలలో నొకటి రెండశములు నేను విమర్శింపవలసియున్నది. ఆవిమర్శనము త్వరలోఁ బంపెదను. ఆశ్వయుజమాసమునఁ బ్రకటింపఁబడు భారతిలో దానివి బ్రకటింపఁగోరుచున్నాను.

చిత్తగింపుఁడు,

పా. ల. నరసింహారావు.''

(''భారతి'' నుండి పునర్ముద్రితము).

# 32. శ్రీమతి సు.స. గారికి బహిరంగ లేఖ

ఆడవేషాలు వేసే మగవారి గురించి దుమ్మెత్తి పోసిన సు.స. గారికి – కొన్ని విషయాల గురించి– సమాధానంగా పానుగంటివారు ఈ వ్యాసం వ్రాశారు.

ఉపన్యాసం స్త్రీలను ఉద్దేశించినదే అయినా, పురుషుల్ని ఉద్దేశించి పుంఖానుపుంఖాలుగా అందులో తిట్లున్నాయి. భర్తమీద కోపంతో వెల్లడించిన అభిప్రాయాలకు, భారతీయ జాతి పరిశుద్ధితో లంకె ఉండడం వల్ల స్త్రీపురుషులంతా చదవాలని పానుగంటి వారు భారతిలో ప్రకటించారు.

సు.స. గారి వ్యాసంలో నాలుగు భాగాలున్నాయి. నాలుగింటా ఒకటే సంకల్పం, పురుష జాతిని తిట్టడం.

స్త్రీపాత్రధారణం చేసే మగవారి మూలంగా కలిగే పిల్లలు సంకర స్వరూపులై ఉంటారనే వాదం సరైంది కాదు. కాదని చెప్పడానికి దృష్టాంతాలున్నాయి.

*HERIDITY* మూలంగా కన్ను, ముక్కు, మూతి వంటి పోలికలు రావచ్చును గాని--గుణగణాలు రావాలని లేదు. మహాపండితుడి కొడుకు శుంఠ కావచ్చు. నిరక్షరకుక్షి వంశంలో మహామేధావంతుడు పుట్టవచ్చు. బహుపత్నీకుడైన దశరథుడికి–శ్రీరాముడి వంటి ఏకపత్నీవ్రతుడు కొడుకు కావడం, విష్ణుద్వేషి అయిన హిరణ్యకశిపునికి హరిభక్తుడైన ప్రహ్లాదుడు పుట్టడం గమనించలేదా!–జీవుడి పూర్వజన్మ సుకృత దుష్టాంతాలే ఈ జన్మలో గుణగణాలకు కారణాలవుతాయి. మగవాడు ఎలాంటివాడైనా, స్త్రీ భావన, బిడ్డల్ని కనడంలో ప్రముఖం. స్త్రీల భావన లోపం వల్లనే జాతిలో బానిసతనం ఎక్కువవుతుంది. ఆడవాళ్లు స్త్రీపాత్రల్ని ధరించడంలో గృహిణులైన వారికి చాలా సాధకబాధకాలున్నాయి. వేశ్యల్ని తెచ్చి వేషాలు వేయిస్తే ప్రమాద పరంపర ఇంకా హెచ్చు. స్త్రీ పాత్రధారణ చేసే పురుషులు బాగానే చేస్తున్నారు. ఈ సందర్భంలో, కొత్త సంస్కరణ లేమీవద్దని, సు.స. గారికి సలహా ఇచ్చారు.

అమ్మా! శ్రద్ధతో వ్రాసి యశ్రద్ధతో విడిచిపెట్టిన నీయుపన్యాసము దైవవశమున నాకు దొరకుటచే దానిని సంతోషమునఁ జదివి విమర్శింప వలసివచ్చెనని విచారించితిని.

ఆ యుపన్యాసము స్త్రీలకై యుద్దేశింపఁ బడినదైనను; దానిలోఁ బురుషులకుఁ బుంఖానుపుంఖముగాఁ దిట్లుండుటవలనను, భర్తపైఁ గోపమున వెల్లడించిన యభిప్రాయములకు భారతీయజాతిపరిశుద్ధితో లంకెయుండుటవలనను దానిని స్త్రీపురుషులందఱు చదువవలవలసినదని యెంచి భారతిలోఁ బ్రకటింపించితిని. అట్లు ప్రకటించుటకు మీ సెలవులేదని యెఱుఁగుదును. కాని మీ రెవ్వరో నే నెఱుఁగనప్పుడు మీ సెలవు నొందకపోవుట లోపము కాకపోవచ్చును. అదికాక జాత్యుపద్రవ మేదో వచ్చినదని మీరు భావించుచు మహాందోళన మొందుచుండ నట్టి యాపత్కాలములో ననుజ్ఞ యక్కఱలేదని యనుకొనుట కూడ లోపము కాకపోవచ్చును. ఎటులైనను భారతీసేవకై సంకల్పింపఁబడినది భారతినే చేరినది.

అమ్మా! నీయుపన్యాసము నామూలాగ్రముగ బండిలోనే చదివితిని. అది నాల్గుభాగములుగా విభజింపబడినట్లు స్థూలదృష్టికిఁ గానఁబడుచున్నది. మొదటిభాగము మగవానికిఁ దిట్లు; రెండవ విభాగము మగవానికిఁ దిట్లు; మూఁడవవిభాగము మగవానికిఁ దిట్లు; నాల్గవ విభాగము మగవానికిఁ దిట్లు; మగవాఁడు వట్టి వ్యర్థుఁడని మీ యభివృద్ధికిఁ బ్రతిబంధకారుఁడని, పరమశత్రుఁడని, ప్రత్యక్షమారకుఁడని, యాతనిఁ దృణీకరించి స్వప్రయత్నముననే మీ రిట్టిమహోన్నతదశకు వచ్చితిరని, మగవాని నేల నడఁచిత్రొక్కినను బాపములేదని మొదలగు ప్రారంభ శాపవాక్యములు మొదటియధ్యాయమునందుఁ బ్రకాశించుచున్నవి. మీ బుద్ధిచేత మీకర్హములని యుపయోగకరములని మీరెంచిన బాహ్యవేషములను ధరించుచు నభినవశోభావి రాజమానలై యార్యావర్తకల్యాణ దేవతలై యలరారుచుండఁగ, బాహ్యవేషధారణమునఁ దన్నేమో మీ రనుకరించుచున్నారని భ్రాంతిపడి మగవాఁడు మి మ్మెంతయో యల్లరిపెట్టినాఁ డనుకోపమున మీ రాతనిని జెడమడఁ దిట్టినతిట్లు రెండవయధ్యాయమున నేర్చినరత్నాలవలె భాసిల్లుచున్నవి. మగవాఁడు కోక కట్టుకొని, కాటుక పెట్టుకొని, నవరపుబుట్ట నెత్తిని గట్టుకొని, బూడిద మొగమునఁ గొట్టుకొని కోడెపెయ్యయై రంగమున నవతరించి నందులకు కాతని కడ్డమైన తిట్లు—మాయదారిచూపులు—మంగళపు టారతిచూపులు—చూడలేకపోయెనని మఱిమఱితిట్లు—ఆఁడుది నిలువఁ బడినట్లు నిలువఁబడనైన లేకపోయినాఁడని నిలువెల్లఁ దిట్లు—మానినీ తత్త్వము ననుకరింపలేకపోయెను. గాని మగయొడలి పొంకములు, మనస్తత్త్వము కూడ మన్ను చేసికొనినాఁడని—ఓ—హద్దుపద్దులేనితిట్లు—మూఁడవయధ్యాయమునఁ బ్రచండధాటీపరిపాటితో విజృంభించుచున్నవి. సంకరరూపసమార్జనమున సంసారకృత్యమున కర్హుఁడు కాని యాతఁ డా నాటకరంగమందే పడియుండి మగవాఁడు కాకుండ, నాఁడుది కాకుండ నేదో మధ్యమమార్గగామియై దేహము చాలించుకొనక, సిగ్గులేక, యిల్లుచేరి, తగుదునమ్మా యని తనవంటి మందభాగ్యుల నింక నవతరించ పజేయుటకుఁ బ్రయత్నించుచున్నాఁడని, దేశద్రోహియని, జాతిద్రోహియని తిట్టినతిట్లు—హరిహరీ!—తురీయాధ్యాయమున నప్రతిహతములై యనిర్వర్ణ్యములై యున్నవి. వేదోచ్చారణమును వదలి చతుర్ముఖుఁ డగు బ్రహ్మదేవుడు తిట్లకు లంకించుకొన్నయెడల నింతకంటె నెక్కువ తిట్టలేఁ డేమో యనుసందేహమును గలుగఁజేసితివి. ఈనాలుగధ్యాయములలో నాలుగువర్ణములవారికి, నాలుగాశ్రమములవారికి, నాలుగుయుగములవారికిఁ దలమున్కలైన తిట్లు ప్రసాదించితివి; తల్లీ! శాపాలాపశారదావతారమవు!

వెల్లీతిట్లకు విమర్శన మేమున్నది? స్వర మగునెడల గాంధారమా మధ్యమమా

మఱియొకటియా యనుపరీక్షకాని, యపస్వరమునకుఁ గైశికియా కాకలియా యనువిచికిత్స యుండునా? ఉపేక్షకంటె నుత్తమవిమర్శనము వేఱొకటి లేదు కావుఁ దిట్లసంగతి యింకఁ దలపెట్టక విమర్శింపవలసినయంశము లేవో కొలదిగా విమర్శింతును.

అమ్మా! స్త్రీపాత్రధారణము తఱచుగఁజేయు మగవానిమూలమునఁ గలుగుపిల్లలు సంకరస్వరూపులై యుందురని మీవాదము. ఇది మీభావనకాని ప్రకృతిసత్యము కాదు. ఆఁడారివా రెందఱో ప్రపంచమున నున్నారు. నే ననేకుల నెఱుఁగుదును. వారి యాఁడారితన మింత యంతయని చెప్పవీలులేదు. మాటలోఁ, జూపులో, రూపులో, నడకలోఁ దలంపులోఁ, జర్యలో సంపూర్తిగా నాఁడువారివంటివారేకారు–ఆఁడు వారే? అంతయో యింతయో దుష్టత్వ మాఁడంగితనమున కంటియే యుండును. ఆఁడారివాఁడు గుమ్మము నొద్ద నిలువఁబడియుండఁగ వీథిలో నెవఁడైన సుందరుడు పోవుచుఁ దనవంకఁ జూడకుండిన యెడలఁ గనపుట్టే యేమిమునిఁగిపోయినది? తన స్త్రీత్వము నాతఁ డవమానపఱచినాఁడని యాతఁ డట్టుడికిన ట్లుడికిపోయెను! ఆసుందరుఁడు మఱియొకయాఁడు దానినిఁ జూచి మందహాస మొనర్చునెడల నాఁడారివాఁ డసూయచేఁ దలనేలఁగొట్టుకొనుటకు సిద్ధపడును. అట్టి యాఁడంగివాఁడైనను బుంస్త్వసహితుఁడై పతివ్రతయైన తనభార్యయం దిల్లునిండిన బిడ్డలఁ గనుచున్నాఁడు. వారు సంకరస్వరూపులైయున్నారా? అణువంతయాఁడారి తన మాతనిపుత్త్రులయం దెచ్చటనైనఁ గనఁబడుచున్నదా? దుర్బలులైనపిల్లలఁ గనుచున్నాఁడా? ఉక్కుతునుకలవంటి వారిని గనుచున్నాఁడు. పౌరుషవిహీనులై వారిని గనుచున్నాఁడా? లేదు, శౌర్యసహితులనే కనుచున్నాఁడు. ఆఁడారితండ్రికిఁ బుట్టినవాఁ డెవ్వఁడుకూడ నాఁడారి వాఁడు కాలేదని యనేకదృష్టాంతములు చూపవచ్చును. అంతవఱ కిప్పుడవసరము లేదు. స్త్రీపాత్రధారియైన పురుషుఁడు దేహమనస్తత్త్వములం దాఁడంగివానికంటె నెక్కువ చెడిపోయినాఁడా? లేదు ఆఁడంగివాఁడే యట్టిబిడ్డలను గనుచుండ, స్త్రీపాత్రధారి సంకరస్వరూపులను గనుననుట సత్యదూరము; సాహసము.

వేదవిహితాచారసంపన్నుఁడై స్వచ్ఛమూర్తియైన వైదికశిఖామణికి, రైల్వేవారి భోజనమఠములందు గొడ్డుమాంసమును బీకుకొని తిను కర్మచండాలుఁడు జన్మించుచున్నాఁడు. పార్వతీపరమేశ్వరులవలె నప్రతిమాన దాంపత్యసహితులై పరమప్రశస్తులైన భార్యాభర్తలకు వారవనితామాతచేఁ జెప్పుదెబ్బలు దిను వంశోద్ధారకుఁ డుదయించు చున్నాఁడు. షట్ఛాస్త్రపాండితీమండితుఁడై సర్వదిగంత విశ్రాంతకీర్తి యుక్తుఁడైనవానికి శుంఠలలో శుంఠ జన్మించుచున్నాఁడు. అమ్మా! ప్రపంచచరిత్రమును జూచుచుండుట లేదా? వితరణకళాదీక్ష యందు బలిశిబికర్ణాదులంతటి మహావదాన్యులగర్భమునఁ దండ్రిప్రాణోత్క్రమణసమయమున నాతనితలవైపునఁ బెట్టుదీపము దండుగ యని యార్పిఁ జేయులుబ్ధాధమాధముఁడు కలుగుచున్నాఁడు. నవరసమయ నవజగన్నిర్మాత యైన Shakespeare మహాకవి గొడ్లు కోసికొను కటికవానిపుత్రుఁ డని యందురు. ఒకనీగ్రోజాతి యాతఁడు మహావిద్వాంసుఁడై మహాసభయం దొకమహోపన్యాస మిచ్చుచుండగా విని మహాశ్చర్యభరితుఁడైనట్లు శ్రీవివేకానందస్వామి సెలవిచ్చినారు. ఆ నీగ్రోపండితుని తండ్రితాతలు పట్టి మూఢులైయుండ, నట్టివిద్వాంసుఁడు వారివంశమునఁ బుట్టుట చూడఁగా Hredity యనునదది కల్లకాని వేఱుకాదని యాస్వామి స్పష్టపఱచినారు. ఏడడుగులయెత్తు దాఁటినవానిని Giant అని

యందురు. అట్టివారెందరో యిదివఱకు జన్మించిరి. కాని వారి తల్లిదండ్రులు సామాన్యాకృతి కలవారేకాని తద్భిన్నులు కారని పరిశోధనమువలనఁ దెలిసియనంశమే కదా! ఏడడుగులయె త్తుగల తండ్రికి మూఁడడుగుల వామనుఁ డుద్భవించుట లేదా? ఇంతయేల? ముగ్గురుభా ర్యలు చాలక దినమున కొకతె చొప్పున మూఁడువందల యఱువదుగు రుంపుడుకత్తెలను జేరఁదీసిన దశరథమహారాజునకు–పరశురాముడు కాఁబోలు యుద్ధవార్త నంపఁగాఁ జేతులకు గాజులు తొడిగించుకొని యూఁడువారిగుడారము లలో దూఱిన దశరథమహారాజుకేకదా –ఏకపత్నీవ్రతుఁడైన జానకీనాథుఁడు–జగదేకవీరుఁడైన శ్రీరామచంద్రమూర్తి జన్మిం చినాఁడు; అమ్మా! ఇంకను Heredity ని నమ్మెదవా? Heredity యనుదాని వలనఁ దండ్రిసంబంధమైన ముక్కుపొడుగో, తల్లిసంబంధమైన కన్నుసోగయో, మేనమామసంబంధ మగు మూతివంకరయో పిల్లవానియందుఁ గాదాచిత్కముగ సంక్రమింపవచ్చునుగాని, జగత్తు నేలుటకు సామర్థ్యముగలయట్టియుఁ గాక జగత్తునకు బానిస యగునంతటి తుచ్ఛత్వము గలయట్టియు, మనస్సులోని శౌర్యము, గాంభీర్యము, త్యాగము, సాపత్సహనము, భూత దయ, దైవభక్తి మొదలగు సద్గుణపరంపర కాని, కాతరత, లాఘవము, లోభము, శాంతిరాహి త్యము, తామసము, నాస్తికత మొదలగు దుర్గుణపరంపర కాని, Heredity వలనఁ గలుగుట కవకాశము లేదు. అట్టియవకాశమే యుండునెడలఁ బ్రహ్లాదుఁడంతటివాఁడు హిరణ్యకశిపు నంతటివానికిఁ బుట్టుట సంభవించునా? అనూచానత కారణము కానియెడలఁ గారణమేదని యడుగుదువేమో? జీవుని పూర్వజన్మసుకృతదుష్కృతములే జన్మములోని గుణాగుణ ములకుఁ గారణములు కాని వేఱుకాదు. అమ్మా! నమ్ముటకు నీ కిష్టమైనయెడల నమ్ముము; కాని యెడల మానివేయుము. నీనమ్మకమువలన నార్యమతమునకు బలము లేదు. నీతిరస్కా రమువలన నీరసతయులేదు. మహాబుద్ధిశాలులైన పెద్దలు నిర్వచించిన మాటలను నాకుఁ దెలిసినంతవఱకు నా యత్యల్పశక్తి ననుసరించి చెప్పుచున్నాను. వేదర్షులయందలి విశ్వా సము చేనైనను నీనూతన సిద్ధాంతమును ద్యజింపఁదగును.

''నీవు స్త్రీపాత్రధారణ మొనర్చితివి కావున నీతో నేను గాఁపుర మొనర్ప'' నని నీవు భర్తతో నిరంకుశముగఁ బలికితివే! ఆహా! భారత దేశ సంరక్షకదేవతలు గడగడ వడఁకునం తటి మాటయంటివే! భర్తపైటవేసికొని వంకరగఁ జూచినంతమాత్రముననే భర్తృభార్యాసం బంధము తెగునని యనుకొంటివా? అదిగాక ''మనకు భర్తలు శాశ్వతులు కారు; వారియి ష్టము లేకున్నఁ బోవుదురు. మన యిష్టము లేకున్నను బోవుదు'' రని వ్యాసుఁడు బ్రహ్మసూత్రరచన మొనర్చినట్లు నీవు పరిణయసూత్ర ములను గల్పించితివే! అమ్మా, యెంతదానవు! మనవివాహశాసనము వంటపూటింటివ్యాపారమువంటిదే యనుకొనుచు న్నావా? రషియావారి మూఁడుసంవత్సరముల ''కాంట్రాక్టు'' వంటిదే యనుకొనుచు న్నావా? భార్యాభర్తలు తనువులు వాసినను బంధము నీడునది కాదని యెఱుఁ గవా? శరీరయాత్ర చాలించి స్వర్గమున నఖండానందసముద్రమున నోలలాడుచుండునిల్లాలైనను భూలోకమం దింక జీవించియున్న తనభర్తకై గ్రుడ్ల నీరుగ్రుక్కుకొనుచునే యుండునుగదా? తనభర్త యన్యకాంతాసక్తుఁడు కాక తనయందే యపేక్షగలవాఁడై యుండవలయు ననియుఁ దన గృహదేవతలను బూజించుచు, నతిథిసత్కార మొనర్చుచు, సదాధర్మమందే చరించుచుఁ గీర్తికాముఁడై యుండవలయు ననియుఁ, బుణ్యరాశియైన యాతఁడు, భూలోక యాత్రాపరిసమాప్తి యైనపిమ్మట స్వర్గమునఁ దన్నుఁజేర యవ్యయానందము ననుభవింపవ

లయు ననియు, నామె భగవంతున కెల్లప్పుడు మ్రొక్కుకొనుచునే యుండును గదా! ఇది సత్యమని నిరూపించుటకు నిదర్శనములున్నవి కాని లేకపోలేదే! అట్టిచో నిద్దెనపాత్రము పొరుగింటినుండి తెచ్చుకొని యిద్దెనలు చేసికొన్న పిమ్మట వారిపాత్ర వారికిఁ బాఱవైచినట్లు భర్తతో నవసరము తీఱినవెంటనే యాతనిఁ బైకిఁ బొమ్మనుటకు నీ కధికార మున్నది యనుకొనుట తప్పు కాదా! పట్టరానికోపముచే నటులంటివి కాని నీమనస్సులో నట్టియుద్దేశము లేదని పెద్దవాఁడనైన నేను గ్రహింపలేనా? ఆఁడువేసములు వేసిన పురుషులవలన సంకరస్వరూపులు పుట్టుదురని స్వప్నమందైన ననుకొనకుము.

అమ్మా! మఱియొక్క మాట. మీకున్న భావనను బట్టియే మీకుఁ బుత్రులు కలుగుదురు. ఈయంశమునుగూర్చి జంఘాలశాస్త్రి చెప్పియే యున్నాఁడు. ఆతనిమాటలనే చెప్పెదను. ''భర్తయందు మీకున్న భావనాగౌరవమును బట్టియే మీకు సంతానము కల్గును. తెలిసినదా? భర్త పరదేవతయని యెంచి మీ రాతనిని సేవింపుఁడు. మీభావనాబలముననే మహాపురుషులు మీ గర్భమున నవతరింతురు. భర్త మీకు బానిసయని యెంచి యాతనిపై నధికార మొనర్పఁకుడు. మీరు బానిసక్రింద బానిసవంటిపిల్లలఁ గందురు. అది నిశ్చయము. అభిమన్యుని సుభద్రయే కనవలయును. భరతుని శకుంతలయే కనవలయును. ఈ కాలములో నభిమన్యులు, భరతు లెందుకు లేరు? సుభద్రలు, శకుంతలలు లేకపోవుటవలన. భర్తలను దైవములుగ సేవించుటకు భగవత్సములైన భర్తలిప్పుడున్నా రాయని తెలివితక్కువ ప్రశ్న మొనర్పకుఁడు. ఒకప్పుడు మాత్రము భగవత్సము లైనవారుండిరా? లేరు. ఇప్పుడింతకంటె లేరు. లేకపోయినప్పటికి మీ భావనకభ్యంతరమేమి? మగలు కాని మట్టిబొమ్మలు కారే. మట్టిబొమ్మనే ద్రోణాచార్యుఁడుగ భావించి సేవించినవాఁడు ధానుష్కశిఖామణి కాలేదా? అంవఱ కెందులకు? గాజులతట్టతోఁ గలుపఁబడిన గోడిగ యరేబియా గుఱ్ఱమును గనుటలేదా? భావనయే ప్రధానమా? అంతకంటె నేమైన నున్నదా? అట్టి మీ భావనలోపమువలననే జాతిలో బానిసతన మెక్కువ యగుచున్నది. మీయొద్ద మీ భర్తలు గడగడలాడినప్పుడు మీరు కన్నకొడుకు లెలుకలను జూచి, పిల్లులను జూచి యేడ్చునారనగ వింతయేమున్నది? సోదరీమణులారా! బాహుబలసంపన్నులు, ప్రజ్ఞాశాలులు, క్షాత్రవంతులైన పుత్రులఁ గని భారతదేశ ప్రాచీన గౌరవమును గాపాడుదురుగాక!''

విమర్శింపఁ దగినయంశ మింకొక్కటియున్నది. నాగరకతగల యితర దేశములందలి పద్ధతి ననుసరించి స్త్రీలకే స్త్రీపాత్రములిచ్చి నాటక కళను బరిపోషింపవలసినదని మీరు నాటకసంఘాధికారుల కొసఁగఁ దలఁచిన యాజ్ఞాపత్రములో నున్నది. అమ్మా! అవశ్యకమైన యెడల నన్యదేశీయ పద్ధతి నవలంబించవచ్చును. కాని, దాని నవలంబించుటకుఁ బూర్వము మనదేశ శీతోష్ణస్థితులేమో, సాంఘికనైతికాదిస్థితులేమో, జాతియాదర్శమో, యన్యదేశీయపద్ధతి మన యీ పరిస్థితులకు సరిపోవునో, వికటించునో, మనతత్త్వములకు విరుద్ధమైనమందును దీసికొనుటవలన నున్న రోగ మట్లుండఁగా మఱి యింక నేరోగము కలుగునో యరవంత చూచుకొన నక్కఱలేదా? పాశ్చాత్యదేశములలో మిక్కిలి శీతలప్రదేశము లందలి వారికి శీతోదకస్నానము స్వప్నమందైన లేదు గదా! ఉష్ణోదకస్నానమైన దినమున కెన్నిసారులని యడుగవలదు; వారమున కెన్నిసారులని యడుగవలదు; మాసమున కెన్నిసారులనియైన నడుగవలదు. సంవత్సరమున కయిదాఱుపర్యాయములు లైనయెడల–ఓ

–సమృద్ధి పండ్రెండుస్నానము లొనర్చువాఁడు పరిపూర్ణస్నాననిష్ఠాగరిష్ఠుఁడు. ముంజేతులకు మొగమునకు మాత్రమే యుష్ణోదకస్పర్శము కాని యొడలి కేది? వారు నాగరికత కలవారు కారా? అట్లని వారి పద్ధతి మనమవలంబించు నెడల భారతదేశమంతయుఁ బదిమాసములలో నిర్జన మగుట కేమైన సందేహమా?

అమ్మా! France దేశమునకుబోయి యచ్చటి యొకనటిని నీ వీ వృత్తినేల యవలంబించితివని యడుగుము. ''ఈవృత్తిలోఁ జాకచక్య మగపఱచి, ధనము సంపాదించునెడల మగఁడెవ్వఁడైన లభించునేమో యను నాసతో నిందు దిగితి'' నని యామె ప్రత్యుత్తరము చెప్పును. ముప్పది రెండేండ్ల కన్య మొగమునకు బూడిద రాచుకొని యర్ధదిగంబర వేషముతో నాట్యమాడుచు, వలతోఁ జిగురుగండెలతో, పక్షికూతలతో మగలకై వేఁటాడుచు, నెవ్వనినో యొకని గ్రహించి వానిని కొంత కాలము పరీక్షించి నచ్చనియెడల విడిచిపెట్టుచు, మఱియొకని గ్రహించి, వాఁడు చేసిన మోసమువలనఁ గలిగిన ఫలముల కేడ్చుచు, మఱల మఱియొకనికై ప్రయత్నించుచు, నాందోళనపడుచు, నల్లాడుచు, మిడుకవలసిన స్థితి భారతదేశస్త్రీ కెన్నఁడైన నేమాత్రమైనఁ గలుగుటకు సాధ్యమగునా? ముప్పదిరెండేండ్లవఱ కెందులకు? పదునెనిమిదేండ్లు దాఁటిన కన్యను సాధారణముగా భారతదేశమందుఁ జూపఁగలమా? అంతవఱకుఁ గూడ నెందులకు? పదియేండ్లకుఁ బెండ్లి, పదునొకండేండ్లకు సమర్త, పండ్రెండేండ్లకు లొడితెడుబిడ్డయు గల గృహిణి భరతశాస్త్రాభ్యాసము చేయుటెప్పుడు? ప్రసన్న యాదవములో నూర్వశియై తాండవించు టెప్పుడు? అమ్మా, Germany లో మఱియొక్క నటిని నీ వీవృత్తిలో నేల చేరితి వని యడిగెదవా? ఆమె యేమిప్రత్యుత్తరమిచ్చుచున్నది. Excitement కొఱకని చెప్పుచున్నదా? అమ్మా! అనఁగ నేమో నీకర్థమైనదా? ఉత్సాహమునకు–ఉబికిన యుద్రేకమునకు–నరముల కదలికకు ఆమె యీవృత్తిలో జేరినదఁట! ఇంట బండపనిచే, భర్తృసేవచే, బంధువుల యాదరణముచే, నతిథిజనసన్మానముచే, దేవపూజా ద్రవ్యసమార్జనముచేఁ, బిల్లల కొనర్పవలసిన మొదలు తుదిలేని, తెఱపి తెంపులేని యుపచారపరంపరచే నిత్య ముత్సాహతోఁ గదలికతో మెలఁగవలసిన మననారీమణుల కెప్పుడైన నట్టి Excitement కావలసియుండునా? పరదేశనటీశిఖామణులు బ్రహ్మచారిణులగుటచే నేవిధమైన జంజాటము నెఱుఁగని హేతువున వారి కట్టి యుద్రేకస్థితి యావశ్యకము కాని, యూఁపిరి విడుచుటకైన దెఱపిలేని యుద్రేకస్థితిలోఁ దఱచుగా నుండవలసిన మననారీమణుల కది యె ట్లన్వయింపఁగలదు? ఒకవేళ నెప్పుడైన నే కారణమునైన రవంత మాంద్యముగా నున్న యెడలఁ దోఁపకుండ నుండునెడలఁ గదలికకొఱకు గ్రచ్చకాయలాడుకొందురు; చతురంగ మాడుకొందరు; పాటలు పాడుకొందురు; పదిమంది చేరి యేదైన గ్రంథమును జదువుకొందురు. అంతేకాని యంతకంటె నుద్రేక మిచ్చుపను లొనర్చుటకు మనవారు పాల్పడఁగలరా? పట్టపగలు, భర్తతోనైన రవంత యే కాంతముగ మాటలాడినయెడల నత్తగారు రొసరొరలాడునే! ఆఁడుబిడ్డ మూఁతి విరుచునే! పరపురుషుని స్పృశింపఁదగదు; చూడఁదగదు; తలఁపఁదగదని ముప్పేటయేనుఁగు మెలికలబంధముతో జాతితత్త్వపరిశుద్ధనిమిత్తమై పరమసంతోషపూర్వకముగ బంధించుకొన్న మన సోదరీమణులు నాటకములలోఁ బరపురుషులచే నాలింగన మొనర్పఁబడుటకుఁ గాని, ముద్దు పెట్టుకొనఁబడుటకుఁగాని యంగీకరించుట యెన్నఁడైన సాధ్యమగునా? పదవయేఁట గట్టుకొని, యెనిమిదేండ్ల నుండి కాఁపురముచేయుచు నల్వురుబిడ్డలను గన్నమగఁ డింటిలో నుండఁగా

మనదేశమందలి సంసారిణి ''ప్రాణప్రియా'' యని ఔరంగజేబుమీఁదఁ జేయి వైఁగలదా? పైన హిమాలయము, ప్రక్కను సముద్రము లున్నంతకాలము భారతదేశస్త్రీల కట్టిదుర్యోగము పట్టదు? ఇతరదేశస్త్రీలందు మాత్రము నటీవృత్తి వివాహముతో సామాన్యముగ నంతముకాకుండ సాగుచున్నదా? అందుచే సంసారిణుల కది యనర్హమని ప్రపంచమంతయు నంగీకరించిన విషయము లాగునఁ గనిపించుచున్నది.

ఇఁక మిగిలినవారు వేశ్యలు. అమ్మా! వీరికి స్త్రీపాత్రము లీయవలసిదని నీయభిప్రాయమై యుండవచ్చును; ఇది సమంజస మగునో కాదో చూతము. ఇప్పుడు వేశ్యలలో గొప్పసంస్కరణ మారంభమైనది. దైవకటాక్షమువలన నిది దేశమంతట వ్యాపించును. అత్యంతము న్యాయమైన యీసంస్కరణమునకు సంపూర్ణవిజయము సిద్ధింపవలయును నని మనుష్యమాత్రుఁడెల్లఁ గోరఁదగినది. ఇఁక నొక్క పదిసంవత్సరములలోఁ బెండ్లికాని వేశ్య కనఁబడకపోవచ్చును. అంతవఱకిప్పుడున్న వారిని నాటక రంగమునఁ బ్రవేశపెట్టి కాలక్షేపమేలచేయరా దందువా? అమ్మా! అటులే యదికూడఁ జూతము.

చెవికంటెఁ గన్నెక్కువ జ్ఞానేంద్రియమగుటచే, శ్రవ్యప్రబంధ పఠనమున మనము సంపాదించుకొను విజ్ఞానము కంటె దృశ్యప్రబంధ ప్రదర్శనమున సంపాదించుకొను విజ్ఞానమెక్కువ-యెక్కువ సుసాధ్యము—యెక్కువ బలీయము—యెక్కువ శాశ్వతము.

నీతికిఁ దావై, ధర్మమునకు నిలయమై, శాంతి కాకరమై, స్వార్థపరిత్యాగమునకు స్థానమై, దేశభక్తికిఁ దావలమై, దైవభక్తికి మూలమై, మోక్షనిశ్రేణికకు మొదటిమెట్టై ప్రకాశించు పవిత్రనాటకరంగమును బ్రత్యక్షపాపవృత్తివలన జీవించు వేశ్యలసమావేశముచేఁ గలుషపఱచుట సమంజసము కాదని భావించుట న్యాయము కాదా? ఇప్పు డున్ననటకు లందఱు యోగులు, భక్తులు, జ్ఞానులేనా యని యధిక్షేపింకుము. మంచివారున్నారు, చెడ్డవారున్నారు. పోనీ! నీయభిప్రాయప్రకారము చెడ్డవారే హెచ్చుసంఖ్యా రున్నారని యంగీకరింతము. ఇదివఱకున్న కీడే ప్రబలమైయుండెనని నీ వొప్పుకొనుచున్నప్పుడు దానికంతకంటెఁ బ్రబలమైనకీడును జేర్పఁ బ్రయత్నింపవచ్చునా? ఉష్ణప్రదేశమగుటచే మప్పులేకుండ ముప్పందుము త్రాగఁగల యిట్టినటకులతో—సంభాషణములకు, సరాగములకు, సాహచర్యములకు, సమాలింగనములకు—బ్రత్యక్షవేశ్యలనే యంటఁగట్టియెడలఁ గొంపలు నట్టేట వేజె కట్టుకొననక్కఱలేదు. ఇఁక నటులలోఁ బరస్పరము కొట్లాటలు, గ్రుద్దులాటలు జరుగుట కేమైన సందేహమా? వారకాంతలను స్త్రీపాత్రములుగఁ జేసికొన్న యొకటి రెండునాటకసంఘముల నే నెఱుఁగుదును. ఆసంఘములు సంవత్సరము జరుగకుండనే యంతరించినవి. ఆ యొక్క సంవత్సరములో జరిగిన హంగామా యింతయంతకాదు —తాతలనాఁటి యీనాముల తనఖాలు, వేశ్యకాంతల బంగారువస్తువుల చౌర్యములు, న్యాయసభలలో నభియోగములు, బ్రాందిబుడ్లతో నొకరినొకరు కొట్టుకొనుట, ప్రేక్షకులు కొందఱు నాటకరంగమున బలాత్కారమునఁ బ్రవేశించుటలు, రక్షకభటులు నిరోధములు, తెరల యేలములు, పాకకు నిప్పంటించుటలు, సివిల్ ఖైదులు—సుఖ వ్యాధులు.

అమ్మా! క్రొత్తసంస్కరణ మేమియు వలదు. ఏదోశాంతియుక్తముగా జరుగుచున్నదానిని జరుగనిమ్ము. బాగుచేయఁదలఁచి మఱింత పాడుచేయుట ధర్మముగాదు. స్త్రీపాత్రధారులకు మగతనము మట్టిలోఁ గలిసినదేకాని యినుమంతయైన స్త్రీత్వము రాలేదని యట్టె

పట్టుపట్టకుము. ముంగురులు కత్తిరించుకొని యిజారు తొడికికొని సైకిలెక్కి నందువలన మీ కెంతమగతనము వచ్చినదో యామాత్రపుస్త్రీత్వ మాతనికి రాకపోలేదమ్మా! ఇప్పుడీన టులు బాగుగనే యభినయించుచున్నారు. కొంద ఱుత్తమస్థాన మాక్రమింపనున్నారు. నాట్యకళాభివృద్ధి కెందఱో పాటుపడుచున్నారు. బుద్ధిమంతులైనవిమర్శకు లాకళపై గ్రంథ ముల వ్రాయుచున్నారు. నాటకపరిషత్తు నొకదానిని స్థాపించి తత్కళాభివృద్ధికి మార్గములు యోజించుచున్నారు. భరతశాస్త్రాభ్యాసమునకై భరతమునిబృంద మొకటి స్థాపింపఁబడినది. అమ్మా! ఏకళలోనైన నుత్తమస్థితి త్వరలో లభించునా? పాటుపడఁగఁ బడక లభింపకమా నునా? నాట్యకళకు సుదినములు రాఁగలవని తోఁచుచున్నది.

అమ్మా! మఱియొకమాట. పాశ్చాత్యవనితలకుఁ గలిగినంత యభివృద్ధి దశ మీ కింక రాలేదని చీటికిమాటికి విచారింపవలదు. అట్లు విచారించి వారిపద్ధతులను మీ రవలంబింపఁ బ్రయత్నింపవలదు. వారి యభివృద్ధిదశతో వారేమో విసుగుఁజెందియున్నట్లు కొలఁదిగాఁ గనఁబడుచున్నదనియు, సర్వసౌఖ్యాకరమైన సమస్తగౌరవభాజనము సర్వమధుర మైన గృహిణీత్వపదము నపేక్షించుచున్న ట్లగపడుచున్న దనియు నింకొక పదిసంవత్సరములలో వెనుకకు నడచినడచి యథాస్థానమును జేరవచ్చుననియు నొకపాశ్చాత్య గ్రంథకర్త "The Modern Girl nonsense" అను శీర్షికతో మొన్న మొన్న వచ్చిన Titbits లోఁ దన యభిప్రాయ మును వెల్లడించినాడు. దానిని నీవు చూడవచ్చును.

అమ్మా! పురుషులు స్త్రీపాత్రముల ధరించి జాతికంత యప్రతిష్ఠ తెచ్చుచున్నా రన్నవిషయము జంఘాలశాస్త్రి పక్షపాతబుద్ధిచేత విమర్శించుట మానినాఁడని నీ వాతని నిందించితివి. ఈ విషయమున నిన్ని చిక్కులుండుటచేతనే మానివైచినాఁడు. కాని పక్షపాత బుద్ధిచేఁ గాదని నే ననుకొందును. జంఘాలశాస్త్రిని నేను రవంత యెఱిఁగినవాఁడనగుటచే, నాతఁ డిప్పుడు బదరీనారాయణమున నుండుటచే నాతనిపక్షమున నేను నీ కి ప్రత్యుత్తర మీయవలసివచ్చినది. కాని యాతఁడు కొలఁది కాలములో మనవైపులకు వచ్చునని కింవదంతి యున్నది. వచ్చుటయే సిద్ధించునెడలఁ దిరుగ నేదో యొక సంఘమును స్థాపించి కొంత గడబిడ చేయకమానఁడు. అమ్మా! సౌభాగ్యవతివై, యాయుష్మతివై, సంతానవతివై సుఖమున నుండుము.

(భారతినుండి పునర్ముద్రితము)

# 33. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారికి బహిరంగలేఖ

సు.స.గారు వ్రాసినది

రైలుబండిలో దొరికిన తన ఉపన్యాసానికి పానుగంటి వారిచ్చిన సమాధానం ఏమి అర్థవంతంగా, శాస్త్రీయంగా లేదని ఖండిస్తూ శ్రీమతి సు.స.గారు బహిరంగ లేఖ వ్రాశారు.

ఇందులో, పానుగంటివారు పురుష పక్షాన కలిగించుకొని సమర్థిస్తూ మాట్లాడినట్టు సు.స.గారు భావించారు.

ఆడది అణిగిమణిగి అణుకువతో అడ్డమైన బానిసతనం చేసినంతసేపు మగవాళ్ళు చేస్తే స్త్రీ స్తోత్రానికి హద్దు లేదు. ఎన్నో అర్హతల్ని, గొప్పతనాన్ని ఆమెకు కట్టబెడుతూ మాట్లాడడం అలవాటే. నేను శాపాలాప శారదావతార మైతే, మీరు వాదాలాప వాచస్పతులో,– ఆడదాని నోట వెలువడిందల్లా తిట్టా? మగవాడు పలికినవన్నీ హేతుకల్పనలా? నావంటి ఆడది గ్రామగ్రామానికీ ఒక్కతె వుంటే, ఆర్యావర్త దేశాన్నంతనీ మూడేళ్లలో ఆడ మళయాళం చేసేయమా?–అని సు.స.గారు పానుగంటి వారిని ఈసడించారు. ముందు మిమ్మల్ని మీరు విమర్శించుకుని, తరవాత మమ్మల్ని విమర్శించండి – అని హెచ్చరించారు. చివరకి *HEREDITY* విషయం గురించి పానుగంటి వారి వివరణల్ని ఎత్తుకొని దాన్నొక్కదాన్నే విపులంగా విమర్శించాడు. పిల్లల లక్షణాల నిర్ణయంలో తల్లివైపు వారివీ, తండ్రివైపువారివీ గుణగణాలు పరిగణనలోకి వస్తాయన్నారు. ఒక కుటుంబంలో కలిగిన బొమ్మ తల్లిదండ్రులు మాత్రమే చేసింది కాదు, అన్నారు. ఇదే విధంగా *HEREDITY* విషయంలో శాస్త్రీయమైన ఉదాహరణలతో పానుగంటివారి జవాబును ఖండించి జంఘాలశాస్త్రి దీనికి జవాబు చెప్పాలని కోరుతూ ముగించారు.

అయ్యా!

మీకు రైలుబండిలో దొరకిన నాయుపన్యాసమునకు ఖండనముగా వ్రాసి ప్రచురించిన మీబహిరంగలేఖను శ్రీభారతిలోఁ జూచి యానందించితిని. ప్రత్యేకముగ నాడువారి

కొకయాఁడుది వ్రాసిన యుపన్యాసముపై మీ రంతయాగ్రహించి యస్త్రశస్త్రములను సమకూర్చుకొని యాహవరంగమునకు దుమికి తెఱపిలేకుండఁ దీవ్రబాణపరంపరలను గ్రుమ్మరించితిరే! ఎందుల కీ వీరావేశము! ఈ పట్టుదల! ఈ వాద విజృంభణము! ఈ శివశక్తిగంతులు! ఆఁడుదానిమాట రవంతయైనఁ బైనుండఁగూడదు కాఁబోలు! అంతమాత్ర మునకే మగవాని పుట్టియంతయు మునిగిపోవును గాఁబోలు! మగవాని గోడంతయు గోడగడ్డ లగును కాఁబోలు! మగవాని ''సృష్టిప్రభుత్వ'' మంతయు మాసిపోవును గాఁబోలు! అనక యనక, యాఱుమాసములకో, సంవత్సరమునకో, కాక యర్ధోదయమునకో, యాఁడు దొక్కమాట యన్నయెడల దానిని వెంటనే ఖండించి తీఱవలయును గాఁబోలు! అంతవఱకు మీకు మతులుండవు కాఁబోలు! ఓస్! మీసతీగౌరవము చట్టుబండలుగాను! మీపాండిత్యప్రభా వము పదటఁ గలియను! ఆఁడుది యడఁగిమడఁగి యడఁకువతో నడ్డమైన బానిసతనము నొనర్చునంతసేపు నాఁడుదానిని మీరు చేయుస్తోత్రములకు హద్దున్నదా? ఆఁడుదియే సంసారసముద్రమునకు నావ యనియు, నాఁడుదానివలననే మగవాఁడు గౌరవపాత్రుఁడై సత్యవంతుఁడై స్వార్థపరిత్యాగియై పుణ్యమూర్తియై ప్రకాశించుచున్నాఁడనియు, నాఁడుది యేదేశమున నేజాతివలన గౌరవింపఁబడి పూజింపఁబడునో యాదేశమే దేశమనియు, నాజాతియే జాతియనియు, దేశసౌభాగ్యమేమి, జాతి పరిశుద్ధియేమి, యాఁడుదానివలననే నిలువఁ బడునుగాని మగవానివలన నిలువఁబడనేరదనియు, మగవానికి మోక్షలక్ష్మి నిచ్చుట కుగూడ నాఁడుదియే యర్ధ్వరాలనియు, నిట్టిమాటలు–మఱి యింక నిట్టిమాటలు, కాంతలకుఁ గర్ణరసాయనములుగలఁ జిత్తరంజకములుగ మీరు పలుకుచుందురే. ఆఁడుది రవంత ప్రతివాక్యమాడినయెడల నసూయావిష్టులై, యాగ్రహాతిరేకులై, యహంభావపూర్ణులై యాఁడుదానిని నిరసించి, విమర్శించి, ఖండించి పరాభవించిన దాఁక నెత్తినేలఁ గొట్టుకొను చుందురే! ఇదియేనా మీ సహనము! మీ శాంతి! మీ సమభావము! మీ సౌజన్యము! మీ దొంగమొగము లెవతె నమ్మును? మీ గుల్లమాట లెవతె విశ్వసించును? మీ లక్క ప్రేమ కెవతె కరఁగును? మీ మొసలియేడ్పుల కెవతె మోసపడును?

ఇట్టిజాతిని దిట్టవలసినదా? రూపుమాపవలసినదా నా యుపన్యాసములలో మొదటి యాశ్వాసమునఁ దిట్లా? రెండవ యాశ్వాసమునఁ దిట్లా? ఊఁ! ఓహోహో! ఏమి యుక్తిపరుఁడవు! ఏమి చతురవచనరచనాచణుడవు! ఈమాత్రపు మీయుక్తికై మీవారు కులుకు చున్నారు కాఁబోలు! ఏమీ! ఏమీ! నాకు శాపాలాపశారదావతార మని బిరుదు కటాక్షించి తివా? పండితుఁడవు కాఁబోలు! ఎంతమాట కల్పించితివయ్యా! హేహే! కవివికూడనఁటే! నేను శాపాలాపశారదావతారమ నైతినా? మీరు! మీరు! వాదాలాపవాచస్పతులు కాఁబోలు! మీవ్యత్యస్తబుద్ధి యెంత స్పష్టముగ, నెంత బహిరంగముగ వెల్లడించితిరయ్యా! ఆఁడుదానినో టనుండి వెడలినవెల్లఁ దిట్లా? మగవాఁడు పలికినవెల్ల హేతుకల్పనలా? ఆఁడుది బుద్ధిహీ నయా? మగవాడు బుద్ధిమంతుడా? ఆఁడుది దుష్టయా? మగవాడు శిష్టుఁడా? నావంటి యాఁడుది గ్రామగ్రామమునఁ గొక్కతె యున్నయెడల నార్యావర్తదేశమంతయు మూఁడు సంవత్సరములలో నాఁడుమళయాళము చేయలేకుందుమా? అప్పు డాఁడుది బుద్ధిమంతు రాలో, మగవాఁడు బుద్ధిమంతుడో ప్రపంచమునకు వెల్లడియై తీఱును. ఏదీ? మీకింక మంచిదినములు రవంత మిగిలియున్నవి. కానిండు. కానిండు.

అయ్యా! నాయుపన్యాసముపై విమర్శనము జంఘాలశాస్త్రి పక్షమున మీరు వ్రాసినట్లు వ్రాసితిరే! ఆయన బదరీనారాయణము నుండి వచ్చి యీప్రాంతముల నేదో సంఘము స్థాపించి యుపన్యాసము లారంభించుదనుక వేచియుండక యింతలోఁ ద్వరపడి మీ రాతనిపక్షమున నేల వ్రాయవలసివచ్చినది. ఇంతలో లోకములు మునుఁగుకొని పోవునని మీరు భయపడితిరా? నేను తొందరపడుట తప్పని మీ రెఱిఁగి నప్పుడు మీ రేల తొందరపడవలయునయ్యా! కాక, జంఘాలశాస్త్రి సాంఘికవిమర్శనముకంటె మీవిమర్శన మెక్కువ సందర్భముగా, సొగసుగా నుండునని వ్రాసితిరా? పాపము! నాయుపన్యాసమును బాగుగా ఖండించితినని యనుకొనుచున్నారు. కాఁబోలు! ఆనందించుచున్నారు కాఁబోలు! అన్యోన్య మభినందించు కొనుచున్నారు కాఁబోలు! అల్పసంతుష్టులైన మిమ్ముఁ గాంచ మాకు జాలియగుచున్నదే! మీ విమర్శన మెంత నీరసముగ, నెంత పేలవముగ, నెంత యుక్తి శూన్యముగ, నెంత యశాస్త్రీయముగ నున్నదో మీరు గ్రహించు కొనలేకుండ నున్నారు. అవును! మా తప్పులు గ్రహించుటలో మీరు మహావిద్వాంసులు కాని మీ తప్పులు గ్రహించుకొనుటలో మీరు మందబుద్ధులే కాదా? తప్పులు లేనిచోటులనైనను జిలువలకుఁ బలవలు, పలవలకుఁ గొమ్మలు, కొమ్మలకు గుత్తులు కల్పించి వేయితప్పులు మాలోఁ జూపఁగలరు కాని లక్షలకొలది తప్పులున్న మీవారి వ్రాతలకుఁ గనులుమూసికొావని, నోరుమూసికొావని పడియుండువారే కాదా? ఆడుదాని యణువంతతప్పు హిమవత్పర్వతముగా మీదయ్యపుఁ గంటికిఁ గనఁబడునే! అట్టి మీకన్ను మీకెంతమాత్రమును వినియోగింపకుండ నున్నదే! మీ పాండిత్యము మమ్మల్లరిపెట్టుటకే కాని మిమ్ము బాగుపఱచుకొనుట కేమాత్రము తోడుపడకుండ నున్నదే! మీ విమర్శనజ్ఞానము మా వ్రాతలలోని కలుపుతీఁతకే మీ మనస్సులలోని గర్వోపశాంతికి వినియోగపడకుండ నున్నదే! ఇంతటినుండియైనఁ దెలివి తెచ్చుకొని మిమ్ము మీరు మొదట విమర్శించుకొని పిమ్మట మమ్ము విమర్శింప మొదలిడుఁడు. మిమ్ము మీరు విమర్శించుకొన్న యెడల మా జోలికెన్నఁడు మీరు వచ్చుటయే సిద్ధించియుండదు. కురూపుఁడు తన రూపదౌష్ట్య మెఱింగినపిమ్మట సామాన్యస్వరూపమును వెక్కిరించునా? మొగముమీద మొటిమలుగల మగువను గుష్ఠరోగి యధిక్షేపించపగలడా?

అయ్యా! ఎంతయో యుత్సాహపడి, యెంతయో తొందరఁ జెంది, యెంతయో కష్టపడి మీరు వ్రాసిన విమర్శనము, నిస్సారమై యున్నదన్న హేతువుచేత దానిని విమర్శింపక, నిరాదరణ మొనర్చి యావలఁ బారవైచినచో, మీవాక్యములే సిద్ధాంతములని మీవారనుకొనిపోవుదురేమో యని, మమ్ము మీరు గెల్చినారని బుజము లెగుర వైచి గంతులు వేసెదరేమో యని మీ విమర్శనకుఁ బ్రతివిమర్శనము వ్రాయవలసివచ్చినది. మీవిమర్శనమున విమర్శింపవలసిన దొక్క యంశమే యున్నది. అందుఁగూడ నొక్క వాక్యముమాత్రమే విమర్శింపదగి యున్నది. అది యేదన:–

"Heredity యనుదానివలనఁ దండ్రిసంబంధమైన ముక్కు పొడుగో, తల్లిసంబంధమైన కంటిసోగయో, మేనమామసంబంధమైన మూఁతివంకరయో సంతానమందుఁ గాదాచిత్కముగ సంక్రమింపవచ్చునుగాని జగత్తు నేలుటకు సామర్థ్యముగలయట్టియు జగత్తునకు బానిసయగునంతటి తుచ్ఛముగలయట్టియు మనస్సులోని శౌర్యము, గాంభీర్యము, త్యాగము, నాపత్సహనము, భూతదయ, దైవభక్తి, బ్రహ్మజ్ఞానము మొదలగు సుగుణ

పరంపరకాని, కాతరత, లాఘనము, లోభము, శాంతి రాహిత్యము, తామసము, నాస్తికత మొదలగు దుర్గుణ పరంపరకాని Heredity వలనఁ గలుగుట కవకాశములేదు.''

ఇది మీ ప్రధాన వాక్యము. ఈవాక్యమువలన మీప్రపంచజ్ఞానము మిక్కిలి యల్పమని స్పష్టపడుచున్నది. వాక్యము బారెఁడేగాని పసగలది కాదు. ''తండ్రి సంబంధమైన ముక్కుపొడుగో'' సంతానమందు సంక్రమింపవచ్చునని మీరు వ్రాసినారు. సంక్రమింపవచ్చుననియే కాని సంక్రమించునని మీరు స్పష్టముగ వ్రాయలేదు. అంతేకాక, దానికి వెనుకఁ ''గాదాచిత్కముగ'' నని యొక్కబంధ మంటఁగట్టినారు. ఇందువలన మీకు Heredity యందు విశ్వాసము లేనట్లు స్పష్టమగుచున్నది. ఈవిషయమున మీకుఁ బూర్వజన్మమే శరణ్యముగ నున్నది. ''పూర్వజన్మమునందు నాకుఁగల విశ్వాసమువలన నార్యమతమునకు బలముకాని, యవిశ్వాసమువలన నీరసతకాని లే'' దనీ మీరు న న్నధిక్షేపించి తిరికాదా? Heredity యందు మీకుఁగల విశ్వాసమువలన సృష్టి శాస్త్రమునకు బలముకాని యవిశ్వాసమువలన నీరసత కాని లేదని మిమ్ము నేను దిరుగ నధిక్షేపించవచ్చును గదా! మీ యధిక్షేపణమునకుఁ బ్రత్యధిక్షేపణమును మీకప్పఁజెప్పితినిగదా! ఇఁక మాటలాడ కూరకుండుఁడు. విడిచినవాదమును దిరుగ నందుకొని సాగింతము.

కాఁకరగింజ నాటినయెడలఁ గాకరతీఁగయే పుట్టుచున్నది కదా? 'కాదాచిత్కముగ' గాఁకరతీఁగ పుట్టవచ్చునని మీ రనరు కదా! తరులతాజాతియందు సహజమైన, సత్యమైన ధర్మము పరిణామనిశ్రేణికలో మొదటి మెట్టుపైనున్న మనుష్యసంతానమునకేల సత్యము కాదు? మనుజ దంపతులకుఁ బుట్టిన సంతానము గూర్చి యింక ననేక విచిత్ర పరిస్థితులు, చిరకాలసంప్రదాయములు, ననేక వ్యక్తిలక్షణసముదాయములు, ననేక లక్షణముల యన్యోన్య సమ్మేళనమువలనఁ గలిగినలక్షణము లెన్నో పరిశీలింపవలయునుగాని తరులతాదిజాతియందుఁ బరమార్థముగ జరుగుచున్న సామాన్యధర్మమే యిచ్చటఁగూడ జరుగుచున్నది కదా? అంతకంటె భేద మేమియు లేదే? కాని యిక్కడ నల్లిక లెక్కువయున్నవి. చికిబికు లెక్కువయున్నవి. క్రొత్తకూర్పు లున్నవి. దూరమాలోచింప వలసియున్నది.

బిడ్డలక్షణములు పరిశీలింపవలసివచ్చినప్పుడు తల్లిదండ్రుల లక్షణములు మాత్రమే పరిశీలించి యూరకుండఁజనదు. ఆబిడ్డని పితామహి లక్షణములు, పితామహిలక్షణములు, వారి యితర సంతానలక్షణములు గూడఁ బరిశీలింపవలయును. అంతేకాదు, మాతామహలక్షణములు, మాతామహిలక్షణములు, వారి యితరసంతానలక్షణములు గూడ బరిశీలింపవలయును. ఇట్లింకఁ బై రెండుమూఁడు తరములవఱకైనఁ జూడఁ దగినది. బిడ్డలోని యనేక లక్షణములు తల్లిదండ్రుల లక్షణముల బట్టియే నిర్ణయింపదగును. తల్లిదండ్రులలో లేని లక్షణములేవైన బిడ్డయందుఁ గానఁబడినయెడల వానికొఱకు వంశవృక్షములోని పైకొమ్మల నెక్కి పరీక్షించినయెడల వానికిఁ గారణము లగపడితీఱును.

ఒకయేఁడుపిల్ల పుట్టినిముసము మొదలుకొని మునలిది యగు వఱకు నడుమ జరుగు ప్రధాన చేష్టలను బరిశీలింతము. పిల్ల చేటలోఁ బడగనే కేరుకేరున నేడువవలయును గదా! అటు లీ పిల్ల యేడువలే దనుకొనుము. ఎందుచేత? ఆపిల్లతల్లియో, తండ్రియో భూపతనమగుటతోడనే యేడువకపోయియుండవలయును. ఆసంగతి వారితల్లితండ్రుల

వలన సులభముగఁ దెలిసికొనవచ్చును. జనులు నిదురించునపుడు కుడి ప్రక్కనో యెడమప్రక్కనో పండుకొను నలవాటు కలవారై యుందురు కాని రెండు ప్రక్కలను సమాన సౌలభ్యముతోఁబండుకొననేరరు. ఒకవేళ నిద్రలో నలవాటు లేని ప్రక్క కొత్తిగిల్లుట తటస్థించినను రెండుమూడు నిముసములలోనే మేల్కాంచి యలవాటైన ప్రక్కకుఁ దిరుగుదురు. మనము పరీక్షింపదలచిన పిల్లతండ్రికో, తల్లికో యెడమవైపునఁ బండుకొనునలవాటున్నదనుకొనుము. ఈపిల్లగూడ నెడమప్రక్కనే పండుకొనును. తెలియక తల్లి యాపిల్లను గుడిప్రక్కను బండుకొనఁ బెట్టిన యెడల బిల్ల యుల్లెగిరిపోవ నేడ్చును. ఎడమప్రక్కగాఁ బండుకొనఁ బెట్టిన వెంటనే కిక్కురుమనకుండ నిద్రించును. బాల్యమునఁ దల్లికో తండ్రికో యెడమచేతివ్రేళ్లో కుడిచేతివ్రేళ్లో నోటఁ బెట్టుకొను నలవాటున్న యెడలఁ బిల్ల యాచేతివ్రేళ్లే యావయస్సులోనే నోటఁబెట్టుకొనును. పిల్లతల్లికిఁ దండ్రికిఁగూడ నత్యంతమధురపదార్థమిష్ట మనుకొనుము. ఈపిల్లకేమో కాని తీపి యిష్టము లేదుసరేకదా పులు పనగ మహాప్రీతి! ఈవ్యత్యాసమునకుఁ గారణమేమో యని దూరాలోచన చేయకుండఁ బూర్వజన్మమే కారణమని తొందరపడి సిద్ధాంత మొనర్చకుము. అంత దూరాలోచన కూడ నేల? వంశవృక్షమున నీపిల్ల తండ్రిప్రక్కనేయున్న యామె యెవతెయో యెఱుఁగుదువా? ఆమెయే యీపిల్ల పెద్దమేనత్త. ఈమె దినమున కొకపదలము చింతపండుపులుసు ద్రాగునప్పుడు మేనగోడలికిఁ బులు సిష్టమనగ నాశ్చర్యమేమి? తల్లికాని, మేనత్తకాని యెన్నవయేఁట నెన్నవమాసమునఁ బ్రథమరజస్వలయగునో యన్నవయేఁటనే మాసమైన బీరుపోకుండఁ బిల్ల రజస్వలయగును. కాని తల్లి మేనత్తల సాంప్రదాయము ననుసరించి యీపిల్ల పండ్రెండవయేఁట రజస్వల కాక, పదియవ యేఁటనే రజస్వల యయ్యెనేమి చెప్పుమా? ఈమాత్రమునకై తొందరపడి వెనుకజన్మమువఱకుఁ బోక, ముందువసారాలోఁ గూర్చొండి చిమ్మిలి దంపించుచున్న పిల్లపితామహియొద్ద కేగి యడుగుము. ఈవిషయమున నామనుమరాలికి నాపోలికవచ్చినదయ్యా యని యామె పైకి విసుఁగుజెందిన ట్లగపడుచున్నను లోన మురియచుఁ దన చరిత్రములోని విచిత్రాంశమును బహిరంగపఱచును. ప్రథమ రజస్వలాదినములలో నీపిల్ల కావునేయి, పులగము, ప్రాఁతబెల్లముఁ దక్క మఱియేదియునీయకుండ నెంతకఠినపథ్యమునుఁ జేయించినను దల్లికిఁ గాని, మేనయత్తకుఁ గాని ఋతుశూాల యున్నయెడల నీపిల్లకుఁగూడ నేకొలఁదిగనో యది సంక్రమించును గాని విడువదు. ఇఁక గర్భవతిగా నుండునప్పుడు ప్రక్క శూలఁగాని, పక్కనొప్పిగాని వంశములోని పూర్వస్త్రీల యాచారము ననుసరించి కలుగును. సంతానక్రమము కూడ సంసారసంప్రదాయము ననుసరించియే యుండును. రజోదోష నివృత్తికూడఁ దల్లినిబట్టియో, తల్లితల్లినిబట్టియో, తండ్రి సోదరినిబట్టియో, యామెతల్లినిబట్టియో యుండును. వేయేల? తల్లిదండ్రుల సామాన్యములైన యభ్యాసములు కూడఁ బిల్లలకు సంక్రమించునుగాని వదలవు. మాటలాడుచున్నప్పుడు తండ్రి చేతు లెట్లాడించునో, తల యెట్లు విసరునో బిడ్డ కూడ నటులే చేయును. తల్లికాని తండ్రికాని గొంతుకూరుచుండి భుజించుటయే యలవాటు కలిగియుండునెడలఁ బిల్లగూడ నటులేకూరుచుండి భుజించును. బలాత్కారమునఁ బద్మాసనమునఁ గూరుచుండఁ బెట్టి యాపిల్లను భుజింపఁజేయునెడల నోటనిడుకొన్న కబళము దిగకపోవుటచేఁ గెక్కు కెక్కుమనును. సాధారణముగా జనులు నాలుగైదునిముసములకంటె నెక్కువకాలము నిలువఁబడవలసివచ్చునప్పుడు రెండు కాళులపై సరిగ నిలువఁబడరు. కుడికాలి పైనో యెడమకాలి

పైనో బరువెల్ల మోపి మిగిలిన కాలికిఁ బనియేమియు నీయరు. కుడికాలిపై నిలువ నలవాటుగగల తల్లిదండ్రులకుఁ బుట్టినపిల్ల ప్రధానముగఁ గుడికాలిపైనే నిలువఁబడును. మన మప్పుడప్పుడు కుడి చేతివ్రేళ్లసందులలో నెడమచేతివ్రేళ్లిముడ్చుకొని కొంతసేపట్లే యుంచుకొనుట తటస్థించుచున్నది. అట్టి హస్తపుటమునకు మొట్టమొదటి వ్రేలు కుడిబొట నవ్రేలైనఁ గానవచ్చును. ఎడమబొట్టనవ్రేలైన గానవచ్చును. దక్షిణాంగుష్ఠమే మొదటిది యగునట్లుగా హస్తములు ముడుచుకొను నలవాటు తల్లికో తండ్రికో యున్నయెడలఁ బిల్లకూడ నటులే హస్తయుగ్మమును ముడుచుకొనును. నడుచునపుడు ముందువేయు కాలుకూడ ననూచానస్థితి ననుసరించి యుండుననుట యతిశయోక్తి కాదు.

అయ్యా! Heredity కల్లయని నిర్ధారణ మొనర్చుటకు మీరు కొన్ని యుదాహరణ ములు నిచ్చినారు. అవి సమంజసముగ లేవు. పండితాగ్రగణ్యునకు శుంఠ జన్మించుచున్నాఁ డని చెప్పినారు. తండ్రి షట్ఛాస్త్ర పాండిత్యమునే మీరు పరిశీలించినారు. కాని మేనమామ శుంఠత్వ సామ్రాజ్యమును మీరు పరీక్షింపలేదు. ఈ తప్పు మీదికాని Heredityది కాదు. మహావదాన్యుఁడైనవానికి లుబ్ధాధమాధముఁడైన నిర్భాగ్యుఁ డుదయించుచున్నాఁడని మీరు చెప్పినారు. ఈలుబ్ధాధమాధముని పితామహుఁడు శ్రాద్ధములు చేసి, శవములు మోసి, శల్యపరమాన్నమును దిని, చౌర్యము లొనర్చి స్వామిద్రోహకృత్యము లొనర్చి తాను తినక యొకనికిఁ బెట్టక కూడఁబెట్టిన ధనమంతయుఁ దనకొడుకు తాను జచ్చిన పిమ్మట దానధర్మములకై తగులఁబెట్టుచున్నాఁ డని కడుపుమంటచేఁ గాలిపోవుచుఁ దనధనము నెటులైనఁ గాపాడుకొనవలయునను దయ్యపుఁ బట్టుదల కలిగి, ద్విగుణీకృత లుబ్ధత్వముతోఁ దానే తనకు మనుమఁడై పుట్టెనని మీరు గ్రహింపలేకపోవుటచేత మీకు వ్యత్యా సముగాఁ గనఁబడుచున్నది. కాంతాలంపటుఁడై, కాతరుఁడైన దశరథునకు శ్రీరామచంద్రు నివంటి యేకపత్నీవ్రతుఁడు, జగదేకవీరుఁడు జన్మించినప్పు డింక Heredityని నమ్మవలసిన పనియేమున్నదని మీరు పలికినారు. అట్లనుట తప్పు. అందుచేతనే మఱింత నమ్మవలసియు న్నది. దశరథుని కాంతా లోలత్వమే మీరు గణించితిరి కాని హోమాగ్నిజ్వాలాతుల్యయగు కౌసల్యాదేవిపరిశుద్ధిని మీరు గణించితిరి కారే! దశరథుని భయస్వభావమునే మీరు గణించితిరి కాని రఘుదిలీపాదిమహారాజుల పౌరుషసంఘాత మంతయు శ్రీరామచంద్రపరబ్రహ్మము లోని కాకర్షింపఁబడినదని మీరు గ్రహింపలేకపోయితిరే! మీరిచ్చిన యుదాహరణము లన్నియు నిట్లే యసంబద్ధములై యవిచారపూర్వకములై యున్నవనుట నిశ్చయము.

ఇఁక వంశానుక్రమముగ వచ్చు రోగములను గూర్చి రవంత చెప్పవలసియున్నది. ఉబ్బసము, మూలవ్యాధి, క్షయము, కుష్ఠము నీతరగతి లోని ప్రధానవ్యాధులు Intermittence of the Heart (నాడి నాలుగైదు దెబ్బలు కొట్టినతరువాత నొక దెబ్బకాలము నిలిచిపో వుట) అనునదికూడ మూఁడుతరములనుండి యొక కుటుంబములో నున్నట్లు కనిపెట్టఁ బడినది. Hysteria యనునది కూడ నట్టి వ్యాధియే యని కొందఱు చెపుచున్నారు. అంధత్వముకూడ నీ తరగతిలోనిదే యని కొందఱ యభిప్రాయము. తాతగారి యంధ త్వము మనుమనికి వచ్చుట కలదు. అది జనుషాంధత్వమైన సరే. చెప్పరాని వ్యాధులలో నొవకదానివిసము వంశములో నాల్గుతరములవఱకు నిలిచియుండునని కొందఱు చెప్పుచు న్నారు. పిల్లనిచ్చుటకుఁ గాని తెచ్చుకొనుటకుఁ గాని మనవారు కుటుంబసంప్రదాయమును

విశేషముగాఁ బరిశీలించుచున్నారు. ఒక్కవంశములోని వ్యాధులు మఱియొక్క వంశములోనికి సంక్రమించుట కవకాశము కలుగకుండుటకే మనవారు పరిణయనిర్ణయపూర్వమునం దింత పరిశోధన చేయుచున్నారు. ఇట్టి పరిశోధనము రోగవ్యాప్తి నివారణమునకే కాక, దుష్ప్రవర్తన వ్యాప్తి నివారణమునకుఁగూడ నైయున్నది. అందుచేఁ బిడ్డలప్రవర్తనముకూడ వంశానుక్రమసూత్రమున కధీనమై యున్న దనియే స్పష్టపడుచున్నది.

అయ్యా! దేహసంబంధములగు కొన్ని లక్షణములు బిడ్డలయందు గానఁబడవచ్చును గాని జగత్తునేల గలట్టియు, జగత్తునకు బానిసయగు నంతటి తుచ్ఛత్వము గలయట్టియు మనస్సులోని సుగుణపరంపర గాని దుర్గుణపరంపర కాని Heredity వలన రాదని మీరు స్పష్టముగఁ జెప్పినారు. మీకుఁ గోపమువచ్చినను సరే కాని యిది పట్టి తెలివితక్కువ మాటయని చెప్పుచున్నాను. ప్రవర్తనము (Character) దేహముతోఁ జేరినదా మనస్సుతోఁ జేరినదా? దేహముతోఁ జేరినదని మీ రనుటకు సాహసింపలేరుకదా! మనస్సుతోఁ జేరినదని యొప్పుకొనక తప్పదు కదా! Heredity వలననే మనస్సు సత్ప్రవర్తనము గలదిగాని దుష్ప్రవర్తనము కలది కాని యగుచున్నదని యిప్పుడే నిర్ణయింపఁబడినదా కాదా? ఆ నిర్ణయము నేను జేసినదగుటచే మీకు నచ్చ లేదందురా? పోనిండు. Heredity మనస్సుపైఁ బనిచేయునని మహాశాస్త్రవేత్తలు చేసిచూపిన నిర్ణయమును విందురా? (Idiocy) జన్మమందత్వము, (Insanity) పిచ్చి, యివి మనస్సుతోఁ, జేరినవా? దేహముతోఁ జేరినవా? దేహముతోఁ జేరినవని మీ రనునెడల మి మ్మేమనవలయునో మాకుఁ దెలియదు. ఇదివఱ కైదుతరములనుండి Idiocy తీఁగ సాగుచున్న వంశములు రెండు Franceలో నున్నట్లు శాస్త్రవేత్తలు చెప్పినారు. తాతకుఁ బిచ్చి, తండ్రికి బిచ్చి, యన్నకుఁ బిచ్చి, చెల్లెలికిఁ బిచ్చి, తనకుఁ బిచ్చియైన కుటుంబములు తఱచుగ లేకున్న విరళముగ నున్నట్లు వినుచున్నాము. తండ్రికిఁ బిచ్చిలేదు కాని తీవ్రమైన కోపము, పెద్దకొడుకునకు సామాన్యపుఁబిచ్చి, రెండవకొడుకున కంతకంటె నెక్కువపిచ్చి, మూఁడవకొడుకునకుఁ బూర్తిగాఁబిచ్చిగల యొక్క కుటుంబము గోదావరీ తీరమందుండుట నే నెఱుఁగుదును. ఇప్పు డేమందురయ్యా! ఇంకను మనస్సునకు Heredity కి సంబంధము లేదని యందురా? అటులైన నొక మనశ్శాస్త్ర పరిశోధకుఁ డగు మహావైద్యుడు చెప్పినమాటలను విందురా? "The heredity transmission of a liability to mental disease must be reckoned as the most important among all predisposing causes of insanity" చూచితిరా, Heredity యే యున్మాద కారణములలోఁ బ్రబలతమమైన దని తెలిసినదా? మఱి యింకను వినుఁడు. "It probably well within the mark to say that at least 50 percent of the insance have a direct or collateral heredity tendency towards insanity" ఇక్కడకుఁ బిచ్చివారిలో నధమము నూటి కేఁబదుగురవఱకీ తరగతిలోనివారే యని స్పష్టపడినదా?

మూర్ఛ వంశానుక్రమమగు వ్యాధి యగుటచేతను, మూర్ఛ ముదిరి పిచ్చికావచ్చును గావునను, మూర్ఛయున్న కుటుంబములో నుండి పిల్లను దెచ్చుకొనగూడదు. ఆకుటుంబములోనికిఁ బిల్ల నీయఁగూడదు. చెడఁద్రాగెడువారికుటుంబముతో నెన్నఁడును సంబంధము చేయఁ దగదు. ఆసంబంధమువలన నున్మాదము మఱియొక్క కుటుంబములోనికి రాఁగలదు. ఏదోయొక్క విషయముననే యత్యద్భుతప్రజ్ఞ కలవాఁడును హద్దుమీఱిన

చెఱుకుందనమును గలవాండున్న కుటుంబముతో సంబంధము చేయంగూడదు. అట్టి ప్రజ్ఞావంతుని తరువాత రూపాయకుఁ బదణాలవలఁకుఁ బిచ్చివారు కలుగవచ్చును. మేన మామ కూంతునకు మేనత్తకొడుకునకు, మేనమామ మేనకోడలికి, మేనత్తకూంతునకు మేనమామకొడుకునకు వివాహసంబంధము లొనర్చి లొడితెడైన యావరణములో గుడుగు డుగుంచము లాడుచు ముళ్లపై ముళ్లు దగుల్చుకొనువారికుటుంబములలోఁ దఱచుగాఁ బిచ్చివారు పట్టుదురని చెప్పుదురు.

Heredity వలననే దేహలక్షణములన్నియు గలుగుచున్నవి. మనోలక్షణములన్నియుఁ గలుగుచున్నవి. ఇట్టిలక్షణములు సంక్రమింపఁ జేయుటలో తల్లి దండ్రులతరమువారి కెంతశక్తియున్నదో, వారి పైతరములవారి కెంతశక్తియున్నదో వారిపై పైతరములవారి కెంతశక్తియున్నదో యను నంశములు కూడ శాస్త్రవేత్తలు సంతతపరిశోధ నమువలనఁ గనిపట్టినారు. తల్లికాని తండ్రికాని (0.5); పితామహుఁడు కాని మాతామహుఁడు కాని $(0.5)^4$; యేడవతరములోని పురుషుఁడు $(0.5)^{14}$; x తరములోని పురుషుఁడు $(0.5)^{2x}$ గా, దైహిక మానసికలక్షణములు పిల్లలకు సంక్రమింపజేయుదురని వారు చెప్పినారు. కాని యీసూత్రము మాత్రము ప్రత్యేకవ్యక్తిపరముగాఁ గాక, సాంఘికసాముదాయికపరముగా సత్యమని వారు చెప్పినారు.

కావుననేమి తేలిన దనఁగా: ఒక కుటుంబములోఁ గలిగిన బొమ్మ తల్లిదండ్రులు మాత్రమే చేసినని కాదు. వారు, వారిపై వారు, వారి పైవారు నేఁబదుగురో యఱువదుగురో చేసిన బొమ్మయని తెలియఁ దగినది. దేహలక్షణములు సంతానమునందుఁ 'గాదాచిత్కా ముగ' గానఁబడుననియు, మనోలక్షణములు మొదలే కానఁబడవనియు మీరు చెప్పిన మాట యాచారవిరుద్ధమైనదియు, నశాస్త్రీయమైనదియు, నసత్యమై నదియునై యున్నది. తల్లిదం డ్రుల లక్షణములే కాదు; వారి పూర్వుల లక్షణములే కాదు; మనుష్యజాతికి బూర్వులైన యన్ని ప్రాణుల లక్షణములు గూడ మనలో నున్నవి. ఇలకోడికూంత యెఱుఁగుదువా? దాని కెదురు పడినప్రేయసిని సంతసింపజేయుట కది కూయుచున్నది. కప్పయు నందుకొ ఱకే కూయుచున్నది. మగవాండు తన కిష్టమైన కాంతను జూచి యట్లే కూనురాగ మీదుచున్నాడు. మగనెమిలి యాండునెమిలి సంతసము కొఱకుఁ బురివిప్పి తాండవిం చును. మగవాండు దనకిష్టమైన మగువ ప్రీతికై తల యెగురవైచుకొని యొడలు విరుచుకొని యొయ్యారమునఁ దిరుగులాడి మిడికిమిడికి మొత్తుకొనుచున్నాడు. క్రూరజంతువుల హింసాసాధనములు మననోటఁ గోరలుగ నిల్చియున్నవి. కోంతితోఁక మన వెన్నుపాము చివర Coccyx రూపమున నిల్చియున్నది. కోంతి కిచకిచలే మననవ్వులైనవి. కోతి వెక్కిరింపులే మన యధిక్షేపణములు. కోంతి చాంచల్యమే మన మనస్సులో శాశ్వతముగ నిల్చియున్నది. అయ్యో! ఇకఁ జాలు. నామాటలు నచ్చినవానికి నింకఁ జెప్పనక్కఱలేదు. నచ్చనివానికి నింకఁ జెప్పనక్కఱలేదు. అందుచే విరమించుచున్నాను.

కాని మఱియొక్కమాట. మునుపటివలెనే యీసారికూడఁ దొందరపడి జంఘాలశా స్త్రిపక్షమున మీరు ప్రత్యుత్తర మీయవలదు. రాఁదలఁచిన జంఘాలశాస్త్రి వచ్చి, స్థాపింపఁదలఁ చిన సంఘమేదో స్థాపించిన తరువాత, నీయవలసిన యుపన్యాసములలోఁ బ్రథమసాంఘికోప న్యాసమే నాకుఁ బ్రత్యుత్తరముగా జంఘాలశాస్త్రి యీయవలయును. అది నాకోరిక. ఆతని

యుపన్యాసములు విని యెంతకాలమో యైనది. ఆతఁడు మమ్మెంత యధిక్షేపించినను మా కెవ్వరికి నాతనిపై నిసుమంత యైనఁ గోపము రాలేదు. ఆతనిని మా సోదరునివలెఁ జూచుకొనుచున్నాము. ఆతఁడు బదరీనారాయణమునుండి వచ్చి నూతనసంఘమును స్థాపించి యాంధ్రదేశమునందు సమంజసమైనసంచలనము, సంతోషము నెప్పుడు సమకూర్చునో యని సముత్కంఠచే నిరీక్షించుచున్నాము.

(భారతినుండి పునర్ముద్రితము)

# 34. సు.స.గారికి బహిరంగ లేఖ

**సు.**స.గారు పానుగంటి వారిపై మండిపడి మందలిస్తూ వ్రాసిన *HEREDITY* వాద విశేష వివరాలను ఆయన ఖండిస్తూ తాను చెప్పిన విషయానికి మరకొంత వివరంగా, తన విశ్వాసభూమిక, విశదం చేస్తున్నారు.

జంఘాలశాస్త్రి జవాబు చెప్పాలని సు.స.గారు ఆశించినా, ఆ పని జరిగేలోగా తన శక్తిమేరకు సమాధానం చెప్పక తప్పదన్నారు. ఏది ఎలా వున్నా *HEREDITY* వల్ల బిడ్డలో స్థూలదేహ లక్షణాలు అన్నీ కలగవచ్చునంటేనూ, కొన్నైనా కలుగుతున్నాయంటేనూ తనూ ఒప్పుకొంటానన్నారు గాని–శరీర పరిణామంలో *HEREDITY* పనిచేయడానికి శక్తి కలిగిందే నని ఒప్పుకొంటానన్నారు గాని మనస్సు మీద దానికి పిసరంత కూడా అధికారం లేదని తన అభిప్రాయమన్నారు.

మనస్సుకి మెదడు ముఖ్యావయవం గనుక మనస్సులో పరిణామం *HEREDITY* వల్ల కలిగినట్టు కనిపిస్తుంది గాని అది భ్రమ అన్నారు. ఉన్మాదాలన్నీ దేహపరిణామాలే కాని, మనః పరిణామాలు కావన్నారు.

పాశ్చాత్య శాస్త్రజ్ఞులలో ప్రకృతి శాస్త్రజ్ఞానం సంపూర్ణంగా వుండే మహావిద్వాంసుల్లో నూటికి 95 మంది నిరీశ్వరవాదులు. మిగిలిన వారు అజ్ఞేయ *(AGNOSTICS)* వాదులు.

మన హిందూ సిద్ధాంత ప్రకారం శరీరాలు మూడు. స్థూల, సూక్ష్మ కారణ శరీరాలు. స్థూల శరీరం మంటలోనో, మట్టిలోనో కలిసిపోతుంది. లోపల జీవాత్మగల సూక్ష్మ శరీరానికే మనవారు పునర్జన్మను నిర్మించారు. ఈ సూక్ష్మశరీరంలోనే, మనిషి సంతరించుకున్న అనేక పూర్వజన్మల కర్మఫలం వుంది. కనక ఒక బిడ్డలో వ్యక్తమయ్యే గుణాగుణాలన్నీ అతగాడి సొంత సొమ్ము. అంటే, 'మనస్సు' అనేది బిడ్డ సొంతమే. ఆత్మ, పునర్జన్మ, విశ్వాసాలుంటే తప్ప ఈ లెక్క మతం మీద విశ్వాసం వల్లనే మనిషి మనిషి అనిపించుకొంటున్నాడు.

అమ్మా!

కార్తీకమాసభారతిలో మీరు ప్రచురించిన బహిరంగలేఖను జదివితిని. జంఘాలశాస్త్రి యుపన్యాసములువిని చాలఁ గాలమైనదనియు, నాతఁడు శీఘ్రముగ వచ్చి నూతనసంఘము

నేదైన స్థాపించి యుపన్యాసము లిచ్చుచు నాంధ్రదేశమునఁ దిరుగ సమంజసమైన సంచల నము, సంతోషము నెప్పుడు సమకూర్చునా యని నిరీక్షించియున్నా మనియు మీరు వ్రాసి భాషాభిమానమును వెల్లడించినందులకు సంతసించితిని గాని యాతఁడే మీబహిరంగలేఖను దన ప్రథమ సాంఘికోపన్యాసమున విమర్శింపవలయును గాని నీవు దొందరపడి దానిని విమర్శింపవలదని శాసించితి రేల? ఆతఁడు వచ్చుపిమ్మట నటులే జరుగవచ్చును గాని యంతవఱకు నేను వేచియుండ నేల? ఆతఁడు విపులముగ విమర్శించిన విమర్శించుగాక! నేను నా యల్పశక్తిననుసరించి సంగ్రహముగ విమర్శింపకుండుట తగదు. కావున నందులకు మీ యనుజ్ఞ కోరుచున్నాను.

అమ్మా! నా బహిరంగలేఖలో మీరు విమర్శించిన దొక్కటే వాక్యము. Heredity వలనఁ దల్లిదండ్రుల దేహలక్షణములు కాదాచిత్కముగ బిడ్డలయందు సంక్రమింపవచ్చును గాని మనోలక్షణము లేవియు నట్లు సంక్రమించుట కవకాశములేదని నా వాక్యమునందలి యభిప్రాయము. నేను దల్లిదండ్రుల లక్షణములు మాత్రమే యెత్తుకొంటిని. అవియైనఁ గాదాచిత్కముగ సంక్రమింపవచ్చునని నే నంటిని. మరికొన్ని తరములవారి దేహలక్షణ ములు గూడఁ బరీక్షింపవలయు నని మీరంటిరి. అది చాలకపోవునెడల నింకను బైకిఁ బోవలయునని కూడ మీరు చెప్పితిరి. దేహలక్షణపరీక్ష కంత విశాలమైన యవకాశమును మీరు కల్పించుకొనినను, బూర్వుల దేహలక్షణములన్నియు బిడ్డకుఁ దప్పకుండ సంక్రమిం చునని మీరును జెప్పఁజాకపోయితిరి. మీరిచ్చిన యుదాహరణములఁబట్టి చూడఁగ నెవరివో కొన్ని దేహలక్షణము లెప్పుడో యొకప్పు డేదోబిడ్డకు సంక్రమించునని స్పష్టముగఁ దేలుచున్నది. అట్టిచోఁ గాదాచిత్కముగ సంక్రమించునని నేనంటినని నాతో మీ కింతవాద మెందులకు? Heredity ని గూర్చి పదునాల్గుతరముల వఱకైనఁ బరీక్షించుట గూడ మీ యభిమతమైనట్లు కనఁబడుచున్నదే! అట్టి పరీక్ష కవకాశ మెట్లు? తరమునకు సామాన్య ముగా ముప్పదిసంవత్సరములు చూచుకొన్నను బదునాల్గుతరములగుటకు 420 సంవత్సర ములుపట్టునే! ఈలోపల నెన్నివందలజనమో పుట్టి చచ్చియుందురు గదా! ఈవంశములోఁ బుట్టిన మగవారికొఱకుఁ దెచ్చుకొన్న యాఁడు పిల్లలవంశములో వారి నందఱ లెక్కపెట్టు కొన్న యెడల మఱికొన్ని వందల జనాభా తేలుచున్నదే! అధమసంఖ్యగా జూచుకొనుటచే వందల వఱకే తేలినదే కాని యనేకసంతానయుక్తులైన వారి వంశములో నీ సంఖ్య వెలవఱ కెగఁబ్రాకు ననుట కేమైన సందేహమా? ఈ సహస్రజనసంఘములో నెవనిదో యొకనిపోలిక యిప్పటి తరములోఁ బుట్టినబిడ్డకు సంక్రమించును గావున Heredity సత్యమని మీరు వాదించుచున్నారా? వేలకొలది జనుల పోలికలో నెవరిదో యొకనిది బిడ్డకు సంక్రమింపకుండ నెట్లుండగలదు? మఱియొకవంశములోని వేయిజనుల దేహలక్షణములు మాత్రమీ వేయిజ నుల దేహలక్షణములకంటె భిన్నముగ నుండుట కవకాశ మున్నదా? ఇంతదూరపరీక్షవలన మనుష్యుల లక్షణములేకాని వంశస్థుల లక్షణములు నిర్ణయింప శక్యమగునా? అందువలన వంశములోని Heredity కి భంగము కలుగుచున్నదని మీ రేల గ్రహింపలేదు? కప్ప, యిలకోడి లక్షణములు కూడ మనయందుఁ గనిపించుచున్న పనికూడ మీరు వ్రాసినారు. ఇది సర్వప్రాణికోటిసంబంధమై సామాన్యలక్షణక్రమమై యుండవచ్చును. అంతేకాని మనకు వివాదాంశమై వంశము లోని Heredity కి సంబంధించినది మాత్రము కాదు.

ఏది యెటులున్నను Heredity వలన బిడ్డలోని స్థూలదేహ లక్షణములన్నియుఁ గలుగవచ్చుననియు, గొన్నియైన గలుగవచ్చుననియు. నా కంగీకృతమే. దేహపరిణామ మందే Heredity పనిచేయుటకు శక్తికలది కాని మనస్సుపై దానికి లేశముకాని, యధికార ములే దని నా యభిప్రాయము. ఈ నా యభిప్రాయమును ఖండించుటకు మీరు కొన్ని వాక్యములు వ్రాసినారు; అవి యేవనఁగా-''ఇదివఱ కైదుతరములనుండి Idiocy తీఁగ సాగుచున్న వంశములు రెండెచ్చ టనో యున్నట్లొక మనశ్శాస్త్రజ్ఞుడు చెప్పుచున్నాఁడు. తండ్రికిఁ బిచ్చి లేదుకాని తీవ్రమైన కోపము, పెద్దకొడుకునకు సామాన్యపుఁబిచ్చి, రెండవకొడుకున కంతకంటెఁ బిచ్చి, మూఁడవకొడుకునకు బూర్తిగాఁ బిచ్చియున్న కుటుంబము నొకదానిని గోదావరీతీరమందు నే నెఱుఁగుదును.'' మీరిట్లు వ్రాసినారు. అమ్మా! గోదావరీ తీరమందలి కుటుంబము నే నెఱుఁగునది కాదు. Heredity మనస్సు మీఁదఁగూడఁ బనిచేయునని నిర్ధారణ చేయుటకై మీరు చెప్పిన యీ రెండుదాహరణములు గూడ మీ కనుకూలించునని కావని తెలియఁజేయవలసివచ్చినందులకు విచారించుచున్నాను. అమ్మా! మెదడు (Brain) మనస్సుయొక్క అవయవము (Organ) అని పాశ్చాత్యులతోపాటు మనముకూడ నొప్పుకొనవలసిన యంశమే కాని వేఱుకాదు. Brain అనునది తలలో నుండు నని మీ రెఱిఁగినయంశమే ,కదా! ఈతల తగినయెత్తుతోఁ, దగినపొడవుతోఁ, దగిన వెడలుపుతోఁ, దగిన యాకృతితోఁ దగినచుట్టుకొలతతో గోధుమరంగు గల తగిన యంత ర్వస్తువుతో నుండవలయును. అప్పుడే తలలోని మెదడు మనస్తత్త్వమునకుఁ దగిన యవయవ మగును. వీనిలో లోపములు కలుగుటచేతనే మనస్సు శక్తిహీనమై చెడినట్లుండును. ఎదిగినమ గవానితల సర్వసాధారణముగా 22 అంగుళముల చుట్టుకొలత కలిగియుండును. ఆడుదాని తల యిరువదియొకటికి నిరువదిరెంటికి నడిమికొలతకలదై యుండును. మహాబుద్ధిశాలు లగువారి తలలు 23, 24 అంగుళముల చుట్టుకొలత కలవియై యుండును. ఎట్టి యద్వితీయ మేధాసంపన్నుని తలయైనను 24½ అంగుళముల కొలతకంటె హెచ్చుకొలత గలిగియుం డదు. అంతకంటెఁ బెద్దతల రోగచిహ్నమని యెంచవలయును. మందులతలలు 19 అంగుళములను, Idiots తలలు 18 అంగుళముల కొలతకలవియై యుండును. అమ్మా! జన్మమందత్వము Idiocy అయిదుతరములనుండి తీఁగ సాగుచున్న కుటుంబములు రెండున్నవి చెప్పితివే! వారంద ఱట్టి తలలు గలవారే. తలలనుబట్టియే వారు Idiots అయిరి. తండ్రికోలమొగము Heredity వలన బిడ్డకు నెట్లు సంక్రమించునో తండ్రిబుద్ధి హీనమైనతల కొడుకున కట్లు సంక్రమించుచున్నది. ఇది దేహపరిణామమే కాని మనః పరిణామ మెంతమా త్రము గాదు. అమ్మా! గోదావరీతీర మందలి పిచ్చికుటుంబమును గూర్చిరవంత చెప్పె దను. తండ్రి, తల్లి, ముగ్గురుకొడుకు లాకుటుంబమున నుండిరి. తండ్రినరముల కత్యంత మైన యుద్రేకము. వాఁకిటిలోఁ గుక్క రవంత మొఱిగినయెడల భూకంప మైనంత తహతహ లాడిపోవును. అట్టి యాతనికి వెనుకవ్రాలుతలగల (Pyramidal-forehead) యిల్లాలు సిద్ధించెను. వా రిద్దఱకు ముగ్గురుకొడుకులు పుట్టిరి. మొదటివాఁడు పాముతలవాఁడు. ఇతనికి నుదుటిసంబంధమగు మెదడు (Frontel brain) లేదు. రెండవకొడుకు మిక్కిలి చిన్నతలతో బుట్టెను. ఇతఁడు జన్మమందుఁడు. చిన్నయన్న గారి చిన్నతలతోఁ దల్లివ్రాలు తలతోఁ, దండ్రి నరముల యుద్రేకముతో మూఁడవకొడుకు పుట్టినాఁడు. ఈతఁ డీఁగను జూచి యెగిరి యెగిరి పడువాఁడు. పిల్లిని గాంచి యేడ్చెదువాఁడు; కాకిని గాంచి గాన

మొనర్చెడివాఁడు. పంచభూతములకు భాషావిషయకోపన్యాసము లిచ్చువాఁడు; ఇతఁడు పూర్తిగాఁ బిచ్చివాఁడు జన్మమందత్వమే కాదు, పెద్దపెద్ద యున్మాదములే కాదు, చిట్టచివరకు మనుజులకు సర్వసాధారణముగా నున్న కొనవెఱ్ఱులు గూడ మెదటితో, నరముల కూట మితో సంబంధించినవే కాని, వేఱు కాదు. ఇవియన్నియు దేహపరిణామములే కాని మనఃపరిణామములు కావు. కాని మనస్సునకు మెదడు ప్రధానావయవము కావున మనస్సులోఁ బరిణామము Heredity వలనఁ గలిగి నట్లు కానఁబడుచున్నది. కాని మఱియొ కటి కాదు. అది కేవలము భ్రమము. మనస్సు చెడిపోయిన ట్లగపడుట కనేక కారణములుం డును. పచ్చకామిలగలవాని కంటికిఁ బికిలిపిట్ట పసపుపొత్తి పిట్ట. సర్పదష్టుని జిహ్వకు లవణము కలకండ. అధర్మాయచెవియందు నిర్ఘాతమునకు నిశ్శబ్దత్వము. సన్నిపాతరోగియె దుట Socrates కు, శంకరాచార్యుల వారికి, జగన్మిథ్యాత్వవాదము జరుగచుండును. అలవాటు లేనివానికి అరయవున్సు Exshaw గొంతుక దిగుటయేమి? యప్సరస లెదుటఁ దాండవించుటకై యమరలోకమునుండి దిగుటయేమి? ఇట్టి వన్నియుఁ దాత్కాలికోన్మాద ములు. వీనికి మహోన్మాదములకుఁ దత్త్వమందు భేదమేమియులేదు. నిలుకడలో మాత్రమే భేదమున్నది. సన్నిపాతరోగికి జ్వరహర మగువెంటనే యున్మాదము వదలును. అటులే యశ్వినీదేవతలు వచ్చి జన్మమందునిఁ జిన్నతలను బెద్దతలగాఁ జేయునెడల Idiot కున్మా దము వదలును. అదియులేదు; యిదియు లేదు, కాని కొన్ని కొన్ని యున్మాదము లౌషధసాధ్యములనుట సత్యమే; ఏ యౌషధమైనను శరీరమునకుఁగాని చిత్తమునకుఁ గాదని యంద ఱెఱిఁగిన యంశమే. అందుచే నున్మాదము లన్నియు దేహపరిణామములు కాని మనఃపరిణామములు కావు.

అమ్మా! Heredity మనస్సుపైఁ బనిచేయునని నీ వెన్నఁడు నమ్మవలదు. నీయభిప్రా యమును సిద్ధాంతీకరించుకొనుటకు మనశ్శాస్త్రజ్ఞుఁ డైన పాశ్చాత్యమహావిద్వాంసుని మాటలఁ గొన్నిటి నుదాహరించినావు. అవి యేవనఁగ:– “The heredity transmission of a liability to mental disease must be reckoned as the most important of all predisposing causes of insanity” ఈమాటలనుబట్టి mental disease (పిచ్చి) Heredity వలననే వచ్చుచున్నదని నీ వనుకొంటివి అమ్మా! అట్లనుకొనుట తప్పు. పిచ్చికి Heredity యే కారణమని యావాక్యముల వ్రాసిన పండితుని యభిప్రాయము కాదు. పిచ్చికి Liability యున్నదే. అదే Heredity వలన వచ్చునని యాతని యభిప్రాయము. ఆ Liability యెప్పుడుకూడ దేహపరిణామమే కాని మఱియొకటి కాదు. అందుచే Heredity దేహముమీఁ దనే కాని మనస్సు మీద బనిచేయదు; చేయలేదు.

అమ్మా! ఒకమాట చెప్పుచున్నాను; శ్రద్ధగా వినుము. మనమార్షమతస్థులము. పరమాత్మను, జీవాత్మను, బునర్జన్మమును నమ్మిన వారము. మనదేశమునందుఁ బుట్టిన చార్వాకమతమునందుమాత్ర మివి యేవియు లేవు. బుద్ధుఁడు దైవమును గూర్చి మూకీభా వము వహించినను జీవాత్మతత్త్వమును గూర్చి కొంతవేఱుగాఁ జెప్పినను బునర్జన్మము నొప్పుకానినాఁడు. అమ్మా! పాశ్చాత్యశాస్త్రజ్ఞులలో ననేకు లనాత్మవాదులు. ఆత్మలేనప్పుడు పునర్జన్మము దేనికి? అందులోఁ బ్రకృతిశాస్త్రజ్ఞానము పరిపూర్ణముగ నున్న మహావిద్వాంసు లలో నూటికిఁ దొంబదియైదుగురు నిరీశ్వరవాదులు. మిగిలిన యయిదుగురు **Agnositcs**

అమ్మా! Evolution గూర్చి Heredity ని గూర్చి యట్టివా రొనర్చిన విపరీత సిద్ధాంతము లందు నీవు విశ్వాస ముంచి మనవారి సిద్ధాంతములను బాటసేయకుండుట తగునా? ఇంతకును నీవు మన సిద్ధాంతసాంప్రదాయములను బూర్తిగ నెఱుఁగకుండఁ బైవారి వాక్యములే సిద్ధాంతము లని నిర్ణయించుటకు నీకేమి యధికారమున్నది? ఆత్మను బునర్జన్మమును నమ్మిన మన కనాత్మవాదుల సిద్ధాంతములు వలదు. నిరీశ్వరవాదుల సిద్ధాంతములు మొదలే వలదు. మనలో మతమునకు వేదాంతమునకు సంపూర్ణసామరస్య మున్నది. వారిలో లేదు. వారిల్లో మతమును నమ్మిన వాఁడు వేదాంతమును బారలౌకికానందభంజకముగను భగవ త్తత్త్వ దూషకముగను భావించును. ప్రకృతిజ్ఞానసంపన్నులైన సిద్ధాంతులు మతము మూఢజ నచిత్తాకర్షణమైన బొమ్మలాటగ భావింతురు. ఈ రెంటికి సామరస్యము కుదిరినఁ గాని మతము నిలువదు; వేదాంతము నిలువదు. వేదాంతము లేని మతమైనఁ గొంతకాలము నిలుచును గాని మతము లేని స్వసౌఖ్యపరమావధికిఁ బరహింసాప్రవీణతకుఁ బ్రపంచవిశ్రాంత ప్రఖ్యాతికిఁ బనికివచ్చును గాని చిత్తశాంతికి, వైరాగ్యమునకు, యోగమునకు, నాత్మజిజ్ఞాసకు, నపరోక్షమార్గమునకు నక్కఱకు రాదు. అసంతుష్టి కరములై, యపూజ్యములై, యనాత్మక ములైన వారిసిద్ధాంతములకు వారే కొంతకాలమైన పిమ్మట వెగటుపడక తప్పదు. ఇప్పుడి ప్పుడే యేదో కొంత విసుగుదలతోఁ గూడిన స్వల్పవైముఖ్యము వారి మనస్సులం దీసిద్ధాంతముల యెడలఁ గలుగుచున్నట్లు కొన్నిచిహ్నము లగుపడుచున్నవని కొందఱు చెప్పుచున్నారు. పుణ్యమున కుత్తమలోకఫలము లేదన్న వేదాంత మెంతకాలము మనస్సు నకు సంతుష్టి నీయఁగలదు? సర్వరక్షకుఁడే లేని వేదాంతమం దెంతకాలం మనోధైర్య ముండఁగలదు? అణువులు (Atoms) నిన్ను రక్షించునని చెప్పినమాటను నీ వెంత కాలము నమ్మఁగలవు?

అమ్మా! నీ విట్టి సిద్ధాంతముల నాధారముచేసికొని వాదించుట సమంజసము కాదు. నీయాంగ్లేయభాషాజ్ఞానమునకు, నీగ్రంథపరిశోధనమునకు నేను సంతసించితిని. కాని మన యార్షమతమునందలి నీ యనాదరణమునకు విచారించుచున్నాను. మన పెద్దలు జీవుని పునర్జన్మమును గూర్చి యెట్టియభిప్రాయమును వెల్లడించిరో రవంత కనుఁగొందము. అమ్మా! నేను నీమాత్రమైనఁ జదువుకొన్న వాఁడనుగాను. కాని పెద్దల సేవించుచు హెచ్చుకాలము గడపినవాఁడ నగుటచే వారిప్రసాదమునఁ గొన్నిమాటలు నాచెవి నప్పుడ ప్పుడు పడినవి. అవి సంగ్రహముగ మనవి చేసెదను.

స్థూల సూక్ష్మ కారణశరీరములని శరీరములు మూఁడు. మనుజుని మరణానంతరము స్థూలశరీర మిచ్చట మంటలోనో మట్టిలోనో కలసిపోవును. ఇఁక సూక్ష్మకారణశరీరములు న్నవి. సూక్ష్మశరీరములోఁ గారణశరీర ముండును. బాదముకాయలోఁ బలు కెట్లో యటులే యుండును. సూక్ష్మశరీరము వెలుతురు (Light) విద్యుచ్ఛక్తి (Electricity) వంటిది. సూక్ష్మశరీరములో నున్న జీవాత్మకు మోక్షము సూక్ష్మశరీరము పూర్తిగా నశించిన పిమ్మట గాని కలుగదు. అట్టిస్థితి కర్మరాహిత్య వాంఛారాహిత్య పూర్వకమయిన జ్ఞానమువలనఁ గని, భక్తివలనఁగాని పరమేశ్వరకటాక్షమువలనఁగాని కలుగును. అంతవఱకు సూక్ష్మశరీర మాత్మ వంటిపెట్టికొనియే యుండును. లోపల జీవాత్మగల యీసూక్ష్మశరీరమునకే మనపెద్దలు పునర్జన్మమును నిర్మించినారు. ఈ జీవుఁడు విశేషపుణ్యము లొనర్చుకొన్నవాఁడైన యెడల

నుత్తమలోకము లందుఁ దత్పుణ్యఫలక్షయ మగువఱకు మహాసుఖమంది యటుపిమ్మట మర్త్యలోకమునఁ దిరుగ జన్మించును. ఉత్కృష్టపుణ్యకార్యములు కాని, పాపకార్యములు కాని సామాన్యముగాఁ జరించి మరణించినవానిసూక్ష్మ శరీరమునకు వెంటనే పునర్జన్మము సంభవించును. విశేషపాపకర్మము లొనర్చినవాఁడు మరణించి శ్వ సూకరాది జంతువుల గర్భమందుఁ బుట్టును. పునర్జన్మ మెత్తవలసినజీవుఁడు తన కర్మానుగుణమైన తావు చూచుకొని వ్రీహిమూలమునఁ బురుషుని యుదరమునఁ బ్రవేశించి యటనుండి మాతృగర్భకోశమునఁ బ్రవేశించును. పుట్టఁదలచిన జీవుఁడు తనంతతానే ప్రయత్నించి పుట్టుచున్నాఁడు; కాని మనప్రయోజకత్వముచే బుట్టుచుండుటలేదని స్పష్టముగఁ దెలిసికొనవలయును. జీవుని వదలకుండ వెంటాడించుచున్న యతని సూక్ష్మశరీరము కూడ జీవునితో పాటే తల్లికడుపునఁ బ్రవేశించును. ఈసూక్ష్మశరీరము కూడ జీవునితో పాటే తల్లికడుపునఁ బ్రవేశించును. ఈసూక్ష్మ శరీరములో నేమున్న వనఁగా: అనేక పూర్వజన్మములలో జీవుఁ డొనర్చుకొన్న కర్మముల ఫలమున్నది. అదికాక విద్యయున్నది. విద్య యనఁగా వేదవేదాంతజ్ఞానము, శాస్త్రాదిజ్ఞానము మొదలగునవి. ఇదికాక ప్రతిభ యున్నది. ప్రతిభ యనఁగా బుద్ధివికాసము, లలితకళా ప్రావీణ్యము, వాక్చతురత, వ్యవహార నైపుణి మొదలగునవి. ఈశక్తులన్నియు దల్లి గర్భమునఁ దనంతఁ దాను ప్రవేశించినజీవుని సొంత సొమ్ము కాని తల్లిదండ్రులిచ్చిన వెంతమాత్రమును కావు. ఇక్కడనే నశించిపోవుట కర్హమైన స్థూలశరీరమును (దేహము) మాత్రమే తల్లిదండ్రులు బిడ్డ కిచ్చుచున్నారు. ఈ దేహమైనఁ దల్లిదండ్రులు బిడ్డకు యథాక్రమముగఁ బూర్తిగ నిచ్చుచున్నారా? ఈయ శక్తిగలిగియున్నారా? కల్ల. అట్లే యగునెడల నిందఱు వికృతాంగులు, నిందఱు నపుంసకులు, నిందఱు రాకాసిరూపులు ప్రపంచమున నుండనేల? బిడ్డనికి దేహమిచ్చుటలోఁ దల్లిదండ్రులు బిడ్డని కర్మమునకుఁ దమ కర్మమునకుఁగూడ ననుగుణమగు నంతవఱకే దేహమిచ్చుచున్నారు. ఎటు లిచ్చినను బ్రధానముగఁ దెలియఁదగిన యంశమేదనఁగా: బిడ్డకుఁ దల్లిదండ్రులిచ్చునది దేహమే కాని తద్వ్యతిరిక్త మెంతమాత్రము కాదు. మన స్సనునది బిడ్డనిదే. దానిపైఁ దల్లిదండ్రుల కధికారము లేనే లేదు. అందుచేతనే యొకనికిఁబుట్టిన యెనమండ్రు కొడుకులలో నొకఁడు మహాబలాఢ్యుఁ డగుచున్నాఁడు. ఒకడు కాలుచేతులులేని మొండె మగుచున్నాఁడు. ఒకఁ డెనుబది సంవత్సరములు పూర్ణారోగ్యమున జీవించుచున్నాఁడు. ఒకఁ డెనిమిదవదినమున నందుగొట్టి చచ్చుచున్నాఁడు. ఒకఁడు మహాకవి యగుచున్నాఁడు. ఒకఁడు నిరక్షరకుక్షి యగుచున్నాఁడు. ఒకఁడు పరమహంసశిఖామణి యగుచున్నాఁడు. ఒకఁడు బందిపోటుదొంగ యగుచున్నాఁడు. ఈ వ్యత్యాసముల నన్నిటిని Heredity సమన్వయించఁగలదా? ఊహుఁ

పాశ్చాత్య వేదాంతులలో నూతనముగఁ గొందఱు మఱియొక యభిప్రాయమును బడుచున్నారని వినుచున్నాను. Heredity వలన బిడ్డని దేహపరిణామములన్నియుఁ బూర్తిగఁ గలుగుచున్నవని వీ రంగీక రించుచు మనఃపరిణామములలోఁ గొన్ని మాత్రమే Heredity వలనఁ గలుగుచున్నవని వీ రభిప్రాయపడుచున్నారు. ఆకొన్ని యేవనఁగా:– బుద్ధివికాసముతోఁ జేరిన మనఃపరిణామములు మాత్రమే Heredity వలనఁ గలుగుచున్నవి. కాని పుణ్యపాప సంబంధంతోఁ జేరిన నడవడి మాత్రము Heredity వలనఁ గలుగుటలేదని వీరి యభిప్రాయమైనట్లు కనఁబడుచున్నది. గణితశాస్త్రప్రావీణ్యము Heredity వలననే కలుగు

చున్నది. గణితశాస్త్రప్రావీణ్యము Heredity వలననే కలుగుచున్నది. కాని కాంతాలంపటత్వముమాత్రము దానివలనఁ గలుగుట లేదట! ప్రబంధరచనానైపుణ్యము Heredity వలననే కలుగుచున్నది. కాని, వైరాగ్యజ్ఞానసంపత్తి దానివలనఁ గలుగుటలేదట! సరే, కలుగుటలేదు. దేనివలనఁ గలుగుచున్నదని వీరి నడిగినయెడల నాత్మ నొప్పుకొనవలసి వచ్చునను భయముచేత Science యింకను Progress అయిన కొలఁదిఁ దెలియునని కాఁబోలు మూకీభావమును వహించుచున్నా రని వినుచున్నాను. ఏమైనాసరే కాని వీ రాత్మ నొప్పుకొనుట కిష్టపడరు.

"This doctrine (Transmigration) famous in antiquity and still held as a religious tenet by certain sects of the civilised world has its roots far back in primitive culture. It is developed out of three universal savage beliefs, (1) that man has a soul; (2) that animals and plants have souls; (3) that souls can be transferred from one organism to another."

అమ్మా! వింటివా! ఆత్మాస్తిక్య విశ్వాసమున్న మనలను పాశ్చాత్యసిద్ధాంతులు Savages అని పిలుచుచున్నారు. కాని యింత నాగరకత యుండియు నింత శాస్త్రజ్ఞాన ముండియు Heredity మనస్సుపై Intellectual Side ననేకాని Moral Side నఁ బనిచేయనదని చెప్పునట్టి వీరిని మన మేమని పిలువవలయునో? జవునఁటికాయ లాగున మనస్సున కొకప్రక్కను బుద్ధిభాగము, రెండవ ప్రక్కను నీతిభాగము నున్నవని వీరి యభిప్రాయము కాఁబోలు! సరే. ఎటులో యొకటు లుండుఁగాక! సగము మనస్సుపైఁ బనిచేసినది. మిగిలినసగముపై నేలపనిచేయదో? నీటిలో ముంచినగుడ్డకుఁ బదుగు తడిసి పేక పొడిగనుండునా? అమ్మా! ఆత్మవిశ్వాసము పునర్జన్మ విశ్వాసమున్నఁగాని యీలెక్క "కజబాజు"లు గిట్టవు. బుద్ధిచేతనే ప్రపంచపుఁ గట్టుకథను విప్ప సాధ్యమగునా? ప్రపంచమున మన లౌకిక బుద్ధికి స్వాధీనమైనది రూపాయ కొక్క యర్ధపైసంతయినఁ గాదే. మిగిలినదంతయు భగవద్వాక్యములని మనము నమ్మినవానివలనను సమాధినిష్ఠాగరిష్ఠులై యపరోక్షజ్ఞాననిక్షేపులైన మంత్రద్రష్టల పలుకులవలనను దెలిసికొనవలెను. Nonsense అది మూఢవిశ్వాస మనిపై వా రందురా? అది Nonsense అయినయెడల నీక్రిందిదానిని వా రేమందురో? "One cannot accept the theory of Evolution or the theory of Heredity built upon the Evolutionary hypothesis without discording the Bible and rejecting the dominent note in Christianity. We are not progeny of the brute. We have not tumbled upward by chance but rise by a power which finds its highest Expression in Christ." W.J. Bryan అను నొక పాశ్చాత్యవిద్వాంసుఁ డీమాటలను వ్రాసినాడు. Evolutionary heredity ని బూర్తిగ ఖండించిన వారిలో నితఁడు ప్రముఖుఁడు. ఈతఁ డుద్రేకమున "God or Gorilla?" అని యఱచినాఁడు. "The worldfamous lawyer, politician and orator" అని ఖ్యాతి చెందినవాఁడు. అమ్మా! ఈతఁ డింక నేమని వ్రాసెనో విందువా? "I would propose the Bible as a substitute for all materialistic doctrines, because the Bible is not only the foundation of ever present standard of morals but also gives us our only conception of God and Jesus Christ.

మతమునందలి విశ్వాసముచేతనే మనుజుఁడు మనుజుఁ డగుచున్నాఁడు. కాని, లౌకికమైన బుద్ధిచేతఁగాదని నమ్మవలయును. ఎంతటి వాఁడైనసరే, యెక్కుడివాఁడైనసరే, యశాస్త్రీయములైన మతవిశ్వాసములు కలవాఁడు మూఢుఁడేకాని మఱియొకఁడు కాఁడని యింకను బాశ్చాత్యవేత్తలు మనల నధిక్షేపింతురా? ఊఁ, అటులే కానిమ్ము. బ్రహ్మర్షులతో పాటు మనము తప్పునఁ బడియుండుటే తగునుకాని పాశ్చాత్య శాస్త్రవేత్తలతోపాటు సందేహహతులమై భ్రష్టత్వమొందుట తగదు. అనాగరకులలో నధము లనిపించుకొన్న మన మాస్తికులమై యుండదము; కాని నాగరకశిఖామణు లనిపించుకొనుచు నాస్తికులమై యుండవలదు. అమ్మా! ఎవరు చూడవచ్చినారు. ఏమో! ఏమో!! ఏమో!!!

(భారతినుండి పునర్ముద్రితము)

# 35. ఆంధ్రసాహిత్యపరిషదేకాదశ వార్షికోత్సవ అధ్యక్షోపన్యాసము

ఆంధ్రదేశ సాహిత్య చరిత్రలో, గ్రాంథిక భాషా పరిరక్షణ కోసం 1911లో ఆంధ్రసాహిత్య పరిషత్తు అవతరించింది. ఈ పరిషత్తు స్థాపక, వ్యాపకులలో పిఠాపురం మహారాజా సూర్యారాయ మహీపతి, జయంతి రామయ్య పంతులు ప్రముఖులు.

ఈ పరిషత్తు 11వ వార్షికోత్సవం దుందుభినామ సంవత్సర భాద్రపద శుద్ధ ఏకాదశి రోజున పిఠాపురంలో జరిగింది. ఈ సభకు పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు అధ్యక్షత వహించి చేసిన ఉపన్యాస పాఠం ఇది.

ఆయన ముందుగా పిఠాపురం విశిష్టతను, ఆ సభ జరుగుతున్న మహారాజా మందిరం విశిష్టతను ప్రశంసించారు. అప్పటికి వున్న ఆంధ్ర భాషా స్థితిని–నాటకీయంగా–ఎదుట దృశ్యం కనిపిస్తున్నట్టు వర్ణించారు. ఎన్నెన్ని రకాల సాహిత్యం, ఎన్నెన్ని రకాల కవుల సందడి, దేశాన్ని క్రమ్ముకొని వుందో విశదం చేశారు. ఆంధ్రదేశ ప్రజలలో నూటికి ఇరవై మందికి మించి ఆంధ్రభాషా జ్ఞానం లేక పోవచ్చుగాని–అదే చాలునన్నారు.

ఆంధ్రులైన వారు ప్రతి వ్యక్తీ ఆంధ్ర గ్రంథాల్ని కొనాలని విన్నవించారు. ప్రజాపోషణ గ్రంథకర్తలకు అవసరమన్నారు. పుస్తకాలలో మంచివాటిని గౌరవించాలనీ, చెడ్డవాటిని బహిష్కరించాలనీ, సూచించారు. తెలుగులో ఉత్తమ 'సాహిత్య విమర్శ' అభివృద్ధి కావడానికి పరిషత్తు కృషి చెయ్యాలన్నారు. ఒక్క సాహిత్య సంబంధ గ్రంథాలేకాక, అనేక ఇతర శాస్త్ర గ్రంథాలు కూడా తెలుగులోకి అనువాదం కావాలనీ, ఛందస్సులో కవిత్వ రచనే కాక, వచన సాహిత్యం విరివిగా పుట్టే భాషను అభివృద్ధి చేయాలనీ, కవుల చరిత్రల్నీ, చిత్రపటాల్నీ పరిషత్తు సేకరించాలనీ, ముఖ్యంగా వివిధ వచనశైలీ నిర్మాణం రచయితల వల్ల జరగాలనీ కోరారు. ఇందుకు ప్రజలు, పరిషత్తుకి ఆర్థికంగా చేయూత ఇవ్వాలన్నారు. అర్హులైన పండితులకు, పరిషత్తు బిరుదులివ్వాలని సూచించారు. కొంత సొమ్ము కేటాయించి పేదకవులను ఆదుకొనే యత్నం చేయాలన్నారు. ఏటా వార్షికోత్సవ నివేదికల కంటె ముఖ్యంగా పరిషత్తు, నిర్మాణాత్మకమైన కృషి గ్రంథ రచన రూపంలో చూపించాలన్నారు.

ఆంధ్రసాహిత్యపరిషదేకాదశవార్షికోత్సవసభకు న న్నగ్రాసనాధిపతిగా నియమించి నందులకు మీ కెంతయుఁ గృతజ్ఞుఁడను. క్రిందటిసారి యేలూరులో నిట్టిసభ జరిగినప్పుడు న న్నగ్రాసనాధిపతిగాఁ గోరిరి. అప్పటి యనారోగ్యస్థితివలన నే నంగీకరింపకపోయినప్పటికి నన్నుఁ దిరుగ నెన్నుకొని గౌరవించినందుకు మఱింత కృతజ్ఞుఁడను.

నేను బండితుఁడను గానని యీయూరివా రెఱుఁగుదురు; పై గ్రామములవా రెఱుఁగుదురు. న న్నెఱిఁగినంతవఱ కాంధ్రదేశమంతయు నెఱుఁగును. సాహిత్యహీనతలో జనమెఱిఁగినవాఁడను గాని సాధారణుఁడను గాను. ఇట్టి నన్నుఁ బరిషత్తువా రేల యెన్నుకొన వలయునో నాకుఁ దెలియదు. తెలిసినవిషయ మేమియో యంతకంటెఁ దెలియదు ''వెనుక జరిగినది పది పరిషత్సభలకుఁ బండితుల నెన్నుకొంటిమి కదా! ఈసారి యపండితు నెన్నుకొందము. ఇంతలోఁ జెడిపోవున దేమున్న'' దని యూహించి మార్పుకొఱకై న న్నెన్నుకొని యుందురేమో! ఎటులైన నేమి? అవిలంఘ్య మైన మహాజనులయాజ్ఞ దులసీ దళమువలె శిరమున ధరించి యిట నిలువఁబడితిని. నాకు సందేహమెందుకు? న న్నిటనిలువఁ బడుటకు నియమించినవారే నాచేఁ దమకార్యమును నిర్వహింపించుకొను భారమును వహించి యున్నపుడు పనికి మాలి సందేహము లొందుటకంటెఁ బామరత్వ ముండునా? కవి కుండఁ దగిన యోచన, తొట్రుపాటు, సందేహము, నలజడి కవిచేతిలోని కలమున కెందుకు? ఈస్వల్పసాధనమును మీ యిష్టానుసార ముపయోగపఱచుకొని మిమ్ము మీరు కృతార్థులుగఁ జేసికొనుఁడు. కలముగూడఁ గానంత మంచిదే యనునట్లు నన్ను రవ్వంత కృతార్థునిఁ జేయుఁడు. చేయుట కవకాశము లేక పోయిన బోనిండు. ఇఁకఁ గార్యక్రమము ననుసరించి సభాచర్య జరిగింతము.

సమ్మాననసంఘాధ్యక్షులగు శ్రీ శ్రీ పీఠాపురమహారాజావారి మనోహరమైన యుపన్యాసమును వింటిమి. దానినిగూర్చి నే నేమైనఁ జెప్పవలసియుండునెడల నా యుపసంహారోపన్యాసము ముందుఁ జెప్పెదను. ఇఁక నా యుపన్యాసమును జదివెదను.

పీఠికాపురము:- ఈసభ పీఠికాపురమునకే తదాస్థానమహారాజువారిచే నాహ్వానింపఁబడినది. ఆహ్వానించినవా రెట్టివారు? ఆంధ్రభాషాపోషకులు, నాంధ్రభాషాకోవిదులు, నాంధ్రభోజబిరుదార్హులు, నత్యంతసుగుణసంపన్నులగు నీ మహారాజుగారు. ఆహ్వానింపఁబడిన దేది? అన్ని దేశ భాషలలో నమృతాధిక మాధురీధురిణీ యని యేభాష యాచంద్రార్కఖ్యాతిఁ గాంచినదో, యేభాషామతల్లిని సేవించుటచే రాజరాజ నరేంద్రుఁడు మన యందఱియిండ్లలో దేవతార్చన వేదికలపై దివ్యమూర్తులతో పాటు పూజ నందుచున్నాఁడో యేభాషాయోష నభ్యర్చించుటచేఁ గృష్ణదేవరాయలయశస్సింహాసన మష్టదిగ్గజములు వహించుచున్నవో యట్టి యాంధ్రభాషాదేవిని సేవించుట కేర్పాటుకాఁబడిన సాహిత్యపరిషత్తు. ఆహ్వానించిన దెచ్చటికి? రామలింగకవి కాలమునకుఁ బూర్వమునుండియే కాక యిప్పటికిఁగూడఁ గళింగదేశాభరణమగు పీఠికాపురమునకు. మల్లన్న-ప్రౌఢకవి మల్లన్న కాఁడు. పావులూరి మలయమారుతముతో వచ్చిన రసికజనమనోభిరామపరిమళము లిటకు రెండుబారలలోనివే. లక్షణాపరిణయ శబ్దాలంకారపు టంగుటెంగు లిక్కడికి మూఁడుబారలలోనివే. అయిన నిది కేవలము సారస్వతప్రాముఖ్యమునందిన పట్టణము మాత్రమే కాదు. శివకేశవసన్నిధానమునఁ బరమపవిత్రమైనది కూడను; పాదగయాక్షేత్రమగుటచే నిది మహాక్షేత్రము. అష్టాదశపీఠములలో నిది

యొకటి. మహాకవినిలయ మగుటచే రక్తికి, మహారాజాస్థాన మగుటచే భుక్తికి, మాధవమహా క్షేత్ర మగుటచే ముక్తికి నిదానమైన యాపుర మాంధ్రదేశమహిళామతల్లికంఠ మాలానాయకమ ణియై ప్రకాశించుచున్నది.

ఇదిగాక చీనాదేశపువారి రాయబారి హియా త్సాంగ్ అనునాతఁడు మన యార్యావర్త దేశమునకు వచ్చి యిచ్చటివిశేషములు వ్రాయుటలో దక్షిణమునఁ బిష్టపుర మనునొక ప్రసిద్ధమైనపట్టణ మున్నదని వ్రాసినాఁ డనియు, నంతకుఁబూర్వ్యఁ డెవఁడో గ్రీస్తుదేశస్తుఁడు కాఁబోలుఁ బిష్టపురఖ్యాతిని వెల్లడిచేసియుండె ననియు మ-రా-రా శ్రీ ది హానరెబిల్ న్యాయ మూర్తి వేపా రామేశముపంతులుగారు నాతోఁ బలికిరి. ప్రాచీనచరిత్రాంశవిమర్శనాసక్తులగు వారిమాటలను బట్టి యీ పట్టణము దాదాపుగాఁ గ్రీస్తుశకమునకుఁ బూర్వమునుండియుఁ బ్రసిద్ధి వహించియున్నదేమో యని యెంచఁదగియున్నది.

మహారాజమందిరము:– అట్టి యీపట్టణమున మహారాజమందిరమున మనసాహిత్యప రిషత్తు సమావేశమైనది. సంగీతసాహిత్యప్రసిద్ధుఁ డగు కవివర్యుని యనేక చిత్రవిచిత్రార్థప్రతి పాదనయుక్తమైన వసుచరిత్ర సంగీతపురాణ పఠనము జరిగిన దీ సభయందే. సర్వకామదకుఁ బరిణయ మెందుకోయి యని రామభక్తుఁడైన లక్ష్మణుఁడు కృష్ణమూర్తిని బరిహసించిన దీ సభయందే. బులుసువారింటఁ బుట్టిన విద్యారణ్యుఁడు. ముప్పదిరెండుపుట్ల రత్నగర్భను రామార్పణముగ గ్రహించిన దీ సభయందే. భరతాభ్యుదయాధిపతి శతఘంటక కవిత్వకాల మున శారదా దేవితోకూడ గజ్జెలు కట్టుకొని తాండవించిన దీ సభయందే. రావువంశముక్తావ ళిని రామరాజేంద్రుని కంఠసీమనలంకరించిన యాస్థాన సోదరకవు లర్ధసింహాసన మధిష్ఠించిన దీ సభయందే. కవులకుఁ గనకవర్ష మన్నిఋతువులందుఁకూడఁ గురియుచున్న దీ సభయందే. నవీనగౌతములు, నర్వాచీనపాణినులు, నూతన బాదరాయణులు విజయదశమినాఁడు మా మహారాజేంద్రునిపై వారి పుత్రపుత్రికాసంతతిపై నాశీఃప్రసవవృష్టిఁ గురియించుచున్న దీ సభయందే. ఆస్థానవైణికాగ్రగణ్య వీణారవామృతాస్వాదనావశములైన చిలుకలుఁగూడ స్తంభోపరివిటంకములనుండి సహవైఖరిని ''రామా'' యని యనఁబోయి సంగీతవైఖరిని ''రీమా'' యని యనుచున్న దీ సభయందే. అట్టి యీసభయందుఁ దెనుఁగు రాయఁడు మొదలు తెనుఁగుభాసలోఁ బండితుఁడు తెలుఁగుబానకుఁ బరిపోషకుఁడు నగు నీ మహారాజువఱకు విద్యాపోషణమునకు విశేషవిశ్రుతి కెక్కి దినదిన ప్రవర్ధమానముగ నెక్కుచున్న యితోధికవృద్ధిగా నెక్కఁ గల యీసభయందు, రమాశారదాకేళీమందిరమగు నీ సభయందు మనము నేటికి సమావేశమైతిమి. ఎందుకు? ఆంధ్రశారదాదేవీసమారాధన మునకు. ఆహా! ఎంత మహాకార్యమునకై-యెంత మహారాజుచే నాహ్వానింపఁబడి యెంత మహాక్షేత్రమున నెంత మహోన్నతయశస్వంత మైనసభయం దెందఱు మహాకవిపండితులు నమకూడిరో! ఆంధ్రభాషా పండితులను, నాంధ్రభాషాభివృద్ధికై యత్యంతము శ్రమమొనర్చు చున్న వారును నగు గౌరవ్యులకు శ్రీరాజా పానుగంటి రామారాయణంగారు నిరంతర రాజకార్యనిర్వహణదీక్షాబద్ధులై యుండుటచే నిటకు దయచేయుట తటస్థింపదేమో యని సందేహించితిమి. కాని యాదృచ్ఛికమునఁ గార్యాంతరములచే గంజాముమండలమునకు వారు వచ్చి తిరుగ మదరాసునకుఁ బోవునప్పుడు తమ మిత్రులగు మా మహారాజుగారిని జూడనిట దిగి పరిషత్సభ ని ట్లలంకరించుట భాషాభిమానుల కందఱకుఁ బరమానందముగా

మున్నది. మదరాసులో రాజప్రతినిధిగారు ప్రథమమంత్రి వీరగుటచే రాజప్రతినిధిగారే పరిషత్సభ నిట్లు బహూకరించి రని యెంచవలసియున్నది. ఆహాహా! ఇది యెంత మహాసుదినము! సెప్టెంబరు రెండవతేది. పోనిండు. అని మన కెందుకు? దుందుభినామ సంవత్సర భాద్రపదశుద్ధైకాదశి భాషాచరిత్రయందు బంగారువర్ణములతో ముద్రింపవలసిన భద్రతిథి కాదా? ఆంధ్రశారదాజయంతి జరుపఁదగిన యమూల్య దిన మిదియేకదా! ఆంధ్రభాషకు జయమగుఁ గాక! ఆంధ్రభాషాపోషకులకు జయమగుఁ గాక? ఆంధ్రసాహిత్యపరిషత్తునకు జయమగుఁ గాక!

ప్రస్తుతాంధ్రభాషాస్థితి:- ఆంధ్రభాష ప్రస్తుత మెట్టి స్థితిలో నున్నదో రవంత చెప్పెదను. నేను జెప్పుట యెందుకు? ఆంధ్రభాషాదేవి యెట్లున్నదో మీరే చూడుఁడు. అదెట్లు? సహజభావనాబలసంపన్నులమైన మనము మనస్ఫూర్తిగాఁ జూడఁదలఁచుకొన్నయెడల శారదాదేవి మనకుఁ బ్రత్యక్షము కాకపోవుటయే. మనశ్శక్తికి బద్ధులుకాని దేవత లెవరు? నాయనలారా! బాహ్యనేత్రములను రవంత ముకుళింపఁ జేయుఁడు. ఆంతరనేత్రజ్యోతి నెగసఁ బొడిచి దానికిరణము లటు లిటులు చెదరనీయక సంఘీభవింపఁజేసి మనకుఁ గావలసిన విషయములపై సుస్థిరముగ సూటిగఁ గేంద్రీకృత మొనర్పుఁడు. ఆహవనౌకలందలి యన్వేషణజ్యోతికంటె ననేకగుణతేజస్సమృద్ధమగునట్లు, వెలుఁగఁ జేయుఁడు? ఇంకనేమి? అదిగో! అదిగో! ఒడలు జలదరించునట్లు, కనులు కృతార్థములగునట్లు, మనస్సు పుష్పించునట్లు, జన్మము తరించునట్లు—ఆంధ్రశారదాదేవి దర్శన మిచ్చుచున్నదే! అనేక సహస్రచంద్రమండల సన్నిభమైన యాస్యమండలము వీణాదండమువంక రవంత యొఱగి యున్నది. అందుచేఁ గిరీటమునుండి వ్రేలాడుచున్న ముత్తెములగుత్తి మేరువునొద్దనున్న వీణబిరడపై వ్రేలాడుచున్నది. బాగుగాఁ బరిశీలింపుఁడు. ఎడమమోఁ కాలిపై మడఁచినకుడిమోఁకాలివంపుప్రక్కను రవంత వెనుకగ దేవతాచందన నిర్మితమైన వీణకుండ ప్రకాశించుచున్నదే. దివ్యసర్పసుధాసేచనమున వీణాదండము తీఁగచెట్టు చిగిర్చిన ట్లామె యెడమ చేయివ్రేళ్లు తంత్రులపై నెట్లు కదలుచున్నవో. ఆహా! అదిగో గుడివైపున రాజరాజనరేంద్రుఁడు, నెడమవైపునఁ గృష్ణదేవరాయలు వింజామరములు చేతఁ బుచ్చుకొని యెట్లు వీచోపు లిడుచున్నారో! అదిగో! ఆపీఠము మొదటఁ బీతాంబరపు నడకట్టుతో నిలువఁబడి దేవికిఁ బారిజాతపుష్పములతోఁ బూజ లొనర్చుచున్న యాపౌరోహిత్యబ్రాహ్మణుఁడెవరో యెఱుఁగుదురా? అదిగో! ఒక్కచింతాకంతవాసి-క్రిందుగ నిలువఁబడిన యాకుండలాల సోమయాజి కప్పురపుటారతిపళ్లెరము చేతఁ బుచ్చుకొని—వహవ్వా! నీరజానననీరజపత్రాక్షికి నివ్వాళు లిచ్చు చున్నాఁడే! మరియొక బెత్తెఁడు క్రింద-పురోహితునియంత పొట్టియుఁ గాక, సోమయాజియంత సొగయుఁ గాక మట్టసపు మాదిరిగమున్న మంత్రి శిఖామణి మహాలక్ష్మీదేవి కోడలిని మందాకినీసలిలపుగిండి దోసిటఁబట్టుకొని సేవించుచున్నాఁడే! ఆర్యులారా! చూచుచున్నారా?

ఉ. క్షోణితలంబు నెన్నుదురు సోఁకగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయసుందర వేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామశుక వారిజపుస్తకరమ్య పాణికిన్.

అని పఠించి చాపచుట్టుగ సాష్టాంగదండప్రణామ మిడుచున్న యాజాంబూనదవిగ్రహ మును గాంచి మీకన్ను లానందబాష్పములను విడుచుచున్నవా? ఆహా! అది యేమి? ఆకవిత వినియేనా శారదాదేవి శిరఃకంపన మొనర్చినది! కాక యుభయమహారాజేంద్రుల వింజామరసే వవలననా యామెచెవినున్న చెంగల్వ గదలినది! అట్లు కదలిన చెంగల్వనుండి జరిన యమృతబిందువు లెట్లు వీణాతంత్రులపైఁ బడుచున్నవో! నాయనలారా! ఈచర్యయం తయు నామెపీఠమునకు దిగువనున్న రెండుమూఁడు మెట్లమీఁదిది! కాని యిదియంతయు మనకేల? దిగుఁడు; ఏడెనిమిదిమెట్లు దిగుఁడు; మృచ్ఛకటికాపరివర్తనమును జూలియస్ సీజరుపరివర్తనమును జేతఁ బట్టుకొని నిలువఁబడిన యాస్థవిష్ఠుని గాంచితిరా! బిల్వేశ్వరీయ శంకరవిజయధ్వజాది గ్రంథములను జేతఁ బుచ్చుకొని ''పలుకుదయ్యమా! ఇది పాయస మమ్మా! బమ్మదయ్యపుటెల్లాలా! ఇది పానకమమ్మా! త్రాగుమమ్మా'' యని తల కంపింప స్పష్టముగ సంబోధించుచున్న యాహ్రస్వరూపుని గాంచితిరా? అదిగో! మహేంద్రవిజయ నయనోల్లాసకర్తలగు సోదరకవులు శ్రవణానందముగ శారదాగాన మొనర్చుచున్నారు. విను చున్నారా! వారి గాన మధురిమచే నాకర్షింపఁబడి కాఁబోలు నొక్క శాంతస్వరూపుఁ డైన వృద్ధుఁ డటకువచ్చి యారంభించిన భారతము పూర్తికాలేదు; ఇది యమ్మగారి కర్పింపవ చ్చునా లేదా'' యని పీచు కాగితముల పెద్దకట్టను వారికిఁ జూపి యడుగుచున్నాఁడు. ఆలకించుచున్నారా? ఏవో బరువైన గ్రంథములు పదిసంపుటములు కాఁబోలుఁ జేతఁ బుచ్చుకొని యెఱ్ఱ మధుర పాగఁజుట్టుకొని దగ్గుచు గష్టమున మెట్లెక్కుచున్న యాముసలి యాయన యెవరో యెఱుఁగుదురా? ఈయనను జూచి బిలేశ్వరీయకర్త గుఱ్ఱుమనుచున్నాఁ డేల? తన ప్రసన్న రాఘవ విమర్శనముమాట పరాకు పడినాఁడు కాఁబోలు! ఆహా! శతఘంటకపు లిద్దరు—ఒకరు ముసలివారు; నొకరు పడుచువారు. ఒక రెఱ్ఱనివారు; నొకరు నల్లనివారు. ఒకరు పొట్టివారు; నొకరు రవంత పొడుగువారు. నొండొరులఁ గౌఁగిలించుకొని మనగ్రంథములు శారదాదేవి కర్పింతమని యొకరితో నొకరు చెప్పుకొనుచుఁ బూర్వవైర ములు వదలి చెట్టపట్టముల వైచుకొని మెట్టు లెక్కుచున్నారు వారిని గాంచితిరా? కాని వీరి కొకటి రెండుమెట్లు ముందు బుద్ధచరిత్రమును సరస్వతీసంచికలను జేతఁ బట్టుకొని కంటిజొటితో ముందునకుఁ బోవుచున్న యా భాషాపోషకతేజ మేబ్రాహ్మణ ప్రభునిదో పరిశీలించితిరా?

మహాజనులారా! ఇదివఱకు మనము కాంచినవారందరు గతించినవారు. ఇప్పుడు బ్రదికి బట్టకట్టుచున్న వారిని గ్రంథము కలముఁ బట్టినవారి నికముందు చూడఁదలచియు న్నాము. ఇఁకఁ గొన్ని మెట్లు దిగుఁడు. అదిగో! శారదా దేవీచరణారాధనమునకై యింద్రధ నుస్సు రంగులుగల యెన్ని యోపూవులను దట్టలోఁ బెట్టుకొని యొక్క ముసలియాయన యా మెట్టుమీఁదఁ గూరుచుండినాఁడు, కనఁబడుచున్నాఁడా? అవి భక్తచింతామణిపుష్ప ములు కాఁబోలు! అచ్చట నొక పెద్దదుకాణమున్నది. చూచితిరా! అ దేదో వంగభాషనుండి పరివర్తనమునొందిన బహుళములైన నవలలుగల గ్రంథనిలయము కాఁబోలు! ఆప్రక్కను ఫర్లాంగు చదరపుస్థలములో దాదాపుగఁ బంద్రెండుగజములయెత్తు వఱకుఁ బేర్పఁబడిన యా పుస్తకములసమూహమేదో యెఱుఁగుదురా? అవియే పాటలనాటకములు. ఓ! యెగురుచు న్నవి. గిరగిర దిరుగుచున్నవి! నేలపైఁబడుచు నెంతగందరగోళమైనఁ జేయుచున్నవి. ఈసందడిలోఁ బర్లాకిమిడి వాస్తవ్యుఁడైన బ్రాహ్మణుఁ డొక్కఁడు నవ్యసంగీతపురాణ

ధోరణితోఁ దాళపుఁజిప్పలు చేతఁబుచ్చుకొని తాండవించుచున్నాఁడు. అదిగో! ఒక్క భాషాపండితుఁడు "ఇటుచూడుఁడు" అని తర్జనితోఁజూపించుచున్న పెద్ద యక్షరములేవో చదువఁగలరా? "విజ్ఞానసర్వస్వాది గ్రంథము లిక్కడ"నని వ్రాయఁబడియున్నది. సెబాస్! ఇవి గీతపద్యనాటకము లని యెవ్వఁడో యొకఁడు కిత్తనారసంచిమూటను విప్పుచున్నాఁడు. ఇవి స్వతంత్రముగ రచియించిన నవలలని గుమికూడి కొందరేవోపేళ్లను జదువుచున్నారు. సౌందర్యతిలక మని మరియేమో యని వినఁబడుచున్నది. ఇదిగో! నూతనాంధ్ర వాఙ్మయచరిత్ర మని యొకపుస్తకమును బైకెత్తి యెవరో చూపుచున్నారు. ఆమూలను రాశిపోసిన వన్నియు గ్రామ్యభాషాగ్రంథములు. అచ్చట వృద్ధుఁ డయ్యును బలిష్ఠుడైన యొకబ్రాహ్మణవర్యుఁడు గ్రామ్యభాషోత్కృష్టత నుపన్యసించుచుఁదమ పుస్తకములలోఁ బ్రమాదమునఁబడిన విమర్శాదర్శవిమర్శాదర్శమను గ్రంథమును బైకిఁదీసి గీతనాటకముల దొంతరపైకి థూయని విసరి నైమచున్నాఁడు. అచ్చటఁ జేరిన గ్రంథకర్తలయిదారువందలకుఁబైగ నున్నట్లు కనుపట్టుచున్నారు. వీ రందఱిచేతులలో నొక నాటకమో, నవలయో, ప్రహసనమో, చిన్నకథయో యున్నది కాని రిక్తహస్తుఁ డొకడును లేఁడు. ఇక్కడఁ జుట్టకాని సిగరెట్లుకాని కాల్పఁగూడదని పెద్దయక్షరములు గోడలపై వ్రాయఁబడియున్న యాకొట్లేవో యెఱుఁగుదురా? అవియే తాళపత్రగ్రంథనిలయములు. ఆసమీపముననే కొందరు చేతులలో నేమియోకాని గలగలలాడించుకొనుచుఁ దిరుగుచున్నారు కనుచున్నారా? రాగికడియములలోఁ దగిల్చిన రాగిరేకులున్నవే యవియే పూర్వశాసనములు; వారే భావ్యాంధ్రసారస్వత చరిత్రకారులు. వహవ్వా! ఎక్కడఁ జూచినఁ గవియే. ఎక్కడఁ జూచిన నాటకకర్తయే. ఎక్కడఁ జూచినఁ దూర్పువారి పొట్టేయేచ, పడమటివారి బారెఁడేసి దీర్ఘములు, మధ్యమండలపువారి మట్టసపు మాటలు. ఒకరీతి యేమి యొక వైఖరి యేమి? అచ్చట నన్నియుఁ గలసియున్నవి. కవులు గవులను దిట్టుచున్నారు. కవులు విమర్శకులను దిట్టుచున్నారు. విమర్శకులు కవులను దిట్టుచున్నారు. విమర్శకులు విమర్శకులను దిట్టుచున్నారు. కవులు విమర్శకులైన వారు విమర్శకులు గవులైనవారిని దిట్టుచున్నారు. వీరిపక్షపువారు వారి పక్షపువారిని దిట్టుచున్నారు. వారిపక్షపువారు వీరిపక్షపువారిని దిట్టుచున్నారు. ఏపక్షమున లేనివారు రెండు పక్షములవారిని దిట్టుచున్నారు. మహాజనులారా! ఈ మహాకోలాహలములోఁ గొందరు మగువలుకూడఁ గనఁబడుచున్నారు చూచితిరా! అబలాసచ్చరిత్రరత్నమాల యని, పావిత్రీనాటకమని, మరియేమో యని సన్ననైన గొంతులతో సంగీతమువంటి ధ్వనులు వినఁబడుచున్నవి. తెల్లగ నుద్దకొండలవలె నగపడునవి యేవో తిలకించితిరా! ఆంధ్రపత్రికలు, కృష్ణాపత్రికలు, హితకారిణీపత్రికలు, న్యాయదీపికలు, గోదావరీపత్రికలు, జన్మభూమిపత్రికలు. ఇవికాక యెన్నియో గ్రంథరూపమున వెలువడిన సంచికలు. ఇఁక నావైపున నున్నవారెవరు? వారే నవ్యకవులు. తెనుఁగుతోటలో యుద్ధగీతములు, మోహగీతములు, భావగీతములు, ప్రేమపాటలు రుంయిమని రొదచేయుచున్నవి. వినుచున్నారా? ఈమహాసంకులములో రాట్నపుగీతములు, ప్రత్తిగీతములు, ఖద్దరు పాటలు, నూలొడుకుపాటలు, ఏకుచేయుపాటలు, స్వరాజ్యదర్పణములు, స్వరాజ్యతాంబూలములు! వాక్కునకు వ్రాఁతకు నింత విజృంభణము ముందెన్నఁడైన నుండెనా? ఓ! ఏమి సంక్షోభము! ఎంతశక్తి! ఎంత జీవము! ఎంతధాటి! శారదాదేవి కింత మహోత్కృష్టదినములే లేనట్లు కనఁబడుచున్నదే! కాని మొదటి రెండుమూఁడు మెట్లమీఁది వారెవరో కేకలిడుచున్నారు వినుఁడు.

''ఎందుకాగోల! ఎందు కాపనికి మాలినవ్రాంత! ఎందు కాతుక్కు! ఆపెంట'' యని కేకలిడుచున్నారే! సరస్వతీదేవి యామాటలు విని సన్నగ సన్నగ నవ్వుచున్న దెందుకో! ఎవ్వరైన నెఱుఁగుదురా? ఎఱిఁగియుండునెడల నాకుఁ జెప్పరా? మీరు, మీరు. ఇంతలో నా మూలనుండి యేదియో ధ్వని వచ్చుచున్నది. వినుఁడు ఎవఁడో మాటలాడుచున్నాఁడు. ''పనికిమాలిన వ్రాంతయా! అబ్బ! మమ్మధిక్షేపించుచున్న మీరు చెప్పిన కవిత పనికి మాలినవ్రాంతకాదు కాఁబోలునేమి! మీపై వారికవితముందు మీరుచెప్పినదియుఁ దుక్కే. క్రిందివారివ్రాంత పైవారి వ్రాంతముందుఁ దుక్కు. అది వారి పైవారి వ్రాంతముందుఁ బెంట. అన్ని కవిత్వములు గాళిదాసుని కవిత్వముముందుఁ దుక్కు. కాళిదాసుని కవిత్వమును పుట్టతేనె కవిత్వముముందుఁ బెంట. అదియైనను బ్రహ్మానుసంధానమున వేదర్షుల నుండి నిష్ప్రయత్నముగ నుద్భుద్ధమునఁ దపోమాహాత్మ్యమునఁ బ్రకృతి కాంతమ్ముంగురులలో నొక్క వెంద్రుకలోని వంకరటింకరలైనను సరిగఁ జెప్పలేకపోయిరే, అట్టిచో నెవనికవిత్వము దుక్కు, ఎవని కవిత్వము ముక్కు, ఎవనికవిత్వము పెంట, ఎవనికవిత్వము పంట. అందరుఁ బ్రయోజకులే! అంద ఆప్రయోజకులే! మాకాలమందు మమ్మెట్లు పైవారు తిట్టుచున్నారో, మీకాలమందు పైవారు మిమ్మట్లు తిట్టినవారే. లోకచరిత్ర మన్నియుగములందుఁగూడ నాడిన యాటయే యాడుచున్నది. కాని యొకచోటఁ గ్రోఁతులభాగవతమాడి యొకచోట గోవిందనామస్మరణ చేయుట లేదు. బుద్ధిలేకపోవుటచేత నెప్పటి కప్పటికే పరాకు. పైమెట్టువారు వారిపై మెట్టువారి మొట్లనుదినుచుఁ దమక్రిందిమెట్టున నున్నవారిని మొట్టు చున్నారు. ప్రపంచమునకు సిగ్గెక్కడిది?'' అని ఇంక నేమేమో జంఘాలశాస్త్రి యాకాశమంత నోరు పెట్టుకొని మొండి మోటత్రోవుగా బడితబాజాపద్ధతినిఁ బలుకుచున్నాఁడు. సాక్షినం ఘోపన్యాసము లింకఁ గట్టిపెట్టరాదఁటయ్యా యని పైమెట్టునుండి వెంకట రత్నముగారు కాఁబోలు పలికినారు! ఈ వెంకటరత్నముగారికి సాక్షి యన్నఁగ నింతద్వేష మెందుకో! మహాజనులారా! మరియొకప్రక్కను జూడుఁడు. అరువది సమీపించుచున్న వృద్ధపండితుల యెదుట నిద్దరు పడుచుపండితులు కూరుచుండి యప్పుడే యక్షరస్వీకరణ మొనర్చుచున్న యర్భకులవలె ''అఆ ఉఊ'' అనుచున్నా రేల? వారే సూర్యరాయనిఘంటు కార్యాలయమం దలి పండితులు. గ్రామ్యభాషాగ్రంథోపద్రవము నుండి భాషను రక్షించి యుద్ధరించిన భాషాకోవిదుఁడైన యాంధ్ర భోజమహారాజు మీయెదుటనే కానఁబడుచున్నాఁడు. ''భాషోద్ధా రకా! పుత్రపౌత్రాది సంపత్తితో నిండుగా నూరేండ్లు వర్ధిలుమయ్యా మహారాజా!'' యని మహాజనులంద రొక్క మా రాశీర్వదింపరా? మహాజనులారా! తెఱ పడుచున్నది. దేవతాద ర్శన మికఁ జాలును.

మహాజనులారా! శక్తివంచన లేకుండ శారదాదేవీపూజకై యెందరు గ్రంథకర్త లెంతగాఁ బాటుపడుచున్నారో చూచితిరా? ఇన్ని పాటులుపడి యేమి ప్రతిఫల మొందుచున్నారో యెఱుఁగుదురా? వస్తులు, పరిభవములు. ఈపుస్తకములన్నియు మంచివికాకపోవుటచేతనే ప్రజలు వాని నిరాకరించుచున్నారా? మంచివో చెడ్డవో చూచినతరువాతఁగదా తెలియవలసి నది. అట్లు చూచినవా రెవరు? చూచుట కోపిక యెవరికి? చూచుటకుఁ దీరిక యెవరికి? చూచుట కంత భాషాభిమాన మెవరికి? చూచుట కక్షరజ్ఞానమైన నెందఱకు? ఆంధ్రదేశ ప్రజలలో విరివిగా లెక్కచూచుకొనినయెడల నూటి కిరువదిమంది కాంధ్రభాషాజ్ఞాన మున్న దేమో! చాలు. అంతే చాలును. లేకపోయినప్పుడు చాలదని దేవులాడిన లాభ మేమున్నది?

